# అలనాటి అమెరికా అనుభవాలు

ఏభైఅయిదు ఏళ్ళ కిందటి నా అమెరికా ప్రవాసం –

మొదటి తరం అనుభవాలు, జ్ఞాపకాలు

వేమూరి వేంకటేశ్వరరావు

2017

# విషయ సూచిక

# అమెరికా అనుభవాలతో నా అనుభవాలు

కొంతమంది జీవితాలని తాము అధిరోహించిన పదవులతో కొలుస్తారు. మరికొంతమంది జీవితాలని తాము సంపాదించిన ఆస్తులు, అంతస్తులతో కొలుస్తారు. ఇంకొంతమంది జీవితాలని తమ అనుభవాలతో, జ్ఞాపకాలతో కొలుస్తారు.

నిశితంగా పరిశీలిస్తే జీవితంలో ప్రతి సంఘటనా అనుభవమే! ప్రతి సన్నివేశమూ జ్ఞాపకమే! ఎటుదిరిగీ వాటిని హృదయంతో సేకరించి పదిలపరచుకొనే నేర్పు ఉండాలంతే... ఇలా పదిలపరచుకోవడం ఒక ఎత్తైతే, వాటికి చక్కటి కథా రూపం కల్పించి , పదిమందికీ పంచి, ఆకట్టుకొనే రచనా శైలి ఉన్న వ్యక్తుల్ని చాల అరుదుగా చూస్తూ ఉంటాం. సమకాలీకుల్లో ఇలాంటి ప్రజ్ఞ ఉన్న ప్రవాసాంధ్ర సాహితీవేత్తలలో ప్రముఖంగా పేర్కొనదగ్గ వ్యక్తి శ్రీ వేమూరి వేంకటేశ్వరరావు గారు.

నేను 2003 తానా పత్రికని రూపొందిస్తున్న సమయంలో డాక్టర్ రావు గారితో పరిచయం అయింది. ఆ సంచికకి "పాతికేళ్లనాటి ప్రవాసాంధ్రులు" అని ఒక వ్యాసం వారిని అభ్యర్థించి వ్రాయించడం జరిగింది. దానికి పాఠకులనుండి విశేషమైన ప్రతిస్పందన లభించింది.

ప్రపంచంలో చాలా దేశాల్లో మాదిరిగానే అమెరికాలో కూడ కాలానుగుణంగా చెప్పుకోదగ్గ మార్పులు సంభవించాయి. ముఖ్యంగా గత పది, పదిహేను సంవత్సరాలుగా శరవేగంతో సంభవించిన కంప్యూటర్ సాంకేతిక రంగం పురోభివృద్ధి వల్ల, అమెరికాకి వలస వచ్చిన, అమెరికాలో స్థిరపడిన, ఆంధ్రుల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఐతే పాతిక, ముప్పై ఏళ్ల క్రితం వచ్చిన తెలుగువారి జీవన విధానానికీ, ఇటీవల వస్తున్న తెలుగువారి జీవన విధానానికీ చాలా వ్యత్యాసం ఉంటోంది. దశాబ్దాల క్రితం వచ్చిన తెలుగువారికి అమెరికాలో మరొక తెలుగు వ్యక్తి ఎదురవ్వడమంటే ప్రపంచంలో ఎనిమిదో వింత చూసినంత సంబరంగా ఉండేది. ఆ రోజుల్లో వచ్చిన తెలుగువారిలో అధికులు విద్యార్థులుగా వచ్చినవారే. వారి విద్యార్థి జీవితంలోని అనుభవాలు, టెలిఫోను సౌకర్యాలు సరిగ్గా లేని రోజుల్లో వారు మాతృదేశంలోని బంధువులతో మాట్లాడడానికి పడిన పాట్లు, ఉద్యోగాలకోసం పడిన

కష్టాలు, ఊహకి మించిన వేగంతో సంభవించిన సాంకేతిక పురోగతిని అందుకోవడంలో వారికి ఎదురైన అనుభవాలు – వగైరాలన్నీ ఇప్పటి తరం అమెరికా తెలుగువారికే గాక, ఎక్కడున్న తెలుగు వారికైనా ఆసక్తికరంగానే ఉంటాయి. ఇదే ఉద్దేశ్యంతో శ్రీ రావు గారిని తమ పాత జ్ఞాపకాలని "అమెరికా అనుభవాలు" రూపంలో రాసి ఇమ్మని కోరడం జరిగింది. వాటిని 21 నెలలపాటు క్రమం తప్పకుండా 'సుజనరంజని' లో ప్రచురించడం ఒక అద్భుతమైన అనుభవం. ఒక్క నెల కూడా అంతరాయం కలగకుండా ఈ వ్యాస, కథానిక పరంపర కొనసాగింది. ప్రతి నెలా అత్యధికంగా చదవబడిన శీర్షికలలో ఇదీ ఒకటిగా ఉండేది.

కేవలం ఆసక్తికరమైన కథనాలే కాకుండా, రచనా శైలి కోణంలో చూస్తే, మనం ఎప్పుడో మరచిపోయిన చక్కటి తెలుగు నుడికారాలు, అందమైన తెలుగు పదాలూ అడుగడుగునా ఎదురొచ్చి మనస్సుకి పులకింతలు కలిగిస్తాయి.

ప్రతి నెలా అనుకున్న తేదీ కంటె ముందుగానే టైప్ చేసిన ప్రతిని అందించేవారు డాక్టర్ రావు గారు. తమ అధ్యాపక వ్యాపకాలతో తీరిక ఉండదనుకున్నప్పుడు ఒక్కోసారి 3–4 వ్యాసాలని ముందుగానే ఇచ్చేసేవారు.

ఇలా 21 నెలల పాటు ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగువారిని అలరించిన ఈ వ్యాసాలని పుస్తక రూపంగా తీసుకురావాలని రావుగారి మీద ఒత్తిడి తెచ్చినవారిలో మేమూ ఉన్నాం. ఈ అనుభవాలూ, జ్ఞాపకాలూ ఇప్పటి తరానికే గాక ముందు తరాలకి కూడా చాలా ఉపయోగపడతాయి. చారిత్రాత్మక ప్రాధాన్యతని సంతరించుకున్న ఈ వ్యాసాల్ని చదివి పాఠకులు ఎంత ఆదరించారో, వాటిని ప్రచురించే అవకాశానికి మేము అంతకంటే ఎక్కువగా సంతోషించాం.

డాక్టర్ వేంకటేశ్వరరావు గారి కలం నుంచి మరిన్ని విలువైన రచనలు వెలువడాలని మనసా ఆశిస్తూ –

కిరణ్ ప్రభ
డబ్లిన్, కేలిఫోర్నియా
డిసెంబరు 25, 2006

# అనుభవాలంటే ఏమిటి రాయాలి?

మా నాన్నగారికి వయస్సు మీరిపోతూన్న రోజులలో నేను ఆయనని ఆయన జీవిత చరిత్రని సంగ్రహించి చెప్పమని ఒక సారి అడిగేను.
మా వంశవృక్షం తీసి ఇచ్చేరు.
ఇది కాదు. మీ జీవిత చరిత్రని మీ మాటల్లో చెప్పండి అని అడిగేను.

ఆయన చోడవరంలో చదువుకున్న రోజులతో మొదలు పెట్టి, కాకినాడలో స్కూలు ఫైనలు వరకు చదవటం, తర్వాత ఆయన ఉద్యోగాలు చేసిన ఊళ్ళు, ఆ ఉద్యోగంలో సంఘటనలు, ఆయన స్నేహితులు, వగైరా విషయాలన్నీ ఒక గంట సేపు చెప్పేరు.

నాకు ఆశ్చర్యం వేసినది ఏమిటంటే మా అమ్మ గురించి కాని, తన పిల్లల గురించి కాని, తన తల్లిదండ్రుల గురించి కాని ఒక్క ముక్క చెప్పలేదు – ఈ గంట సేపు చెప్పిన దాంట్లో.

ఇదే ప్రశ్న ఇదే విధంగా మా అమ్మని అడిగే అవకాశం నాకు రాలేదు. నా చరిత్ర ఏమిటి? నేనెవరు? మొదలైన ప్రశ్నలు వేసే కుతూహలం నాలో పుట్టే సరికి మా అమ్మ చచ్చిపోయింది. కాని మా చిన్నతనంలో మా అమ్మతో ఉన్న చనువు మా నాన్నగారితో ఉండేది కాదు  కనుక మా అమ్మ చిన్నతనం గురించి తనంతట తను చెప్పిన కథలు ఎన్నెన్నో మాకు జ్ఞాపకం ఉన్నాయి. వాటిని బట్టి మా అమ్మ చిన్నతనం ఎలా ఉండేదో నేను ఊహించి చిత్రించగలను.

ఈ రకం చిత్రణ మా నాన్నగారి విషయంలో సాధ్యం కాదు. ఎందుకంటే మా నాన్నగారికి రెండేళ్ళు నిండకుండానే మా పితామహుడు స్వర్గస్తులయారు. అటుపైన ఆయన జీవితమంతా పొట్ట నింపుకునే పోరాటంతోనే తెమిలిపోయింది. బాల్యం అనే అవస్థ అనుభవించకుండానే ఆయన ఎదిగి పోయేరు.
ఈ విషయం తలుచుకున్నప్పుడల్లా నాకు నా జీవిత సంగ్రహం రాసుకోవాలనే కోరిక పుడుతూ ఉండేది. నేను భారత దేశంలో ఉండిపోయి, అమెరికా వలస రాని పక్షంలో నాకు ఇటువంటి కోరిక పుట్టి

ఉండకపోను. పుట్టినా అక్కడ జీవిత పోరాటంలో పడి నేను రాసి ఉండేవాడిని కాదేమో! కాని నేను ఇప్పుడు అమెరికా వచ్చి స్థిరపడి పోయేను. అప్పుడే మన దేశంతో బంధాల పట్టు కొద్ది కొద్దిగా సడలిపోతూంది. రేప్పొద్దుట కాని, మరెప్పుడయినా కాని "మనం ఎవళ్ళం? ఎక్కడ నుండి వచ్చేం?" అని నా పిల్లలకి కుతూహలం పుట్టిన రోజున వారికి సమాధానం ఈ దేశంలో దొరకదు; ఇండియా వెళ్ళి పరిశోధన చెయ్యాలి. ఈ వెలితిని పూడ్చటానికి నా జీవిత సంగ్రహం ఒకటి రాయాలనే కోరిక మెదడులో మెదులుతూ ఉండేది.

ఊహలు చాలా మందికి పుడతాయి; కాని వాటిని ఆచరించేవారు బహు కొద్దిమందే ఉంటారు. దీనికి కారణం మానవుడికి సహజంగా ఉండే జంకు, భయం, బద్ధకం. ఈ పని చేసి ప్రయోజనం ఏమిటి? చెయ్యకపోతే వచ్చిన నష్టం ఏమిటి? జీవిత సంగ్రహం రాసేననే అనుకుందాం. ఎవరు చదువుతారు? నవ్వుతారేమో! మన గురించి అంతా చెప్పేస్తే నలుగురికీ మన గుట్టు తెలిసిపోతే ఎలా? మన జీవితంలో అనేకులు తారసపడతారు కదా! వారి గురించి ఏమని రాయాలి? మంచిగా రాయకపోతే కోపం రాదా? దులిపెయ్యరా? ఇలా సవా లక్ష ఆక్షేపణలు ఎదురవుతాయి. చూద్దాం లే అని పనిని బకాయి పెడతాము. నేనూ ఇటువంటి తర్జన భర్జనలు చేసిన వాడినే. ఇలా దరిదాపు పదేళ్ళ పైనే తటపటాయించేను.

ఈ సందర్భంలోనే  కె. వి. ఎస్. రామారావు ఈమాట అనే అంతర్జాల పత్రిక స్థాపించి అందరికీ అందుబాటుగా ఉండే విధంగా అంతర్జాలం మీదకి సంధించి ఒదిలేరు. నా మనస్సులో మెదులుతూన్న ఆత్మ కథ నఖచిత్రం ఆయనకి చెప్పి "మీ పత్రికలో వేసుకుంటారా?" అని అడిగేను.

"మీరు అమెరికా వచ్చిన తర్వాత కథ రాయండి. అద్దైతే అందరూ ఉత్సాహంగా చదువుతారు. మీకంతకీ మీ పాత కథ చెప్పాలని ఉంటే ఫ్లేష్‌బేక్‌లా వెనక్కివెళ్ళి అప్పుడప్పుడు ఒక మోతాదు చెప్పండి." అని సలహా ఇచ్చేరు.

ఆయన సలహా మేరకి నా అమెరికా ప్రయాణానికి నేను చేసిన సన్నాహాలని ఒక వ్యాసంలా రాస్తే ఆయన ఈమాటలో ప్రచురించేరు. లేడికి లేచిందే పయనం అన్నట్లు నేను మొదలు పెట్టిన తర్వాత ఆప

లేను. అమెరికా వచ్చిన కొత్తలో అనుభవాలని రాయటం మొదలు పెట్టేను. మళ్ళా అనుమానాలు, శంకలు, కుశ్శంకలు! ఏయే అనుభవాలని రాయటం? ఏవరెవరి గురించి రాయటం? అందరి గురించి మంచే రాయటమా? ఉన్నదున్నట్లు రాయటమా? నేను పడ్డ భయాలు, బెంగలు, అమ్మాయిలతో కలసి చేసిన అవకతవ పనులు, పొందిన పరాభవాలు, ప్రకృతిలో మార్పులు, ఇలా ఎన్నిటి గురించో రాయవచ్చు. ఇవన్నీ జరిగినవి జరిగినట్టు చెప్పటమా లేక చిలవలు, పలవలు అల్లి, రంగులద్ది చెప్పటమా? ఆఖరికి ఉన్నదున్నట్టు చెప్పటానికే నిశయించి రాత మొదలుపెట్టేను.

రాయటం అంటే రాస్తున్నాను కానీ జ్ఞాపకం ఉన్న వాటిలో వేటిని ఎంపిక చేసి చెప్పటం అనేది ఒక కొరకరాని సమస్యగా తయారయింది. ప్రతివారికి వారి జీవితంలో కొన్ని కొన్ని సంఘటనలు ముఖ్యం అనిపిస్తాయి. గుర్తున్నవన్నీ ముఖ్యం అని అనిపించకపోవచ్చు. కాలక్రమ వ్యతిక్రమణ జరగొచ్చు. లేదా, సందర్భ శుద్ధి కుదరక పోవచ్చు. కనుక నేను ఎంపిక చేసి రాసిన విషయాలు చదువరులని దృష్టిలో పెట్టుకుని ఎంపిక చేసినవి.

గమనించదగ్గ మరొక విషయం. ఒకే కాల పరిధిలో జరిగిన సంఘటనలని ఇంగ్లీషులో ఒక సారి, తెలుగులో ఒకసారి రాసి చూసేను. రెండింటికి పోలికే లేదు! ఇంగ్లీషులో రాస్తూన్నప్పుడు, తెలుగులో రాస్తూన్నప్పుడూ మనస్సులో మెదిలిన భావజాలాలే వేరు! ఇంగ్లీషులో రాస్తూన్నప్పుడు – అసంకల్పంగానే – అమెరికా పాఠకుడు నా మనస్సులో తిష్ఠ వేసుకున్నాడు. కనుక అమెరికా పాఠకుడు మన గురించి ఏమిటి తెలుసుకోవాలనుకుంటాడో ఊహించి అలా స్పందించి ఉంటాను. తెలుగులో రాసేటప్పుడు తెలుగు వారి కోసం రాసినట్లున్నాను. ఎందుకంటే ఎంపిక చేసిన సంఘటనలే వేరు! కథనం చెప్పే తీరే వేరు! నేను ఇంగ్లీషులో రాసిన జ్ఞాపకాలు https://vizagwallah.wordpress.com/ అన్న బ్లాగులో చూడవచ్చు. ఇంగ్లీషులో రాసినది కూడా 2010 ప్రాంతాలలో రాసినదే కాని ప్రచురించడం 2016-17 లో జరిగింది.

నేను యు. సి. ఎల్. ఎ. లో చదివిన నాలుగేళ్ళల్లో అమెరికాలో భారతీయుల జనాభా బాగా పెరగటం మొదలయింది కాబట్టి నేను 1960 దశకం తరువాత నేను చెప్పే కథలో కొత్తదనం ఉండకపోవచ్చు.

ఇంతవరకు నేను రాసిన రాతలు బాగున్నాయంటూ పత్రికా ముఖంగా ఉత్తరాలు రాసిన చదువరులకి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. నా వయస్సుకి దగ్గరగా ఉన్న చాలా మంది ఈ వ్యాసాలు చదువుతూ ఉంటే వారి పాత రోజులు కూడా జ్ఞాపకం వస్తున్నాయని నన్ను టెలిఫోనులో పిలచి పాత రోజులని పాత స్నేహాలని స్మరించుకుని సంతోషించిన వాళ్ళు కూడ ఉన్నారు. కనుక నేను పడ్డ శ్రమ వృధా కాలేదనే అనుకుంటున్నాను.

ఈ వ్యాసాలన్నిటిని సిలికాన్ ఆంధ్రా వారి సుజనరంజని జాలపత్రికలో ప్రచురించడానికి ప్రేరణ కారకులైన కిరన్ ప్రభ దంపతులకి, తరువాత దీనిని పుస్తక రూపంలోకి తీసుకురావాలని ఎమెస్కో వారికి సిఫార్సు చేసిన A. G. కృష్ణమూర్తి గారికి, “అమెరికా అనుభవాలు” అన్న పేరుతో 2008 లో మొదటి కూర్పు ప్రచురించిన ఎమెస్కో వారికి, తరువాత ఈ రెండవ కూర్పుని ఇ–పుస్తకం రూపంలో ప్రచురిస్తున్న రాజన్ కి వందనాలు. ఈ రెండవ కూర్పులో కొంత కొత్త సమాచారంతో పాటు కొన్ని ఛాయాచిత్రాలు కూడా చేర్చేను.

శలవ్!

వేమూరి వేంకటేశ్వరరావు

అక్టోబరు 2017

# అనుభవాలు రాయటమా? మానటమా?

సామాన్యుడి జీవితంలో చెప్పుకోదగ్గ విషయాలు ఏముంటాయి? "అయినా సరే స్వీయ చరిత్ర రాయటంలో కొంత సొగసుంది. కనీసం దినచర్య లాగో, 'జర్నల్' లాగో కొద్ది పేజీలు రాసి చూడండి," అన్నారు పెమ్మరాజు వేణుగోపాలరావు, "ఇంగ్లీషులో రాయండి. మన పిల్లలు పెద్దవాళ్ళైన తర్వాత చదువుకుంటారు."

అవి రాచకొండ విశ్వనాథశాస్త్రి పరమపదించిన కొత్త రోజులు. అప్పట్లో బతికున్న తెలుగు రచయితలలో విశ్వనాథ శాస్త్రి అగ్రగణ్యుడని చందూరి మురళి  అనటంతో అప్పుడేనా ఆయన రాసిన రాతలు చదవకపోతే పరువు పోతుందని భయపడుతూన్న రోజులవి. విశ్వనాథశాస్త్రి అంత కొమ్ములు తిరిగిన వాడని అంతవరకు నాకు తెలియదు. నేను అమెరికా రాక పూర్వం ఆయన కథలు చూసిన జ్ఞాపకం లేదు.

ఈ సందర్భంలోనే విశ్వనాథశాస్త్రి తన చిన్నతనంలో రాసుకున్న దినచర్యని కొన్నాళ్ళు రచన పత్రికలో ప్రచురించేరు. ఈ అవకాశం జారవిడవ కూడదని ఆ దినచర్యని చదవటం మొదలు పెట్టేను – పువ్వు పరిమళించే ముందు ఎలా ఉంటుందో చూడాలన్న కుతూహలంతో. దరిమిలా శాస్త్రి వారసులు కోర్టు నోటీసు ఇచ్చి ఆ ప్రచురణని ఆపు చేయించేరు. ఇంతకీ చెప్పొచ్చే విషయం ఏమిటంటే ఆ దినచర్యని చదువుతూన్నంత సేపూ ఆ రోజులలో సమాజం ఎలా ఉండేదో, ఒక కుటుంబంలో ఆర్థిక పరిస్థితులు ఎలా ఉండేవో కొంచెం అవగాహన అయింది. కనుక దినచర్యలకి, జీవిత చరిత్రలకి ఓ స్థానం ఉందన్న మాటే కదా!

చరిత్ర పుస్తకాలు చదువుతూ ఉంటే పూర్వ కాలంలో రాజులు ఏమిటి చేసేరో తెలుస్తుంది కాని, సామాన్యులు ఎలా బతికేవారో అర్థం కాదు. ఎక్కడో  శ్రీనాథుడి లాంటి కవులు సామాన్యుల గురించి రాసేరు తప్ప, మిగిలిన చరిత్ర అంతా పాలక వర్గానిదే.

నా జీవితంలో చెప్పుకోదగ్గ సంఘటనలు లేకపోయినా నేను కలసిన వ్యక్తులు ప్రసిద్ధులు కావచ్చు, చూసిన సంఘటనలు చారిత్రాత్మకం కావచ్చు, గడపిన రోజులు గడ్డు రోజులు కావచ్చు. అందుకని ఆత్మకథ కాకపోయినా అనుభవాలు రాసి చూద్దామనే నిశ్చయానికే వచ్చేను.

ఈ ఆలోచనని ఇంతటితో అపేద్దాములే అనుకుంటూన్న తరుణంలో "రీడర్స్ డైజెస్ట్" మాసపత్రికలో కాలగమనం మీద ఒక వ్యాసం చూసేను. ఆ వ్యాసకర్త అనేదేమిటంటే, మనకి వయస్సు వస్తూన్నకొద్దీ రోజులు రెక్కలు కట్టుకున్న పిట్టల్లా జోరుగా వెళ్ళిపోతూన్నట్లు అనిపిస్తుందిట. భగవంతుడు ఇచ్చిన ఆయుర్దాయం మించి ఎవ్వరూ బతకలేరు కానీ, కనీసం రోజులు అంత జోరుగా గడచి పోకుండా ఉండటానికి అతనొక చిటకా చెప్పేడు. ఏభయ్యో పడి దాటిన తర్వాత రోజుకి నాలుగైదు పేజీల చొప్పున ఆత్మ కథ రాసుకోమన్నాడు. కనీసం అలాగైనా మరుపు దొంతరల మరుగున పడిపోయిన మధుర స్మృతులని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉంటే కాల గమనం మందగించినట్లయి మిగిలిన జీవితాన్ని ఆనందించవచ్చని అంటాడు ఆ ఆసామీ. కనుక జీవిత చరిత్ర రాయడంలో కొన్ని లాభాలు లేకపోలేదు.

పోనీలే, అలాగే రాద్దాం అనుకుంటూ ఉండగా అక్కిరాజు రమాపతిరావు నా చేత తిరుమల రామచంద్ర రాసిన "హంపీనుండి హరప్పా దాకా" కొనిపించేరు. అది చదివిన తర్వాత నేను సగం సగం రాసిన ఆత్మకథని అక్కడికక్కడే అపేద్దామన్న కోరిక పుట్టింది. రామచంద్ర "నాకు ఏమీ తెలియదు. నేను చేతకాని వాడిని" అంటూనే బ్రహ్మాండమైన స్వీయ చరిత్ర రాసి పారేసేరు. రాస్తే అలా రాయాలి. తగుదునమ్మా అంటూ నేను జీవిత చరిత్ర రాయడమేమిటి? మనస్సు ఊగిసలాడుతోంది.

ఈ తటపటాయింపులతో దరిదాపు ఏడేళ్ళు కదలిపోయేయి. రాసుకుంటూన్నవాడిని రాసుకుంటూ కూర్చోకుండా "నేను నా ఆత్మకథ రాసుకుంటున్నానర్రోయ్" అని అడిగిన వాళ్ళకి, అడగని వాళ్ళకి టముకు వేసి చెప్పే స్వభావం నాది. ఇలా టముకు వేసుకుంటూన్న సందర్భంలో ఇంద్రగంటి పద్మ, శర్మలు – "అయ్యా, తెలుగులో ఉన్న జీవిత చరిత్రలలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథ మీరు తప్పక చదివి తీరాలి" అని ఎన్నో సార్లు అన్నారు. కాని వారి ప్రతి ఎవ్వరో అరువు తీసికెళ్ళేరుట. "ఎప్పుడైనా మీరు మళ్ళా మా ఊరు వచ్చినప్పుడు ఇస్తాం లెండి," అన్నారు. అరువిచ్చిన పుస్తకం తిరిగి రాదని

వారికి ఇంకా తెలియని అమాయకపు భ్రమలో ఉన్నారు. అయినా ఆశగా రెండేళ్ళు ఎదురు చూసేను. ఆ పుస్తకం మళ్ళా వాళ్ళ గడప తొక్కలేదు.

జూలై 2002 లో ఇండియా వెళ్ళినప్పుడు హైదరాబాదులో పద్మ చెల్లెలు మాధవిని చూడటానికి వెళ్ళేను. వెళ్ళినప్పుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి జీవిత చరిత్ర ఊళ్ళో ఎక్కడ దొరుకుతుందని అడిగేను.

"మా ఇంట్లో ఉంది, పట్టికెళ్ళండి" అన్నారు.

"పుస్తకం, వనిత, విత్తం – ఈ మూడు పరహస్తం గతం గతః అంటారు. పైగా నేను పరాయి దేశం వాడిని. కనుక నా పుస్తకం నేను కొనుక్కుంటాను," అన్నాను.

"ఈ పుస్తకం మీరు మళ్ళా తిరిగి మాకు ఇవ్వనక్కరలేదు. ఇది ఇటుపైన మీదే" అంటూ నా చేతిలో పెట్టేరు.

శాస్త్రి గారి "అనుభవాలూ, జ్ఞాపకాలూ" చదివిన తర్వాత నాకు నా కథ రాయటానికి ఒక రకం భయం పట్టుకుంది. అలాగని మానేనా? లేదే! ఎందుకంటారేమో? శాస్త్రి ఉద్దండుడని ఒప్పుకుంటాను. కాని ఆయన రాసిన 'అనుభవాలూ, జ్ఞాపకాలూ' లో, నా దృష్టిలో, అనుగుణ్యత లోపించింది. తెలుగుని ఒక పక్క అందలం ఎక్కిస్తూనే పుస్తకం నిండా సంస్కృత పదాలు గుప్పించి ముంచెత్తేరు. నాలుగు నిఘంటువులు వెతికినా దొరకని మాటలు ఆ పుస్తకం నిండా!!

నిజానికి తెలుగులో ఆత్మకథలకి కొదువ లేదు. పారనంది లక్ష్మీ నరసింహం 'రచ్చబండ' లో ప్రచురించిన జాబితాలో దరిదాపు ఎనభై ఉన్నాయి. అన్నీ ప్రాచుర్యంలో లేకపోవచ్చు కాని, ఉండటం ఉన్నాయి.

ఇంకా ఆలోచిస్తున్నాను, రాయటమా? మానటమా? అని!

ఈ లోగా 'ఈమాట' జాలపత్రిక సంపాదకులు కె. వి. యస్. రామారావు వద్ద ఈ విషయం ప్రస్తావించేను. నేను రాయాలే కాని రాస్తే తను 'ఈమాట' లో ప్రతి సంచికలోనూ ధారావాహికగా ప్రచురించటానికి సిద్ధంగా ఉన్నానని అన్నారు. "అమెరికా ప్రయాణంతో మొదలు పెట్టి, అవసరం వెంబడి flashback లా చిన్నప్పటి కబుర్లు కావలిస్తే చెప్పండి, బాగుంటుంది" అని సలహా కూడ ఇచ్చేరు. సలహా నచ్చింది కాని ఆచరణలో పెట్టటానికి ముహూర్తం కుదరలేదు.

ఇంతలో తానా (Telugu Association of North America) కి పాతిక ఏళ్ళు నిండిన సందర్భంలో ఒక ప్రత్యేక సంచికని ప్రచురిస్తూ దానికి – నా నెరిసిన తలకాయ చూసి కాబోలు – గత పాతికేళ్ళ అనుభవాలనీ సమీక్షిస్తూ ఒక వ్యాసం రాసిమ్మని అడిగేరు కిరణ్‌ప్రభ (పాతూరి ప్రభాకరరావు). నాలుగు పేజీలు మించకూడదన్నారు. ఆ సందర్భంలో నా నలభై ఏళ్ళ అనుభవాలనీ నాలుగు పుటలలో ఇమిడ్చి ఆయనకి ఇచ్చేను. దానికి వచ్చిన స్పందన వర్ణనాతీతం. రచనలోనూ, TelugPeople.com లోనూ, ఇంకా చాలా చోట్ల ఆ వ్యాసాన్ని పునర్ముద్రించేరు. ఎంతో మంది టెలిఫోను చేసి బాగుందని చెప్పేరు.

ఈ నేపథ్యంలో వచ్చిన స్ఫూర్తితో అమెరికా ప్రయాణం గురించి వివరంగా 30 పేజీలు పైచిలుకు రాసి ఈమాట లో ప్రచురించేను. అది చదివి ప్రఖ్యాత రచయిత "వసుంధర" (జొన్నలగడ్డ రాజగోపాలరావు దంపతులు) చాలా బాగుందని కితాబు ఇచ్చేరు.

ఇంత గాథ జరిగిన తర్వాత, పరవా లేదులే అని ధైర్యం వచ్చి ఈ వ్యాస పరంపరకి ఉపక్రమించేను. చదవండి.

## నేను పుట్టిన రోజు, నా తాళపు మాట

నేను స్వస్తిశ్రీ ఈశ్వర నామ సంవత్సర, పుష్య బహుళ  పాడ్యమి సోమవారం, అనగా 17 జనవరి 1938 నాడు, విశాఖపట్నం జిల్లా, వీరవల్లి తాలూకా, చోడవరంలో పుష్యమీ నక్షత్ర యుక్త ధనుర్లగ్నము నందు, మా పెద్ద మామయ్య గారి ఇంట్లో, పెద్ద మామయ్యగారి గదిలో పుట్టేనని మా ఇంట్లో ఉన్న జాతకాన్ని బట్టి, మా అమ్మ చెప్పిన కబుర్లని బట్టి తెలుసుకున్నాను. "ముక్కనుము వెళ్ళిన మర్నాడు పుట్టేవురా!" అనేది అమ్మ.

నా జనన సమయం ఉదయం గం. 6:04 ని., సూర్యోదయాది 58 ఘడియల 50 విఘడియలు. జన్మ లగ్నం ధనుర్లగ్నం. జనన దినం నాడు సూర్యోదయం గం. 6 – 28 ని. సూర్యాస్తమయం గం. 5 – 32 ని.

నా "అఫీషియల్ రికార్డు" లో జననం 1937 అని ఉంది కాని, అది తప్పు. నేను హైస్కూలు లో చేరే తరుణం లో, వయస్సు ఒక  ఏడు ఎక్కువ వెయ్యకపోతే స్కూలు ఫైనలు వేళకి ఒక ఏడు తక్కువ అవుతుందని లెక్క గట్టి, ఆ విషయం నాతో చెప్పి, 1937 అని వేసేరు నాన్న గారు. ఆ రోజులలో చాల మంది ఇటువంటి పనులు చేసేవారు. తమ కుమార రత్నాలు అఖండ మేధావంతులనీ, ముక్కు పచ్చలారని పిన్న వయస్సులోనే వారు అత్యున్నత శిఖరాలు అధిరోహించేరనీ గప్పాలు కొట్టుకోవటం ఆ రోజులలో చాల మందికి అలవాటుగా ఉండేది. అందుకని పిల్లలని స్కూలు ఫైనలు వరకు తెగ తోసే వారు.  ఈ తోపుడు రద్దీతో ఒక చిన్న చిక్కుంది. స్కూలు ఫైనలు వేళకి పదహారు ఏళ్ళు నిండక పోతే పరీక్షకి కూర్చోనిచ్చేవారు కాదు. అందుకని కొంత మంది కక్కుర్తి పడి, పుట్టిన తేదీ, నెల, సంవత్సరం అన్నీ మార్చేసి, పరీక్ష నాటికి సరిగ్గా పదహారు వచ్చేటట్లు కిట్టించే వారు. ఇవన్నీ ఇంత బందోబస్తుగా మార్చటానికి కారణం లేకపోలేదు. మరీ పూర్తిగా ఒక ఏడాది పెంచి వేసెస్తే ఒక ఏడాది త్వరగా రిటైరయి పోవాలి. మన వాళ్ళకి ఎంత దూరదృష్టో చూడండి. ఈ విషయాలన్నీ నాతో సంప్రదించి, "ఒక ఏడు తొందరగా రిటైరైపోతావు, మరి" అని నాకు వార్నింగు ఇచ్చి, నేను పుట్టిన సంవత్సరం ఒక్కటే మార్చి, తేదీ, నెలా, అలాగే వదిలేసేరు, నాన్నగారు. గుడ్డిలో మెల్ల. మా నాన్నగారు కలగన్నారా?

రిటైరయే వేళకి నేను అమెరికాలో యూనివర్శిటీలో ఉద్యోగం చేస్తూ ఉంటాననిన్నీ, అక్కడ రిటైర్‌మెంటు వయస్సు అంటూ ఏదీ లేదనిన్నీ!

ఇలా పుట్టిన తేదీని గల్లంతు చేసెయ్యటం వల్ల నేను ఎదుర్కోబోయే ఈతి బాధలని నాన్నగారు కలలో కూడ ఊహించి ఉండరు. వైద్యుడిని చూడటానికి వెళ్ళినప్పుడు, జాతకం చూపించుకునేటప్పుడు, వైదిక ధర్మానుసారం పూజలు, పురస్కారాలు, కర్మ కాండలు జరిపేటప్పుడు, నిజం తేదీని, అఫీషియల్ వ్యవహారాలప్పుడు అబద్ధపు తేదీని చెప్పుకొస్తూ ఉండేవాడిని. ఇంతలో పులి మీద పుట్రలా అంతర్జాలం (ఇంటర్‌నెట్) వచ్చి పడింది. ఈ ఇంటర్‌నెట్ వల్ల సమకూరే సదుపాయాలని వాడుకోటానికి 'పేస్‌వర్డ్' అనేది వాడుకలోకి వచ్చింది కదా. గదిలోకి వెళ్ళటానికి తాళపు చెవి ఎలాంటిదో ఈ ఇంటర్‌నెట్ సదుపాయాలని వాడుకోటానికి 'పేస్‌వర్డ్' అలాంటిది. కావలిస్తే దీనిని 'తాళపుమాట' అని తెలుగులో అనొచ్చు. లేదా కొంచెం ప్రాస కోసం పాకులాడే జీవులకి – పక్కా తెలుగు కాకపోయినా — 'బీగంబాత్' అనొచ్చు.

నాకు మరుపు ఎక్కువ. ఈ మరుపుకీ, నేను చేసే యూనివర్సిటి ఉద్యోగానికి ఏదో కారణకార్య సంబంధం ఉంటే ఉండొచ్చు. కాని అది వేరే విషయం. ఏతావాతా ఈ మరుపు వల్ల నా తాళపు మాటని ఎప్పుడూ మరిచిపోతూ ఉండేవాడిని. నాలాంటి మరుపుగొట్టు వాళ్ళు ఇంకా చాల మంది ఉన్నారనుకుంటాను. అందుకని మరిచిపోయిన తాళపుమాటని గుర్తు చెయ్యటానికి తల్లి పుట్టింటి పేరు, నా పుట్టిన తేది అడిగేవారు. ఈ రెండూ సరిగ్గా చెబితే మరిచిపోయిన మన తాళపుమాటని గుర్తు చేస్తారు. మా అమ్మ పుట్టింటి పేరు తెన్నేటి వారు. కాని నా పుట్టిన తేదీ కొన్ని చోట్ల 1938 అనీ, మరికొన్ని చోట్ల 1937 అనీ ఇచ్చేవాడిని. కాని ఎక్కడ ఏ తేదీ వాడేనో గుర్తుకి వచ్చేది కాదు. దాంతో నా పేస్‌వర్ద్ గల్లంతు అయేది. కనుక చీటికీ మాటికీ యదార్థానికి రంగులు పుయ్యటం మంచిది కాదు.

ముక్కనుము వెళ్ళిన మర్నాడు అంటే అది ఉత్తరాయణం. పుణ్యకాలం అంటారు. భీష్ముడంతటి వాడు అంపశయ్య మీద పడుక్కుని ఈ పుణ్యకాలం కోసం వేచి ఉండి అప్పుడు ప్రాణాలు ఒదిలేడంటారు. అంతే కాని, ఈ కాలంలో పుట్టటం వల్ల ఏదైనా లాభం ఉందో లేదో నాకు తెలియదు. జనన మరణాల

వేళలు మన చేతులలో లేవు కాని, కావాలంటే చావు ఫలానా అప్పుడు రావాలని కోరుకోగలం. ఫలానా వేళకి పుట్టాలని కోరుకోలేము కదా. మనకి బొత్తిగా పెత్తనం లేని రోజులవి. మన సంచిత కర్మ ఎలా ఉందో దానిని బట్టే మన జనన కాలం నిర్ణయించబడుతుందో ఏమో!

ఇప్పుడంటే సిజేరియన్ పద్ధతి విస్తారంగా వాడుకలోకి వచ్చింది కనుక డాక్టరుకి ఎప్పుడు సదుపాయంగా ఉంటే అప్పుడు పురుళ్ళు పోస్తున్నారు. కనుక పుట్టబోయే పసికందు జాతక చక్రం ముందుగానే తయారు చేసుకుని, ఏ సమయంలో భూపతనం అయితే అదృష్టం పడుతుందో లెక్క గట్టి అదే సమయంలో పురుడు పోయించుకోగల సదుపాయాలు ఇప్పుడు లభ్యమౌతున్నాయి కదా అని మనం ఎక్కడ గర్వ పడతామో అని మా నాన్నగారు ఒక కథ చెప్పేవారు. ఆ కథని టూకీగా ఇక్కడ మనవి చేసుకుంటాను.

**జనన కాల మహిమ: నాన్నగారు చెప్పిన కథ.**

అనగా, అనగా, వెనకటికి ఒక ఊళ్ళో ఒక రాజు గారు ఉండేవారుట. ఈ భూలోకాన్ని ఏలగలిగే మహా ప్రతిభావంతుడైన కొడుకుని ఒకణ్ణి కనాలని ఆయన ఎప్పుడూ కలలు కంటూ ఉండేవాడుట.

ఇలా ఉండగా ఒక నాడు అపర వరాహమిహురుడనిపించే వర్చస్సుతో శోభిల్లుతూన్న ఒక జ్యోతిష శాస్త్రజ్ఞుడు ఆ రాజు గారి ఆస్థానానికి అరుదెంచేడు. ముఖం చూసి, చెయ్యి చూసి, జననకాలం తెలిసిన వారికి జాతకం చూసి, అది తెలియని వారికి నామ నక్షత్రం ఆధారంగా చేసుకుని, ఇలా పండితులకి, పామరులకి జోశ్యం చెప్పి అందరినీ ఆనందభరితులని చేసేడు. ఆశ్చర్య చకితులని చేసేడు. రాజు గారు సకల సత్కారాలతో ఆ పండితుడిని సభలో సన్మానించేరు. ఏకాంతంగా తనని అంతర్ గృహంలో కలుసుకుని అంతరంగికమైన ప్రశ్నలకి సమాధానాలు చెప్పమని వినయ విధేయతలతో అర్థించేరు. జ్యోతిష్కులవారు అంగీకరించేరు.

ఈ భూలోకాన్నే ఏలగల సమర్ధత గల ఒక కొడుకుని కనాలని ఉందని రాజుగారు తన మనోభీష్టాన్ని వెల్లడి చేసేరు. తనకా అదృష్టం పడుతుందా అని అడిగేరు.

మన జ్యోతిష శాస్త్రజ్ఞుడు ఏమీ ఆషామాషీ వ్యక్తి కాదు కదా. రాజు గారి జాతకంతో నిమిత్తం లేదన్నాడు. రాణివాసపు అక్షాంశ రేఖాంశాలు, ఆ ఊరి సూర్యోదయ సూర్యాస్తమయ కాలాలు, వగైరాలన్నిటిని వేళ్ళమీద లెక్కించేడు. ఏ సమయంలో పిల్లవాడు భూపతనమైతే సకల రాజయోగాలూ పడతాయో లెక్క గట్టేడు. ఆ సమయంలో పురుడు రావాలంటే ఏ సమయంలో రాజు గారు మహరాణీ వారితో సంయోగం చెందాలో అంతా ఘడియలు, విఘడియల మేరకి నిర్ణయించేడు. సుముహూర్తం ఆసన్న మైన సమయం తెలుసుకుందికి ఆకాశంలో ఏయే నక్షత్రాలు ఎక్కడెక్కడ ఉంటాయో రాజు గారికి అర్థమయే రీతిలో వివరించేడు. తను చెప్పినట్లు కార్యక్రమం అంతా తు. చ. తప్పకుండా పాటిస్తే ఈ భూలోకాన్ని ఏలే కొడుకు తప్పకుండా పుడతాడని హామీ ఇచ్చేడు.

రాజు గారికి పరిచర్యలు చేసే భృత్యుడు, ఒక దివాకీర్తి, ఇదంతా సావధానంగా విన్నాడు. మంగలి మహదానంద భరితుడైనాడు. ముహూర్తం కొరకు ఎదురు చూసేడు. అనుకూలవతి అయిన పెళ్ళాం ఇతనితో సహకరించడానికి ఒప్పుకుంది.

నెలలు గడుస్తున్నాయి. ఒక శుభముహూర్తాన్న మహరాణి వారు గర్భవతి అయారన్న వార్త ఊరందరికీ తెలిసింది. ఊరంతా తోరణాలు కట్టి, దీపాలు వెలిగించి, భజంత్రీలు వాయించి పెద్ద ఉత్సవం చేసేరు.

మన మంగలి పెళ్ళాం కూడ నెల తప్పింది. రాణిగారి కొరకు వాయించిన బాజాలనే మన మంగలి తన పెళ్ళాం దగ్గర కూడ వాయించేడు.

నెలలు నిండేయి. రాణి గారితో పాటు రాజ్యం అంతా నొప్పులు పడింది. రాణి గారు మగ శిశువుని ప్రసవించేరు. అందరూ యువరాజుకి జేజేలు పట్టేరు.

అదే సమయంలో మన భృత్యుడి పెళ్ళాం పాకలో పురుడు పోసుకుంది. కొడుకుని కన్నాది.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు. యువరాజు శుక్లపక్ష చంద్రుడిలా పెరిగేడు. కత్తి పట్టి కదన రంగం లోకి యువ కిశోరం లా దూకి రాజ్యాలు జయించి తండ్రి కన్న కలలన్నీ నిజం చేసేడు.

మన మంగలి కొడుకు కండలు పెంచి కత్తిరి పట్టేడు. అందినప్పుడు జుత్తు, అందనప్పుడు ఊరువాళ్ళ జేబులు, కత్తిరించేడు. కారాగారం నుండి తిరిగి వచ్చిన తర్వాత చిప్ప చేతికి వచ్చింది. వాడి తండ్రి కలలన్నీ కల్లలయేయి. మంగలికి తను చేసిన తప్పు ఏమిటో అర్ధం కాలేదు. రహస్యం బయట పడితే రాజు గారు తల తీయించేస్తారేమో అని భయం. దొంగాడికి తేలు కుట్టినట్లు మన దివాకీర్తి కుమిలి కుమిలి ఏడ్చేడు.

యువరాజుకి పట్టాభిషేకం ఘనంగా జరుగుతోంది. రాజ్యం అంతా పందిరి వేసేరు. చేతికి ఎముక లేదా అన్నట్లు రాజు గారు దానాలు చేసేరు.  ధర్మరాజుల వారి రాజసూయ యాగంలా ఉందని అంతా వేయి నోళ్ళ కొనియాడుతూ ఉంటే, ఈ వార్త నారదులవారి చెవిని పడనే పడింది. ఆయన హుటాహుటి దివి నుండి భువి కి దిగి వచ్చేరు. ఆయన మహా జ్ఞాని కదా. జరిగినదంతా క్షణంలో అవగాహన అయింది ఆయనకి. కాని రాజు గారు చేసినది ఏమిటో, మంగలి చెయ్యనిది ఏమిటో నారదులవారికి బోధ పడ లేదు. కనుక ఆయన వెంటనే సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మ దేవుడిని కలిసేరు. ఈ సృష్టి విచిత్రం ఏమిటో వివరించమని కోరేరు.

బ్రహ్మ  మందస్మిత వదనారవిందంతో ఇలా చెప్పుకొచ్చేడు.

“నారదా! జ్యోతిష శాస్త్రం జైమిని మహర్షి రచించేరు. ఈ శాస్త్రానికి ఆయువు పట్టు ముహూర్త బలం. ఈ ముహూర్త నిర్ణయం బహు జాగరూకతతో జరగాలి. ఈ ముహూర్తం లోని స్థలకాలాలలో గోరంత తేడా వస్తే దాని ఫలితంలో కొండంత వ్యత్యాసం కనిపిస్తుంది.”

నారదులవారు విరించి వ్రాకుచ్చుతూన్న కథనాన్ని అత్యంత కుతూహలంతో వింటున్నారు.

"మహారాణి గర్భంలో ఫలోత్పాదన జరిగే సమయానికే నేను శంకా మాత్రుడనై అధిష్టించిన సింహాసనం దిగే నిమిత్తం కిరీటం తీసే ప్రయత్నంలో నా చేయి కిరీటం మీదకి పోయింది. ఆదే క్షణంలో మహరాణికి ఫలోత్పాదన జరిగింది. తద్రూపేణా అంకురించిన రాకుమారుడికి పట్టాభిషేకం జరిగింది. నా కిరీటం తల మీద నుండి రెండు చేతులలోనికీ తీసుకునే వేళకి అది తలకిందులై బిక్షాపాత్ర మాదిరి నా చేతులలో ఉన్న క్షణంలో మంగలివాడి భార్యకి ఫలోత్పాదన అయింది. అలా పుట్టుకొచ్చిన మంగలి కొడుకు చేతికి చిప్ప వచ్చింది. ముహూర్తంలో తేడా లిప్త మాత్రమే. జాతకుడి యోగంలో ఎంత తేడా వచ్చిందో చూడు."

జ్ఞానోదయం అయిన నారదుడు తండ్రికి నమస్కరించి శలవు తీసుకున్నాడు. కథ కంచికి, మనం ఇంటికి.

ఈ కథనం రాస్తూ ఉంటే నేను కాలేజీలో చదువుకున్న పాత పాఠం ఒకటి జ్ఞాపకం వస్తోంది. ఈ ప్రపంచంలో మనం గమనించే దృగ్విషయాలు ('ఫినామినా') అన్నిటికి ఒక కారణం ('కాజ్') అంటూ ఉండాలనే నమ్మకం ఆధునిక వైజ్ఞానిక దృక్పథానికి ఒక పునాదిరాయి వంటిది. ఒక కారణం అవధీకృతం ('బౌండెడ్') అయినప్పుడు దాని పర్యవసానం ('ఎఫెక్ట్') కూడ అవధీకృతం అయిన ఎడల ఆ సమస్యని సవ్యంగా కూర్చబడ్డ సమస్య ('వెల్ పోస్డ్ ప్రోబ్లెం') అంటారు. ఈ నిర్వచనం ప్రకారం జ్యోతిష శాస్త్రం అపసవ్యంగా కూర్చబడ్డ సమస్య ('ఇల్ పోస్డ్ ప్రోబ్లెం') అవుతుంది. ఒక సమస్య గణిత పరిభాషలో 'ఇల్ పోస్డ్' అయినంత మాత్రాన్న కొంపలేమీ మునిగి పోవు. ఆ శాస్త్రానికి వాటిల్లే నష్టమూ లేదు. ఇటువంటి 'ఇల్ పోస్డ్' సమస్యలని పరిష్కరించేటప్పుడు కొంచెం ఒంటి మీద తెలివి అట్టేపెట్టుకుని అప్రమత్తతతో ఉండాలి. ఉదాహరణకి జనన కాలంలో రవంత తేడా వచ్చినా, రాశి చక్రం వేసేటప్పుడూ, లగ్నం కట్టేటప్పుడూ రవంత తప్పు దొర్లినా అర్థాపత్తి ('ఇన్ఫరెన్సు') లో బోలెడు తేడా వస్తుంది.

అయ్యా! పేరుని మార్చుకున్నా పరవా లేదు కాని, పుట్టిన తేదీని మార్చటం లో కొన్ని కాదు, చాలా చిక్కులు ఉన్నాయి. తర్వాత మీ ఇష్టం.

# అమెరికాలో చదువుకి ప్రయత్నం

**పూర్వ భాగం**

అమెరికా రావాలన్న ఊహ నా బుర్రలో ఎప్పుడు ప్రవేశించిందో తిథి, వార నక్షత్రాలతో చెప్పలేను. కాని నేను చదువుకునే రోజులలో నాకు అమెరికా అంటే మోజేమీ ఉండేది కాదు. అమెరికాలో చదువుకోవాలని కాని, అక్కడకి వలస వెళ్ళి స్థిరపడి పోవాలని కాని ఎప్పుడూ అనుకోలేదు.

అది 1958. కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో కడపటి రోజులు. బుచ్చన్నయ్య "ఫుల్‌బ్రైట్ ఫెలోషిప్" మీద అమెరికా వెళ్ళేడు. బుచ్చన్నయ్య మా బంధు వర్గంలోనే చాల తెలివైనవాడనే గట్టి నమ్మకం మాలో చాలమందికి ఉండటంతో వాడు వెళ్ళినంత మాత్రాన వాడి వెనక మేమంతా వెళ్ళగలమనే ఊహ మా మస్తిష్కాలలో ఎక్కడా మెరవ లేదు. కాని వాడు రాసే ఉత్తరాల ద్వారా అమెరికా దేశపు ఉనికి, ఎల్లలు అర్థం అవటం మొదలయాయి.

అన్నయ్య కాశీ నుండి తిన్నగా అలా అమెరికా వెళ్ళిపోయాడు, మన వైపైనా రాకుండా. కనుక మా ఇంట్లో ఎవ్వరికీ అమెరికా గురించి కాని, అమెరికా ప్రయాణానికి కావలసిన హంగులని సమకూర్చుకోవటం లో ఉన్న కష్టసుఖాల గురించి కానీ అవగాహన ఏమీ లేదు.

ఇలా అన్నానని అమెరికా గురించి బొత్తిగా ఏమీ తెలియని వ్యక్తిని కాననండోయ్. ఆ మాటకొస్తే నా హైస్కూల్ రోజులలోనే అమెరికాలో ఉన్న ఎం. ఐ. టి. గురించి విన్నాను. మా ఇంటికి నాలుగిళ్ళ దిగువున అవసరాల వారి అబ్బాయి అప్పాజీ అనే కుర్రాడు ఒకడు ఉండేవాడు. ఆతను నా కంటె నాలుగేళ్ళు పెద్ద. ఒక సారి ఎం. ఐ. టి. నుండి దరఖాస్తు, సరంజామా – అంటే వీశెడు బరువున్న కేటలాగు – వచ్చేయి. దాంట్లో బొమ్మలు చూడటం చూసేను. తర్వాత దాని సంగతే మరచి పోయేను.

అమెరికా గురించి జనరల్ నాలెడ్జి కూడ నాకేమీ లేదనుకునేరు. వినండి, చెబుతాను.

మా తమ్ముడు శేషగిరి పాఠ్యపుస్తకంలో “రిప్ వాన్ వింకిల్” కథ ఉండేది. అది వాడు చదువుతూ ఉంటే విన్నాను. ఈ రిప్ వాన్ వింకిల్ ఊర్మిళా దేవి కంటె ఆరాకులు ఎక్కువ చదివినట్లు ఉన్నాడు. కేట్‌స్కిల్ కొండలలో ఇరవై ఏళ్ళు నిద్ర పోయి లేస్తాడు. బోడి మెట్ట, ఏనుగు కొండ, సూది కొండ వగైరా పేర్లు విన్న నాకు ఈ పిల్లులని చంపే “కేట్స్ కిల్” కొండల పేరు మనస్సులో నాటుకు పోయింది.

ఒక సారి హౌరా–మెడ్రాస్ మెయిల్‌లో ఫస్టు క్లాసులో ప్రయాణం చేస్తూ, అనకాపల్లిలో భోజనం ఆర్డరు చేసిన  మిస్ కాక్స్ అనే అమెరికన్ అమ్మాయిని బండి తుని వచ్చే లోగా ఎవరో పొడిచి చంపేసేరు. తుని స్టేషన్‌లో ఉన్న యూరొపియన్ స్టయిల్ రెస్టరాంట్ లో పని చేసే బేరర్ లంచి పట్టుకుని వెళ్ళేడు, పెట్టె లోపలికి. రక్తపు మడుగులో అసువులు బాసిన  ఆ అమ్మాయి అవశేషాలు అక్కడ అగుపించేయి. నేను తుని స్టేషను లో తరచు తిరుగాడుతూ ఉండేవాడిని కనుక, పోలీసులు దర్యాప్తుకని ఆ రైలు పెట్టెని విడదీసి, గూడ్సు షెడ్డు పక్కన నిలిపి, మిగిలిన రైలు బండిని మద్రాసు పంపించటం కళ్ళారా చూసేను. ఆ పిల్ల తెల్ల పిల్ల కాకపోతే పోలీసులు ఇంత హడావుడి చేసేవారా అని పెద్దవాళ్ళు అనుకుంటూ వుంటే నేను విన్నాను కూడ!

అమెరికా మీద క్రమేపీ ఒక అభిప్రాయం ఏర్పడటానికి కాకినాడలో నా సహాధ్యాయి కర్రా వేంకటేశ్వరరావు చేసిన చిన్న చిలిపి పని కొంత దోహదం చేసింది. పేపర్లో పెన్ ఫ్రెండు కావాలన్న ప్రకటన చూసి కర్రా వాడు ఒక అమెరికన్ పిల్లకి ఉత్తరం రాసేడు. రాసినప్పుడు మాకెవరికీ చెప్పలేదు. ఆ అమ్మాయి అయోవా నుండి జవాబు రాసింది! పైపెచ్చు ఫొటో పంపించింది. ఈ వార్త హాస్టల్ అంతా శరవేగంతో దూసుకు పోయింది. మేమందరం వెళ్ళి ఆ ఫొటోని చూసి, ఆ అమ్మాయి రాసిన ఉత్తరం చదివి ఎవరికి తోచిన విధంగా వేంకటేశ్వరరావు ని వేళాకోళం చేసేం. ఈ వ్యాసం రాస్తూన్న సందర్భంలో లండన్‌లో ఉన్న కర్రాని పిలచి అడిగేను. వివరాలు ఏవీ జ్ఞాపకం లేవన్నాడు. అమెరికా అమ్మాయిలంతా ఏ రీటా హేవర్తు లాగో, ఎస్తర్ విలియంసు లాగో, లేదా ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ లో తరచుగా వచ్చే ఏ హాలీవుడ్ పిన్‌అప్ పిల్ల లాగో ఉంటారనుకున్న మాకు ఆ ఫొటో చూసిన తర్వాత ఒక ‘రియాలిటీ ఛెక్’ అయింది. బాగా పుష్టిగా, ఏపుగా కనిపించిందా పిల్ల. అమెరికాలో బరువు సమస్యకి కారణం ఈ మధ్య పుట్టుకొచ్చిన ‘ఫేస్ట్ ఫుడ్స్’ అని ఆడిపోసుకోవటం ఎందుకు?

నేను ఫైనల్ ఇయర్ లో ఉన్నప్పుడు వైజాగ్ లో కాల్‌టెక్స్ రిఫైనరీ మీద టిల్లోట్సన్ అనే అమెరికన్ ఆసామీ పెత్తనం చేస్తూ ఉండేవాడు. మా స్టూడెంట్  బాడీ ప్రెసిడెంటు దుర్వాసుల శ్రీరామ శాస్త్రి విశాఖపట్నం వాడు. అందుకని, కాలేజి వార్షికోత్సవాలకి టిల్లోట్సన్ నీ అతని పెళ్ళాన్నీ ముఖ్య అతిథులు గా ఆహ్వానించేడు. ఆవిడ మా అందరి ఎదటా సిగరెట్టు ముట్టించింది. మేమంతా ఆవిడని సర్కస్ చూసినట్లు చూడలేదు కాని, అమెరికన్ అమ్మాయి కదా అని ఒక సారి, సిగరెట్టు ముట్టించింది కదా అనీ మరో రెండు సార్లు – ముత్యం మూడు సార్లు – మెడలు రిక్కించి మరీ చూసేం.

ఇలా చెప్పుకొస్తున్నానని నన్ను మరీ బైతులా కట్టెయ్యకండి. మా ఊళ్ళో పాటకజనపు ఆడ వాళ్ళు చుట్టలు కాల్చటమూ చూసేను, ధనిక వర్గాలలో ఆడవాళ్ళు సిగరెట్లు తాగటం ఇంగ్లీషు, హిందీ సినిమాల్లో చూసేను, కాని మన మధ్య లో తిరుగాడే మధ్య తరగతి ఆడవాళ్ళు సిగరెట్టు  కాల్చటం నేను ఎప్పుడూ చూడలేదు.

ఆ మాటకొస్తే తునిలో, మా పక్కింట్లో, తంగిడిబిల్లి నారాయణ పెళ్ళాం కొవ్వూరి వెంకయ్య అడ్డ పొగ వేసేది – అంటే వెలుగుతూన్న చుట్ట కొసని నోట్లోను, పీకని బయటకి కనిపించేటట్లు పెట్టుకుని కాల్చటం. ఏదీ, మన దేశాన్ని చూసి ఈ అమెరికా కుర్రాళ్ళు ఎన్నెన్నో చేష్టలు – మేరువానా నుండి మెడిటేషన్ దాకా - చేసేరు. కాని నాకు తెలుసున్నంత వరకు అమెరికన్ ఆడవాళ్ళు మన దగ్గర అడ్డ పొగ వెయ్యటం ఇంకా నేర్చుకో లేదు.

వెంకయ్యప్పని ఒక సారి అడిగేను.
"వెంకయ్యప్పా! వెంకయ్యప్పా! ఇద్దరు పిల్లల్ని కన్నావు కదా. ఇంకా నీ ఇంటి పేరుని మార్చుకోలేదేమి?"

"ఎంకటేశులు బాబూ! ఈ గొల్లిగాడు మనువు తీరిపోయిందని నన్ను ఒగ్గీసినాడనుకో. అప్పుడు నానేటిసేసేది? ఆడి పేరు ఆడిదే. నా పేరు నాదే!"

ఇది అమెరికన్ థింకింగ్ అంటారా? ఇండియన్ థింకింగ్ అంటారా? చెప్పండి!

ఆ మాట కొస్తే మా ఇంటికెదురుగా ఉండే బండి నాయుడు అప్పన్న పెళ్ళాం చిన్నమ్మి, ఎర్రయ్య పెళ్ళాం గంగమ్మ – ఇద్దరూ కూడ – ఎప్పుడూ టాప్ లెస్ గానే ఉండే వారు. ఇటువంటి 'ఎడ్వాన్స్‌డ్ కల్చర్' మధ్య పెరిగిన నా అంతటి వాడిని నేను! ఏమనుకుంటున్నారో!

అయ్యా! ఇదీ అమెరికా వచ్చే ముందు నా నేపథ్యం!

కాకినాడలో నా సహాధ్యాయి పిండిప్రోలు వెంకట్రావు నా ఈ నేపథ్యాన్ని బాగా అవగాహన చేసుకున్న వ్యక్తి కనుక నన్ను 'పార్వతీశం' అని పిలచే వాడు. మా ఊరు మొగల్తుర్రు కాకపోయినా, మా ఇంటి పేరు కూడ వేమూరి వారే కనుక నేను "ఓయ్" అని పలికేవాడిని.

## ఉత్తర భాగం

కాకినాడలో చదువు అయిపోయిన తర్వాత నేవేలీలో నాలుగున్నర నెలలు ఉద్యోగం వెలగబెట్టేను. అక్కడ నేల మీద చాప వేసుకుని పడుక్కునే వాళ్ళం. రాత్రి దీపం ఆర్పగానే నల్లులు – ఎక్కడనుండి దిగి వచ్చేవో – తండోపతండాలుగా వచ్చేవి. వాటి బాధ భరించలేక దీపం వేసేసరికల్లా అవి గబగబా గోడల మీదకి ఎక్కి పోయేవి. ఈ నల్లుల కారణంగానో, లేక నేవేలీలో నీళ్ళ వల్లో నా ఆరోగ్యం దెబ్బ తింది. నా ఆరోగ్యం పాడయిందని వైద్యుడు చెప్పే వరకూ నాకు తెలియనే లేదు. చుట్టపు చూపుకని తుని వచ్చినప్పుడు, మా అమ్మకి పన్ను తీయించటానికి చల్లా సుబ్బారాయుడి గారి ఆసుపత్రికి తీసుకెళ్ళేను. పన్ను తీయటం అయిపోయిన తరువాత బయటకి వచ్చెస్తూ ఉంటే, సుబ్బారాయుడు గారు నన్ను గదిలోకి రమ్మని సంజ్ఞ చేసేరు. అమ్మ గురించి ఏమి చెడ్డ వార్త చెబుతారో అనుకుంటూ లోపలికి వెళ్ళేను. ఆయన నా కళ్ళ దిగువ రెప్పలు రెండూ దిగువకి లాగి, "ఎక్కడ ఉద్యోగం చేస్తున్నావు?" అని

అడిగేరు. చెప్పేను. అప్పుడు ఆయన పక్కనున్న నాన్న గారి వైపు తిరిగి, "అబ్బాయిని నెవేలీ పంపించకండి. మలం పరీక్ష చేసి రోగ నిర్ధారణ చేస్తాను" అన్నారు. మరునాడు కడుపులో కొంకి పురుగు (hook worm) ఉండటం వల్ల రక్తపు లేమి వచ్చింది, వెంటనే వైద్యం చేసి తీరాలి, ఈ ఉద్యోగం మానిపించెయ్యటం మంచిది." అంటూ ఒక సలహా పారేసేరు. ఉద్యోగం మానేసి ఇంటిదగ్గర ఉండిపోయేను. నా అమెరికా ప్రయాణానికి సంబంధం లేకపోయినా, మా సుబ్బారాయుడి గారి రోగనిర్ణయ ప్రతిభ ని చాటి చెప్పటానికే ఈ ఉదంతం చెప్పుకొచ్చేను.

భిలాయ్ లో ఉద్యోగం చేస్తూన్న నరసింహం బావ  పని లేకుండా ఇంటి దగ్గర కూర్చున్న నన్ను చూసి దగ్గరుండి భిలాయి తీసుకెళ్ళిపోయేడు. నేను అక్కడ దరఖాస్తు నింపటం, ఉద్యోగంలో చేరిపోవటం అన్నీ చకచకా అరగంటలో అయిపోయాయి. ఇంటర్వ్యూ లాంటిది ఏదీ లేదు. నాకు తెలియకుండానే, కట్టు బట్టలతో వచ్చిన వ్యక్తిని ఆ పట్టుని అలా ఉద్యోగంలో చేరి పొమన్నారు. అక్కడ బెంచీ మీద ప్రతీక్షిస్తూ కూర్చున్న అనతోలే అలక్స్యేవ్ నన్ను తన వెంట జీపులో తీసుకు పోయాడు.

పని లోకి వెళ్ళిన దగ్గర నుండి తిరిగి వచ్చేదాకా అదొక చిన్న రష్యాలా ఉండేది. ఉండేదేమిటి? మేం భిలాయిని రష్యా అనీ, ఆంధ్రాని ఇండియా అనీ అనేవాళ్ళం.

నేనక్కడ చేసే ఉద్యోగానికి కాకినాడ చదువు సరిపోలేదని నాకు మొదటి రోజులలోనే స్పష్టమైపోయింది. ఎటు చూసినా నాకు తెలుసున్న విషయాల కంటె తెలియని విషయాలే ఎక్కువ కనిపించేవి. అందుకని పని అయిపోయిన తర్వాత, సాయంకాలం పూట, కొంతమంది రష్యన్ ఇంజనీర్లు మాకు ఎలక్ట్రికల్ ఇంజనీరింగు పాఠాలు చెప్పేవారు – దుబాసీల సహాయం తో.

అప్పటికే బుచ్చన్నయ్య రాచెస్టర్ లో పి. హెచ్. డి. చేస్తున్నాడు కదా. చదువుల విషయంలో మా ఇంటిల్లిపాదికీ వాడు గురువు, సలహాదారుడూను. అందుచేత నాకే తేటతెల్లమౌతూన్న  నా అజ్ఞానానికి ఆరాటాన్ని వెల్లడి చేస్తూ వాడికి ఒక ఉత్తరం రాసేను. దానికి సమాధానంగా వాడు షెల్కునాఫ్ అనే ఆసామీ రాసిన లెక్కల పుస్తకం ఒకటి కొని పంపేడు. ఆ పుస్తకం అంతా చదివేసి ప్రతి అధ్యాయం చివర

ఉన్న సమస్యలన్నిటిని పరిష్కారం చేసెయ్యమన్నాడు. దీని వెనక అసలు రహస్యం అమెరికా వచ్చేక కాని నాకు బోధపడ లేదు. అన్నయ్య అమెరికా వచ్చిన కొత్తలో ప్రొఫెసరు ఎబర్లైన్ దగ్గరకి వెళ్ళి "ఏమిటి చెయ్యమంటారు?" అని అడిగితే దానికి సమాధానంగా రూడిన్ రాసిన
టొపాలజీ పుస్తకం ఒకటి ఇచ్చి ఇది పూర్తిగా చదివేసి, తర్వాత కనిపించు, అప్పుడు మాట్లాడదాం అన్నాట్ట. ఆయన వీడి మీద ప్రయోగించిన మంత్రాన్నే వీడు నా మీద ప్రయోగించేడన్న మాట!

నాకు తీరుబడి దొరికినప్పుడల్లా ఆ పుస్తకం కుంటుతూ, మెక్కుతూ పూర్తి చేసేసరికి ఒక సంవత్సరం పట్టింది. నాకు కొరుకు పడని సమస్య ఏదైనా తారస పడితే అన్నయ్యకి ఉత్తరం రాస్తే ఆ లెక్క ఎలా చెయ్యాలో వాడు తిరుగు టపాలో చెప్పేవాడు.

ఈ కరస్పాండెన్సు కోర్సు ఇలా జరుగుతూన్న రోజులలో "పోనీ నేను కూడ అమెరికా వచ్చి చదువుకుంటే ఎలా ఉంటుంది?" అని ఒక ఉత్తరం రాసేను. దానికి సమాధానంగా "అబ్రహం అండ్ బెక్కర్ రాసిన పుస్తకం ఒకటి మద్రాసులో దొరుకుతుంది, అది కొనుక్కుని పూర్తిగా చదివెయ్. ఈ లోగా దరఖాస్తు కాగితాలు నేను పంపుతాను" అని రాసేడు.

ప్రొఫెసరు ఎబర్లైన్ మీద కసిని నా మీద ఇలా తీర్చుకున్నాడేమో అని ఇప్పటికీ నాకు అనుమానమే. అమెరికా పేరు పెట్టి అన్నయ్య నన్ను ఒక పాము పామేస్తున్నాడేమో అని ఒక అనుమానం పుట్టుకొచ్చింది. ఎందుకంటే, 'అబ్రహం అండ్ బెక్కర్' కొని తెప్పించేను కదా. దీని ముందు షెల్కునాఫ్ నల్లేరు మీద బండి నడక. అసలు విషయం మౌలికంగా అర్థం అయి చావ లేదు. ఆ భావ సంకల్పనని వివరిస్తూ ఉన్న లెక్కలు అస్సలు అర్థం కాలేదు. కూర్చున్నవాడిని కుదురుగా కడుపులో చల్ల కదలకుండా కూర్చోకుండా కొరకంచుతో తల గోక్కున్నానా అని ఒక పక్క ఆవేదన పడుతూ ఉంటే మరొక పక్క నుండి అప్లికేషన్ ఫారాలు ఒకటీ ఒకటీ రావటం మొదలు పెట్టేయి.

ఇంతవరకూ నెట్టుకొచ్చిన తర్వాత ఇప్పుడు వెనక్కి తగ్గితే ఏం బాగుంటుందిలే అని ఆ దరఖాస్తు కాగితాలు నింపటం మొదలు పెట్టేను. అసలు వాటిలో భాష అర్థం అయేసరికి తల ప్రాణం తోకకి

వచ్చింది. 'ఫస్ట్ నేం' అంటాడు. 'మిడిల్ నేం' అంటాడు. 'లాస్ట్ నేం' అంటాడు. 'ఫొటొ స్టేట్ కాపీ అఫ్ ద ట్రాన్స్‌క్రిప్ట్' అంటాడు. 'సెమెస్టర్' అంటాడు. నిజం చెప్పొద్దూ. నాకు ఈ మాటలేవీ అర్థం అయి చావ లేదు. నా దగ్గర నిఘంటువు లేదు. ఉన్నా ఆ మాటకి అర్థం నిఘంటువులో చూడాలన్న స్ఫూర్తి కూడ లేదు.

పైపెచ్చు 'రికమెండేషన్ లెటర్స్' కావాలంటాడు. నేను కాకినాడ వదలిపెట్టి మూడేళ్ళు అవుతోంది. నేనెవ్వరినో అక్కడ ఎవరికి జ్ఞాపకం ఉంటుంది? ఉన్నా భిలాయి నుండి నేనొక ఉత్తరం ముక్క రాసినంత మాత్రాన వారు ఆ రికమండేషన్ పంపుతారా. పంపిరిపో, నా గురించి మంచి మాట రాస్తారా? రాసి పంపేరే అనుకుందాం. వాళ్ళు నాకా విషయం తెలియబరచక పోతే? ఏ సంగతీ నాకు ఎలా తెలుస్తుంది? పోనీ అడగటానికి స్వయంగా కాకినాడ వెళ్ళేనే అనుకుందాం. తీరామోసి వెళ్ళిన తర్వాత నాకు కావలసిన వ్యక్తులు అక్కడ లేకపోతే? ముందుగా ఎపాయంట్‌మెంట్ పుచ్చుకుందామంటే ఆ రోజులలో ఫోను సౌకర్యం లేదు. 'ఎపాయంట్‌మెంట్' లేకుండా వెళితే 'డిసప్పోయంట్‌మెంట్' ఖాయం.

నాకొక ఊహ తట్టింది. నేను రోజూ పని చేస్తూన్న రష్యన్ ఇంజనీరు దగ్గర రికమండేషన్ పుచ్చుకుంటేనో? ఈ విషయం బుచ్చన్నయ్యకి రాసి వాడి సలహా అడిగితే వాడు నేను భిలాయిలో పని చేస్తూన్నట్లు కాని, నాకు రష్యన్ భాష మాట్లాడటం వచ్చని కాని మాటవరసకేనా ఎక్కడా అనొద్దని వార్నింగు ఇచ్చేడు. వాడు ఎందుకు అలా అన్నాడో అప్పట్లో నాకు అర్థం కాలేదు. అమెరికా వచ్చిన్ తర్వాత తెలిసింది. వీళ్ళకి కమ్యూనిష్టులంటే ఏహ్యాభావం ఒక పక్క, సింహస్వప్నం మరొక పక్క. ఏమాత్రం వీరితో ఏకీభవించకపోయినా, "ఆర్ యూ ఎ కామ్మునిష్ట్" అనేవారు. పొరపాటునైనా "అవును" అన్నామంటే మన పుట్టి ములిగిందన్నమాటే. అందుకని "క" అనే అక్షరంతో మొదలయే మాట మాటవరసకైనా వీళ్ళతో మాట్లాడవద్దని ఒక సలహా ఇచ్చేడు అన్నయ్య. ఆ రోజులలో వాడు సలహా ఇచ్చేడంటే అది ఆర్డరే.

ఏది ఏమైతేనేమి, చివరికి ఒక అరడజను యూనివర్సిటీలని ఎంపిక చేసి దరఖాస్తులు నింపి పంపేను. "ఈశాన్య దిశగా కూర్చుని మరీ నింపు" అని నాన్నగారు చెప్పినట్లే చేసేను. ఏ పని ఉపక్రమించే ముందైనా "సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే| శరణ్యే త్ర్యయంబకే దేవీ, నారాయణి నమోస్తుతే|" అన్న శ్లోకం చదవకుండా చెయ్యనిచ్చే వారు కాదు నాన్నగారు. తునిలో ఉన్నప్పుడు ఏదో పాత కాలపు మనిషిలే అని ఆయన శ్లోకం పఠిస్తూ ఉంటే మెదలకుండా కూర్చునే నేను, భిలాయిలో నా అంతట నేనే ఆ శ్లోకం గుర్తుకి తెచ్చుకుంటూ – ఏమో ఏ పుట్టలో ఏ పాము ఉందో ఎవరికి తెలుసు? – కాగితాలు నింపేవాడిని.

కాగితాలు  దాఖలు చెయ్యడానికి దరఖాస్తు ఒక్కంటికి పది, పదిహేను డాలర్ల రుసుం ఉండేది.

ఆ రోజులలో ఫారిన్ ఎక్స్చేంజి సులభంగా ఇచ్చేవారు కాదు. పైపెచ్చు డాలరుకి నాలుగున్నర రూపాయల చొప్పున  దరఖాస్తు ఒక్కంటికి నలభై ఐదు రూపాయల  రుసుమూ, మార్కుల జాబితాలకి నకలు టైపు చేయించటం, వాటిని సర్టిఫై చేయించడానికి గజిటెడ్ ఆఫీసరు సంతకానికి వెళ్ళినప్పుడు బిళ్ళ బంట్రోత్తుకి రూపాయ లంచం, తపాలా ఖర్చులు, ఇలా అమాంబాపతులు కలుపుకుని సునాయాసంగా 60 రూపాయల వరకూ ఖర్చు.

నాకప్పటికి పెళ్ళి కావలసిన చెల్లెళ్ళు, చదువుకో వలసిన తమ్ముళ్ళూ ఉన్నారు.  నాన్నగారు రిటైరైపోయారు. నేను బ్రహ్మచారిని కావటం వల్ల  ఉద్యోగం చేస్తూన్న అన్నదమ్ములలో నాదే "డిస్పోజబుల్" జీతం. ఈ జీతం రెండు వందలతో మొదలయి రెండు వందల యాభై వరకు పెరిగింది. నా ఖర్చులకి ఏ నూరు రూపాయలో వాడుకుని ఎంత మిగల్చ గలిగితే అంత మిగిల్చి నాన్నగారికి పంపేవాడిని. కనుక అమెరికా దరఖాస్తు పెట్టినప్పుడల్లా ఆయనకి ఓ 60 రూపాయలు తగ్గుతుంది. అందుకని ప్రతి దరఖాస్తు లోనూ, "అయ్యా! దరఖాస్తు రుసుం కట్టుకునే తాహతు నాకు లేదు. ఓక వేళ మీరు నాకు ఎడ్మిషనూ, స్కాలర్షిప్పూ ఇస్తే అక్కడికి వచ్చిన తర్వాత ఆ రుసుం కట్టుకుంటాను," అని ఒక ఉత్తరం రాసి పంపేవాడిని.

ముందు చకచకా రెండు 'రిజక్షన్ లెటర్సు' వచ్చేశాయి. ఆ ఉత్తరాలలో భాష చూసి – నిజం చెప్పొద్దూ – "అయ్యో! పాపం!!" అనిపించింది. మనం అంటే ఈ అమెరికా వాళ్లకి ఎంత అభిమానం. నా అర్హతలని చూసి వాళ్ళు ముగ్ధులు అయిపోయారుట. మరో రోజో, మరో సారో అయితే వాళ్ళు నన్ను తప్పకుండా చేర్చుకుని స్కాలర్షిప్పు కూడ ఇచ్చేవారుట. కాని ఆర్థికంగా అధిగమించలేని అవరోధాలని ఎదుర్కొనటం వల్ల కొద్దిమంది విద్యార్థులనే తీసుకుంటున్నారుట. క్షమించమని అడగలేదు కానీ అంతపనీ చేసేరు, వాళ్ళ భాషా పాటవంతో. తర్వాత ఎడ్మిషన్ ఇస్తాం కానీ స్కాలర్షిప్ ఇవ్వలేమని కొంతమంది రాసేరు. ఇక్కడితో అమెరికా అధ్యాయం అంతం అయిపోయిందని ఒహ కొబ్బరికాయ కొట్టేసి భిలాయిలోనే స్థిరపడిపోదాం అనుకున్నాను.

ఈ అనుకోవటం పూర్తిగా అనుకోనే లేదు, భిలాయిలో ఉన్న ఉద్యోగం కూడ ఊడే సూచనలు కనబడ్డం మొదలైనాయి. మొదటి దఫా కట్టటం పూర్తి కాబోతోంది, రెండవ దఫా ఇంకా మొదలు కాలేదు. కనుక అందరికీ చేతి నిండా పని లేదు. కొంతమందిని బొకారో బదిలీ చేసేరు. కొంతమందిని 'కన్స్ట్రక్షన్' నుండి 'ఆపరేషన్ అండ్ మైన్టెనెన్సు' లోకి తీసుకుంటున్నారు. కాని వీరందరిచేతా భిలాయిలో "ఏడేళ్ళు ఉద్యోగం చేస్తాం" అని హామీపత్రం (bond) రాయించుకుంటున్నారు. ఈ ఏడేళ్ళూ నిండకుండా ఒక్క రోజు ముందుగా కంపెనీని వదలి పెట్టినా సరే పదివేల రూపాయలు జరిమానా కట్టాలి.

ఏడిసినట్లుందనుకున్నాను. పూర్వం ట్రెయినింగుకి రష్యా పంపించే రోజులలో ఈ పద్ధతి ప్రవేశ పెట్టేరు – రష్యా పంపటానికి బోలెడు ఖర్చు అవుతుంది కనుక. ఇప్పుడు ట్రెయినింగు అంతా భిలాయి లోనే. పైపెచ్చు ఆ ఫేక్టరీని మా స్వంత చేతులతో కట్టేం. 'టెస్టు' చేసి 'ఆపరేషన్' వాళ్ళకి మేమే అప్పగించి యంత్రాలన్నీ ఎలా నడపాలో మేమే వారికి తరిఫీదు ఇచ్చేం. ఇప్పుడు ఏడేళ్ళు బాండు ఎందుకు రాయాలో నాకు అర్థం కాలేదు. పరిస్థితి అంతా అస్తవ్యస్తంగా ఉంది.

"పోనీ ఆ అమెరికాలోనైనా సీటు వచ్చింది కాదు, ఈ గొడవ ఉండేది కాదు"
అని ఇంటిల్లిపాదీ ఒకసారి అనుకుని తక్షణ కర్తవ్యం ఏమిటా అని ఆలోచనలో పడిపోయేం.

ఇలాంటి క్లిష్ట పరిస్థితి వచ్చినప్పుడల్లా నాన్నగారు ఒక లాగ, అమ్మ ఒక లాగ స్పందించేవారు. నాన్నగారు నా జాతకం తీసి "ఈ జాతకుడికి విదేశ ప్రయాణం ఉందిరా. కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది!" అన్నారు.

జాతకంలో కనిపిస్తోందేమో కాని ఎదట అటు రష్యా వెళ్ళటానికి కాని, ఇటు అమెరికా వెళ్ళటానికి కాని కంచు కాగడా వేసినా సావకాశం కనిపించటం లేదు.

అమ్మ పద్ధతి వేరు. ఇటువంటి పరిస్థితులు ఎదురైనప్పుడల్లా సత్యనారాయణ వ్రతం చేయించేది. మర్నాడు సోమయాజులు గారు వచ్చి నా చేత వ్రతం చేయించేరు. వ్రతం అయింది. కథ చదవటం అయింది. అందరు ప్రసాదాలు తిన్నారు. మొదటి విడత భోజనాలు కూడ అయేయి. సోమయాజులు గారు తాంబూలం సేవిస్తూ వరండాలో కూర్చున్నారు. ఆయనున్నారుకదా అని నేను గొట్టాలలోకి దిగి పోకుండా ఇంకా పట్టుపంచ కట్టుకునే ఉన్నాను.

ఈ సమయంలో తపాలా జవాను వచ్చి ఉత్తరాలు ఇచ్చి వెళ్ళేడు. అందులో యూనివర్సిటీ అఫ్ డిట్రాయిట్ నుండి వచ్చిన ఉత్తరం ఒకటి ఉంది. ఆ కవరు చాల పల్చగా ఉంది. లోపల ఒకే ఒక కాగితం ఉంది. ఇది మరొక రిజెక్షన్ లెటర్ అని నాకు తెలుసు. నాన్నగారు, "సర్వ మంగళ మాంగళ్యే, శివే సర్వార్థ సాధకే, శరణ్యే త్ర్యయంబకే దేవీ నారాయణి నమోస్తుతే" అని యధావిధిగా శ్లోకం మరొకసారి చదివేరు. నాన్నగారి నోటి వెంట ఆ శ్లోకం కనీసం లక్ష సార్లైనా విని ఉంటానేమో. కనుక ఆయన చాదస్తాన్ని కాదనటం ఎందుకని శ్లోకం పూర్తయే వరకూ ఆగి ఉత్తరం విప్పేను. ఆ ఉత్తరం సారాంశం ఇది.

"డియర్ మిస్టర్ వేమూరి, మేము నెల్లాళ్ళ కిందట నీకు ఎడ్మిషను, స్కాలర్‌షిప్పూ ఇస్తూ ఉత్తరము, దానితో పాటు ఐ–20 ఫారము పంపేము. నువ్వు మా ఆఫర్‌ని అంగీకరించి వస్తున్నావో, తిరస్కరించి రావటం లేదో ఇంతవరకు తెలియబరచలేదు. ఈ ఉత్తరం అందిన వెంటనే ఏ విషయమూ తెలియజేస్తే దానిని బట్టి ఈ స్కాలర్‌షిప్ మరొకరికి ఇవ్వడానికి వీలవుతుంది. ఇట్లు ఫాదర్ ఫారెల్"

“ఇది ఆ సత్యనారాయణ స్వామి అనుగ్రహమే” అంది అమ్మ.

“అక్కరకు రాని ఉత్తరాలన్నీ లక్షణంగా అందేయి కానీ, కావలసిన కాగితం కాస్తా గల్లంతు అయిందన్నమాట. ఇంకా నయం. వాళ్ళు మరొక ఉత్తరం రాసేరు కనుక సరిపోయింది,” అంటూ నాన్నగారు సర్వమంగళ మాంగళ్యే మళ్ళా అందుకున్నారు.

వెల్లువలా పెల్లుబికిన ఉత్సాహం చల్లారడనికి మూడు నిమిషాలు కూడ పట్ట లేదు. తనకి కాలూ చెయ్యీ ఆడటం లేదని అమ్మ పడక గదిలోకి వెళ్ళిపోయింది. వెనకాతలే నేను వెళ్ళేను. అవి ఆనంద బాష్పాలనే అనుకున్నాను.

“నాయనా, ఇప్పటికే బుచ్చన్నయ్య వెళ్ళిపోయి మూడేళ్ళయింది. వాడు తిరిగి ఎప్పుడు వస్తాడా ఎప్పుడు కంట బడతాడా అని రోజులు లెక్క పెట్టుకుంటున్నాను. ఇప్పుడు నువ్వు కూడ వెళ్ళిపోతే ఎలారా? రెండేళ్ళల్లో తిరిగి వచ్చెస్తానని మాట ఇస్తేనే నువ్వు వెళ్ళటానికి నేను ఒప్పుకుంటాను.”

అంతేకాని గాంధీ గారి తల్లిలా “మద్య మాంసాలు ముట్టుకోవద్దు, పరాయి స్త్రీని చూడ వద్దు” మొదలైన ఆంక్షలు పెట్టలేదు. గుడ్డిలో మెల్ల.

నాకు అమెరికా యోగం ఉన్నట్లు నా జాతకంలో మా నాన్నగారికి ఏమిటి కనిపించిందో అన్న కుతూహలం నన్ను ఏళ్ళపాటు పీడించింది. చివరికి 2006 లో నేను హైదరాబాదు, గచ్చీబౌలీలో ఉన్న కేంద్ర విశ్వవిద్యాలయానికి వెళ్లినప్పుడు కాకతాళీయంగా నా సమస్య పరిష్కారం అయింది. అక్కడ G. విజయ్ భరద్వాజ్ అనే విద్యార్థి కనిపించేడు. ఆతనికి జాతకాల పిచ్చి ఉంది. నా జనన సమయం, స్థలం ఇస్తే కంప్యూటరు ఉపయోగించి నా జాతకం వేసి చూపించేడు. ఆ జాతకం ప్రకారం నా జీవితంలో కేతు మహాదశ లో రాహువు అంతర్దశ జూలై 10, 1961 నుండి, జూలై 28, 1962 వరకు నడచింది. అదే నా విదేశీ యానానికి సూచిక అని చెప్పేడు. అంతవరకు విజయ్ భరద్వాజ్ కి నేను మొట్టమొదట అమెరికా ఎప్పుడు వెళ్లేనో తెలియదు. అతని సేవకి మెచ్చి "ఏమి బహుమానం కావాలి" అని అడిగేను.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించిన జ్యోతిష శాస్త్ర గ్రంథాలు కావాలని అడిగేడు. “నీకు కావలసిన పుస్తకాలు అన్నీ తెప్పించుకో, డబ్బులు నేను ఇస్తాను,” అని చెప్పేను. నా మాట మీద రూ. 850/= ప్రాప్తికి పుస్తకాలు కొనుక్కునాడు. ఇప్పుడు అతను వెల్లూరులో ఉన్న ఒక విశ్వవియాలయంలో ఆచార్యుడిగా పని చేస్తున్నాడు!

# అమెరికా ప్రయాణం

అమెరికా వెళ్ళటం అంటే మాటలా? నాలుగైదు వారాల కంటె ఎక్కువ వ్యవధి లేదు. పేస్‌పోర్టుకి వీసాకి దరఖాస్తులు పెట్టాలి. మా ఇంట్లో అంతా చదువుకున్న వారే అయినప్పటికీ ఎవ్వరికీ పేస్‌పోర్ట్ అంటే ఏమిటో, వీసా అంటే ఏమిటో, ఈ రెండింటికి మధ్య తేడా ఏమిటో సరిగ్గా తెలియదు.

తునిలో ఫారిన్ వెళ్ళి తిరిగొచ్చిన వాళ్ళెవరైనా ఉన్నారేమోనని చూసేం. రంగం వెళ్ళి వచ్చిన వాళ్ళనీ, మరీషస్ వెళ్ళొచ్చిన పాటక జనాన్ని మినహాయిస్తే నా ఎరికలో నేనే మొట్టమొదట మా ఊరు నుండి అమెరికా వెళ్ళబోతూన్న వ్యక్తినేమోనని ఒక అనుమానం పట్టుకుంది. మా మాజీ హెడ్‌మాస్టారు పులుగుర్త వెంకటరత్నం గారి పిల్లలు జెర్మనీ వెళ్ళినట్లు గుర్తు. కాని వాళ్ళు జెర్మనీ వెళ్ళే వేళకి మా ఊరు వదిలేసి రాజమండ్రి వెళ్ళిపోయారు.

కనుక మాకు సలహా ఇవ్వటానికి అనుభవం ఉన్నవాళ్ళు ఎవ్వరూ లేరు.

తెలియని దేశం వెళ్ళటానికి బెదురు.

ఇప్పటికే ఆలశ్యం అయిపోయింది కనుక మీదటికి వస్తే ఎలాగుంటుందని బుచ్చన్నయ్యని సలహా అడుగుతూ ఒక టెలిగ్రాము ఇచ్చేం.

ఈ సెప్టెంబరుకే వచ్చెయ్యమనీ, వివరాలు ఉత్తరంలో రాస్తాననీ చెబుతూ రెండు రోజులలో తిరుగు టెలిగ్రాము వచ్చింది.

అమెరికా సెప్టెంబరులో వెళ్ళాలంటే ముందు భిలాయిలో ఉద్యోగం వదిలేసి ఈ అమెరికా పనిమీద ఏకాగ్రతతో పని చేస్తే తప్ప కాగితాలు కదలవు. తీరామోసి ఉద్యోగం వదిలేసిన తర్వాత పేస్‌పోర్టు,

వీసా, రిజర్వు బేంకు పెర్మిటు, ఇన్‌కం టేక్స్ వారి వద్ద నుండి 'నో అబ్జెక్షన్ సర్టిఫికేటు' వేళకి అమరక పోతే రెండింటికి చెడ్డ రేవడిలా ఇంట్లో కూర్చోవాలి. Insert blank line here
భిలాయి తిరిగి వచ్చేను. మా డి. ఇ. (డివిజనల్ ఇంజినీరు) గారిని చూద్దామని నిశ్చయించేను. మా పక్క వీధిలోనే ఆయన ఉండేవారు. పేరు కె. సి. జైన్. ఆయనని కర్కోటకుడు అని మేం తెలుగులో పిలిచుకునేవాళ్ళం. నా బట్టలు ఎప్పుడూ బొగ్గుతో మాసిపోయి ఉండేవని నన్ను కొంచెం నీటుగా ఉండలేవా అని కోప్పడేవాడు. "బట్టలు మిలమిలా మెరుస్తూ ఉంటే పనులెలా అవుతాయి? ఇది ఫేక్టరీయా? ఆసుపత్రా?" అని నా రష్యన్ బాసు అనేవాడు. ఈ భేదాభిప్రాయంలో నేను జైను గారి మాట ఎప్పుడూ వినేవాడిని కాదు. అయినా ఇప్పుడు అవసరం నాది. తెల్లటి బట్టలు కట్టుకుని జైన్ గారిని చూడటానికి వెళ్ళేను. నా పరిస్థితిని అంతా ఆయనకి చెప్పి "ఏమిటి చెయ్యమంటారు?" అని ఆయననే సలహా అడిగేను.

ఒక తెల్ల కాగితం నాకిచ్చి ఒక రాజీనామా ఉత్తరం డిక్టేటు చేసేరు. తారీఖు వెయ్యొద్దన్నారు.

మరొక తెల్ల కాగితం ఇచ్చి, దాని మీద ఆ మర్నాటి తారీఖుతో నెల్లాళ్ళపాటు సెలవు కావాలని ఉత్తరం రాయించేరు.

"రావ్, నువ్వు ఇంటికి వెళ్ళి నీ పనులు చూసుకో. బొంబాయిలో విమానం ఎక్కే ముందు నాకొక కార్డు ముక్క రాసి పడెయ్. నీ జాబు రాగానే, నీ రాజీనామా మీద తారీఖు వేసి ఎస్. ఇ. గారికి పంపుతాను. నీకు పేస్‌పోర్టు, వీసా వేళకి రాని పక్షంలో మళ్ళా భిలాయి తిరిగి వచ్చేసి ఉద్యోగంలో చేరిపో.

" ఈ శలవు కాగితం అంటావా! నువ్వు ఒళ్ళు దాచుకోకుండా రాత్రనక, పగలనక పని చేసేవని నాకు తెలుసు. నువ్వు ఏమైపోయావని నన్ను ఎవరూ అడగనన్నాళ్ళూ ఈ ఉత్తరం నా ఫైలు లో ఉంటుంది. నువ్వు భిలాయి తిరిగి వచ్చేస్తే ఈ కాగితం తిరిగి నీకిచ్చేస్తాను. సరా?"

ఆయనని కర్కోటకుడు అని పిలచినందుకు కొంచెం బాధ పడ్డాను. ఆయనకి మనస్ఫూర్తిగా దండం పెట్టేసి, మర్నాడు నా జీతం లో నుండి ఇన్‌కం టేక్సు వాళ్ళకి ముట్టవలసినది ముట్టిందని ఒక సర్టిఫికేటు తీసుకుని, పెట్టె, బెడ్డింగు సర్దుకుని, పుస్తకాలు, వగైరాలు అన్నీ కట్ట కట్టి చిత్తరంజన్ ఇంట్లో (దాన్ని సత్రవ అనే వాళ్ళం) అటక మీద పడేసి, రాయపూరు లో బండి ఎక్కి తుని వచ్చేసేను.

ఈ చిత్తరంజన్ తెలుగు వాడే. కాకినాడలో నాకు ఒక ఏడు సీనియరు. ఆసిస్టెంటు ఇంజనీరుగా పని చేసేవాడు. 1996-97 ప్రాంతాలలో పిల్లలని చూడటానికి అమెరికా వచ్చి, సిలికాన్ వేలీలో కొద్ది రోజులు ఉన్నాడు. వెతికి నన్ను పట్టేడు. అప్పటికి చీఫ్ ఇంజనీరు అయేడు. వాళ్ళ అటక మీద నేను పెట్టిన పుస్తకాలు ఇంకా ఉన్నాయిట. ఏమి చెయ్యమంటావు అని అడిగేడు. ఎప్పటి 1961. ఎప్పటి 1998! చిత్తరంజన్ ప్రశ్నకి నేనేమి సమాధానం చెప్పేనో గుర్తు లేదు కాని, ఈ సందర్భంలో ఒక ఉదంతం జ్ఞాపకం వస్తోంది. అది చెబుతాను.

మా పెద్దన్నయ్య, మరేమండ రామారావు మంచి స్నేహితులు. ఇద్దరు కలసి కథలు రాసేవారు. ఊహ రామారావుది, రాత అన్నయ్యది. ఆనందవాణి, వినోదిని, చిత్రగుప్త, ఆంధ్ర పత్రిక మొదలైన పత్రికలలో వీళ్ళు రాసిన కథలు తరచు వచ్చేవి. ఒక సారి వీళ్ళిద్దరు బెజవాడ రైల్వే ప్లేట్‌ఫారం మీద ఎందుకో చిక్కడి పోయేరు. వీళ్ళు మారవలసిన బండి పన్నెండు గంటలో ఎంతో లేటు. ఆ రోజులలో రైళ్ళు 24 గంటలు లేటుగా నడచిన వైనం నేను ఎరుగుదును. మారేమండ రామారావుని సామానుకి కాపలా కూర్చోమని అన్నయ్య ఏదో చిన్న పనుందని ఊళ్ళోకి వెళ్ళేడు. ఊళ్ళో తెలుసున్న వాళ్ళు తారసపడితే వాళ్ళతో కబుర్లలో పడిపోయి అన్నయ్య రామారావు సంగతి మర్చి పోయి, హొటేలుకి వెళ్ళి భోజనం చేసి, కిళ్ళీ నములుతూ ఉంటే గభీమని రామారావు గుర్తుకొచ్చాడు. అన్నయ్య పరుగు పరుగున స్టేషన్‌కి వచ్చి ఆరు గంటల సేపు సామాను దగ్గర పడిగాపులు పడుతూ, కించిత్తయినా కోపగించుకోకుండా ఉన్న రామారావు కనిపించేడు. అలా చిత్తరంజన్ 35 ఏళ్ళ పాటు నా పుస్తకాలని భద్రపరచి, ఆ విషయం ప్రత్యేకం అమెరికా పట్టుకొచ్చి చెప్పేడంటే అది విశేషం కాక మరేమిటి?

తుని వచ్చేసిన తర్వాత విషయాలు ఒకొక్కటి అవగాహన అవటం మొదలుపెట్టేయి. పేస్‌పోర్టు వచ్చేముందు పోలీసు రిపోర్టు కావాలి. ఈ పోలీసు రిపోర్టు ఊళ్ళో తీసుకుని దానిని కలక్టరు ఆఫీసుకో ఆర్. డి. ఒ. ఆఫీసుకో పట్టుకెళ్ళి కాగితాల మీద సంతకాలు పెట్టించుకుని అప్పుడు అవన్నీ మెడ్రాసు పంపాలి. పంపి రెండో మూడో నెలలు ఆగితే, అన్నీ సవ్యంగా ఉంటే పేస్‌పోర్టు వస్తుంది. అన్ని రోజులు ఆగలేని వాళ్ళు మెడ్రాసు పోయి అక్కడ పేస్‌పోర్టు ఆఫీసులో పడిగాపులు పడితే కొంచెం త్వరగా తెమలొచ్చు. మెడ్రాసులో అరవ్వాళ్ళకి ఇచ్చినంత సులభంగా తెలుగు వాళ్ళకి పేస్‌పోర్టులు ఇవ్వరని కొందరు బెదిరించేరు.

పోతే వీసా సంగతి. వీసాకి మెడ్రాసు వెళ్ళి తీరాలి. అక్కడ మెడికల్ ఎక్జామినేషను, తర్వాత ఇంటర్వ్యూ.

బయలుదేరటానికి ముందు మసూచికం టీకాలు, కలరా ఇంజెక్షను.

అంతేకాదు. రిజర్వు బేంక్ వాళ్ళు ఎనిమిది డాలర్లు దేశం నుండి బయటకి పట్టికెళ్ళటానికి అనుమతి ఇవ్వాలి. ఆ అనుమతి పత్రాన్ని పి. ఫారం అనేవారు.

ఆదాయపు పన్నులు అన్నీ కట్టేసినట్టు ఇన్‌కం టేక్సు వాళ్ళు ఇచ్చిన కాగితం ఉండనే ఉంది.

కాగితాలు నెమ్మదిగా కదులుతున్నాయి. ఇహ కావలసింది డబ్బు. ఒకటి, ఓడ టిక్కెట్టు. అది ఏ మూడు వేల రూపాయలలో ఎంతో ఉండేది. రెండు, అమెరికన్ కాన్సలేటు వారికి హామీ పత్రం. ఏ కారణం వల్లనైనా అమెరికా ప్రభుత్వం వారు నన్ను కాని, నా శరీరాన్ని కాని తిరిగి ఇండియా పంపవలసి వస్తే దానికయే విమానం ఖర్చు, అమాంబాపతులు, కలుపుకుని ఫది వేల రూపాయలకి హామీ ఇవ్వాలి. వెళ్ళినప్పుడు మనం పడవలో వెళ్ళేమో, ఈదుకు వెళ్ళేమో వాళ్ళకి అనవసరం. తిరిగి పంపవలసి వస్తే విమానంలో రాచ మర్యాదలతో పంపుతారుట. ఉత్తుత్తనే సంతకం పెడితే సరిపోదుట. స్థిరాస్థి దన్ను చూపించాలిట. మా ఊళ్ళో ఉన్న వర్తకులు చాల మంది ఈ రకం హామీ ఇవ్వటానికి సిద్ధపడ్డారు. కాని ప్రయాణపు టిక్కెట్టు కొనుక్కోటానికి ఉత్తుత్తి డబ్బు సరిపోదు. నిజం డబ్బు కావాలి. కావాలంటే అది

కూడా సర్దుబాటు చేసే వాళ్ళు మా ఊళ్ళో ఉన్నారు. కాని రిటైరైపోయిన నాన్నగారికి చీటికీ, మాటికీ డబ్బు అప్పు చెయ్యటం ఇష్టం ఉండేది కాదు. అప్పులతో ప్రాణం పోతే రుణం మిగిలిపోతుందేమోనని ఆయన బెంగ.

ప్రయాణానికి ట్రేవెల్ గ్రేంటు ఎవరైనా ఇస్తారేమోనని చూసేం. తెన్నేటి విశ్వనాథం గారి సహాయంతో హుమయూన్ కబీర్ అంతటి వాడిని పట్టి టాటా వారి దగ్గరకి ఒక రికమెండేషను పట్టుకెళ్ళేను. అయినా పని చెయ్య లేదు. వాళ్ళు "ఈ ఏటికి వేళ మించి పోయింది, మీదటికి ప్రయత్నం చెయ్యండి, అప్పుడు రావచ్చు" అని మొండి చెయ్యి చూపించేరు. ఇచ్చే చేతులన్నీ ఒక్క లాగే కనిపిస్తాయి; కాని మొండి చేతులు మాత్రం రకరకాలు! ల్ కి ఏత్వం, ద కి కొమ్ము ఇవ్వటం లో ఎంత చాతుర్యం చూపవచ్చో నెమ్మది నెమ్మదిగా ం అవటం మొదలైంది.

టిక్కెట్టు కొనుక్కోడానికి ఇంట్లో తంతే దమ్మిడీ లేదు కాని, ప్రయాణానికి మాత్రం ప్రయత్నాలు ముమ్మరంగా జరిగి పోతున్నాయి.

అప్పుడు బుచ్చన్నయ్య ఉత్తరం రాసేడు. "టిక్కెట్టు కొనుక్కుందికి 800 డాలర్లు అప్పు చేసి పంపుతాను, నెలకి ఏభై చొప్పున తీర్చేస్తే ఏణ్ణర్థంలో అప్పు తీరిపోతుంది" అని సలహా ఇచ్చేడు. అమెరికా వెళ్ళి జల్సాగా డబ్బు ఖర్చు పెట్టేసుకుందాం అన్న ఊహ ఏ మారుమూలనైనా ఉండి ఉంటే అది కాస్తా హారతి కర్పూరంలా అక్కడే హరించుకుపోయింది. నేనింకా అమెరికా వెళ్ళనే లేదు, కాని నాకు రాబోయే రెండు వందల అసిస్టెంటుషిప్ లోనూ ఏభై నాన్నగారికి ఇంటి ఖర్చులకి, ఏభై అప్పు తీర్చటానికి కేటాయింపు అయిపోయింది.

"పరవా లేదు. పాడు ఖర్చులు పెట్టకుండా బుద్ధిగా చదువుకుంటే స్కాలర్షిప్ డబ్బు వీటన్నిటికీ సరిపోతుంది" అని బుచ్చన్నయ్య ధైర్యం చెప్పేడు. పాడు ఖర్చులకీ డబ్బు సరిపోవటానికి మధ్య ఉన్న విలోమ సంబంధం అర్థం అయింది కాని, బుద్ధిగా చదువుకోటానికీ డబ్బు సరిపోవటానికీ మధ్య లంకె అర్థం కాలేదు. తర్వాత నిలకడ మీద ఆలోచించగా తెలిసింది. మా అన్నయ్య దృష్టిలో 'బుద్ధిగా

చదువుకోవటం' అంటే మంచి మార్కులు రావడమే కాకుండా, 'అమ్మాయిల వెంట తిరగకుండా ఉండటం'. ఇంకేమి తిరుగుతాను, చేతిలో చిల్లి గవ్వ లేకుండా? "అరుంధతి మాట దేవుడెరుగు కానీ ఆరు వేలు అప్పు కనిపిస్తున్నాది" అన్నాడుట వెనకటికి ఒహడు. అలాగ, పేస్‌పోర్టు లేదు, వీసా లేదు, కాని ముందస్తుగా అమాంబాపతులు కలుపుకుని ఐదు వేలు అప్పు కనిపించింది.

పేస్‌పోర్టు పోస్టులో తెప్పించుకుందికి వ్యవధి లేదు కనుక , దరఖాస్తు కాగితాలు తీసుకుని మెడ్రాసు వెళ్ళేను. ఒక రోజల్లా అక్కడ కూర్చున్న తర్వాత, "పోలీసు రిపోర్టు రాలేదు, పేస్‌పోర్టు ఇవ్వం పో" అన్నారు. పుల్లయ్య యావ్వారంలా అయిందనుకొని నెత్తి మీద చెంగేసుకుని తుని తిరుగు ప్రయాణం కట్టేను.

ఆ రోజుల్లో ఇప్పటిలా కంప్యూటర్లతో రిజర్వేషన్ చేసే పద్ధతి లేదు. ఆ రోజులలో ఇండియాలో కంప్యూటర్లే లేవు. అప్పటికప్పుడు అనుకుని ప్రయాణం చేస్తే నరకం కంట పడేది. టికెట్టు కౌంటరు దగ్గర దొమ్మీ లోకి అభిమన్యుడు పద్మవ్యూహం లోకి జొరబడ్డట్టు దూరి పోవాలి. రెండంగుళాలు వ్యాసం ఉన్న చిన్న కంతలోకి నాలుగు చేతులు ఒక్కసారి వెళ్ళేవి. టిక్కెట్లు, చిల్లర ఉన్న చెయ్యిని బయటకి లాగ గలిగితే నోబెల్ బహుమానం వచ్చినంత గర్వంగా ఉండేది.

మొత్తం మీద హౌరా మెయిలు ఎక్కేను. ఆ రోజుల్లో మెడ్రాసు నుండి తుని వెళ్ళాలంటే పూరీ పేసెంజరు, మెయిలు – ఈ రెండే గతి. మెయిలు లో ఫస్టు క్లాసు, సెకండు క్లాసు, ఇంటరు, ఐస్ వెండరు, మిలిటరి, పోస్టల్ సర్వీసు, లేడీస్ – ఇలా ఒకొక్క బోగీని ఒకొక్క విధంగా కేటాయించెయ్యడంతో, రిజర్వేషన్లూ, రైల్వే పేసులూ లేని నా బోటి మూడవ తరగతి ప్రయాణీకులకి బోగీలో సగం భాగం ఉండేది. ప్రయాణం దుర్భరంగా ఉండేది. ఆ రోజు రైలు ఎంతలా కిటకిటలాడిపోయిందంటే, సాయంకాలం మెడ్రాసులో బండి ఎక్కిన వాడిని, మర్నాడు ఉదయం పదిగంటలకి రాజమండ్రి చేరుకునే వరకు నిలబడే ఉన్నాను, ఆ తొడతొక్కిడిలో నేల మీద కాలు మోపుకుందికి కూడ జాగా దొరకక అలా గాలిలోనే నిలబడ్డాను! నా జీవితంలో మొదటిసారి అనిపించింది: "ఎప్పుడు ఈ దేశం నుండి బయట పడతానా, ఎప్పుడు సుఖపడతానా" అని.

ఈ భాగోతం అంతా అయేసరికి నేను వెళదామనుకుంటూన్న పడవ కాస్తా బొంబాయి వదలి పెట్టేసింది. మూలుగుతూన్న నక్క  మీద తాటిపండు పడ్డట్టు ఇహ నాకు ఆ విమానం ఖర్చులు తప్పేట్టు లేవు.

ఈ మారు మనిషి సాయం ఉంటే బాగుంటుందని చిట్టన్నయ్య కూడ నాతో మెద్రాసు వచ్చేడు. విమానం ఖర్చులకి కావలసిన డబ్బు అంతా లోపల బనీను జేబులో పెట్టి ఆ జేబుని మూసేస్తూ అక్క ఒక పోగు వేసి కుట్టింది.

సెప్టెంబరు ఎనిమిదిన పేస్‌పోర్టు వచ్చింది. అది పట్టుకుని మౌంట్  రోడ్డులో ఉన్న అమెరికన్ కాన్సలేటుకి పరిగెట్టేం. వీసా త్వరలోనే వచ్చింది. అక్కడనుండి థామస్ కుక్ అండ్ సన్స్ వారి ఆఫీసుకి సాయంకాలం ఆఫీసు మూసేసే వేళకి వెళ్ళి విమానం టికెట్టు కొన్నాం. వారే ఎనిమిది డాలర్లు ఫారిన్ ఎక్స్చేంజి కూడ ఇచ్చేరు. ఇవన్నీ తెమిలిన తర్వాత పరుగు పరుగున తుని వచ్చేం. ఇక బొంబాయికి బయలుదేరి వెళ్ళటానికి ఎక్కువ వ్యవధి లేదు.

మర్నాడే బొంబాయికి రైలు ప్రయాణం. రెండు రోజులు పట్టింది కాని కూర్చుందుకి చోటు దొరికింది. బొంబాయి ఊరు నాకూ, చిట్టన్నయ్యకి కూడ తెలియదు. తన  స్నేహితుడు, జోషీ విక్టోరియా టెర్మినస్ లో మమ్మల్ని కలుసుకుని విమానం ఎక్కించే ప్రయత్నం అంతా బుచ్చన్నయ్య అమెరికా నుండే చేసేడు. కనుక మేం ఇద్దరం అతి ధైర్యంగా చేతులాడించుకుంటూ సెప్టెంబరు ఉదయం తొమ్మిదింటికల్లా వి. టి. లో దిగేం.

స్టేషన్‌లో ఎంతసేపు నిరీక్షించినా జోషీ కనిపించడే. ఆ జోషీని మేం ఎప్పుడూ చూడలేదు. ఆందుకని బండి ఎక్కడైతే దిగేమో అక్కడే కదలకుండా రెండు గంటలు నిరీక్షిస్తూ కూర్చున్నాం. అతనొచ్చి సాయం చేస్తాడన్న ధైర్యంతో మేమేమీ సన్నాహాలు చేసుకోలేదు. ఆప్పటికప్పుడు ఏమి చెయ్యగలం?

స్టేషన్ కి దగ్గరగా వెల్‌కం హొటల్ అని ఒక దక్షిణాది హొటల్ కనిపించింది. అందులో దిగేం. స్నానం గట్రా కానిచ్చి, ఆ చుట్టుపట్లే నాలుగు వీధులు తిరిగేం.  ఎదురుగా ఒక అమ్మాయి బొమ్మతో పేద్ద

ప్రకటన కనిపించింది. “పి–ఫారం దొరక్క పోతే పోయింది, మెయిడెన్ ఫారం బ్రా కొనుక్కోండి” అని ఆ ప్రకటన  సారాంశం. అందులో సందర్భోచితంగా కనిపించిన వ్యంగ్యాన్ని గమనించి ఇద్దరం నవ్వుకున్నాం.

ఇహ  భోజనం చేసి ఎయిర్‌పోర్టు కి వెళ్ళాలి. సాయంకాలం ఆరు గంటలు అయింది. భోజనాల వేళ కాలేదు కాని మా ఇద్దరికీ భోజనం పెట్టటానికి ఒప్పుకున్నారు. సర్వర్ మా ఇద్దరి కంటె బాగా ఇంగ్లీషు మాట్లాడెస్తూ కబుర్లు మొదలు పెట్టేడు. మా వాలకం చూసి నేను అమెరికా వెళుతున్నట్టు సులభంగానే పసి గట్టేడు. విమానాల గురించి కబుర్లు మొదలు పెట్టేడు. విమానం ఎక్కడానికి నాకు బెదురుగా ఉంటే విమానం ఎక్కించటానికి అన్నయ్య బెదురుగా ఉన్నాడు. ఈ సెర్వర్ విమానాలలో రకాలు, వాటిని నడిపే పద్ధతులు చెబుతూ ఉంటే వినటానికి బాగానే ఉన్నాయి కాని బెదురు తగ్గ లేదు. కడుపులో ఏదో కలవరం.

ఏమిటో ‘త్రీ పోయింట్ లేండింగ్’ అన్నాడు; అంటే ముందున్న చక్రం, వెనక ఉన్న చక్రాల జత ఒకే సారి నేల్ మీద ఆంచటం. చాలా కష్టం కాని కొందరు చెయ్యగలరు. తర్వాత ‘టూ పోయింట్ లేండింగు’ అన్నాడు; అంటే వెనక ఉన్న చక్రాల జత ముందు నేలని ఆనిన తర్వాత ముందున్న చక్రాన్ని నెమ్మదిగా కిందకి దించటం.

“వన్ పోయింట్ లేండింగ్” ఉంటుందా?” అని అడగబోయి, నాలిక్ కరుచుకుని, ఎందుకేనా మంచిదని అడగలేదు.

నేను బందరులో ఇంటరు చదువుతున్న రోజులల్లో కోలవెన్ను సుబ్బారావు ఇటువంటి సందర్భం లోనే “పడవ నూరు డిగ్రీలు పక్కకి వాలితే కండిషన్ రెడ్ అవుతుందా, లేక యెల్లో అవుతుందా?”  అని చుట్టపు చూపుకి వచ్చిన ఒక నేవీ ఆఫీసర్‌ని అడిగేడు. “రెడ్ కాదు, నువ్వు డెడ్ అవుతావు” అని చెప్పేడాయన.

ఈ నూరు డిగ్రీలు సుబ్బారావు బుర్రలో ఎలా పాతుకు పోయేయో చెబితే కాని ఈ కథ రక్తి కట్టదు. నేను హిందూ కాలేజి లో ఇంటర్మీడియేట్ చదువుకుంటూన్న రోజులలో మా తరగతి లో 600 మంది మగ పిల్లలు, పన్నెండు మంది ఆడ పిల్లలు ఉండేవారు. కనుక ఈ పన్నెండు వందల కళ్ళూ ఆ పన్నెండు మంది అమ్మాయిల మీదే ఉండేవి. అందులో ఒక అమ్మాయి ఏ. డి. ఎం. ఓ. గారి కూతురు. మిగిలిన అమ్మాయిలంతా ఎడ్ల బళ్ళల్లోనో, జటకాలలోనో కాలేజి కి వస్తే ఈ అన్నె వారి అమ్మాయి కారులో వచ్చేది. దగ్గరగా వెళ్ళి చూసి, పలకరించే ధైర్యం లేకపోయినా, దూరం నుండి చూస్తే, సన్నగా, పొడుగ్గా, నాజూగ్గానే ఉండేది. ఆ అమ్మాయి రోల్ నంబరు 100. కనుక 100 అనే సంఖ్య మా సుబ్బారావుకి ఆరాధ్య దేవత అయిపోయింది. విగ్రహారాధన విన్నాను కాని సంఖ్యారాధన చూడటం ఇదే మొదటి సారి. ఏ సందర్భంలో అంకెల ప్రస్తావన వచ్చినా అక్కడ 100 ని ఇరికించి నప్పుతుందో నప్పదో చూసుకునేవాడు మా సుబ్బారావు. పరిక్ష లో నూరు మార్కులు, క్రికెట్ లో సెంచరీ, నీరు మరిగే స్థానం – ఇలా 100 కి సృష్టిలోనే ఒక ప్రత్యేక స్థానం ఉందని నమ్మేసే స్థితిలోకి దిగజారిపోయేడు. కనుక తుఫానులో ఊగిసలాడుతూన్న పడవ 100 డిగ్రీలు ఊగితే ఏమౌతుందని అడిగేడంటే మనం ఎలా ఆక్షేపించగలం? ఊగే పడవ 100 డిగ్రీలు ఒరిగితే సముద్రం అడుగున ఉంటుందన్న విషయం తెలియని వాడు కాదు, సుబ్బారావు; తర్వాత ఆంధ్రా యూనివర్శిటి లో కెమెస్ట్రీలో పి. హెచ్. డి. చేసేడు. ఆ అమ్మాయి మీద మోజు కొద్దీ పప్పులో కాలేసేడు. ఈ సంఘటన నా బుర్రలో నాటుకు పోయిందేమో 'వన్ పోయింట్ లేండింగ్' గురించి అడగ లేదు.

దరిమిలా నేను అమెరికా వచ్చేసిన తర్వాత, ఆ అమ్మాయి గురించి వాకబు చేస్తే మెనింజైటిస్ వచ్చి పోయిందని విని చాల బాధ పడ్డాను.

విమానాల కబుర్లు విమానాల ప్రమాదాల వైపు మళ్ళాయి. బాండుంగ్ కాంఫరెన్సు నుండి తిరిగి వస్తున్న ఎయిర్ ఇండియా వారి విమానం, 'కాశ్మీర్ ప్రిన్సెస్' సౌత్ చైనా సముద్రంలో కూలిపోవటం గురించి చెప్పేడు. అందులో చైనా ప్రధాని జో ఎన్ లై ఉన్నాడనుకుని సి. ఐ. ఎ. వారు దానిని కూల్చేసేరుట. వీడికి తెలియని విషయం లేనట్టుంది.

విమానం సముద్రం మీద వాలితే అది రెండు మూడు నిమిషాలు కంటె ఎక్కువ కాలం తేల లేదుట. ఇలా వాటర్ లేండింగ్ లో ఉన్న కష్ట సుఖాలు చెప్పుకొస్తున్నాడు. "లేండ్ మీద వాలితే దాన్ని లేండింగ్ అంటారు కాని, నీటి మీద వాలితే దానిని లేండింగ్ అనొచ్చా?" అని నాకు చిన్న వ్యాకరణ భూయిష్టమైన సందేహం వచ్చింది. కాని అసలే బెదురుగా ఉన్నానేమో అడిగితే ఎటువంటి సమాధానం వస్తుందో అని అడగలేదు. 'వింగ్ టిప్' రన్‌వే కి తగిలితే విమానం బోల్తా కొడుతుందన్నాడు. ఇంకా ఏవేవో చెప్పుకు పోతున్నాడు. నా ముఖం లో కత్తి వేటుకి నెత్తురు చుక్క లేదు. అది గమనించి అన్నయ్య వాడి చేత  కబుర్లు ఆపు చేయించేడు. దబదబా నాలుగు మెతుకులు కతికి గబగబా బయటకి వచ్చేసేం.

ఆ రోజు 12 సెప్టెంబరు 1961. రాత్రి పన్నెండు దాటిన తర్వాత  విమానం ఎక్కేను. విమానం సవ్యంగా నూ యార్క్ చేరుకుందనే వార్త వచ్చే వరకు తను బొంబాయిలోనే  ఉంటానన్నాడు అన్నయ్య..

విమానం సగం ఖాళీ. నేను కిటికి సీటు లో కూర్చున్నాను. బయట చిట్ట చీకటి. ఏమీ కనిపించటం లేదు.

అది సూపర్ కాన్‌స్టలేషన్ విమానం. ఇంజనుకి ప్రొపెల్లరు,  జెట్టు రెండూ ఉంటాయి. ఈ రకం ఇంజనుకి వెనక వైపు నీలి రంగు మంట లాంటిది కనిపిస్తుంది. దాన్ని చూసి భయపడవద్దని పైలట్ ముందుగానే చెప్పేడు.
విమానం ఎగిరే ఎత్తు చేరుకుంది. హోస్టెస్ అందరికి చాకలేట్లు, ఆ తర్వాత   రెండు రకాల సిగరెట్టు పెట్టెలు ఇచ్చింది. నా పక్కనున్న అమెరికన్ పిల్ల సిగరెట్టు ముట్టించింది.

భోజనాలయాక చాల మంది నిద్ర లోకి జారుకున్నారు. పుంజుగుంట (కాక్‌పిట్ అన్న మాటని తెలుగులో రాద్దామనే సరదా తప్ప దురుద్దేశం ఏమీ లేదు.) చూడాలని  ఉంటే ఒకరి తర్వాత మరొకరు ముందుకి వచ్చి చూడ వచ్చని పైలట్ చెప్పేడు. కొంచెం సేపు తటపటాయించి, నేను వెళ్ళి చూసి వచ్చేను. ఈ రోజులలో ఈ పని చెయ్యటం మన తరమా?

విమానం అరేబియా సముద్రం దాటి అరేబియా దేశం మీదకి వచ్చే సరికి కొరివి దయ్యాలలా ఎక్కడ చూసినా మంటలే. వైజాగు లో కాల్‌టెక్స్ వారి నూనె శుద్ధి కర్మాగారం వద్ద ఇటువంటి "ఫ్లేర్" ఒకటి చూసేను కనుక అవి కొరివి దయ్యాలనుకుని భయపడ లేదు. కాని అన్ని ఫ్లేర్‌లని ఇంతకు ముందెప్పుడు చూడ లేదు. మెల్లిగా మంటలు దూరం అయిపోయాయి. కైరో మరొక రెండు గంటలలో చేరుకుంటామని పైలట్ చెప్పేడు.

నేను కిటికీ లోంచి అలా చూస్తూనే ఉన్నాను. ఇంతలో ఇంజను వెనక నుండి వచ్చే నీలం మంట ఎర్రగా మారింది. బందరులో ఇంటరు చదువుతూన్న రోజులలో బన్సెన్ బర్నర్ మంట నీలం నుండి ఎరుపుకి ఎప్పుడు మారుతుందో తెలుసుకున్నాను కనుక ఇక్కడ కూడ అటువంటి ప్రకియ ఎదో జరుగుతోందని అనుకున్నాను. అంత కంటె విమానాల గురించి పెద్దగా నాకేమీ తెలియదు – వెల్కం హొటల్ లో సర్వర్ దగ్గర నేర్చుకున్న విషయాలు తప్ప.

ఈ లోగా ఆ ఎర్ర మంట బాగా పెద్దదయింది. కొద్ది సేపటిలో మంట ఏ రంగూ లేకుండా పూర్తిగా ఆరిపోయింది. నేనున్న వైపు రెక్క కింద రెండు ఇంజనులు ఉన్నాయి. ఆ రెండో ఇంజను నీలం మంటనే చూపిస్తోంది. ఇంజనీరుని కదా. నేను చూస్తూన్న దాంట్లో తర్కం నాకు అర్థం కాలేదు.
దూరంలో ఆకాశం ఎర్రబడుతోంది. విమానం మలుపు తిరుగుతోంది. మేపు ప్రకారం మళుపు తిరగవలసిన అవసరం నాకు కనబడ లేదు; ఇప్పుడే కదా చెప్పేడు, రెండు గంటలలో కైరో చేరుకుంటున్నామని? ఈ లోగా విమానం పూర్తిగా వెనక్కి తిరిగింది. ఎర్రబడుతూన్న ఆకాశం అట్నించి ఇటు వచ్చింది. విమానం ప్రవర్తన అర్థం కాలేదు. ఈ లోగా పైలట్ ప్రకటన చేసేడు. విమానానికి చిన్న ఇబ్బంది వచ్చిందిట. ఎందుకైనా మంచిదని ఒక సారి కిందకి దిగి తనిఖీ చేసుకుని వెళ్ళటానికి దహరాన్ లో విమానాన్ని దింపుతున్నాను అన్నాడు. ఒక గంట కంటె ఎక్కువ ఆలస్యం అవదని హామీ ఇచ్చేడు.

అప్పట్లో దహరాన్ ఏ దేశం లో ఉందో నాకు తెలియదు. దిగేం. అది మాములు విమానాశ్రయం కాదు; అమెరికా వారి వాయుదళాల స్థావరం. మమ్మల్ని అక్కడ ఒక మిలటరీ హొటల్లో పడేసేరు. గంట

ఆలశ్యానికి హొటేలు ఎందుకు? తర్వాత విమానం కంపెనీ వాళ్ళు తుపాకేస్తే కనిపించకుండా అదృశ్యం అయిపోయేరు. నోరున్న వాళ్ళు, అనుభవం ఉన్న వాళ్ళు ఎవరి దారి వారు చూసుకున్నారు. నా లాంటి వాళ్ళం ఏమి చెయ్యాలో తెలియక అలా ఆ హొటల్లో మూడు రోజులు నట్టడి పోయేం.

నాలాంటి వాళ్ళు నలుగురం కలుసుకుని బ్రహ్మ ప్రయత్నం చేసి ఒక ఏజంటుని పట్టేం. నూ యార్క్ లో నన్ను విమానం దింపుకోటానికి రాబోతూన్న అన్నయ్యకి ఒక టెలిగ్రాము ఇవ్వాలి. కాని వాడి రాచెస్టర్ ఎడ్రస్ మాత్రమే నా దగ్గర ఉంది. నూ యార్కు లో ఎక్కడ దిగేడో తెలియదు.

రాచెస్టర్ అడ్రసుకి ఒక టెలిగ్రాము ఇప్పించేను, విమానం కంపెనీ వాళ్ళ చేత. ఇచ్చేం అన్నారు. కాని నిజంగా ఇచ్చేరన్న నమ్మకం నాకు లేదు. అలాగే తునిలో నాన్నగారికి మరొక టెలిగ్రాము ఇప్పించేను; నేను క్షేమంగానే ఉన్నానని. కాని బొంబాయిలో ఉన్న చిట్టన్నయ్యకి టెలిగ్రాము ఎక్కడికి ఇవ్వాలో తెలియ లేదు. ఆ వెల్‌కం హొటలు అడ్రసు కూడ నా దగ్గర లేదు.

నా టెలిగ్రాము అందుకోకుండానే నూ యార్కు సిటీ వచ్చేసిన బుచ్చన్నయ్యకి పరిస్థితి తేలికగానే అర్థం అయిందిట. బొంబాయిలో ఉన్న చిట్టన్నయ్యకి సగం సగం వార్త వచ్చిందిట. “విమానం ఇంజనుకి నిప్పంటుకుందిట. అందుకని కైరో చేరలేదుట,” అని ఎవరో చెప్పేరుట. విమానం ఏమైందో చెప్పలేదుట. విమానం కూలిపోయి ఉంటే పేపరులో వస్తుంది కదా! అయినా సరే, బెంగ బెంగే! తాజ్ మహల్ హొటేలు లో ఉన్న టి. డబ్ల్యు. ఏ. వారి ఆఫీసులో అడిగితే ఎయిర్‌పోర్టు కి వెళ్ళి అడగమన్నారుట. శాంటా క్రూజ్ లో అడిగితే ఊళ్ళో కనుక్కోమన్నారుట. ఆ ఎడారిలో ఎక్కడో కూలిపోయిందేమో అన్న బెంగ వాడి మస్తిష్కాన్ని దొలిచేస్తున్నాది. బొంబాయిలో విమానాల్ కంపెనీల వాళ్ళ ఆఫీసుల చుట్టూ తిరిగి తిరిగి, ఇంక చేసేది లేక, ఏ మొహం పెట్టుకు ఇంటికి వెళ్ళటమా అని భయపడుతూ, రైళ్ళు మారుకుంటూ ఇంటికి వెళ్ళేసరికి మూడు రోజులు పట్టిందిట. అప్పటికి నేను క్షేమంగా నూ యార్కు చేరుకున్నట్లు అన్నయ్య ఇచ్చిన టెలిగ్రాము తునిలో అందింది కనుక సరిపోయింది.

ఇక దహరాన్‌లో నా సంగతి. నేనున్నది సౌదీ అరేబియాట. చేతిలో ఎనిమిది డాలర్లే ఉన్నాయి. ఎప్పుడు దేనికి అవసరం వస్తాయో? అందుకని, రెండు రోజుల పాటు, ఆ ఎడారి మధ్యలో, ఆ హొటల్లో కాలం గడిపేను. తిండి తినటం, దిక్కులు చూస్తూ కూర్చోవటం, పడుక్కోవటం. తిండి తినడానికి రెస్టరాంటుకి వెళ్ళేను కదా. "నేను శాకాహారిని. తినటానికి ఏమైనా ఉందా?" అని అడిగేను. 'మష్‌రూం సూపు' తప్ప మరేదీ లేదన్నాడు. నేను అంతకు ముందు సాంబారు, పులుసు తిన్నాను కాని, సూపు ఎప్పుడూ తినలేదు. పైపెచ్చు కుక్క గొడుగులతో చేసిన సూపా? అసలు కుక్క గొడుగులు తింటారా? కుక్క గొడుగులు శాకాహారమా? మాంసాహారమా?
నేనిలా తర్జనభర్జనలు పడుతూ ఉంటే సర్వరు అన్నాడు. "అదొక్కటే ఉంది. కావాలంటే పట్టుకొస్తాను. లేక పోతే పస్తు పడుక్కో." గత్యంతరం లేక అదే తిన్నాను. తర్వాత తెలిసింది. తినే మష్‌రూం ని పుట్ట గొడుగులనీ, తినకూడని వాటిని కుక్క గొడుగులనీ అంటారని. మష్‌రూం శాకాహారం కిందకే వస్తుందని చెప్పేరు.

సెప్టెంబరు 14 న టి. డబ్ల్యు. ఏ. వారి విమానం మరొకటి వచ్చి దహరాన్ లో నట్టడి పోయిన వాళ్ళందరినీ ఎక్కించుకుని నేరుగా లండన్ తీసుకు పోయింది. లండన్ చేరుకునేసరికి నూ యార్క్ వెళ్ళే విమానం మా కోసం వేచి ఉంది. నన్ను, నా లాంటి మరొక ఇద్దరిని కారులో ఎక్కించుకుని, మా కోసం నిరీక్షిస్తూన్న ఆ రెండవ విమానం దగ్గరకి తీసుకెళ్ళి ఎక్కించేరు. అది వెంటనే గాలి లోకి లేచి ఎగిరి పోయింది. ఈ హడావుడిలో లండను విమానాశ్రయం ఎలా ఉంటుందో చూసే అవకాశం కూడ రాలేదు.

లండన్ నుండి నూయార్కు తీసికెళ్ళిన విమానం బోయింగు 707. జెట్టు విమానం. అప్పట్లో అది చాల కొత్త విమానం. విమానం ఎక్కి కూర్చున్నాను. ఎప్పుడు నిద్ర పట్టేసిందో తెలియదు కాని నూయార్కులో దిగే ముందు లేపేరు. కిటికీ లోంచి చూస్తూ ఉంటే నూయార్కు లో దీపాలు అద్భుతంగా కనిపించేయి. సెప్టెంబరు 14 రాత్రి ఎనిమిదింటికి విమానం నేల మీద వాలింది.

# అమెరికాలో మొదటి వారం

ఆ రోజు సెప్టెంబరు 14, 1961. రాత్రి ఎనిమిదయింది. ఎయిర్ హాస్టెస్ నిద్ర లేపి సీటు బెల్టు కట్టుకోమంది. సీటు తిన్నగా లేదని ముందుకి తోసింది. అప్పుడే నూ యార్కు వచ్చేసినట్లుంది. లేచేను. పక్క సీట్లో ఉన్నావిడ ఏ ఊరు వెళుతున్నావని అడిగింది. డిట్రాయిట్ అని చెప్పేను. "అ హా, దటీస్ ద ఆటొమొబీల్ కేపిటల్ అఫ్ ద వరల్డ్" అంది. ఆ మాట అర్థం అప్పుడు అర్థం కాలేదు. మర్యాదకి "ఐ సి" అనేసి కిటికీలోంచి బయటకి చూడటం మొదలు పెట్టేను. కిందని అంతా దీపాల సముద్రం. శాంటా క్రూజ్ లో విమానం పైకి లేచినప్పుడు బొంబాయిలో కిందని దీపాలు కనిపించనే లేదు. ఇక్కడ ఇన్ని దీపాలా?

ఎనిమిదిన్నరకల్లా విమానం ఐడిల్‌వైల్డ్ ఎయిర్‌పోర్టులో వాలింది. జేబులోని పేస్‌పోర్టుని ఒక సారి బయటకు తీసి, అందులో అమెరికన్ కాన్సలేటువారు ఇచ్చిన వీసా మరొక సారి చూసుకుని, వీసా మీదసంతకం చేసిన డెనిస్ కక్స్ పేరు మరొక సారి చదువుకుని, అన్ని కాగితాలని కోటు లోపల జేబులో పెట్టుకుని, మిగిలిన ప్రయాణీకుల వెంట యాంత్రికంగా నడుచుకుంటూ వెళ్ళేను.

సూట్‌కేసులో కూడ పెట్టకుండా, దారిపొడుగునా చేత్తో పట్టుకొచ్చిన ఎక్స్ రే పటాన్ని ముందస్తుగా ఇమ్మిగ్రేషన్ వారికి ఇస్తే వాళ్ళ వైద్య సిబ్బంది అది తనిఖీ చేసి అప్పుడు నన్ను కస్టంస్ లోకి వదలి పెట్టేరు. వాళ్ళన్న మాట ఒక్క ముక్క అర్థం అవలేదు.

నేను ఆవకాయల వంటి సరుకులేవీ పట్టుకు రాలేదు. కాని మా పెరట్లో పండిన దానిమ్మ పండు ఒకటి బుచ్చన్నయ్య కి ఇష్టమని చెప్పి అమ్మ ఇస్తే అది పట్టుకొచ్చేను. అగ్రికల్చరల్ తనిఖీ వారు నా ప్రమేయం, నా అనుమతి లేకుండానే అది పెట్టె లోంచి తీసి చెత్త బుట్టలో పడేసేరు. నాకు మనస్సు చివుక్కు మంది, ఒళ్ళు మండింది కూడా. చేసేది, చెయ్యగలిగేది ఏదీ లేక నోరు మూసుకుని ఊరుకున్నాను.

రావటం మూడు రోజులు ఆలస్యం అవటంతో మొదట్లో అనుకున్న విమానంలో రాలేదు. నేను దహరాన్ నుండి ఇచ్చిన టెలిగ్రాము అందిందో లేదో. ఈ గందరగోళంలో అన్నయ్య నన్ను దింపుకుందికి రాక పోతే? బొంబాయి ఎంత తెలియని ఊరైనా మన దేశం. పరిచయం ఉన్న 'వెల్కం హొటేలు' పేరు కనిపించగానే అందులో దిగిపొయేను. ఇప్పుడు అన్నయ్య కనిపించకపోతే? ఇలాంటి బెంగతో, మా ఊళ్ళో గిరిమల్లయ్య బిగుతుగా కుట్టిన ఊలు కోటు గుండీలన్నీ పెట్టేసుకుని, కుడి చేత్తో సూట్ కేసు, ఎడం చేత్తో ఎక్స్‌రే పటం పట్టుకుని, బుజం మీద సంచీ వేల్లాడేసుకుని, ఇంకా అలవాటు కాని కొత్త బాటా బూట్లతో తప్పటడుగులు వేసుకుంటూ బయటకి వస్తున్నాను. గాజద్దాల తలుపుల బైట అన్నయ్య కనిపించటంతో ప్రాణం కుదుట పడింది.

మెడ్రాసులో అమెరికన్ కాన్సలేటు ముఖద్వారం దగ్గర అరటన్ను బరువున్న తలుపు రెండు చేతుల తోటీ తోస్తే కాని కదల లేదన్న విషయం మేధలో నాటుకు పోయిందేమో, అన్నయ్య వైపే చూస్తూ గాజద్దాల తలుపుని గాఠ్ఠిగా ముందుకి తొయ్యబోయాను. దీని తస్సాగొయ్యా! ఇది నా చెయ్యి ఇంకా తగలకుండానే ముందుకి తెరుచుకుంది. ఆ ఊపుకి నేను ముందుకి తూలి పడబోతే అన్నయ్య నన్ను గభీమని పట్టుకుని, చేతిలో సూట్ కేసు అందుకున్నాడు. వాడు వేళకి నన్ను పట్టుకుని ఉండకపోతే కింద బోర్లా పడుండేవాడిని. ఆటోమేటిక్ గా తలుపులు తెరుచుకుంటాయని కలగన్నానా?

సామానుతో బయట రోడ్డు పక్క చపటా ('పేవ్‌మెంట్') మీద నించున్నాం. అన్నయ్య బాగానే ఉన్నాడు కాని నాకు చలితో గుండెల్లోంచి వణుకు వస్తోంది. కొద్ది నిమిషాలలోనే చిన్న కారు వచ్చి మా ముందు ఆగింది. లోపల కూర్చున్న తర్వాత తన స్నేహితుడు ఐరా గెడాన్ ని అన్నయ్య నాకు పరిచయం చేసేడు. హల్లోలు అయిన తర్వాత నాకు అతనితో ఏమి మాట్లాడాలో తెలియ లేదు. అన్నయ్య ఐరా తో మాట్లాడుతూన్నది అర్థం అవుతోంది కాని ఐరా అన్నది ఒక్క ముక్క అర్థం అవలేదు. ఐరా ఒక చేత్తోటే చక్రం పట్టుకుని, రెండవ చేత్తో గేర్లు మార్చుతూ, ఎంతో చాకచక్యంగా ఆ ట్రేఫిక్ లోంచి కారుని తోలుతున్నాడు.

అప్పటి వరకు నేనెక్కడా ట్రేఫిక్ లైట్లు చూసిన జ్ఞాపకం లేదు – బొంబాయి, ఢిల్లీ, మద్రాసు ల తో సహా. నేను ఆ ట్రేఫిక్ లైట్లని, ట్రేఫిక్ సైన్ లని అలా కళ్ళప్పగించి చూస్తూ ఉండగానే అరగంట ఇట్టే గడచి పోయింది. ఏదో పండగకి అలంకరించినట్లు దారి పొడుగునా దీపాల తోరణాలు! ఊరి మధ్య ఒక హొటేలు దగ్గర దింపేసి వెళ్ళిపోయేడు ఐరా.

అప్పుడు రాత్రి పదకొండు దాటింది. ఆ దీపాల వెలుగులో ఆ హొటేలు జేగీయమానంగా మెరిసి పోయిందనుకొండి. దానిని వై. యం. సి. ఎ. అంటారని చెప్పేడు. మూణ్రోజుల ముందు నేను బొంబాయిలో ఉండి వచ్చిన వెల్కం హొటేలు దీని ముందు దిగదుడుపే. తర్వాత అన్నయ్య చెప్పేడు, నా కోసమని డిలక్స్ గది తీసుకున్నాడుట; అంటే ఎయిర్ కండిషనింగ్ ఉన్న గది. రోజు ఒక్కంటికి మనిషికి నాలుగు డాలర్లు అద్దె కట్టేనని చెప్పేడు. గత స్మృతులని జ్ఞాపకం చేసుకుందామనే తాపత్రయం మానవ నైజం అనుకుంటాను. నేను బింఘంటన్ లో ఉన్న రోజులలో – 1980 ప్రాంతాల లో – ఆ వై. యం. సి. ఎ. ని వెతుక్కుంటూ మళ్ళా వేళ్ళేను. ఎంత మారి పోయింది? వాళ్ళు తిరిగి డబ్బులిస్తామన్నా ఇప్పుడు నేను అక్కడ ఉండలేను. తానే మారెనో, గుణంబే మారెనో అనుకుంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గబగబ వెనక్కి తిరిగి వచ్చేసేను.

మర్నాడు నేను లేచే సరికి అన్నయ్య కాలకృత్యాలన్నీ తీర్చేసుకుని, తయారుగా ఉన్నాడు. ఒకటికీ, రెంటికీ కానిచ్చేసి మూటికి ఎక్కడికి వెళ్ళాలని అడిగేను. వాడు స్నానాల గది చూపించి “త్వరగా తెమిలిరా మనం ఇక్కడ నుండి బయలుదేరాలి” అని తొందర పెట్టేడు. నేను స్నానాల గది వైపు వెళ్ళి వెంటనే తిరిగి వచ్చేసేను. “నేను అంత తొందరగా రమ్మని అనలేదు, స్నానం చేసేవా?” అని అడిగేడు. నేను నసుగుతూ, "ఇంటికెళ్ళాక చేస్తానులే," అంటే అసలు సంగతి గ్రహించేసి, “మరేం పరవా లేదు. ఇక్కడ ఆచారమే అంత. నీకంతకీ మొహమాటంగా ఉంటే నువ్వు తువ్వాలు కట్టుకుని స్నానం చేసెయ్” అంటూ నన్ను స్నానాల గదిలోకి తోసేడు. నేను కళ్ళు మూసేసుకుని, తుండు గుడ్డ నడ్డికి చుట్టుకుని లోపలికి వెళ్ళేను. చచ్చిపోయినా బాగుండిపోయేది అనిపించింది.

మొత్తం మీద స్నానం అయిందనిపించి, కిందికి దిగొచ్చి, ఆ పక్క బ్లాకులో ఉన్న కేఫిటేరియాకి బ్రెక్‌ఫస్ట్ తినటానికి వెళ్ళేం. ఆ కేఫిటేరియా ఇలా మిలమిలా మెరిసిపోయింది. అంత శుభ్రంగా ఉన్న పరిసరాలు నేను ఎప్పుడూ అంతవరకూ నా జన్మలో చూడలేదు. భిలాయి స్టీలు ప్లేంటు లోనూ ఉండేది ఒక కేఫిటేరియా – ఎప్పుడూ ఈగలూ, కాఫీ మరకలతో! మా తుని రైలుస్టేషన్ లో ఉన్న యూరొపియన్ స్టైల్ రెస్టరాంటు బాగానే ఉండేది కాని, దానికీ, దీనికీ పోలికా? నక్కెక్కడ? నాగ లోకం ఎక్కడ?

అన్నయ్య కార్న్ ఫ్లేక్సు, పాలు, కాఫీ తీసుకున్నాడు. నేనూ అవే తీసుకుని, ఎర్రగా, బుర్రగా కనిపిస్తోంది కదా అని జెల్లో కూడ తీసుకున్నాను. కార్న్ ఫ్లేక్సు, జెల్లో రెండూ తినటం నా కదే మొదటి సారి. కాని ఆ పచ్చి పాలు తాగటం ఎలాగో నాకు తెలియలేదు. "ఇక్కడ పాలు వేడి చేసుకోరు. మన లచ్చు దగ్గర నిలబడి గుమ్మ పాలు తాగినట్టు తాగెయ్యటమే" అన్నాడు అన్నయ్య.

"నువ్వు ఈ దేశంలో ఎన్నాళ్ళు ఉంటావో, ఏమో. మళ్ళా నీకు నూ యార్కు వచ్చి ఊరు చూడటం పడుతుందో పడదో, నువ్వు గబగబా తినేసి, చకచకా నడుస్తానంటే ఎంపైర్ స్టేట్ బిల్డింగు ఎక్కించెస్తాను" అన్నడు అన్నయ్య.

నూట  రెండు అంతస్తులూ రెండంచెలలో ఎక్కాలి. ఒకటి నుండి ఎనభై వరకు ఒక్క నిమిషంలో తీసుకెళ్ళింది లిఫ్టు. నూటరెండో అంతస్తుకి వెళ్ళే సరికి అక్కడ చుట్టూ మేఘాలు, చలి. కిందకి చూస్తే కళ్ళు తిరిగేయి. కార్లు చీమల్లా కనిపించేయి. అక్కడ ఎటెండెన్సు వేయించేసుకుని, నా మెదడులో ఉన్న నోటు పుస్తకంలో "ఎంపైర్ స్టేట్ బిల్డింగు" అని రాసుకుని, దానికి ఎదురుగా టిక్కు పెట్టేసుకుని, తిరిగి పదకొండు లోపల వై. యం. సి. ఎ. కి  వచ్చి, గది ఖాళీ చేసేసి, పోర్ట్ అథారిటీ బస్ టెర్మినల్ వరకు సామాను మోసుకుంటూ నడచి వెళ్ళేం. మేం వెళ్ళవలసిన బస్సు ఎక్కడో ఐదో అంతస్తులో ఉంది. ఎలివేటర్ లో పైకి వెళ్ళి అక్కడ బస్సు ఎక్కేం. అన్నయ్య అంతకు ముందే ఇద్దరికీ బస్సు టిక్కెట్లు కొనేసేడుట!

మేడ మీద బస్సేమిటి, నా మొహం కాకపోతే. ఆ బస్సు ఇప్పుడు కిందికి ఎలా దిగుతుందో నాకు అర్థం కాలా. పేరూరు ద్రావిళ్ళు గుర్రాన్ని గుడెక్కించేరని నా చిన్నతనంలో చెప్పుకునేవారు. ఆ గుర్రాన్ని గుడి ఎలా ఎక్కించేరో చెప్పేవారు కాని, దానిని కిందికి ఎలా దించేరో ఎవ్వరూ చెప్పేవారు కాదు. కనుక ఈ బస్సు ఐదో అంతస్తు నుండి కిందికి ఎలా దిగుతుందో చూడాలని చాల ఆత్రుత పడిపోయేను.

బస్సు డ్రైవరు విమానం పైలట్ లా ఉన్నాడు! ఎయిర్ కండిషండ్ బస్సు. బెంచీ సీట్లు కావివి. అన్నీ మెత్తటి కుర్చీ సీట్లు. కిటికీలోంచి కిందకి ఊసెయ్యటానికి వీలు లేకుండా పెద్ద పెద్ద గాజద్దాలు. బస్సు మాత్రం నా కంటికి బ్రహ్మాండంగా కనిపించింది.

బస్సు కదిలింది. గుండ్రంగా మలుపులు తిరుగుతూ, ఘాట్ రోడ్డు లాంటి రోడ్డు వెంబడి కిందకి దిగింది. ఊళ్ళో కొద్ది దూరం నడిచింది. ఎరుపు, పచ్చ రంగులతో ట్రేఫిక్ లైట్లు వెలుగుతూ ఆరుతూ ఉంటే నాకు వాటిని అలా చూడాలనే ఉండేది. బస్సు ఒక సొరంగంలోకి వెళ్ళి బయటకి వచ్చి ఊరు దాటింది. రెండు గంటలు నడిచింది తప్ప ఎక్కడా ఆగ లేదు.

మా తుని నుండి కాకినాడ వెళ్ళే బొగ్గు బస్సు అన్నవరం వచ్చే లోగా కనీసం అరడజను సార్లు ఆగేది. కత్తిపూడి జంక్షన్ దగ్గర కాఫీ బ్రేకు పేరుతో కనీసం అరగంట ఆపేసేవారు. అక్కడ జంగిడిలో పోసి కొబ్బరుండలు, మొక్క జొన్న పొత్తులు, బటానీలు, జీళ్ళు, ఇలా ఎన్నో అమ్మేవారు. బండి దిగితే అక్కడో ముసలమ్మ వేడి వేడిగా పొంగరాలు పోసి అమ్మేది. ఇంకా గోళిక్కాయ సోడాలు, కలర్ సోడాలు, కిళ్ళీలు, సిగరెట్లు. తరవాత ఇంజను వేడెక్కిపోతున్నాది, నీళ్ళు పొయ్యాలని గొల్లప్రోలు దగ్గర పశువులని కడిగే చెరువు దగ్గరో అరగంట అపేసేవాడు. తునిలో ఎనిమిది గంటలకి బయలుదేరిన బండి, పెత్తనాలన్నీ పూర్తి చేసి నలభై మైళ్ళ దూరంలో ఉన్న కాకినాడ చేరేసరికి పదకొండు అయేది. ఈ మూడు గంటలసేపు, కాలక్షేపానికి కొదువ లేకుండా రాజకీయాల మీదో, బెండపూడి యోగి భార్యల మీదో, ముమ్మిడివరం బాలయోగి మహిమల మీదో తీవ్రంగా జరిగే చర్చలతో బస్సంతా గోల గోలగా ఉండేది. ఇక్కడో! సన్నని శబ్దం తప్ప అంతా నిశ్శబ్దమే.

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుతూ "అబ్బీ, ఈ బస్సు ఎంత జోరుగా వెళుతున్నాదో ఊహించి చెప్పగలవా?" అని అన్నయ్య అడిగేడు.

ఎప్పుడూ రకరకాలైన చమత్కారపు లెక్కల ప్రశ్నలడిగి మమ్మల్ని చిన్నప్పుడు మహా ఇబ్బంది పెట్టేసేవాడు, అన్నయ్య. అలాగే ఇప్పుడు కూడ నన్ను పరీక్ష చేస్తున్నాడనుకుని, "బయట టెలిగ్రాఫు స్థంబాలైనా లేవు లెక్కగట్టి చెప్పడానికి," అని నేను నసుగుతూ ఉంటే, "అంత హడావుడి అక్కర లేదు, ఊహించి చెప్పు, చాలు" అన్నాడు అన్నయ్య. తుని నుండి కాకినాడ వెళ్ళే బస్సు ఎన్నడూ గంటకి ఇరవై మైళ్ళు దాటి నడవటం నేను చూడలేదు."థర్టీవన్ డౌన్" పేసెంజరు తుని నుండి అనకాపల్లికి మధ్యనున్న నలభై మైళ్ళు నడవటానికి సునాయాసంగా రెండు గంటలు తీసుకునేది. మధ్యలో మెయిల్ క్రాసింగు తగిలిందంటే ముత్యం మూడు గంటలు. అందుకని చిన్న ఫేక్టర్ అఫ్ సేఫ్టీ పడేసి నలభై మైళ్ళు జోరుగా వెళుతున్నాది అని చెప్పేను. కాదు, డెబ్బై మైళ్ళు వేగంతో వెళుతున్నాదని చెబితే నేను నమ్మలేక పోయాను.

మరికొంతసేపు పోయిన తర్వాత నూ యార్క్ స్టేట్ త్రూవే మీద "కేట్‌స్కిల్" అనే పేరుతో ఒక ఎక్సిట్ కనబడ్డాది. అకస్మాత్తుగా ఆ పేరు చూడగానే నా శరీరం లోని రక్తం ఒక్క సారి ఉత్తుంగ తరంగాలతో పైకి లేచినట్లు అయింది. "ఇదిగో, ఇక్కడే రిప్ వాన్ వింకిల్ ఇరవై ఏళ్ళ పాటు నిద్రపోయాడు కదూ?" అని అడిగేను. అన్నయ్యకి రిప్ వాన్ వింకిల్ అంటే ఎవ్వరో తెలియదుట. అన్నయ్యకి తెలియని విషయం నాకొకటి తెలిసేసరికి కాలరెగరేసి, చిన్నప్పుడు శేషగిరి పుస్తకం చదువుతూ ఉంటే నేను విన్న వైనం చెప్పేను.

చీకటి పడ్డ తర్వాత అమెరికా చాల విచిత్రంగా కనబడింది. నియాను దీపాలతో రకరకాల సైను బోర్డులు; పట్టణాలలోనే కాదు, పల్లెపట్టులలో కూడా! "ఇన్, మొటేల్, హేంబర్గర్, హాట్‌డాగ్, పిజ్జా" మొదలైన మాటలు పెరీ మేసన్ పుస్తకాల ద్వారా పరిచయమైనా, మొదటిసారి చూడగానే అదొక రకమైన అనుభూతి. రాచెస్టర్ చేరుకునేసరికి రాత్రి ఎనిమిది అయింది.

మర్నాడు రాచెస్టర్ లో రోజంతా గడిపేను. ఉదయం అన్నయ్యతో కలసి యూనివర్సిటీకి వెళ్ళేను. కేంపస్ ప్రాంగణంలో వార్తా పత్రిక కొనటానికి ఆగేడు. పేపర్లన్నీ ఒక దొంతి పెట్టి ఉన్నాయి. పక్కనే మూత లేని రేకు డబ్బా ఒకటి ఉంది. అందులో ఒక డైం (పది పైసల బిళ్ళ) పడేసి నూస్ పేపరు తీసుకుని, చిల్లర నికెలు (ఐదు పైసల బిళ్ళ) డబ్బా లోంచి తీసుకున్నాడు. నేను ఉండబట్టలేక, "అన్నయ్యా! ఎవ్వరైనా ఆ డబ్బాలో ఉన్న చిల్లరంతా తీసేసుకుంటేనో?" అని అడిగేను. "అలా ఎవ్వరూ తీసుకోరు. ఈ దేశంలో నిజాయతీ ఎక్కువ" అన్నాడు. ఇప్పుడో? మా ఊళ్ళో నూస్ పేపరుని వెండింగ్ మెషీన్ లో కొనుక్కుంటాం. అందులో పేపర్లు ఎవ్వరూ ఎత్తుకు పోకుండా, పెట్టెకి ఒక మూత, దానికో కప్ప తాళం, ఆ పెట్టె పళంగా ఎవ్వరూ పట్టుకుపోకుండా దాని చుట్టూ ఒక మోకు లాంటి గొలుసు, ఆ గొలుసుని స్తంభానికి చుట్టబెట్టి మరొక కప్ప తాళం! ఒక్క తరంలో కృత యుగం నుండి కలి యుగానికి ప్రయాణం చేసేను.

పేపరు చూస్తూ అన్నయ్య ఆఫీసులో కూర్చున్నాను. తటాలున అమ్మ ఇచ్చిన దానిమ్మ పండు, దానిని కస్టంస్ వాళ్ళు తస్కరించిన వైనం జ్ఞాపకం వచ్చేయి. అన్నయ్య కి చెప్పేను. అన్నయ్య వెంటనే ఒక తెల్ల కాగితం తీసి అమ్మకి ఉత్తరం రాసేడు. "మ. స. అమ్మకి, నమస్కరించి వ్రాయునది. వెంకటేశం క్షేమంగా చేరుకున్న సంగతి నిన్న టెలిగ్రాము ఇచ్చేను కదా. ఇప్పుడు మేమిద్దరం నా ఆఫీసులో కూర్చుని నువ్వు పంపిన దానిమ్మ పండు తింటున్నాం. చాల రుచిగా ఉంది. ఇట్లు, బుచ్చి." తను దగ్గర ఉండి నా చేత ఆ ఉత్తరం పోస్ట్ చేయించేడు.

సాయంకాలం నాలుగింటికి అన్నయ్య స్నేహితుడు బాబ్ వార్నర్ వచ్చి మమ్మల్నిద్దరినీ నయాగరా ఫాల్స్ చూపించటానికి తన కారులో తీసుకెళ్ళేడు. నేను రెండేళ్ళల్లో తిరిగి ఇండియా వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నాను కనుక, మళ్ళా మళ్ళా అవకాశం రాదేమోనని అంత అర్జంటుగా ఆ జలపాతాన్ని చూడటానికి కారణం. సాయంకాలపు వెలుగులో కొంతసేపు చూసేం. నా మెదడులో ఉన్న నోటు బుక్కులో 'నయాగరా జలపాతం' అని రాసుకుని దానికి ఎదురుగా టిక్కు పెట్టేసుకున్నాను. నయాగరా అంటే మన శివసముద్రం, జోగ్ జలపాతాలలా పైనుండి నీళ్ళు పడుతూ ఉంటే మనం కిందనుండి చూస్తాం అనుకున్నాను. కాని ఇది నేననుకున్నదానికి వ్యతిరేకం. ఇది మనం నిలుచున్న నేల మట్టం లో ఉన్న ఒక

సరస్సులో ఉన్న నీరు 175 అడుగుల దిగువున ఉన్న నదిలోకి అమాంతం ఒక ఫర్లాంగు వెడల్పున ఒలికి పోతూ ఉంటే కనిపించే ఆ దృశ్యం, ఆ శబ్దం వర్ణనాతీతం.

ఈరీ సరస్సునీ, అంటేరియో సరస్సునీ కలుపుతూ ఇరవై మైళ్లు పొడుగున్న నది ఒకటి ఉంది. ఆ నది పేరు నయాగరా. ఈరీ సరస్సులో నీళ్ళు ఈ నది గుండా కొంత దూరం ప్రవహించి, దారిమధ్యలో ఈ జలపాతం దగ్గర కిందికి ఒక పెద్ద ఉరుకు ఉరికి, అక్కడ నుండి మరికొంత దూరం ప్రవహించి అంటేరియోలో కలుస్తుంది. తమాషా ఏమిటంటే ఈ జలపాతం ఎల్లప్పుడూ ఈ ప్రదేశంలో, నదికి మధ్యేమార్గంలో ఉండేది కాదుట. కొన్ని వేల సంవత్సరాల క్రితం, ఈ జలపాతం అంటేరియో సరస్సుని ఆనుకుని ఉండేదిట. అంటే ఈరీ సరస్సు నుండి బయలుదేరిన నది ఇరవై మైళ్ళు ప్రవహించి అంటేరియో సరస్సులోకి ఉరికి పడేదన్నమాట. జోరుగా ప్రవహించే నీటి కోతకి చుట్టూ ఉన్న భూమి కోరుకుపోవటం వల్ల ఈ జలపాతం క్రమేపీ వెనక్కి జరుగుతోందిట. ఇప్పుడు ఈ జలపాతం రెండు సరస్సులకీ మధ్యస్థంగా ఉంది. మరో కొన్ని వేల సంవత్సరాలు ఇలా కోత జరిగిందంటే ఈ జలపాతం నెమ్మది నెమ్మదిగా వెనక్కి జరిగి ఈరీ సరస్సు దగ్గరకి చేరుకుంటుందిట. అప్పుడు తండోపతండాలుగా వచ్చే ప్రజలు చూడటానికి ఏమీ మిగలదుట.



కానీ అదృష్ట వశాత్తూ, మన నాగరికత ప్రభావం వల్ల, ఈ జలపాతం మరెక్కడికీ పోకుండా ఇక్కడే ఉండటానికి అవకాశాలు ఉన్నాయి. ఎందుకంటే ఈ జలపాతాన్ని ఆధారం చేసుకుని ఇక్కడ ఎన్నో విద్యుచ్ఛక్తి కేంద్రాలు నిర్మించేరు. ఈ విద్యుచ్ఛక్తిని పుట్టించటానికి ఈ నది లోని నీటిని గొట్టాల ద్వారా శక్తిగృహాలలోకి తీసుకెళ్ళాలి కదా. ఇలా నది నీటిని మళ్ళించటం వల్ల నదిలోని ప్రవాహం ఉధృతి

తగ్గుతుంది కదా. దాని వల్ల కోరుడు తగ్గుతుంది. అందువల్ల ఈ జలపాతం ఇక్కడే కదలకుండా కొన్నాళ్ళపాటు ఉంటుంది.

నేను వెళ్ళిన రోజున ఎందువల్లనో చీకటి పడ్డ తర్వాత జలపాతం మీదకి రంగు రంగుల దీపాలు వెయ్య లేదు. కనీసం కెనడా వైపు వెళ్ళి జలపాతం చూస్తే బాగుంటుంది అన్నాడు బాబ్. కానీ నాకు ట్రిపుల్ ఎంట్రీ వీసా మాత్రమే ఉంది. అందులో ఒకటి నూ యార్కు లో ఖర్చు అయిపోయింది. "క్రిస్మస్ కి కెనడా తీసుకెళతాను. అప్పుడు తిరిగి రాడానికి మరొక ఎంట్రీ ఖర్చు అయిపోతుంది. ఆ మూడోది మరెందుకైనా ఉంటుంది" అని అన్నయ్య నన్ను కెనడా పక్కకి వెళ్ళనియ్యలేదు. కాలి వంతెన మీద గీత వరకు వెళ్ళనిచ్చేడు. ఆ గీతకి ఇటు పక్క అమెరికా, అటు పక్క కెనడా. ఎవరు చూడొచ్చేరు, ఒక కాలు అమెరికాలో ఉంచి మరొక కాలు కెనడాలో వేసి చూస్తానన్నాను. "మరొకరు చూసినా, చూడకపోయినా అధిక్రమణం అధిక్రమణమే, వీలు లేదు కాక వీలు లేదు" అని నిర్ద్వందంగా చెప్పేడు అన్నయ్య. వచ్చిన మర్నాడే వాడి మాట వినటం మానెస్తే బాగుండదని, అప్పటికి వినేసి ఊరుకున్నాను.
మర్నాడు డిట్రాయిట్ ప్రయాణం. రాచెస్టర్ నుండి డిట్రాయిట్ వెళ్ళటానికి రెండు దారులు ఉన్నాయి. ఒక దారి అంతా అమెరికాలోనే ఉంది కాని అది బృహత్ సరోవరాలని చుట్టుకుంటూ అర్ధచంద్రాకారంగా ఉన్న రోడ్డు. అడ్డుదారి కెనడా గుండా ఉంది. నయాగరా ఫాల్స్ దగ్గర కెనడా లో ప్రవేశించి మళ్ళా విండ్సర్ దగ్గర అమెరికాలో ప్రవేశించవచ్చు. కెనడా ద్వారా వెళితే వీసాలో ఒక ఎంట్రీ దానికి కావాలి. అందుకని కొంచెం చుట్టు దారైనా రాచెస్టర్ నుండి బఫలో, అక్కడనుండి క్లీవ్‌లండ్, టొలీడో ల మీదుగా డిట్రాయిట్ వెళ్ళడానికి నిశ్చయం చేసేం. ఈ ప్రయాణం రాత్రి చెయ్యటానికి కూడ నిశ్చయం చేసేం. దారి పొడుక్కీ బస్సులు మారాలి కాని, తెల్లారే సరికల్లా డిట్రాయిట్ చేరుకుంటాను కనుక అదొక విధంగా సదుపాయం.

మర్నాడు సాయంకాలం బస్సు స్టేషన్‌కి బయలు దేరే వేళకి కడుపులో గుడగుడ మొదలైతే రెండు మూడు సార్లు బాత్ రూం కి వెళ్ళవలసి వచ్చింది. "నీకు డిసెంట్రీ లాంటిదేదో పట్టుకుందో ఏమిటో, వీళ్ళకి తెలిస్తే నిన్ను క్వారెన్‌టైన్ లో పడెస్తారు, జాగ్రత్తగా ఉండు" అని హెచ్చరిక చేసి, తన దగ్గర ఉన్న హొమియోపతీ మందు మాత్రలు మూడు ఇచ్చి అప్పుడు బస్సు స్టేషన్ కి తీసికెళ్ళేడు. నన్ను బస్సు

ఎక్కించే ముందు తన దగ్గర ఉన్న టాప్ కోటు నా కిచ్చేసి, నా జేబులో మరొక నలభై డాలర్లు పెట్టి, నన్ను సెప్టెంబరు 17 రాత్రి బస్సులో కూర్చోబెట్టేడు.

బస్సు బయలు దేరింది. కడుపులో గుడగుడ మళ్ళా మొదలైంది. గంట, గంటన్నరలో బఫలో చేరుకున్నాం. అక్కడ బస్సు మారాలి. మన దేశంలో బస్సు మారినప్పుడల్లా మన సామానుని మనమే ఎక్కించటం, దింపటం వంటి పనులు చేసుకోవాలి. ఇక్కడ మనకి ఆ బెడద లేదు. వాళ్ళే మార్చి పెడతారు. కనెక్టింగ్ బస్సు ఎంత సేపటిలో బయలుదేరుతుందో కనుక్కుని ఒక్క ఉదుటున రెస్ట్ రూం ఎక్కడుందో వెతుక్కుంటూ పరుగు లంకించుకున్నాను. రెస్ట్ రూం మేడ మీద ఉందని ఎవ్వరో చెప్పేరు. మేడ మీదికి వెళ్ళి చూద్దును కదా! అక్కడ కక్కసు గదులని వాడటానికి మీటర్ లో ఒక డైం వేస్తే గాని తలుపు తెరుచుకోదు. నా దగ్గర డైం లేదు. తలుపు కిందనున్న జాగా లోంచి దూరి లోపలకి వెళ్ళిపోవచ్చు. తొందరలో అంత పనీ చేసి ఉండే వాడినే – అదే సమయం లో మరొక ఆసామీ ఆ గదిలోకి వచ్చి నా ప్లేనుని భంగ పెట్టకపోతే! అక్కడ చిల్లర  ఇచ్చే నాధుడు లేదు. కిందనున్న కాఫీ షాపుకి పరిగెత్తుకి వెళ్ళి ఒక డాలరుకి చిల్లరిమ్మని అడిగేను. ఏదైనా కొంటేగాని చిల్లర ఇవ్వనన్నాది అక్కడున్న పిల్ల. ఒక కాఫీ కావాలని ఆర్డరు చేసి, ముందు డబ్బు ఇచ్చేసి, చిల్లర పుచ్చుకుని పరుగు పరుగున పైకెళ్ళి పని కానిచ్చేను. ఇలా ఆ రాత్రల్లా, బస్సు ఆగినప్పుడల్లా, కోయిన్ ఆపరేటెడ్ టాయిలెట్ లతో తంటాలు పడి, తెల్లవారురఝామున నాలుగున్నరకి డిట్రాయిట్ చేరుకున్నాను.



తరువాత ఎవ్వరో చెప్పేరు. టాయిలెట్ సదుపాయం బస్సులోనే ఉందనిన్నీ, దానిని వాడటానికి డబ్బు అవసరం లేదనిన్నీని. నా జాతకం ఎలాంటిదంటే నేను పడవలసిన కష్టాలన్నీ పడ్డ తర్వాత ఎవ్వరో వచ్చి చెబుతారు, "మమ్మల్ని అడగలేకపోయేవా, మేం చెప్పుండేవాళ్ళం కదా!" అని. ఇలా పబ్లిక్ టాయిలెట్ల దగ్గర నిర్బంధంగా డబ్బు వసూలు చెయ్యటం ఇప్పుడు చట్ట విరుద్ధం చేసేరుట.

బయట భళ్ళున తెల్లారే వరకు బస్సు స్టేండులో కూర్చుని, బిక్కుబిక్కు మంటూ బయటకి వచ్చేసరికి ఎనిమిది కావస్తోంది. ఎక్కడ చూసినా కార్లు. ఒకటి కాదు. రెండు కాదు. అదొక కార్ల ప్రవాహం. తీగలో కరెంటు ప్రవహించేటప్పుడు ఆ ఎలక్ట్రానుల ప్రవాహం ఇలా ఉంటుంది కాబోలు అని అప్పుడు ఊహించుకున్నాను.

టేక్సీలో యూనివర్సిటీకి వెళ్ళి జేబులో ఉన్న నాలుగు డబ్బులూ తగలేసుకో వద్దనీ, సిటీ బస్సులో వెళ్ళమనీ అన్నయ్య మరీ మరీ చెప్పేడు కదా. అందుకని సిటీ బస్సు ఎక్కడ ఎక్కాలో వీళ్ళనీ, వాళ్ళనీ అడగటం మొదలు పెట్టేను. అందరికీ కార్లు ఉన్నప్పుడు సిటీ బస్సుల సంగతి ఎవరికి తెలుస్తుంది? మిచిగన్ ఎవెన్యూ, ఉడ్వర్డ్ ఎవెన్యు, గ్రేండ్ రివర్ వీధుల మధ్య పడి తిరుగుతున్నాను, చేత్తో సూట్ కేసు పట్టుకుని. ఒగర్పు వస్తోంది. కనిపించిన ప్రతీ వాళ్ళని అడుగుతున్నాను. అప్పుడు ఎవ్వరో రోడ్డుకి అవతల పక్కన ఇటూ, అటూ పచార్లు చేస్తున్న ఒక నీగ్రో మనిషిని చూపించి, "అతన్ని అడుగు, చెబుతాడు" అన్నారు. ఉడ్వర్డ్ ఎవెన్యూ మీద ఎడం పక్క నుండి వస్తూన్న ఐదు లేనుల కార్ల ప్రవాహాన్ని దాటుకుని, రోడ్డు మధ్య ట్రేఫిక్ ఐలెండు లో ఉన్న ఆసామీని పట్టుకుని, "యూనివర్సిటీ అఫ్ డిట్రాయిట్ కి వెళ్ళటానికి ఏ బస్సు ఎక్కాలి?" అని అడిగేను. అతనికి దేశం లో అప్పుడే దిగిన శాల్తీనని తెలిసిపోయినట్లుంది. నాకేమీ సమాధానం చెప్పకుండా నా జబ్బ పట్టుకుని బరబరా రోడ్డు మధ్యకి ఈడ్చుకు వెళ్ళేడు. అక్కడ వస్తూన్న ఒక సిటీ బస్సు వేపు తన కుడి కాలుని జాపి, చేత్తో తన పేంటు ని సాక్సు కనబడే వరకూ లాగి, బస్సు ఎదట పాదాన్ని ఇటూ అటూ ఆడించేడు. వెంటనే ఆ నడి రోడ్డు మీద, ఆ ట్రేఫిక్ మధ్య, బస్సు ఆగింది. తలుపు తెరుచుకుంది. "డ్రాప్ హిం ఆఫ్ ఎట్ యు అఫ్ డి." అంటూ నన్నూ, నా పెట్టెనీ లోపలికి తోసేడు. తర్వాత వాకబు చెయ్యగా తెలిసింది, ఈ వ్యక్తి బస్సులన్నిటిమీద అజమాయిషీ చేసే మేస్త్రీ లాంటి వాడుట.

నా బస్సు స్టాపు ఎక్కడ దాటిపోతానో అని నిట్టనిలువునా బెంగ పెట్టేసుకుని, బిక్కచచ్చిన మొహంతో ఆ డ్రైవరు కి ఎదురుగా – ఆడవాళ్ళ కోసం కేటాయించిన సీటులో – నా సూట్ కేసుని ఒక చేత్తో గాఠ్ఠిగా పట్టుకుని, కండక్టరు వస్తే టికెట్టు కొనటానికి తయారుగా రెండవ చేతిలో ఒక డాలరు పట్టుకుని కూర్చున్నాను.

ప్రాణం కాస్త కుదుట పడ్డ తర్వాత చుట్టూ చూద్దును కదా — ఆ బస్సులో నేను ఒక్కడినే తెల్లవాడిని; మిగిలిన వాళ్ళంతా — డ్రైవరుతో సహా — అంతా నల్ల వాళ్ళే. దారి పొడుక్కీ "నా సంగతి మరిచి పోకేం!" అని డ్రైవరుకి నా ఉనికిని గుర్తు చేస్తూనే ఉన్నాను. ఎక్కే ప్రయాణీకులంతా డ్రైవరు పక్కన ఉన్న హుండీలో డబ్బులు వేస్తున్నారు తప్ప టికెట్టు కొయ్యటానికి కండక్టరంటూ ఎవ్వరూ రాలేదు.

ఇంతలో మూలుగుతూన్న నక్క మీద తాటి పండు పడ్డట్టు, "నా" డ్రైవరు షిఫ్టు అయిపోయిందిట. అతను దిగిపోతే మరొక డ్రైవరు వచ్చేడు. నా కథ మళ్ళా మొదటికి వచ్చే సరికి ఈ కొత్తవాడిని మచ్చిక చేసుకోవటం మొదలు పెట్టేను. లివర్నాయ్ అవెన్యూ, సిక్స్ మైల్ రోడ్డుని కలుసుకున్న మొగలో బస్సుని ఆపి, ఎడమ పక్కన ఉన్న కేంపస్ వైపు చూపించి, "దిస్ ఈజ్  యు. ఆఫ్. డి. గొ దట్ వే" అని ఎటు వెళ్ళాలో చూపించేడు డ్రైవరు. పెట్టెతో సహా దిగేను. రోడ్డు దాటి కేంపస్ లో ప్రవేశించేను. వేళ పదకొండు అయింది.

కేంపస్ లో తరవాత ఏమి చెయ్యాలో బోధ పడ లేదు. తలని తరిగేసిన కోడి పుంజులా ఆ కేంపస్ లో తిరుగుతున్నాను. నడుస్తూన్న కొద్దీ చేతిలో ఉన్న పెట్టె బరువెక్కుతున్నాది. దీంట్లో దయ్యం కాని లేదు కదా అని అనుకుంటూ (మా ఊళ్లో లబోడాశంకం గాడి సైకిల్ వెనక సీటు మీద దయ్యం కూర్చుని క్రమేపీ బరువెక్కిన కథ గతంలో చెప్పేను!), చెయ్యగలిగేది లేక, అలా ఒగుర్చుకుంటూ, చేతులు మార్చుకుంటూ ఆ ప్రాంగణం లో తిరగటం మొదలు పెట్టేను.

నక్కని తొక్కొచ్చేనో ఏమో, ఇంతలో ఆపద్బాంధవుడిలా ఆరడుగులు పొడుగున్న ఒక భారతీయుడు కనిపించేడు. ఆ రోజుల్లో మన దేశపు వాడు కనిపిస్తే ముఖం పక్కకి తిప్పేసుకుని వెళ్ళిపోకుండా

పలకరించే వారు. అతనూ పలకరించేడు. పేరేమిటన్నాడు. చెప్పేను. "తెలుగువాడివి అన్న మాట?" అన్నాడు, తెలుగులో! ఇలాంటి పరిస్థితిలోనే కృష్ణదేవరాయలు "దేశభాషలందు తెలుగు లెస్స" అని అనుంటాడనుకున్నాను. "తెలుగూ ఈజ్ ఎ స్వీట్ లేంగ్వేజ్" అని ఇతరులు అంటే వినటమే తప్ప అది ఎంత స్వీటో అప్పుడు అర్థం అయింది.

"ఏదీ ఆ పెట్టె నాకిలా ఇయ్యి" అని నా చేతిలో పెట్టె తీసుకుని నన్ను వెంటనే ఇంజనీరింగు డిపార్టుమెంటుకి తీసికెళ్ళేడు, అచ్యుతరావు. అక్కడ ఎడ్వయిజర్ పేరు అల్ఫాన్సో టొప్పెటో. చూడటానికి టొమేటో పండులా ఉన్నాడు. నేను చెయ్యవలసిన పనులన్నీ చెబుతున్నాడు. ఒక్క మాట అర్థం అయిన పాపాన పోలేదు. ఇక లాభం లేదని, ఒకటి, రెండు, మూడు అని ఒక జాబితా కాగితం మీద రాసేసి నా చేతికిచ్చేడు. బయటకి వచ్చిన తర్వాత అచ్యుతరావుతో, "ఏమయ్యా, ఆయన ఏమన్నాడో నీకు అర్థం అయిందా?" అని అడిగేను.

"స్కూలు తెరచి అప్పుడే వారం రోజులు దాటిపోయింది. కనుక ఇటుపైన క్లాసులు మిస్సవ కూడదు అని చెప్పేడు" అని చెప్పి టొప్పేటో ఇచ్చిన జాబితాని, నా సూట్ కేసునీ పట్టుకుని ముందు వాళ్ళింటికి తీసుకెళ్ళేడు. కేంపస్ కి దరిదాపు ఎదురుగానే ఉందా ఇల్లు. ఇల్లంటే పెద్ద ఇల్లేమీ కాదు. మరొక ఇంటికి వెనకాతల ఔట్ హౌస్ లా ఉంది. తలుపు తీసుకుని లోపలికి రాగానే గోచీ అంత వసారా. అదే లివింగ్ రూము. దానిని ఆనుకుని బెత్తెడంత వంట గది, ఆ పక్కనే పడకగది. చిన్న బాత్ రూం. ఆ ఇల్లంతా ఇప్పటి మా పడక గదిలో ఇమిడిపోతుంది!

రామినేని అచ్యుతరావు చదువుకుందుకని అప్పటికి ఆరు నెలల క్రితమే భార్య లక్ష్మితో వచ్చేడుట. ఇంటికి వెళ్ళగానే లక్ష్మి కూడ ఎంతో ఆప్యాయతతో పలకరించింది. వాళ్ళిద్దరికోసం వండుకున్నదే నాకు ఇంత పంచి పెట్టింది. మజ్జిగ మరీ చిక్కగా కనిపిస్తే "ఏమిటయ్యా, ఈ మజ్జిగ ఇలా ఉంది?" అని నసుగుతూ ఉంటే "నీకు మరీ నీళ్ళ మజ్జిగ తాగటం అలవాటయి పోయి మంచి మజ్జిగ ఎలా ఉంటుందో మరచి పోయి ఉంటావు!" అంటు భళభళా నవ్వేడు. ఆ "నీళ్లమజ్జిగ" లోని శ్లేషని అర్థం

చేసుకున్న లక్ష్మి, "కలుసుకున్న గంటలోనే ఇలా మాట్లాడితే ఏమి బాగుంటుంది" అని లక్ష్మి వారిస్తున్నా లక్ష్యపెట్టకుండా ఎప్పుడూ అలాగే మాట్లాడేవాడు, కాని కల్మషం లేని మనిషి.

కడుపులో ఆకలి శాంతించిన తర్వాత, యూనివర్సిటీకి పది బ్లాకుల దూరంలో, శానువాన్ అనే వీధిలో, 16233 నంబరు ఇంట్లో ఒక గది అద్దెకి కుదిర్చి పెట్టి, తనకి వేరే పనుందని నన్నొక్కడినీ అక్కడ వదిలేసి వెళ్ళిపోయాడు, అచ్యుతరావు.

అమెరికాలో, నా గదిలో, నా కాళ్ళమీద ఏకాంతంగా నించున్నాను. తర్వాత ఏమి చెయ్యాలో బోధపడక సీలింగ్ వైపు చూస్తూ ఒంటరితనపు బరువుకి మంచం మీదకి ఒరిగిపోయేను.

ఇంటావిడ తలుపు తట్టి లోపలికి వచ్చింది. ఆవిడ పేరు ఫేనీ ఫ్రీడ్‌మన్. ఓ డెబ్భై ఉంటాయేమో. ఒంటరిగా ఉంటోందిట. “నేనూ నీలాగే ఒకప్పుడు ఇక్కడకి వచ్చినదాన్నే. మా ఆయన పోయిన తర్వాత ఇంట్లో గదులు అద్దెలకిచ్చి కాలక్షేపం చేస్తున్నాను. నా కూతుళ్ళు ఊళ్ళోనే ఉన్నారు. తరచు వచ్చి చూసి పోతూ ఉంటారు” అని ఫేనీ తనని పరిచయం చేసుకుంది.

“మేడ మీద గదిలో ముగ్గురు ఇండియన్ కుర్రాళ్ళు ఉన్నారు. నాకు ఇండియన్ కుర్రాళ్ళంటే ఇష్టం. బుద్ధిగా ఉంటారు. వేళకి అద్దె చెల్లిస్తారు. అమ్మాయిలని గదిలోకి తీసుకొచ్చి అల్లరి పనులు చెయ్యరు.” అంటూ ఒక నవ్వు నవ్వేసింది.

మేడ మీద పెద్ద హాలు లాంటిది ఉంది. అక్కడ మూడు పడకలు ఉన్నాయి. ఈ హాలులో నట్వా పటేల్, గిరిష్ షా, మరొక గుజరాతీ కుర్రాడు ఉండేవారు. వారంతా ఒక బాత్ రూం ఉమ్మడిగా వాడుకునే వారు. వారి అద్దె 25 డాలర్లు. కింద యజమాని పడకగది పక్కనే మరొక చిన్న గది. ఈ గదిని 30 డాలర్లకి నేను తీసుకున్నాను. లేండ్ లేడీ కి నాకు కలిపి ఉమ్మడిగా ఒక బాత్ రూం.

ఇంటావిడే బాత్ రూం లు శుభ్రం చెయ్యటం, పక్కల మీద దుప్పట్లు మార్చటం, తువ్వాళ్ళు మార్చటం, వగైరా పనులన్నీ చేసేది. ఏదైనా బరువు పనులుంటే మమ్మల్ని సాయం చెయ్యమని అడిగేది. ఇలా సాయం చేసినప్పుడల్లా ఏపిల్ పై కాని, ఏపిల్ సాస్ కాని, కాఫీయో, పళ్ళ రసమో, ఒక డాలరో ఇస్తూ ఉండేది. అంతే కాని ఎప్పుడూ మాచేత "ఫ్రీ" గా పనులు చేయించుకునేది కాదు. విద్యార్థులు వంట చేసుకుందుకి బేస్‌మెంట్ (అంటే నేల మాళిగ) లో స్టౌ, రెఫ్రిజిరేటరు ఉన్నాయి. అక్కడే ఇంటిని వేడి చేసే ఫర్నెస్ కూడ వుంది.

నాకు నెలకి వచ్చే 200 డాలర్ల అసిస్టెంట్‌షిప్ లో 30 డాలర్లు అద్దె కట్టగా, తిండికి నెలకి 20 డాలర్లు మించి అయేది కాదు. నెలకి ఏభై డాలర్లు (అంటే 225 రూపాయలు) నాన్నగారికి పంపించి, 50 డాలర్లు విమానం టికెట్టు కోసం చేసిన అప్పు తీర్చడానికి, మిగిలిన ఏభైలో పుస్తకాలకి, తిరుగు ప్రయాణానికి సర్దుకోవాలి. గుడ్డిలో మెల్ల నేను పన్నులు కట్టవలసిన అవసరం రాలేదు. ఇంటికి 50 పంపుతున్నానని తెలిసి, "నువ్వు ఆ 50 నాకిచ్చెయ్, మీ ఇంటికి రూపాయలు పంపే ఏర్పాటు నేను చేస్తాను" అని అచ్యుతరావు పుచ్చేసుకునేవాడు. ఆ రోజులలో రూపాయలని డాలర్లు లోకి మార్చి తెచ్చుకోవటం చాల కష్టంగా ఉండేది.

# గిరిష్ షా

నేను డిట్రాయిట్ లో చదువుకుంటూన్న రోజులలో మా యూనివర్శిటిలో సుమారు పాతిక మంది, వేన్ స్టేట్ యూనివర్శిటిలో సుమారు ఏభై మంది భారతీయులు ఉండేవారు. ఇప్పట్లా ఆ రోజుల్లో కో అంటే కోటి మంది తెలుగు వాళ్ళు కనిపించే వారు కాదు; నూటికో కోటికో ఒకడు కనిపించేవాడు. నేను ఉన్న పరిసరాలలో అచ్యుతరావు, లక్ష్మి, నేను – మేము ముగ్గురమే తెలుగు వాళ్ళం, మొదట్లో. ఆ తరువాత సెమెష్టర్ లో వాసిరెడ్డి సత్యనారాయణ అని మరొక కుర్రాడు చేరేడు. ఇంకా తెలుగు వాళ్ళు కావాలంటే పక్కనున్న టొలీడో లో చారి, మణి దంపతులు ఉండేవారు. ఏన్ ఆర్బర్ వెళితే అక్కడ టి. ఆర్. ఎన్. రావు, చివుకుల రామమోహనరావు అనే ఇద్దరు విద్యార్థులు భార్యలతో కాపురం చేస్తూ ఉండే వారు.

తెలుగు వాళ్ళు తక్కువే అయినా మా యూనివర్శిటి లోను, మా ఊళ్ళోను కూడ గుజరాతీలు మస్తుగా ఉండేవారు. నేను ఉన్న ఇంట్లోనే ముగ్గురు ఉండే వారు. నాకు పరిచయం అయిన గుజరాతీలలో గిరిష్ షా ముఖ్యుడు. వాడూ నా లాగే ఇంజనీరింగు చదవటానికి వచ్చేడు. నా కంటె వారం రోజులు ముందు వచ్చేడు. పైపెచ్చు వాడు బొంబాయిలో ఉండి మరీ వచ్చేడు. కనుక సహజంగా నా కంటె వాడికి నాలుగు విషయాలూ బాగా తెలుసుంటాయి కదా! నేను యూనివర్శిటీ లో చేరి దరిదాపు మూడు వారాలైంది. ఒక రోజున గిరిష్ షా నా దగ్గరకి వచ్చి “రావు గరూ! (ర కి దీర్ఘం ఇవ్వాలని ఎంత చెప్పినా వాడికి అనటం చేతనయేది కాదు.), నువ్వు తప్పు క్లాసులో కుర్చుంటున్నావ్, తెలుసా?” అనటంతో నా గుండె గుభేల్ మంది.

నా రిజిస్ట్రేషన్ కాగితాలు తీసి చూపించేను. అందులో ఎడ్వాన్స్డ్ కేలుక్యులస్, నూమరికల్ ఎనాలిసిస్ అని రెండు లెక్కల క్లాసులు, ఎలెక్ట్రోమేగ్నెటిక్ ఫీల్డ్స్ అనే ఇంజనీరింగు క్లాసు (భిలాయిలో అబ్రహం అండ్ బెకర్ నా అంతట నేను చదివి అర్థం చేసుకోలేకపోయిన సబ్జెక్టు ఇదే) అనేవి ఉన్నాయి. క్లాసులో పాఠ్యాంశాలని బట్టి మొదటి క్లాసులో లిమిట్, కంటిన్యువస్ ఫంక్షన్ మొదలైన మాటలు ఉండబట్టి అది కేలుక్యులస్ లాగే అనిపించింది. రెండోది కేలుక్యులస్ లా లేదు. పైపెచ్చు దాంట్లో లెక్కలు చెయ్యటానికి కంప్యూటరు వాడేవాళ్ళం.

అప్పటి రోజుల్లో మా యూనివర్సిటీ లో రెండే రెండు కంప్యూటర్లు ఉండేవి. ఒక దాని పేరు ఐ. బి. ఎం. 1620. దానిని ఎయిర్ కండిషన్ చేసిన గదిలో పెట్టేరు. అది చూడటానికి బాగుండేది. గిర్రు గిర్రు మని ఏవేవో చక్రాలలాంటివి ముందుకీ వెనక్కీ తిరుగుతూ ఉండేవి (వీటిని టెప్ డ్రైవ్స్ అంటారని తర్వాత తెలిసింది). టపటప చప్పుడు చేసుకుంటూ చిల్లులు పడ్డ కాగితపు టేపు ఒకటి కంప్యూటర్ లోంచి జరజరా బయటికి వచ్చేది. అంతే కాకుండా పోస్టు కార్డు కంటె మరికొంచెం కోలగా ఉన్న పలచటి అట్ట ముక్కకి మరొక యంత్రం ద్వారా చిల్లులు పెట్టి , ఆ చిల్లుల కార్డులని (పంచ్ కార్డ్ అనేవారు) ఒక దొంతిలా పేర్చి, ఆ దొంతిని కంప్యూటర్ లోకి తోసేవారు. మరొక పక్క నుంచి టెలిటైపు టపటపా చప్పుడు చేసుకుంటూ జవాబులని కాగితం మీదకి అచ్చు కొట్టేది. ఈ వ్యవహారం అంతా బయట గాజద్దాల తలుపుల గుండా చూడటం తప్ప, నా లాంటి మొదటి సంవత్సరం గ్రేడ్యువేట్ స్టూడెంట్స్ ని ఆ గదిలోకి కూడ వెళ్ళనిచ్చేవారు కాదు.



మొదటి సంవత్సరం “కుర్ర కుంకలకి” బరోస్ కంపెనీ వారి కంప్యూటర్ మరొకటి ఉండేది. భోషాణం పెట్టె లా ఉండేది. ఇది ఏ చప్పుడూ చేసేది కాదు. దీనికి కదిలే చక్రాలు లేవు. మిణుకు మిణుకు మంటూ వెలిగే దీపాలు ఉన్న ఒక సాలారం (కాన్సోల్) ఉండేది. కాగితం మీద ప్రోగ్రాము రాసుకునే వాళ్ళం. కోడింగ్ చెయ్యటం అంటే ఒక చిల్లుల పలక లాంటి సాధనాన్ని తీసుకుని ఆ రంధ్రాలలో ప్రోగ్రాము చెప్పిన విధంగా చిన్న చిన్న పిన్నులు (నిజానికి చిన్న మేకులు లా ఉండేవి) గుచ్చటం. అలా గుచ్చిన పలకని ఒక సొరుగులో దోపి, ఆ సొరుగు మూసేసి తాళం వేసేసి, సాలారం మీద ఉన్న మీట నొక్కటం. అప్పుడు సాలరం మీద ఉన్న చిన్న చిన్న దీపాలు కొంత సేపు మిణుకు మిణుకు మని తర్వాత స్థిరంగా వెలగటం మొదలెట్టేవి. అప్పుడు నోటు పుస్తకం లో వెలుగుతూన్న దీపానికి 1, ఆరిన దీపానికి 0 అని

వేసుకుని, ఈ ఒకట్లనీ, సున్నలనీ దశాంశ పద్ధతి లోకి మార్చుకుని జవాబు సరిగ్గా వచ్చిందో లేదో చూసుకునే వాళ్ళం. కంప్యూటరుతో పని చెయ్యటం నాకు అదే మొదటి సారేమో, భలే ఉషారుగా ఉండేది.

ఈ నేపథ్యం లో నేను తీసుకుంటూన్న కోర్సు తప్పక నూమరికల్ ఎనాలిసిస్ అయుంటుందనే అనుకున్నాను, అన్నాళ్ళూ. కేలుక్యులస్ కి కూడ కంప్యూటర్లు వాడతారని నాకేం తెలుసు?

నిజమే నీకేమీ తెలియదు పొమ్మన్నాడు, గిరీష్. ఈ రెండు సబ్జెక్ట్ల మధ్యా తేడా గమనించకుండా గుడ్డెద్దు చేలో పడ్డట్టు పాఠాలు చదువుతూన్న నా అమాయకత్వానికి జాలి పడ్డాడు.

ఎడ్వాన్స్డ్ కేలుక్యులస్ కీ, నూమరికల్ ఎనాలిసిస్ కీ మధ్య తేడా తెలియని తమంధం లా క్లాసులో కూర్చున్నానని అన్నయ్య కి తెలిసే లోగా ఏ సిరా బుడ్డి లోనో బుఱ్ఱ పెట్టేసి చచ్చిపోవటం మెరుగనిపించింది.

ఇటువంటి పరిస్థితి లోనే “ఆ మాత్రం తెలియక పోతే ఎందుకు పనికొస్తావురా, యూ స్టుపిడ్ గూస్” అనే వారు తునిలో మా ఇంగ్లీషు మేష్టారు, శ్రీమాన్ నల్లానచక్రవర్తుల నారాయణాచార్యుల వారు, హైస్కూల్ రోజులలో.

మర్నాడు గిరిష్ దగ్గరుండి నన్ను ఫారిన్ స్టూడెంట్ ఎడ్వైజర్ ఫాదర్ స్మిత్ దగ్గరకి తీసుకెళ్ళేడు. ఫాదర్ స్మిత్ కి లెక్కలు రావు. కాని, నా కోర్సు నంబరు, గది నెంబరు, ప్రొఫెసరు పేరు అన్నీ చూసి నేను చేస్తూన్న పనిలో ఏ తప్పూ కనబడటం లేదని చెప్పి, నా మంచి చెడ్డలు మరొక సారి కనుక్కుని, నా యెడల అంత శ్రద్ధ తీసుకున్నందుకు గిరిష్ ని అభినందించి మమ్మల్ని సాగనంపేరు.

మేము గది బయటకి వచ్చి పదడుగులు వేసేమో లేదో, ఫాదర్ స్మిత్ మమ్మల్ని వెనక్కి రమ్మని కేకేసేరు. ఏమనుకున్నారో ఏమో, ఆయన గిరిష్ ని “నువ్వేమి కోర్సులు తీసుకుంటున్నావు?” అని అడిగేరు. తను

కూడా ఎడ్వాన్స్‌డ్ కేలుక్యులస్,  నూమరికల్ ఎనాలిసిస్ తీసుకుంటున్నాననీ, తనకి పాఠం చెప్పే గురువులు, గదులూ వేరని చెప్పేడు.

ఆయన ఏమనుకున్నాడో గిరిష్ కి పాఠం చెప్పే గురువులిద్దరినీ ఫోనులో పిలచి, ఒక నిమిషం మాట్లాడి, గిరిష్ వైపు తిరిగి, "నాయనా స్కూలు మొదలై నెల కావస్తోంది. ఈ నెల్లాళ్ళబట్టీ నువ్వు పొద్దుట ఎడ్వాన్స్‌డ్ కేలుక్యులస్ క్లాసు లోనే కూర్చుంటున్నావు. కాని, నువ్వు సాయంకాలం తీసుకుంటూన్నది నూమరికల్ ఎనాలిసిస్ కాదు; అది కూడ ఎడ్వాన్స్‌డ్ కేలుక్యులస్ క్లాసే!" అనేసరికి గిరిష్ షా తెల్ల మొహం పెట్టుకుని చూసేడు.

దరిమిలా గిరిష్ కి చదువు ఒంటబట్ట లేదు. కాని స్కూలులో ఎలాగో ఒక లాగ నిలదొక్కుకోపోతే వీసా పోతుంది. వీసా పోతే, ఇంటికి పంపించెస్తారు. అందుకని వాడి తెలివితేటలన్నిటిని దేశం నుండి బహిష్కరణని తప్పించుకుందికి ఉపయోగించేవాడు.

గిరిష్ ఏమీ తెలివి తక్కువ వాడు కాదు. బ్రతక నేర్చిన మనిషి. వాడికి స్కాలర్‌షిప్ ఏదీ లేకపోయినా ఎలా వచ్చేసేడో కాని అమెరికా వచ్చేసేడు. ఎలా పట్టుకొచ్చేడో కాని, వాడితో వెయ్యో, రెండు వేలో డాలర్లు తెచ్చుకున్నాడు. ఊరొచ్చిన అతి కొద్ది కాలంలో ఒక పాత కారొకటి కొన్నాడు. మన దేశపు విద్యార్థులలో వాడి దగ్గరే కారు ఉండేది. ఎవ్వరడిగినా కాదనకుండా రైడ్ ఇచ్చే వాడు.  ఎవ్వరికి ఏ సహాయం కావాలన్నా చేసేవాడు. వాడికి తినటానికి లేకపోయినా మరొకరికి పెట్టేవాడు. నోటి మంచితనం ఉన్న వ్యక్తి. కాని నోటి మంచితనం చూసి మార్కులు వెయ్యరు కదా! వాడికి సి లు, ఎఫ్. లు వచ్చేవి. ఈ రకం మార్కులు కూడబెడితే నేల విడచి సాము చెయ్యటమే అవుతుంది.
ఒక సారి నా దగ్గరకొచ్చి నా మార్కుల కాగితం చూస్తానన్నాడు. ఇచ్చేను. మర్నాడు నా కాగితం నాకు ఇచ్చేసేడు. నా దగ్గర ఏ మడతలు లేకుండా, సాపుగా  ఉన్న కాగితం పుచ్చుకున్న పెద్ద మనిషి, మేజిక్ చెయ్యటానికి డాలరు కాగితాన్ని మడత పెట్టినట్లు మడతలు పెట్టి తిరిగి ఇచ్చేడు.

నా పుస్తకాలు ఎరువు తీసుకుని, వాటిలో పెన్సిలు తోటో, పెన్ను తోటో అండర్‌లైను చేసినా, పేజీలని గుర్తు పెట్టుకుందికి కాగితం మూలని మడచినా నాకు చాల కోపం వచ్చేది. అలాంటిది నా మార్కుల కాగితాన్ని అలా మడతలు పెడితే కోపం రాదూ? ఎందుకలా చేసేవని నిలేసేను. నిజమే చెప్పేడు.

నాకు A వచ్చిన నూమరికల్ ఎనాలిసిస్ భాగం పైకి కనిపించేలా మార్కుల కాగితాన్ని మడత పెట్టి దానిని వాడి మార్కుల కాగితం మీద  ఉన్న F ని కప్పేలా అమర్చి దానికి కాపీ తీసేడు. అది ఎంత బాగా వచ్చిందంటే, వాడికి నూమరికల్ ఎనాలిసిస్ లో ఎ వచ్చినట్లు అనుమానానికి తావు లేకుండా కనిపించిది. వాడు చేసిన  జిత్తులని ఆ ఫాలాక్షుడు కూడ పట్టుకో లేడు – అంత బాగా వచ్చింది ఆ నకలు. ఒక్క దెబ్బతో వాడి గ్రేడ్ పోయింట్ ఏవరేజి పెరిగిపోయింది. ఆ కాగితం పట్టుకెళ్ళి వర్కు పెర్మిట్ సంపాదించేడు. ఆ కాగితం చూపించి పేరు లేని మరొక కాలేజీలో ఎడ్మిషను సంపాదించి, మారొక ఐ–20 ఫారం సంపాదించి నా చేత "ఔరా!" అనిపించుకున్నాడు. శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలు.

ఒక రోజు గిరిష్ కొంచెం డబ్బు అప్పిమ్మని అడిగేడు. మంచి విద్యార్థి కాకపోయినా మనిషి మంచి వాడు. పోనీ ఓ ఐదో పదో సర్దు బాటు చేసినంత మాత్రాన్న కొంపేమీ ములిగి పోదులే అనుకుని, "ఏమాత్రం కావాలేంటి?" అని అడిగేను. ఎనిమిది వందలు కావాలన్నాడు. నన్ను అమ్మేసినా 800 రావని చెప్పేను.

"నీ దగ్గర లేకపోతే బేంకులో అప్పు చేసి ఇయ్యి."

"ఆ అప్పేదో నువ్వే చేసుకోకూడదా?"
"నాకు ఉద్యోగం లేదు. నాకివ్వరు. నీకుంది. నీకిస్తారు."

"హోరి భడవా! ఈ హోం వర్కు చేసేవన్నమాట. ఈ రకం ముందు చూపేదో ఆ చదువులో చూపించి ఉంటే ఈ పరిస్థితి ఎదురయేది కాదు కదా!" అని మనస్సులో అనుకున్నాను.

మొత్తం మీద నన్నెలాగో మొహమాటపెట్టేసి నన్ను బేంకుకి లాక్కెళ్ళేడు.

అప్పులాఫీసరుని పట్టుకుని అప్పు కావాలని అడిగేను. అతను అడగవలసిన ప్రశ్నలు ఉంటాయి కదా!

"నీకు ఉద్యోగం ఉందా?"

"ఉంది"

"జీతం ఎంత?"

"1,800"

"నెలకా? సంవత్సరానికా?"

"సంవత్సరానికి"

"సమ్మర్ లో ఉద్యోగం ఉందా?"

"లేదు"

"అంటే, నెలకి రెండు వందలు స్కాలర్‌షిప్ అన్నమాట!"

"---."

"ఏమైనా సేవింగ్సు ఉన్నాయా? ఉంటే ఎక్కడ?

“ఇక్కడే. ఈ బేంకు లోనే ఉన్నాయి. మూడు వందలు ఉన్నాయి”

“నీకు అప్పు ఎంత కావాలి?”

“800”

“డాలర్లా?”

“లేక పోతే పైసలనుకుంటున్నావా?” అని అందామని అనుకుని, నోరు మూసుకుని ఊరుకున్నాను. అప్పుడు ఆ బేంకు ఆఫీసరు మా ఇద్దరివైపు జాలిగా చూసి, “నాయనా, నీకు ఉద్యోగం ఉండి, సేవింగ్సులో ఓ రెండు వేల దాకా ఉంటే నీకు 500 వరకూ 5 శాతం వడ్డీ మీద అప్పు ఇస్తాను” అన్నాడు.

“నా సేవింగ్సులో రెండు వేల దాకా ఉంటే నిన్నెందుకు అడుగుతాను?”

“నాయనా, నువ్వు ఇంకా ఈ దేశానికి కొత్తనుకుంటాను. నీకు మా డబ్బు అవసరం లేదని నువ్వు రుజువు చెయ్య గలిగితే నీకు డబ్బు అప్పివ్వటానికి సిద్ధంగా ఉన్నాను,” అన్నాడు.

బేంకు వ్యవహారం ఇంత జోరుగా బెడిసి కొడుతుందని అనుకోలేదు. అయినా గిరిష్ షా కి ఈ 800 ఇప్పుడు ఎందుకు అవసరం వచ్చేయో నాకు అర్థం కాలా. నాకు నెలకి అరవై దాటి ఖర్చు కావటం లేదే. ఏ అమ్మాయినైనా ఇరుకులో పెట్టేసేడేమోనని నాకు ఒక్క లిప్త పాటు అనుమానం వచ్చింది. అలాంటిదేమీ కాదన్నాడు. నేను నమ్మేను. ఎందుకంటే వాడు రోజుకి ఒక్కసారైనా బొంబాయిలో ఉన్న వాడి స్నేహితురాలు రోహిణి ఫొటో చూపించేవాడు. ఆ అమ్మాయి వృత్తాంతం అంతా నాకు కొట్టిన పిండే. కనుక ఇది అమ్మాయికి సంబంధించిన సమస్య కాదు. మరేమిటో?

గుచ్చి గుచ్చి అడగ్గా చెప్పేడు. అమెరికాలో అప్పట్లో 'విక్ టేనీ' అనే కంపెనీ ఉండేది. ఇప్పట్లో 'ఫిట్నెస్ సెంటర్' అంటామే అలాంటి 'జిమ్నేజియం' అది. ఇప్పుడంటే ఈ 'స్పా' లు కుక్కగొడుగుల్లా కనిపిస్తున్నాయి కాని అప్పట్లో డిట్రాయిట్ ఉరంతటికీ ఒకటో, రెండో 'విక్ టేనీ సెంటర్లు' ఉండేవి. వ్యాయామం చెయ్యటానికి కావలసిన హంగులు, సరంజామా అంతా ఒక పేద్ద గదిలో అమర్చి, దానిని ఒక క్లబ్బులా చేసి అందులో అందరి చేతా సభ్యత్వం కొనిపిస్తారు. సభ్యత్వం ఉన్నవారంతా ఈ 'జిం' కి వెళ్ళి అక్కడ కసరత్తులు, గుంజీలు, బస్కీలు, బరువులు ఎత్తటం, ఇలా ఒకటేమిటి, రకరకాల సామగ్రి సహాయంతో రకరకాల వ్యాయామం చేసుకో వచ్చు. వీడిని ఉచితంగా నాలుగు రోజులు కసరత్తు చేసుకోనిచ్చి, ఆ తర్వాత బాగా మొహమాటపెట్టేసి, వీడి చేత వాళ్ళు సభ్యత్వం కొనిపించేసి, వాయిదాల పద్ధతి మీద సభ్యత్వ రుసుం కట్టెస్తానని కాగితాల మీద సంతకాలు పెట్టించేసుకున్నారు. కాగితమే కదా, సంతకమే కదా అని వీడు ముందూ, వెనకా చూసుకోకుండా సంతకం పెట్టేసి చక్కావచ్చేడు. వాయిదాల పద్ధతిలో సభ్యత్వ రుసుం కట్టటం మాట దేవుడెరుగు, వీడి దగ్గర తిండి తినటానికి సరిపడా డబ్బుండేది కాదు. 'పేమెంటు డీఫాల్ట్' అయేసరికి వాళ్ళు వీడికి ముందు 'వార్నింగు'లు, తర్వాత 'కోర్టు నోటీసు' పంపించేరు. గిరిష్ ని ఈ లంపటం లోంచి లాగే సరికి వాడికి పట్టిన కండ ఏదైనా ఉంటే అది కరిగి పోయింది, మాకా తల ప్రాణం తోకకి వచ్చింది. తెలిసీ తెలియకుండా ప్రతి కాగితం మీదా సంతకం పెట్టెయ్యకూడదని ఆ అనుభవం మా అందరికీ ఒక గుణపాఠం నేర్పింది.

గిరిష్ షా నా లాగే శాకాహారి. వాడు రాత్రెక్కడో పని చేసి ఇంటికి వచ్చేసరికి పది దాటేది. అప్పుడేమి వండుకుంటాడు? మేము వండుకున్నది ఏదైనా మిగిలితే తినే వాడు. లేక పోతే పొటేటో చిప్సు, కుకీలు తిని బతికేవాడు. తింటానికి తిండి లేకపోయినా మీసాలకి సంపెంగ నూనె అంటారే అలాగ వారాంతంలో బీరు తాగటానికి బారుకి వెళ్ళేవాడు. బొంబాయి వంటి మహా నగరంలో ఉండి వచ్చేడేమో బారుకి వెళ్ళటం లో ఉన్న 'ప్రొసీజర్' ఏదో వీడికి బాగా తెలుసుంటుందని గ్రహించి, నేను ఒక సారి వాడిని బతిమాలుకొని, వాడితో, వాడి కారులో, బారు కి వెళ్ళి, ఎవ్వరైనా చూస్తారేమోనన్న భయం కూడ లేకుండా, బీరు తాగి చూసేను. తలంటి పోసుకున్నప్పుడు, బుర్ర మీంచి నోట్లోకి జారిన కుంకుడు రసం రుచిలో ఉందా బీరు.

బార్ కి వెళ్ళి బీరు కొనుక్కుని తాగటం ఎలాగో నాకు తెలిసింది కదా. పెద్ద బ్రహ్మవిద్య నేర్చిన వాడిలా అచ్యుతరావు దగ్గరా, లక్ష్మి దగ్గరా గప్పాలు కొట్టటం మొదలు పెట్టేను. వాళ్ళకీ సరదా పుట్టింది. మళ్ళా బారుకే వెళితే మన గొప్పేముంటుంది. అందుకని ఈ మారు బర్లెస్కు కి వెళ్ళటానికి నిశ్చయించేం. టాప్ లెస్ బార్ అయితే అర్ధనగ్నంగా ఉన్న అమ్మాయిలు బీరు పట్టుకొచ్చి ఇస్తారు. బర్లెస్కు లో అయితే బీరు సెర్వు చేసే అమ్మాయిలు వేరు, స్టేజి మీద డేన్సు చెసే అమ్మాయి వేరు. స్టేజి మీద అమ్మాయి మొదట్లో సచేలంగాను, సాలంకృతంగానే ఉంటుంది. డేన్సు చేస్తూ ఒకటీ ఒకటీ ఒంటి మీద ఉన్న బట్టలు, ఊరిస్తూ ఊరిస్తూ, ఊడదీస్తుంది. చూసే వాళ్ళకి దమ్ములు ఉండాలి కాని తీసే వాళ్ళకి అవధులు ఉండవు. ఈ బర్లెస్కు డిట్రాయిట్ డౌన్‌టౌన్ లో ఉంది. మా దగ్గర కారు లేదు. గిరిష్ షా ని అడిగితే తీసికెళ్ళేవాడే. కాని తను బర్లెస్కు షో కి వెళ్ళినట్లు, ముందు గిరిష్ కీ తరవాత తద్వారా ఊరంతటికీ తెలియటం లక్ష్మి కి ఇష్టం లేదు. కనుక మేం సిటి బస్సెక్కి వెళ్ళటానికి నిశ్చయం చేసేం.

రాత్రి భోజనాలు చేసి బయలుదేరేం. అప్పటికే రోడ్లన్నిటిని మంచు కప్పేసింది. బయట బాగా చలి వేస్తోంది. ఆ చలికి సరిపడా బందోబస్తుగా బట్టలు వేసుకొని బయటకి వచ్చి సిటీ బస్సు కోసం ఎదురు చూస్తూ బస్సు స్టాప్ లో నించున్నాం. అటొచ్చే బస్సులలో ఏ బస్సెక్కాలో నాకు తెలియదు. అచ్యుతరావు కి తెలుస్తుందన్న ఇంగిత జ్ఞానం నాకు లేకపోయింది. ఒకటి, రెండు బస్సులు ఆగకుండా వెళ్ళిపోయేయి. మేమంతా చలిలో గజగజ వణికి పోతున్నాం. బస్సు ఎప్పటికీ రాదు. అప్పుడు నాకు ఒక అనుమానం వచ్చింది. మనం ఆపమని అడగక పోతే ఆపరేమోనని. కనుక ఈ మాటు మూడో బస్సు ఇంకా అల్లంత దూరంలో ఉండగానే, ఎదటకి వెళ్ళి, నా కాలు జాపి, పేంటుని వెనక్కి లాగి, పాదాన్ని ఇటూ అటూ ఆడించేను. బస్సు ఆగింది! ఓహో! అదన్న మాట. మనం ఇండియాలో బస్సుల్ని ఆపటానికి చెయ్యి జాపి చేతిని ఆడిస్తాం. ఇక్కడ అమెరికాలో కాలుని జాపి, పాదాన్ని ఆడించాలన్న మాట!

బస్సెక్కిన తర్వాత అచ్యుతరావు అడిగేడు, ఎందుకు అలా కాలు జాపేనని. చెప్పేను, నేను వచ్చిన రోజున ఉడ్‌వర్డ్ ఎవెన్యు మీద నీగ్రో మేస్త్రి చేసిన పనిని. అప్పుడు ఆ పక్కనున్న ప్రయాణీకులు చెప్పేరు దాని నేపథ్యం. పూర్వం నీగ్రోలు ఇంకా బానిసలుగా ఉన్న రోజులలో ఊరు వదలి ఊరు వెళ్ళవలసి వచ్చినప్పుడు “రైడ్” కావలిస్తే వస్తూన్న బండికి ఎదురెళ్ళి, ‘నడవలేక పోతున్నాను” అని చెప్పటానికి సూచనగా కాలు పైకెత్తి చూపించేవారట. ఇది దక్షిణాది నుండి ఉత్తరాదికి వలస వచ్చిన నీగ్రోలలో

అవశేషంగా మిగిలిపోయిన అలవాటుట. ఈ విషయం చెప్పి చుట్టు పక్కల ఉన్న ప్రయాణీకులంతా ఒక్క సారి ఘొల్లున నవ్వేరు. (ఈ రోజులలో"నీగ్రో" అన్న మాట వాడడం సభ్యత కాదు; కాని, ఆ రోజుల్లో నిరభ్యంతరంగా వాడేవారు)!

# హోం సిక్‌నెస్

ఒక అపూర్వమైన అనుభవాన్ని మాటలతో వివరించటం అసాధ్యమనిపిస్తే దానిని అనుభవైకవేద్యం (అనుభవ + ఏక + వేద్యం = ఒక అనుభవం వల్ల తెలిసినది) అంటారుట. హోం సిక్‌నెస్ అనేది అనుభవించాలి తప్ప, మాటలతో వర్ణనకి లొంగేది కాదు. అయినా ప్రయత్నిస్తాను.

నేను అమెరికా వచ్చి అప్పటికి ఓ ఐదారు వారాలు దాటుంటుంది. జీవితం ఒక గాడిలో పడి దొర్లిపోతోంది. కొత్తలో ఉన్న వింత క్రమేపీ పాతబడుతోంది. దానితో ఒక విధమైన 'ఏంటీ క్లైమేక్సు' ఎదురుకుంది. ఎన్నో కష్టాలకి ఓర్చుకుని అమెరికా రావాలనుకున్న పని సాధించటం అయిపోయింది. చుట్టూ కనిపించేది కొత్త దేశం. కొత్త పరిసరాలు. కొత్త వాతావరణం. కొత్త మనుష్యులు. పరిచయస్తులు లేరు. కొత్తగా మళ్ళా విద్యార్ధి దశ. ఈ అమెరికన్ కుర్రాళ్ళతో పోటీకి నిలవగలనో లేదో అని ఒక బెంగ. అన్నయ్య నా తరఫున పడ్డ కష్టానికి వాడి పరువు నిలబెట్టగలనో లేనో అని మరొక భయం. ఇంటికొచ్చేసరికల్లా ఏకాంతం. ఇవన్నీ కలగలుపుగా కుట్ర పన్నేయో ఏమో కాని ఏదో అనిర్వచనీయమైన అందోళన నేపథ్యం లో ఎక్కడో తచ్చాడుతోంది. రోజూ చేసుకునే పనులు జరుగుతూనే ఉన్నాయి కాని, ఈ బెరుకుదనం వెంటాడుతూనే ఉంది.

దీనికి తోడు చలి కాలం మొదలైంది. పగలు తక్కువ, రాత్రి ఎక్కువ. సాయంకాలం నాలుగున్నరకే చీకటి పడిపోయేది. ఎనిమిది వరకు తెల్లారదు. దీనితో పాటు ఆ కాలం లో మబ్బులు ఎక్కువ. ఎండ కాసినా దాని తరచుదనం, తీవ్రత రెండూ తక్కువే. అసలే కోతి, కల్లు తాగింది, ముల్లు గుచ్చుకుంది, నిప్పు తొక్కింది అన్నట్లు అసలే చలి, దాని మీద గుబులు గుబులుగా మబ్బు. సూర్యరస్మి సోకేది కాదు. ఈ వాతావరణం లో మనస్సు కి ఉత్సాహం ఉండేది కాదు. నలుగురి మధ్య పెరిగినవాడిని కనుక ఇంటిదగ్గర బంధు మిత్రుల ఆసరా ఉండేది. అమ్మ, నాన్న గారు తరచుగా మనస్సులో మెదిలేవారు.

పోనీ ఇంటికి ఫోను చేసి మాట్లాడదామా అంటే, తునిలో రెండే రెండు ఫోనులు ఉండేవి. ఒకటి, పోస్టాఫీసులోను, రెండవది పోలసానపల్లి గంగరాజు మందుల కొట్లోను. అయినా అమ్మ ఇల్లు దాటి

ఫోనులో మాట్లాడటానికి ఎలా వస్తుంది? అప్పుడు మరొక ఉపాయం తట్టింది. ఆ రోజులలో "కోయిన్ ఆపరేటెడ్" ఫోటో బూతులూ, రికార్డింగ్ బూతులూ ఉండేవి. బూతులో కూర్చుని ఒక క్వార్టర్ వేసి మీట నొక్కితే, టపటపా మూడు ఫ్లేషులు వచ్చి ఒక నిమిషం లో మూడు ఫొటోలు "ఆటోమేటిక్" గా వచ్చేవి. అలాగే మూడు పావలాలు వేస్తే ఐదు నిమిషాలపాటు ఏదైనా రికార్డు చేసుకో వచ్చు. అమ్మకి ఉత్తరం రాసి, అది ఈ బడ్డీ దగ్గరకి పట్టికెళ్ళి చదవి మీట నొక్కితే చిన్న కైవారం ఉన్న ఒక గ్రామఫోను రికార్డు బయటకి వచ్చేది. దానిని టపాలో ఇంటికి పంపితే అమ్మ మమ్మల్ని చూడలేకపోయినా మా గొంతుక వింటుందని మా ఆశ. వచ్చిన చిక్కల్లా ఇంట్లో గ్రామఫోను లేదుగా!

ఇదంతా అమ్మా, నాన్నల కోసం బెంగ వల్లనే కాదు. అంతకి మించిన, వర్ణనకి లొంగని ఒక అనిర్వచనీయమైన ఆవేదన. ఒక రోజున ఇల్లు జ్ఞాపకం వచ్చి, ఇంటి గురించి గిరిష్ తో మాట్లాడుతూ, మరే ప్రేరణ లేకుండా తలగడలో మొహం పెట్టి వెక్కి వెక్కి ఏడ్చేసేను. గిరిష్ సముదాయింపుగా పక్కని కూర్చుని, "ఏదో ఒకటి మాట్లాడు, నేను వింటాను" అన్నాడు. అప్పుడు వాడితో కనీసం ఒక గంట సేపు తెలుగులో అలా మాట్లాడేసేను. అప్పుడు అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది, గిరిష్ కి తెలుగు రాదని.

నేను అనుభవించిన బాధనే 'హోం సిక్‌నెస్' అంటారుట. దీనిని 'ఇంటిబెంగ' అని తెలుగులో అనొచ్చు. దీని గురించి చదవటం మొదలు పెట్టేను. ఇది విద్యార్థి దశలో సర్వసాధారణంగా వస్తుందిట. మొట్టమొదటి సారి 'నా' అన్న వాళ్ళని వదలి పెట్టి బయటకి వచ్చినప్పుడు దీని లక్షణాలు పొడచూపుతాయిట. అప్పుడు అనుకున్నాను, మనదేశంలో చిన్న వయస్సులోనే ఆడపిల్లలకి పెండ్లి చేసేసి అత్త వారింటికి పంపేసినప్పుడు, వాళ్ళు కూడ ఇలాగే బాధ పడతారా అని. అచ్యుతరావు ఇంటికి వెళ్ళినప్పుడు నా గోడు చెప్పుకుని లక్ష్మిని అడిగేను. లక్ష్మికి వాళ్ళ నాన్నగారు – బుజ్జులు గారు – జ్ఞాపకం వచ్చి తనూ బావురుమంది. డోలు వెళ్ళి మద్దెలతో మొర పెట్టుకున్నట్లు ఉంది కదూ!

ఇంటిదొంగని ఈశ్వరుడు కూడ పట్ట లేరన్నట్లే, ఇంటిబెంగని ఈశ్వరుడు కూడ తీర్చలేడనిపించింది. అందుకని అవకాశం దొరికినప్పుడల్లా అచ్యుతరావుతో కలసి సినిమాలకి వెళ్ళేవాడిని. సినిమా చూడటానికి ఏభై పైసలు టికెట్టు. వరసగా 'వెస్ట్‌సైడ్ స్టోరీ', 'గన్స్ అఫ్ నవరోన్', 'జడ్జిమెంట్ ఎట్

నూరెన్‌బర్గ్', 'లవర్ కం బేక్', 'ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్', 'కం సెప్టెంబర్', అమెరికా, రష్యాల మధ్య ముమ్మరంగా జరుగుతూన్న ప్రచ్ఛన్న యుద్ధపు (కోల్డ్ వార్) నేపథ్యంలో తీసిన కామెడీ 'వన్, టు, త్రి' చూసేసేను. నేను కాకినాడలో ఉన్న నాలుగేళ్ళల్లోనూ చూసిన మొత్తం సినిమాలు కూడ ఏడే!

పోనీ, ఒక సారి అన్నయ్యని ఫోనులో పిలచి మాట్లాడదామని పిలచేను. అదే నేను మొట్టమొదట అమెరికాలో చేసిన 'లాంగ్ డిస్టెన్స్ కాల్.' నా గోంతుక విని అన్నయ్య, "ఏమిరా ఈత కొట్టటం నేర్చుకుంటున్నావా?" అని అడిగేడు. ఇంతవరకు లెక్కలు చెయ్యటం బాగా నేర్చుకోమనే చెప్పేవాడు కాని, ఎప్పుడూ ఈత నేర్చుకోమని అడగలేదు. పైగా చలితో చస్తున్నాం. ఇప్పుడు ఈతేమిటి? పోనీ నేర్చుకుందామన్నా మా యూనివర్సిటీలో ఈత కొలను ఉందో, లేదో! వాడికి ఏమని సమాధానం చెప్పాలో స్ఫురించక, "సమ్మర్ వచ్చిన తర్వాత నేర్చుకుంటానులే!" అన్నాను. "అది కాదురా. నువ్వు నీ దగ్గర ఉన్న డబ్బంతా ఇలా లాంగ్ డిస్టెన్స్ కాల్స్ మీద తగలెట్టెస్తే, రేప్పొద్దున్న ఇండియా ఈత కొట్టుకు వెళతావా?" అని అడిగేడు. అప్పుడు, "అది కాదు, అన్నయ్యా, ఎవ్వరితోటైనా ఒక సారి మాట్లాడాలనిపించి పిలిచేనంతే!" అని చెప్పి ఫోను పెట్టేసేను.

అసలు విషయం గ్రహించటానికి అన్నయ్యకి ఆట్టే సేపు పట్ట లేదు. అప్పుడు చిర్రా రామలింగారెడ్డి రాచెస్టర్ లోని "బౌష్ అండ్ లాంబ్" లో ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. అతని దగ్గర కారు ఉంది. మా అన్నయ్య అడగగానే, కారులో ఎక్కించుకుని డిట్రోయిట్ తీసుకొచ్చేడు – వసంత కాలం వచ్చి రోడ్లు కొంచెం బాగుపడ్డ తర్వాత. అప్పుడు నా దగ్గర ఉన్న ఒక్క రోజులోను, అచ్యుతరావు ఇంటికి తీసికెళ్ళేను, భోజనానికి. సాంబారు చెయ్యటానికి  లక్ష్మి బటానీ పప్పు ఉడకేసింది. కాని అది ఎప్పటికీ ఉడకదే. అప్పుడు అన్నయ్య పప్పు ఉడికించటంలో సూక్ష్మం, సాంబారు చెయ్యటం  లక్ష్మికి నేర్పేడు. (ఈ సూక్ష్మం ఏమిటంటే, పప్పులో నీళ్ళు పోసి ఉడకబెడుతూన్నప్పుడు, నీళ్ళు ఇగిరిపోతాయి తప్ప పప్పు బద్ద చిట్లదు, మెత్తబడదు. అప్పుడు మరో కప్పుడునీళ్ళు పోసి మరగబెట్టినా లాభం లేదు. నీళ్ళు దరిదాపుగా అన్నీ ఇగిరిపోయిన తర్వాత, మంట బాగా తగ్గించి, ఆ చిన్న సెగ మీద నెమ్మదిగా ఉడకనిస్తే పప్పు ఉడుకుతుంది. దీని వెనక ఉన్న శాస్త్రం ఏమిటో నాకు తెలియదు. స్వయంపాకపు రోజులలో వంట మీద

ఇటువంటి రిసెర్చి చాలా చేసి, పరిశోధన పత్రాలు ప్రకటించే స్థాయికి ఎదిగిపోయేను. చిక్కల్లా నాకు ఒక కప్పు కాఫీ కాచుకోవటం రాదు; కాఫీ మీద లెక్చరు ఇవ్వగలను.)

రామలింగారెడ్డిని నేను మొదటి సారి కలుసుకున్నప్పుడు, మనిషి టై, గియ్ కట్టి టిప్‌టాప్ గా తయారై కనిపించేడు. నా వేషం చూసి, “మేష్టారూ, మీరు ఎప్పుడూ టై కట్టుకొని, బాగా డ్రెస్ చేసుకోవాలి. లేక పోతే మన స్టేటస్, మన దేశం స్టేటస్, మన ప్రాచీనత, మన గొప్పదనం వీళ్ళకి  తెలియదు.” అంటూ రెడ్డి నాకొక సలహా పారేసేడు. ఏళ్ళ తరవాత లాస్ ఏంజిలిస్ లో నా చదువు అయిపోయిన తర్వాత నా ఫోక్స్ వేగన్ ని చూసి, “మేష్టారూ, స్టీలండీ, స్టీలు. చుట్టూ స్టీలు ఉండాలి. ఏదైనా ప్రమాదం జరిగితే ఆ స్టీలే మనని రక్షిస్తుంది,” అని చెప్పి నా చేత పెద్ద రథం లాంటి ప్లిమత్ ఫ్యూరీ ని కొనిపించేడు. దరిమిలా ఏపిల్ కంప్యుటర్‌లు వచ్చిన కొత్త రోజులలో ఆ కంప్యూటర్ ఉపయోగించి ఆప్టికల్ డిజైన్ చేస్తూన్నట్లు ఈ రెడ్డి కి ఒక ఫొటో తీసి దానిని విరివిగా ఎడ్వర్టైజ్‌మెంట్‌లలో వాడు కున్నారు. ఏ కంప్యూటరు పత్రిక చూసినా వెనక పేజీలో రామలింగారెడ్డి బొమ్మే!

అన్నయ్య, రెడ్డి తిరిగి వెళ్ళిపోయేరు, కాని ఈ హోం సిక్‌నెస్ అంత త్వరగా వెళ్ళేటట్లు లేదు. ఇంటి దగ్గర మరీ బోరు కొడితే టొలీడొవో, ఏన్ ఆర్బరో, లేన్సింగో వెళ్ళే వాళ్ళం – బస్సులో నో, లేక ఎవ్వరైనా రైడ్ ఇస్తే కారులోనో. అక్కడ తెలుగు వాళ్ళు ఎవరు ఉంటే అక్కడకి వారం చెప్పుకుని వెళ్ళిపోవటమే. వాళ్ళు పిలవక్కర లేదు. ఇలా వెళ్ళిన ఒక సందర్భంలోనే ఏన్ ఆర్బర్ లో టి. ఆర్. ఏన్. రావు గారినీ, చివుకుల రామమోహనరావు గారిని, వారి భార్యలనీ కలుసుకున్నాను. కలుసుకోవటమేమిటి, వారింట భోజనం చేసేను. రామమోహనరావు గారి భార్య నన్ను చూసి, మా తమ్ముడులా ఉన్నారు, మరో రోజు ఉండండని అడిగి మరీ ఇంట్లో ఉంచుకున్నారు. ఆమెకి కూడా "హోం సిక్‌నెస్" వచ్చిందేమో!

నేను హోం సిక్ అవుతున్నానని అన్నయ్య ఇండియా వెళ్ళిపోయే ముందు అర్బానాలో ఉన్న చెరుకూరి రామారావు గారికి రాసేడుట. ఆయనా, మా వదినా పినతండ్రి, పెత్తండ్రి బిడ్డలుట. అందుకని ఆయన వీలు చూసుకుని ఒక సారి వాళ్ళ ఊరు రమ్మని ఉత్తరం రాసేరు. ఆయన ఎవ్వరో నాకు అప్పట్లో

తెలియక పోయినా, పిలవని వాడిదే పొరపాటనే ధోరణిలో ఉన్న నేను వాళ్ళింటికి వెళ్ళటానికి అవకాశం కోసం ఎదురు చూడటం మొదలు పెట్టేను.

ఈ అవకాశం కాకతాళీయంగా తన్నుకు వచ్చింది. అదెలా జరిగిందో చెబుతాను. నేను లంచికి నా సేండ్‌విచ్  ఇంటి దగ్గరే తయారు చేసుకుని, కేఫిటేరియాకి పట్టికెళ్ళి అక్కడ కాఫీ కొనుక్కుని లంచి తినేవాడిని. నేను విదేశ విద్యార్థిని కావటం వల్ల, నా బల్ల దగ్గర సాధారణంగా ఎవరో ఒకరు వచ్చి కూర్చుని నా గురించి కాని, మన దేశం గురించి కాని అడిగేవారు. ఒక రోజున రూడాల్ఫ్ అనే అండర్ గ్రేడ్యువేట్ కుర్రాడు వచ్చి కూర్చున్నాడు. ఇరవై ఏళ్ళు కూడ ఉండవేమో. మాట్లాడే భాష లోని యాసని బట్టి అతను  జెర్మనీ వాడని తెలుసుకుందికి నాకు ఆట్టే సేపు పట్ట లేదు. రెండవ ప్రపంచ యుద్ధం అయిన తర్వాత అతను, తల్లిదండ్రులతో పాటు జెర్మనీ నుండి అమెరికా వలస వచ్చేడుట. ఇలా వలస వచ్చిన వాళ్ళల్లో రెండు రకాలు ఉన్నారు. హిట్లరు బారి నుండి తప్పించుకుని బయట పడ్డ యూదులు మొదటి రకం. యుద్ధం అయిపోయిన తర్వాత, దేశం అంతా సర్వనాశనం అయిపోయినప్పుడు పొట్ట చేత్తో పట్టుకుని జీవనోపాధి వెతుక్కుంటూ వచ్చిన క్రైస్తవులు రెండవ రకం. రూడాల్ఫ్ ఓల్క్‌మన్ ఈ రెండవ తరగతి వ్యక్తి; ప్రొటస్టెంట్ క్రైస్తవుడు. ఒక విధంగా కాందిశీకుడు.

ఈ జీవితమనే నాటక రంగం మీదకి ఎంతో మంది వస్తూ ఉంటారు, పోతూ ఉంటారు. కాని కొందరితోనే మనకి స్నేహం కుదురుతుంది. అమెరికా వెళ్ళిన కొత్తరోజులలోనే, రూడాల్ఫ్ ని కలుసుకోక మునుపే నేను హిట్లరు ఆత్మ కథ "మైన్ కాంఫ్" చదివేను. అది చదవటానికి కూడ కారణాలు ఉన్నాయి. నేను అమెరికా వచ్చిన కొత్తలో "జడ్జిమెంట్ ఎట్ నూరెన్‌బర్గ్"  అనే సినిమాని చూసేనని చెప్పేను కదా. అందులో మేక్స్‌మిలియన్ షెల్ అనే నటుడు జెర్మని తరఫున అద్భుతంగా వాదిస్తాడు. ఆ సందర్భంలో హిట్లరు ఆత్మ కథ చదవాలన్న కోరిక కలిగి ఆ పుస్తకం సంపాదించి చదివేను. ఆ పుస్తకం చదివితే హిట్లరు చేసిన పని ఎందుకు చేసేడో కొంత ఆధారం దొరుకుతుంది. ఆ ప్రస్తావనతో మా బాతాఖాని మొదలైంది. తర్వాత, భారత, జెర్మన్ సంస్కృతుల మధ్య "ఆర్యులు" అనే ఉమ్మడి భావం గురించి, ఆర్యుల పవిత్ర చిహ్నం స్వస్తిక గురించి, జెర్మన్–సంస్కృత భాషల మధ్య పోలిక గురించి, అధర్వణ వేదం యొక్క ప్రతి ఒకటి జెర్మనీలో ఉందనే మన నమ్మకం గురించీ – ఇలా

ఎన్నో విషయాలు మాట్లాడుకునే వాళ్ళం. ఆఖరికి తునిలో మా ఇంట్లో ఉన్న కోడిగుడ్డు దీపం జెర్మనీలో తయారైనది కాబట్టే ఎన్నో రోజులు మన్నిందని జెర్మనీని పొగిడేను. రసాయన శాస్త్రంలో జెర్మనీ యొక్క అద్వితీయ స్థానాన్ని ప్రశంసించేను. ఈ సందర్భం లోనే తునిలో నీలిమందు కుండీల కథని చెప్పేను. జెర్మనీ యుద్ధంలో ఓడిపోయినంత మాత్రాన జెర్మనీకి ప్రపంచంలో ఉన్న ఔన్నత్యం ఏమాత్రం తగ్గదని చెప్పేను. నాజీ పార్టీ గురించి కాని, హిట్లరు యూదుల యెడల చేసిన దురాగతాలని కాని ఎప్పుడు ప్రస్తావన లోకి రానియ్య లేదు.

క్రమేపీ రూడాల్ఫ్ నాతో మాట్లాడటానికే, నేను లంచి తినే వేళకి, కేఫిటేరియాకి వచ్చేవాడు. నా గురించి తల్లిదండ్రులతో చెబితే వారు నన్ను ఒక రోజున లంచికి పిలచేరు. రూడాల్ఫ్ తల్లి నన్ను ఎంతో అభిమానంతో చూసేది. నన్ను ఎన్నో సార్లు వాళ్ళింటికి భోజనానికి పిలచేది. భోజనం కంటె ముఖ్యంగా నాకు కావలసినది మరొకరి సహవాసం. రూడాల్ఫ్ తల్లిదండ్రుల దృష్టిలో నేను బాగా చదువుకునే బుద్ధిమంతుడనైన విద్యార్థిని. నా సహవాసం వల్ల ఒక్కగానొక్క బిడ్డ అయిన రూడాల్ఫ్ కి మంచే జరుగుతుందని వారి విశ్వాసం. ఇది నా అభిప్రాయం కాదు, వారు చెప్పినదే.

రూడాల్ఫ్ తండ్రి అక్కడ ఉన్న ఒక కారుల కంపెనీలో ఇండస్ట్రియల్ ఆర్టిస్ట్. ఇతని పని కొత్త కొత్త కారుల ఆకారాలని ఉహించి బొమ్మలు గియ్యటం. కట్టుబట్టలతో అమెరికా వచ్చినప్పుడు చాల ఇబ్బందులు పడ్డారుట. రోడ్డు పక్క, డిపార్ట్‌మెంట్  స్టోరుల ఎదట, పేవ్‌మేంటు మీద కూర్చుని బొమ్మలు గీసి అమ్ముకుని బతికేడట కొన్నాళ్ళపాటు.

రూడాల్ఫ్ బర్మింగ్‌హాం లో 1220 బర్డ్ అవెన్యు మీద ఉండేవాడు. ఈ ఊరు ఉడ్‌వర్డ్ ఎవెన్యు, ఫోర్టీన్ మైల్ రోడ్డు మొగలో ఉంది. డిట్రోయిట్ డౌన్‌టౌన్ (అంటే ఊరు మధ్య ఉండే పెద్ద బజారు లాంటిది) నుండి బయలుదేరి దూరం వెళుతూన్న కొద్దీ నల్లవాళ్ళ జనాభా తగ్గి, తెల్ల వాళ్ళ జనాభా పెరుగుతుంది. సిక్స్ మైల్ రోడ్డు దగ్గర ఉన్న మా యూనివర్శిటీ దగ్గరకి వచ్చేసరికే నల్లవాళ్ళ జనాభా తగ్గి తెల్ల ముఖాలు ఎక్కువగా కనిపించేవి. రోయల్ ఓక్ దగ్గరకి వెళ్ళేసరికి బాగా తెల్లబడేది. అటు పైన ఫోర్టీన్ మైల్ రోడ్డు దగ్గర ఉన్న బర్మింగ్‌హాం, బ్లూంఫీల్డ్ హిల్స్ రెండూ సామంతుల శివార్లు. ఇక్కడ నల్ల ముఖాలు

కనిపించేవి కాదు. అందుకని వీటిని 'లిల్లీ హ్వైట్' శివార్లు అనేవారు. కార్ల కంపెనీలలో పెద్ద పెద్ద ఉద్యోగస్తులు ఇక్కడ ఉండే వారు. బర్మింగ్‌హాం కంటె బ్లూంఫీల్డ్ హిల్స్ మరొక మెట్టు పైన. ఈనాటికీ బ్లూంఫీల్డ్ హిల్స్ సామంతుల శివార్లలోకే వస్తుంది. అప్పటికీ ఇప్పటికీ తేడా ఏమిటంటే ఇప్పుడు ఇక్కడ ఉన్న వారిలో చాల మంది భారతీయులే. దీనినే "ద బ్రౌనింగ్ అఫ్ ద బ్లూంఫీల్డ్ హిల్స్" అని అనొచ్చు.

డిట్రాయిట్ లో మొదటి ఏడు పూర్తి కావస్తోంది. వేసవి శలవలలో ఉద్యోగం అంటూ ఏదీ లేదు. ఎక్కడికైనా వెళ్ళి దేశం చూస్తే బాగానే ఉంటుంది కాని, ఎక్కడికి వెళ్ళటం? అప్పటికి అన్నయ్య పి. హెచ్. డి. అయిపోయి ఇండియా వెళ్ళిపోతాడు. ఈ సందర్భంలో రూడాల్ఫ్ కేంపింగ్ కి వెళ్ళాలని తల్లిదండ్రుల అనుమతి అడుగుతున్నాడు. వాళ్ళు ఇతన్ని ఒక్కడినీ పంపటానికి జంకుతున్నారు. రూడాల్ఫ్ తో నేను పెద్ద దిక్కులా సాయం వెళితే ఒప్పుకుంటామన్నారు. మా ఇద్దరికీ అయే ఖర్చులన్నీ వారే పెట్టుకుంటామన్నారు. ఇంకేమి, రొట్టె విరిగి నేతిలో పడిందన్న మాటే కదా! సరే అన్నాను.

రూడాల్ఫ్ దగ్గర కేంపింగ్ సామగ్రి అంతా ఉంది. వాళ్ళమ్మ తినుభండారాలన్నీ మూటలు కట్టి ఇచ్చింది. ఒక ఎజెండా అంటూ ఏదీ లేకుండా డిట్రాయిట్ నుండి ఈస్ట్ లేన్సింగ్, అక్కడ నుండి మస్కిగన్ వెళ్ళేం. మేకినా బ్రిడ్జి వరకు వెళితే బాగుండునని నాకు ఉంది కాని, రూడాల్ఫ్ కి ఎక్కడకి వెళ్ళాలని ఉంటే అక్కడికే వెళ్ళేం. దారిలో ఆగటం, అక్కడ టెంటు వేసుకుని రోజో రెండు రోజులో ఉండటం, మరొక చోటికి వెళ్ళటం; మన దేశంలో మందులాళ్ళల్లా. మస్కిగన్ లో లేక్ మిషిగన్ ఒడ్డున డేరా వేసి రెండు రోజులు ఆ బీచిలో గడిపిన తర్వాత, మా కారుని ఒక స్టీమర్ మీదకి ఎక్కించి, సరస్సు దాటి మిల్వాకీ వెళ్ళేం. అక్కడ ఊరు మధ్య ఉన్న వై. ఎం. సి. ఎ. లో దిగేం. ఈ వై. ఎం. సి. ఎ. చాల అధునాతనంగా ఉంది. అద్దె ఏడు డాలర్లు. అక్కడ నుండి మేడిసన్, షికాగో చూసుకుని ఇంటికి వెళ్ళిపోదామని ప్రయత్నం. కాని మిల్వాకీలో రూడాల్ఫ్ కి విపరీతంగా హే ఫీవర్ వచ్చింది. హే ఫీవర్ అంటే గాలిలో ఉన్న పుప్పొడి పడకపోతే ముక్కంట, కళ్ళంట నీళ్ళు కారటం, తుమ్ములు, దురద మొదలైన లక్షణాలు వస్తాయి; సాధారంగా దీనివల్ల ప్రమాదం ఏమీ ఉండదు. అయినా సరే ఈ విషయం తల్లిదండ్రులకి టెలిఫోను చేసి చెబితే వాళ్ళు అంతకంటె విపరీతంగా కంగారు పడిపోయి, రూడాల్ఫ్ ని విమానంలో

ఇంటికి రప్పించేసుకున్నారు. నాకు డ్రైవింగు రాదు. కనుక అక్కడ నట్టడిపోయిన కారుని డిట్రాయిట్ పంపటానికి మరొక డ్రైవరుని కిరాయికి కుదుర్చుకోవలసి వచ్చింది.

నేను ఒక్కడినీ మిల్వాకీలో ఉండి పోయేను. అప్పుడు చెరుకూరి రమాదేవి గారిని పిలచి (ఎవరింటికైనా వెళ్లాలని ఉంటే గృహస్తు అనుమతి కంటె గృహిణి అనుమతి ముఖ్యం అన్న ధర్మ సూక్ష్మం ఎప్పుడో నేర్చుకున్నాను!) అక్కడ నుండి బస్సులో వారింటికి వెళ్ళి, అక్కడ ఒక వారం రోజులు ఉన్నాను. ఆమె విజయవాడ వాస్తవ్యులు జంధ్యాల వారి అమ్మాయనీ, ఒక పేరు పడ్డ రచయిత అనీ, ఆమె రాసిన బాంధవ్య బంధితులు అనే నవలకి పోటీలో ప్రథమ బహుమతి కూడ వచ్చిందనీ అప్పుడు తెలిసింది.

## పాత జ్ఞాపకాలు వెంటతరుముతూ ఉంటే...

హోం సిక్‌నెస్ రాడానికి ఇండియా వదలి అమెరికా రానక్కరలేదు. ఒక ఊరు నుండి బదిలీ అయి మరొక ఊరు వెళ్లినప్పుడు కూడా పాత ఊరు జ్ఞాపకాలు మనస్సులో అలా మెదులుతూనే ఉంటాయి. నేను పుట్టినప్పటికి నాన్న గారు పిఠాపురంలో ఉద్యోగం చేస్తూ ఉండేవారు. నాకు రెండేళ్ళప్పుడు బదిలీ మీద తుని వచ్చేసేరు. కనుక నా చిన్నతనంలో, మా ఇంట్లో, పిఠాపురం కబుర్లు తెగ వినేవాడిని. మా వాళ్లకి పిఠాపురం మీద మమకారం తగ్గి తుని మీద దృష్టి మరల్చడానికి ఒక దశాబ్దం పట్టింది! నా మనస్సు మా ఇంటివైపు మళ్ళినప్పుడల్లా నాకు నా స్వానుభవంలో ఉన్న తుని కబుర్లు కంటె అమ్మా, నాన్నగారు, అన్నయ్యలు చెప్పుకునే పిఠాపురం కబుర్లే జ్ఞాపకానికి వచ్చేవి.

**పిఠాపురం**

పిఠాపురాన్ని పూర్వం పీఠికాపురం అనేవారు. ఈ ఊరుకి అధిపతి పీఠాంబ. ఈ పీఠాంబ విగ్రహం ఒకటి – ఒక చేతిలో బంగారు పాత్ర, వేరొక చేత బాగుగా పండిన ఉసిరి కాయ, మూడవ చేత త్రిశూలం, నాల్గవ చేత లోహ దండం ధరించి – నేటి పిఠాపురానికి సమీపంలో, నాలుగు వీధులు కలిసే కూడలిలో ఉండేదిట. ఈ విషయాన్ని శ్రీనాధుడు భీమేశ్వర పురాణంలో ఈ కింది విధంగా చెబుతాడు.

"హాటక పాన పాత్రయును నారగ బండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొంగి ధరియించి పురోపకంఠశృం
గాటక భూమి భాగమున గాపురముండెది పీఠికాంబకుం
గైటభదైత్యవైరిప్రియ కాంతకు మ్రొక్కె నతండు భక్తితోన్"

పిఠాపురానికి ఉత్తర దిక్కున ఏలేరు అనే ఏరు ఒకటి ఉంది. ఈ ఏలేరుని "జగతి నెక్కడివేలేటి సాటి నదులు" అంటాడు శ్రీనాధుడు. అలా అనేసి ఊరుకోకుండా,

"ఏలేటి విరినీట నిరుగారునుంబండు

ప్రాసంగు వరిచేలు పసిడిచాయ"

అని చెబుతూ పిఠాపురం ప్రాంతం సస్యశ్యామలంగా ఉండేదని అప్పటి ఫల వృక్షాలనీ, పిండివంటలనీ శ్రీనాధుడు వర్ణించేడు. ఒక్క వేరు పనస చెట్లు, పోక తోటలు ఇప్పుడు కనిపించటం లేదేమో కానీ, మిగిలినవన్నీ ఇప్పటికీ ఉన్నాయి. పిఠాపురం వరకు వచ్చిన శ్రీనాధుడు కళింగ దేశం వరకూ పర్యటించినట్లు ఆధారాలున్నాయి. సింహాచలం వరాహ నృసింహస్వామి ఆలయాన్ని దర్శించిన ఆధారాలూ ఉన్నాయి. కాని, పక్కనే ఉన్న అన్నవరం సత్యనారాయణ స్వామి దర్శనానికి వెళ్ళిన దాఖలాలు నాకు కనిపించ లేదు. ఆ రోజులలో అన్నవరం కొండ అంత ప్రాచుర్యంలో లేదేమో. అప్పటి వరకు ఎందుకు? ఇప్పట్లో ఉన్న ప్రాచుర్యం నా చిన్నతనంలోనే లేదు. భక్తులు పాపం పెరిగినట్లు పెరిగి పోతున్నారు – ఇక్కడ అన్నవరం లోనూ, అక్కడ తిరుపతి లోనూ.

ఏలేరు సంగతి మాట్లాడుతూ దారి తప్పేం. ఈ ఏలేరు ఉప్పాడ దగ్గర సముద్రంలో కలుస్తుంది. అన్నవరం దగ్గర ఉన్న పంపా నది కూడ సాగర సంగమం చెందే ముందు ఈ ఏలేటి నీటితో పొన్నాడ దగ్గర కలుస్తుందని చిలుకూరి పాపయ్య శాస్త్రి "శ్రీనాధ కృతి సమీక్ష" అనే పుస్తకంలో రాసేరు. ఒడ్డె రాజులతో వైరం పూనిన విజయనగరం గజపతులు ఈ నదుల సాగర సంగమ స్థానాన్ని పూరీ జగన్నాథంతో సమానమైన దివ్య క్షేత్రంగా రూపొందిద్దామని జగన్నాథ స్వామి, బలభద్ర స్వామి, సుభద్రా దేవి విగ్రహాలని ప్రతిష్ట చేసేరుట. ఈ జగన్నాథ స్వామి చేతులు ఇటీవల మొండి అగుటచే ఈ స్వామిని "మొండి జగ్గప్ప" అని ప్రాంతీయులు పిలుస్తారుట.

**ఉప్పాడ**

పిఠాపురం దగ్గర ఉన్న ఉప్పాడ మా ఇంట్లో పిల్లల ఆటపాటలలో ఎలా స్థిరపడి పోయిందో చెబుతాను. మా ఇంట్లో చంటి పిల్లల చేత "గుమ్మాడమ్మా గుమ్మాడు" అనే ఆట ఆడించేవారు. పెద్దవాళ్ళు మంచం మీద వెల్లకిల్లా పడుక్కుని, ముడిచిన కాళ్ళ మీద చంటి పిల్లడిని పడుక్కోబెట్టి, ఆ కాళ్ళని ముందుకీ వెనక్కీ నెమ్మదిగా ఆడిస్తూ ఈ కింది పాట పాడేవారు –

"గుమ్మాడమ్మా గుమ్మాడు
పళ్ళు పండింది గుమ్మాడు
కాయల్లు కాసింది గుమ్మాడు...
సపోటా చెట్టుకి  నీళ్ళు పోసేవా?"

ఈ సందర్భంలో పిల్లడు (పిల్ల) "పోసేను" అంటాడు, లేదా "ఔను" అన్నట్లు తల ఆడిస్తాడు.

"అయితే, సపోటా పళ్ళన్నీ నావి, పిక్కలన్నీ నీవి!

అరటి చెట్టుకి నీళ్ళు పోసేవా?"

మళ్ళా ఈ సందర్భంలో పిల్లడు (పిల్ల) "పోసేను" అన్నట్లు తల ఆడిస్తాడు.

"అయితే, అరటి పళ్ళన్నీ నావి, తొక్కలన్నీ నీవి!

కొబ్బరి చెట్టుకి నీళ్ళు పోసేవా?"

మళ్ళా పిల్లడు "పోసేను" అన్నట్లు తల ఆడిస్తాడు.

"కొబ్బరి కాయలు నావి, డిప్పలు నీవి!"

ఈ విధంగా ఓపిక ఉన్నంత సేపు పిల్లడిని ముందుకీ వెనక్కీ ఆడించి, ఆఖరున

"ఉప్పాడెళ్ళిందేనుగు, ఉప్పునీళ్ళు తాగిందేనుగు
మాఊరొచ్చిందేనుగు, మంచినీళ్ళు తాగిందేనుగు," అని పాడి,

"ఉప్పాడెళ్ళేవా?"
"..."
"ఉప్పునీళ్ళు తాగేవా?"
"..."
"మావూరొచ్చేవా?"
"..."
"మంచినీళ్ళు తాగేవా?"

అన్న ప్రశ్నలు వేసేవాళ్ళం. ఈ ప్రశ్నలకి పిల్లాడు సమాధంగా తలాడించడమో, "వెళ్ళేను, వెళ్ళలేదు" అని చెప్పడమో జరుగుతుంది.

అప్పుడు మోకాళ్ళు రెండూ పైకెత్తి, పిల్లడిని తలకిందులు చేసి, "ఏతాం కిర్రు" అనే వారు. పిల్లలకి ఈ "ఏతాం కిర్రు" భాగం బాగా నచ్చేది. మా అమ్మాయి సీత చంటితనంలో ఆట మొదట్లోనే "ఏతాం కిర్రు" కావాలని అల్లరి పెట్టేసేది!

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే ఈ పాటలో, ఉప్పాడ" అన్నది పిఠాపురంలో ఉన్నప్పుడు నప్పింది కాని తుని దగ్గర సముద్రం పెంటకోటలో ఉంది. పై పాటలో ఉప్పాడకి బదులు పెంటకోట పెడితే ప్రాస కుదరదు కదా!

## పాదగయ

పిఠాపురంలో మా అద్దె ఇంటికి దగ్గరలో కుంతీమాధవ స్వామి ఆలయం, మరి కొంచెం దూరంలో కుక్కుటేశ్వరుడి కోవెల ఉన్నాయి. వృత్తాసురుడిని చంపిన తర్వాత బ్రహ్మహత్యా పాతకం నుండి తప్పించుకుందికి ఇంద్రుడు ఐదు వైష్ణవాలయాలు స్థాపించేడుట. కాశీలో బిందు మాధవ స్వామి, ప్రయాగలో వేణుమాధవ స్వామి, పిఠాపురంలో కుంతిమాధవ స్వామి, తిరుచునాపల్లిలో సుందర

మాధవ స్వామి, రామేశ్వరంలో సేతు మాధవ స్వామి. శైవులూ, వైష్ణవులూ పోటాపోటీలుగా ఒకరు కుక్కుటేశ్వరుడునీ, మరొకరు కుంతిమాధవ స్వామినీ సమర్ధిస్తూ స్థల పురాణాలు అల్లేరేమోనని నాకు అనిపిస్తుంది. మేము వీరశైవులం కాదు కనుక ఇంటికి దగ్గరగా ఉన్న మాధవుడి గుడికి వెళ్ళడానికి ఎవ్వరికీ అభ్యంతరం ఉండేది కాదు. దేవుడి మీద అభిమానం మాట దేవుడెరుగు కానీ మాధవుడి గుడిలో ప్రసాదం పేరిట పెట్టే పులిహోర, దద్ధ్యోదనం, చక్కెర పొంగలి మీద చిన్నన్నయ్యకీ, చిట్టెన్నయ్యకీ ఎక్కువ మక్కువ ఉండేది. ఏదో అంగుటికి అందనంత చేతులలో రాల్చడం కాదు; గుడిలో ఇచ్చిన ప్రసాదంతో వీళ్ల పొట్టలు నిండి పోయేవిట. మేము తుని వచ్చిన తర్వాత చాల ఏళ్ళ పాటు ఆ ప్రసాదం ఎంత బాగుండేదో చెప్పుకుంటు లొట్టలు వేసేవారు అన్నయ్యలిద్దరూ.
ఈ కుక్కుటేశ్వరుడి ఆలయ ప్రాంగణం లోనే కాలభైరవుడి విగ్రహం "వ్రీడావిహీనజఘనమై" చూసేవారికి సిగ్గును కలిగించేదిగా ఉందిట. నేను చూడ లేదు. వ్రీడావిహీనజఘనంగా వీధులలో తిరిగే కుర్ర కుంకలు కొల్లలుగా ఉన్న మన దేశంలో సిగ్గు పడవలసిన అవసరం ఏముంది?

కుక్కుటేశ్వరుడి గుడికి ఎదురుగా ఒక తటాకం ఉంది. దానిని "పాదగయ" అంటారు. ఈ పాదగయకి ఆ పేరు ఎలా వచ్చిందో వివరిస్తూ రెండు కథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. గంగా తీరమున ఉన్న గయ "గయా శీర్షం" అనీ, పిఠాపురంలో ఉన్నది "పాదగయ" అనీ ఒక సిద్ధాంతం. అందుకనే పాదగయలో స్నానం చేస్తే గంగలో చేసినంత ఫలితం అని ఒక నమ్మకం ఉంది. "గయ" అంటే జ్ఞాపకం వస్తోంది. మన అదృష్టం కొద్దీ పాదగయలో పిండాలు వదలమని ఎవ్వరూ చెప్పలేదు కనుక సరిపోయింది కానీ, లేకపోతే ఇది కూడా కాకినాడలో పిండాల చెరువులా తయారయి, కొనసకి దీనికి కూడ పిండాల చెరువుకి పట్టిన గతే పట్టి ఉండేది.(కాకినాడ సూర్యారావుపేటలో ఉన్న పిండాల చెరువుని కప్పేసేరుట!)

గయుడు అనే రాక్షసుడి పాదాలు అక్కడ ఉన్నాయి కనుక ఇది పాదగయ అయిందని మరొక వదంతి. గయుడి పాదాల ప్రస్తావన వచ్చింది కనుక అతగాడి బుర్ర సంగతి కూడ చెబుతాను. ఈ కథ ఏ పురాణంలో ఉందో తెలియదు. ఈ గయుడికీ గయోపాఖ్యానానికీ మధ్య ఏదైనా సంబంధం ఉందో లేదో కూడ తెలియదు. ఈ గయుడిని ఎవ్వరు చంపేరో అస్సలు తెలియదు. ఏది ఏమైతేనేమి, చచ్చిన శవం యొక్క బుర్ర సింహాచలం దగ్గర, పాదాలు పిఠాపురం దగ్గర పడ్డాయిట. అందుకని సింహాచలం నుండి

పిఠాపురం వరకు ఉన్న ప్రదేశం పాపభూమి అనేవారు నాన్నగారు. పాపభూమి కాబట్టే ఈ మధ్య ప్రదేశంలో పుణ్య క్షేత్రాలు లేవుట. "అన్నవరం ఉందే" అని కొందరు అనవచ్చు. ఈ కథాకాలం నాటికి అన్నవరంలో సత్యనారాయణ స్వామి ఆలయం లేదేమో; ఉండుంటే శ్రీనాథుడు ఎక్కడో ఒక చోట ప్రస్తావించి ఉండేవాడే!

మామ్మ వీలయినప్పుడల్లా ఉదయం పాదగయలో స్నానం చేసి, కుక్కుటేశ్వరుడి దర్శనం చేసుకు వచ్చేదిట. ఒక సారి మా చిన్నన్నయ్యని కూడా వెంట తీసుకెళ్ళిందిట. అప్పటికి చిన్నన్నయ్యకి పది, పన్నెండు ఏళ్ళకి మించి ఉండవు. అన్నయ్యని పాదగయ మెట్ల మీద కూర్చోబెట్టి, తను స్నానం చెయ్యడానికి నీళ్ళల్లోకి దిగిందిట. ఒక్క క్షణం కను మరుగయ్యే సరికల్లా చిన్నన్నయ్య కుదురుగా కూర్చోకుండా నీళ్ళల్లోకి దిగబోయి పాదగయలో పడి పోయాడుట. ఈ సంగతి నీళ్ళల్లో ఉన్న మామ్మకి తెలియదు గాని గట్టు మీద ఉన్న మరొక మామ్మ గారు చూసి వాడిని పట్టుకోబోయారుట. పావంచాలమీద కాలు జారి ఆవిడ కూడ నీళ్ళల్లో పడ్డారుట. ఇద్దరూ ఇలా నీటి పాలు అయేసరికి మిగిలినవాళ్ళంతా మొర్రో మొర్రొ అని గోల పెట్టడం మొదలు పెట్టేరుట. అక్కడ గట్టుమీద ఉన్నవాళ్ళెవరికీ ఈత రాదు!

అదే సమయంలో అక్కడ మంద కృష్ణమూర్తి  తమ్ముడు మంద ప్రకాశం  అప్పుడే పాదగయలో స్నానం పూర్తి చేసుకుని దేవాలయంలోకి వెళ్ళబోతూ వెనకనుండి వచ్చిన కేకలు విని వెనక్కి పరుగెత్తుకు వచ్చి, ఒక్క ఉదుటున పాదగయలో దూకేరుట. దూకీ దూకగానే పిల్లాడి చెయ్యి తగిలిందిట. పిల్లాడిని బయటకి లాగి ములిగిపోతూన్న మామ్మ గారిని వెతకి ఆవిడనీ గట్టు మీద పడేసేరుట. తర్వాత వీళ్ళూ వాళ్ళూ అనుకుంటూ ఉంటే తెలిసింది. పంతులు గారు దేవాలయం లోపలికి వెళ్ళిన తర్వాత హరి మీద గిరి పడ్డా, గిరి మీద హరి పడ్డా, దేవతార్చన పూర్తి అయేదాక మరి బయటకు రారుట. అది ఆయన నియమం. అదృష్టం కలసి రాబట్టి ఆయన అప్పటికి ఇంకా దేవాలయం లోపలికి వెళ్ళలేదు కనుక ప్రమాదం – మా చిన్నక్క మాటల్లో చెప్పాలంటే – చుక్కలో తప్పిపోయింది!

అదే సమయంలో నాన్నగారు వీధి అరుగు మీద కూర్చుని చిన్నన్నయ్య జాతకం చూస్తున్నారుట. చూసి, అమ్మని పిలచి, "ఓవిడా! చూడు, మన విశ్వేశం జాతకంలో జలగండం ఉంది. వాడిని నీళ్ళ దగ్గరకు వెళ్ళనీయకు సుమీ" అని చెప్పేరుట. మా నాన్నగారి జాతకాల మీద అమ్మకి పెద్ద గురి లేదు. అందుకని అమ్మ సమాధానంగా ఏమందో మనం తెలుసుకోడానికి ప్రయత్నించడం విజ్ఞత అనిపించుకోదు.

కొద్ది సేపటిలో మామ్మ పిల్లడిని వెంటేసుకుని ఇంటికి రానే వచ్చింది. "నాయనా నీ పిల్లడిని నిష్కారణంగా చంపేసినంత పని చేసేనురా" అని మొర్రోమందిట.

వరాహమిహురుడు రాజుకి జాతకం చెప్పి వరాహమిహురుడు అనే బిరుదుని ఎలా పొందేడో అలాగే అప్పటి నుండి నాన్నగారి జ్యోతిష ప్రకర్ష మీద క్రమేపీ అమ్మకి కూడ కొంచెం నమ్మకం కుదరడం మొదలైంది.

### ట్రంక్ మర్డర్ కేసు

నాన్నగారి జ్యోతిష ప్రకర్షని గురించి చిన్నన్నయ్య మరొక ఉదంతం చెప్పేడు. పిఠాపురం రాజా వారు ఒక నాడు వారి ఆస్థాన జ్యోతిష్కుడిని పిలచి, కాలక్షేపానికి, రెండు ప్రశ్నలు వేసి సమాధానం చెప్పమని అడిగేరుట. ఒక ప్రశ్న భూతకాలానికి సంబంధించినది, రెండవది భవిష్యత్తులో జరగబోయేది. రాజుగారి భార్య వారి కుమార్తెని ఎక్కడ ప్రసవించిందో ఆ సూతికా గృహాన్ని వర్ణించమన్నది మొదటి ప్రశ్న. యుక్తవయస్సులోనికి ప్రవేశిస్తూన్న ఆ అమ్మాయి ఎవరిని వివాహమాడుతుందో అన్నది రెండవ ప్రశ్న. మొదటి ప్రశ్నకి సమాధానం రాజు గారి ఆంతరంగిక వర్గానికి తప్ప తదితరులకి తెలియదు. ఈ మొదటి ప్రశ్నకి ఎవరైతే సరైన సమాధానం చెబుతారో వారే రెండవ ప్రశ్నకి కూడ సరైన సమాధానం చెప్పగలరని రాజు గారి నమ్మిక.

ఆస్థాన జ్యోతిష్కుడికి ఈ రెండు ప్రశ్నలు కొరకబడని కొయ్యలయాయి. అప్పుడు ఆయన నాన్న గారిని సంప్రదించడానికి వచ్చేడుట. ప్రశ్న అడిగిన సమయాన్ని బట్టీ, రాజు గారు ఇచ్చిన మిగిలిన

దత్తాంశాలని బట్టీ నాన్నగారులెక్కలు కట్టి, "శిధిలమౌతూన్న ఆవరణలో, అంధకార బంధురమైర నిశీధిలో, ఏకాతంగా రాణీవారు ప్రసవించేరు" అని నాన్నగారు చెప్పేరుట. రాజు గారి కుమార్తె తల్లిదండ్రుల కోరికకి వ్యతిరిక్తంగా, మరొక కులం వాడిని వివాహమాడుతుందని రెండవ ప్రశ్నకి జోస్యం చెప్పేరుట.

ఆస్థాన జ్యోతిష్కుడు నాన్న గారు చెప్పిన విషయాన్నే తన మాటగా రాజు గారికి చెప్పేడుట. అప్పుడు రాజు గారి ఆశ్చర్యానికి అవధులు లేవుట. రాణీ వారు ఒక నాడు సాయంకాలం, సంధ్యా సమయంలో, తోటలో తిరగడానికి వెళ్ళేరుట. చీకటి పడ్డ తర్వాత, అకస్మాత్తుగా ఆమెకి నొప్పులు ప్రారంభం అయేయిట. అదే సమయంలో కాకతాళీయంగా విద్యుచ్ఛక్తి పోవడంతో తోటంతా చీకటి కమ్ముకుందిట. ఆ హడావుడిలో వైద్యుడి కొరకు కబురు పెట్టడానికి కాని, రాణి వారిని లోగిలి లోనికి తీసుకు వెళ్ళడానికి కాని సానుకూలపడక, తోడ ఉన్న పరిచారిక రాణి గారిని దగ్గరలో ఉన్న ఒక పాడు పడ్డ గుర్రాలసాలలో గడ్డి పరుపు వేసి, అక్కడ పడుకోబెట్టి వైద్య సహాయం కోసం పరుగెత్తిందిట. అప్పుడు రాణి వారు, ఆ చీకట్లో, ఆ శిధిలమైన గుర్రాల సాలలో, ఏకాంతంగా ఉన్న సమయంలో కుమార్తెని ప్రసవించేరుట.

ఈ కథకీ ఆ రోజుల్లో జరిగిన ట్రంక్ మర్డర్ కేసుకీ లంకె ఉంది కాని, అది ఇప్పుడు అప్రస్తుతం. ఈ కేసులో పిఠాపురం రాజా వారి తాలూకు వారు ఇరుక్కున్నారని అంటారు. అందుకని ఆ రోజులలో ఇది బాగా పేరు పడ్డ కేసు. రాజా వారికి కోపం వస్తే ఎక్కడ ఏమి ముప్పు వస్తుందో అని బయటకి మాట్లాడడానికి భయం! త్రికోణ ప్రేమాయణంలో చిక్కుకున్న బట్టలు కుట్టే దర్జీని ఖూనీ చేసేసి, ముక్కలు ముక్కలుగా కోసేసి, ట్రంకు పెట్టెలో పెట్టేసి, ఆ పెట్టెని రైలుబండి లో ఎక్కించేసేరు. దరిమిలా రైలు బరంపురం చేరుకునేసరికి ఆ పెట్టె కంపు కొట్టడం, పోలీసులు దానిని అక్కడ దించడం జరిగింది. శవం బరంపురంలో పట్టుబడింది కనుక కేసు అక్కడ నమోదయింది. ఆ కేసుకి సంబంధించిన ఆస్తుల పంపకాల రాతకోతల కాగితాలు నాన్నగారు పిఠాపురం సబ్ రిజిస్ట్రారు కచేరీ నుండి బరంపురం కోర్టుకి పట్టుకు వెళ్ళి అక్కడ సాక్ష్యం చెప్పవలసి వచ్చింది. ఈయనకి ప్రభుత్వం వారు పోలిసు ఎస్కార్టు ఇచ్చి మరీ పంపేరు. ఈ కథనం నాన్నగారు చెబుతూ ఉంటే చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళంతా వచ్చి వాకట్లో

కూర్చుని వినేవారు. ఇంకా వివరాలు కావలసినవారు నా బ్లాగు https://wordpress.com/posts/vizagwallah.wordpress.com (chapter 4c) చూడండి.

**ఇతర సంఘటనలు**

నాన్నగారు పిఠాపురంలో కనీసం ఎనిమిదేళ్ళు ఉద్యోగం చేసి ఉంటారు. ఆ రోజులలో వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస, తర్క వ్యాకరణ సిద్ధాంతి బిరుదాంకితులు), లేళ్ళపల్లి సత్యనారాయణ, ఓలేటి పార్వతీశం (వేంకట పార్వతీశ్వర కవులలో ఒకరు), నడకుదుటి వీర్రాజు, ఉమర్ ఆలీషా (తెలుగు పండితులు), మొదలైన వారు నాన్న గారి దగ్గర స్నేహితులలో కొందరు. పానుగంటి లక్ష్మీ నరసింహం (సాక్షి) కూడ నాన్న గారి పరిచయస్తులే కాని వారిద్దరి మధ్య ఎంత సాన్నిహిత్యం ఉందో తెలియదన్నాడు చిన్నన్నయ్య. కాని పక్కింట్లో ఉన్న నేదునూరి కృష్ణ మూర్తి (సంగీత విద్వాంసులు) కి అప్పట్లొ ఏ పది పన్నెండు ఏళ్ళో ఉండేవని, తరచు మా ఇంటికి వచ్చి అమ్మని చనువుగా "అక్కయ్యా" అని పిలచే వాడనీ చిన్నన్నయ్య చెప్పేడు.

**లాటరీలో గెలుపు**

నాన్నగారు పిఠాపురంలో ఉద్యోగం చేస్తూన్న రోజులలో ఏదో ఒక లాటరీకి రూపాయి పెట్టి టికెట్టు కొన్నారుట. అప్పుడు ఆయన స్నేహితుడు ఎవరో అడిగేరుట – "లాటరీ వస్తే నాకేమిటిస్తావు?" అని. "వచ్చిన దాంట్లొ సగం ఇస్తానులే" అన్నారుట. ఏ ముహూర్తాన ఆ మాట అన్నారో ఆయనకి లక్ష రూపాయలు లాటరీ రానే వచ్చిందిట. మాట వరసకి అన్న మాటని నిజంగా నిలబెట్టుకునేవారు ఉంటారా? ఉంటారో ఉండరో తెలియదు కాని, నాన్నగారు లక్షలో సగం ఇచ్చెయ్యడానికి సిద్ధపడిపోయారుట. కాని ఈ ఇద్దరిలోనూ ఎవరి జాతకం వక్రించిందో కాని, ఆ నెలే ఆ లాటరీ కంపెనీ దివాలా తీసేసిందిట. లక్ష రూపాయిలు మా దగ్గర లేవు, రెండు వందలు మాత్రమే ఉన్నాయని నాన్నగారికి 200 రూపాయిలు పంపించేరుట – ఆ కంపెనీ వాళ్ళు. అందులో ఒక వంద నాన్నగారు

స్నేహితుడికి ఇచ్చేసేరుట! అమ్మ అనేది, "మన అదృష్టం కొద్దీ మనకి ఆ లాటరీలో లక్ష రాలేదు కనుక సరిపోయింది కానీ, వచ్చుంటే మీకెవరికీ చదువులు వచ్చి ఉండేవి కావు."

మళ్ళా అలాంటి లాటరీ వస్తుందేమోనని నాన్నగారు తునిలో ఎన్నాళ్ళో వారానికి ఒక రూపాయి చొప్పున ఆర్. ఎం. డి. సి. క్రాస్‌వర్డ్ పజిల్ నింపి పంపేవారు. నాకు బాగా జ్ఞాపకం. ఈ పజిల్ లో ప్రశ్న, ఒకే ఒక అక్షరం మినహా సమాధానం ఇచ్చేసేవారు. మినహాయించిన గడి స్థానంలో రెండే రెండు అక్షరాలు నప్పుతాయి. ఆ రెండింటిలో ఏ అక్షరం నింపినా అది సరి అయిన సమాధానం లాగే స్ఫురిస్తుంది. పజిల్ నిర్వాహకులు ఆ రెండు అక్షరాలూ కూడ ఇచ్చేసేవారు! మనం చెయ్య వలసిందల్లా ఆ రెండింటిలో ఒక అక్షరాన్ని ఎన్నుకోవాలి. ఇలాంటివి ఇరవై నిలువు ఆధారాలు, ఇరవై అడ్డు ఆధారాలు ఉండేవి. నింపడానికి సరదాగానే ఉండేది. ఇంటిల్లిపాదిమీ సహాయం చేసేవాళ్ళం. కాని, దాని తస్సాగొయ్యా, ఆ లాటరీలో ఎప్పుడు నెగ్గ లేదు. కాలేజీలో సంభావ్య సిద్ధాంతం చదువుకున్న తర్వాత తెలిసింది. ఇరవై అడ్డు ఆధారాలు, ఇరవై నిలువు ఆధారాలు ఉన్న ఆర్. ఎం. డి. సి. క్రాస్‌వర్డ్ పజిల్ గెలవడానికి సంభావ్యత ఒకటింట "2 ని 40 సార్లు వేసి గుణించగా వచ్చిన సంఖ్య" అంత! ఇంతకంటె కేలిఫోర్నియా లాటో గెలవడానికి సావకాశాలు ఎక్కువేమో.

పిఠాపురం గురించి ఇన్ని కబుర్లూ చెప్పి పిఠాపురం రాజా గారి గురించి మరికొంచెం చెప్పక పోతే బాగుండదు. ఈ ఊరుని వెలమ రాజులు పాలించే వారు. వీరు సాహిత్యాన్ని బాగా పోషించేరు. వింజమూరి సోమేశ (రాఘవపాడవీయం), వక్కలంక వీరభద్ర కవి (వాసవదత్తా పరిణయం), కూచిమంచి జగ్గ కవి, కూచిమంచి గంగన్న, దేవులపల్లి బాపన్న, పిండిప్రోలు లక్ష్మన్న, అల్లంరాజు సుబ్రహ్మణ్య కవి, దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి, దేవులపల్లి వెంకటకృష్ణ శాస్త్రి, రెండవ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి, ప్రభృతులు పిఠాపురం ఆస్థానంలోని వారే! కాకినాడ లోని పిఠాపురం రాజా వారి కళాశాల పూర్వపు రోజుల్లో పేరున్న కళాశాలే; దరిమిలా ఆ పేరు లోని జిగి తగ్గింది అనుకొండి.

# హోస్ట్ ఫేమిలీలు

విదేశీయ విద్యార్థులు విశ్వవిద్యాలయంలో చేరిన కొత్తలోనే మా 'ఫారిన్ స్టూడెంట్ ఆఫీసు' వారు ప్రతీ విద్యార్థికీ ఒక 'హోస్ట్ ఫేమిలీ' ని నియమించేరు. హోస్ట్ ఫేమిలీ అంటే ఆతిథ్యం ఇచ్చే కుటుంబం, లేదా అతిథేయ కుటుంబం. ఈ ఆతిథ్యం పుచ్చుకునేది విదేశాల నుండి వచ్చిన విద్యార్థులు. ఈ విద్యార్థులకి దేశం కొత్త, వాతావరణం కొత్త అవటం వలన ఎన్నో సమస్యలని ఎదుర్కొన వలసి వస్తుంది. ఆ సందర్భంలో వాళ్ళకి పెద్ద దిక్కంటూ ఎవ్వరైనా ఉంటే బాగుంటుందని ఈ పద్ధతి ప్రవేశ పెట్టేరు. ఆతిథ్యం అంటే మనని అప్పుడప్పుడు పిలచి మాట్లాడటం, సలహాలు ఇవ్వటం, వారింటికి పిలవటం, వారితో బజారులో దుకాణాలకి తీసుకెళ్ళటం, మొదలైన పనులు చెయ్యటం.

ఇలా విద్యార్థులకి ఆతిథ్యం ఇవ్వటానికి ఉత్సాహం, స్తోమత ఉన్న కుటుంబాలు తమ పేరుని యూనివర్సిటీలో నమోదు చేసుకుంటారు. ప్రతి ఏటా కొత్త విద్యార్థులు వచ్చినప్పుడు ఒకొక్క విద్యార్థిని ఒకొక్క కుటుంబానికి పరిచయం చేస్తారు. అటుపైన వీరిరువురి మధ్య స్నేహ సంబంధాలు సహజసిద్ధంగా అల్లుకుంటాయనే అందరి అభిమతమూను. ఈ ఏర్పాట్లన్నీ జరిగే సరికి అక్టోబరు వచ్చేస్తుంది. కనుక కొత్తగా వచ్చిన విద్యార్థులని ఈ కుటుంబాలు నవంబరులో వచ్చే `థేంక్స్‌గివింగ్' పండగకి తప్పక భోజనానికి ఆహ్వానిస్తారు.

`థేంక్స్‌గివింగ్'అమెరికాలోను, కెనడా లోను చాల పెద్ద పండగ; అమెరికాలో నవంబరు మూడవ లక్ష్మివారం చేసుకుంటారు. ఇది క్రైస్తవ మతానికి సంబంధించిన పండగ కాదు. కనుక అన్ని మతాల వారు చేసుకుంటారు. మొట్టమొదట ఇంగ్లండ్ నుండి 'మేఫ్లవరు' పడవలో అమెరికా వలస వచ్చిన 'పిల్ గ్రిం' లకి స్వాగతం చెబుతూ, అప్పటికే అమెరికాలో ఉన్న 'రెడ్ ఇండియన్' లు – వచ్చిన మనుష్యులు ఆషాడభూతులని తెలియక – టర్కీ కోళ్ళని, తియ్య దుంపలని, మొక్కజొన్న పొత్తులని, క్రేన్‌బెరి పళ్ళనీ పట్టుకొచ్చి ఇచ్చి స్వాగతం చెబుతారు. నెలల తరబడి సముద్రయానం చేసి సురక్షితంగా ఒడ్డు చేరుకున్నందుకు, భగవంతుడికి అభివందనాలు (థేంక్స్) చెబుతూ, ఈ భండారాలతో వంట వండుకొని, అందరు కలసి తింటారు. క్రమేపి అదే ఆచారంగా మారింది. మన వినాయక చవితికి

ఉండ్రాళ్ళు, పప్పొద్రి, పాలొద్రి, మొదలైనవి ఎంత ముఖ్యమో అలాగే అభివందనాల పండగ కి తప్పక ఉండవలసిన వంటకాలు: టర్కి, పాకం పట్టిన దుంపలు, జొన్న రొట్టె, తియ్య గుమ్మిడి పండుతో చేసిన హల్వా లాంటి వంటకం (దీనిని 'పంప్కిన్ పై' అంటారు. మొట్టమొదట ఈ పై ని అమెరికాలోనే చూసేను), క్రేన్‌బెరీలు (ఇవి చిరు పులుపుతో, ఎర్రగా, చిన్న రేగి పండు ఆకారంలో ఉంటాయి). అలనాడు ఇటువంటి విందు భోజనం 'ఇండియన్స్' తో పంచుకు తిన్నారు కనుక, ఈ నాడు – ఆ రెడ్ ఇండియన్ లని సమూలంగా నాశనం చేసేసేరు కనుక – బంధు మిత్రులని పిలచి వారితో పంచుకు తింటారు. నాలా ఒంటరి విదేశీ విద్యార్థులు ఎవ్వరైనా ఉంటే వారిని భోజనానికి పిలుస్తారు.

కనుక బ్లూంఫీల్డ్ హిల్స్ (మన హైదరాబాదులో బంజారా హిల్స్ లా ధనిక వర్గాలు ఉండే శివారు) లో ఒకరు నన్ను భోజనానికి పిలచేరు. (ఇప్పుడు ఈ బ్లూంఫీల్డ్ హిల్స్ నిండా మన భారతీయులే అని గతం లో ఒక సారి చెప్పేను కదా!)

నన్ను మా ఇంటి దగ్గర కారెక్కించుకుని తీసుకు రమ్మని ఆ ఇంటి వారు వారి అమ్మాయిని పంపేరు. ఆ అమ్మాయి పేరు సూజన్. అందానికే అసూయ పుట్టిస్తుందా అన్నట్లు ఈ అమ్మాయి కనిపించింది, ఆ వయస్సులో ఉన్న నా కంటికి. ఇరవై ఏళ్ళ లోపే. ఉదయం తొమ్మిదింటికి వచ్చి, నన్ను తన కారులో ఎక్కించుకుని, కొత్త అనుకోకుండా కలుపుగోలుగా పలకరించింది. కొండ చరియల్లో రాళ్ళ మీద పారుతున్న సెలయేరు చేసే శబ్దంలా ఉంది ఆమె గొంతుక.

ముందస్తుగా వాళ్ళ నాయనమ్మ గారున్న చోటుకి తీసుకెళ్ళింది. ఆ నాయనమ్మకి ఓ ఎనభై ఏళ్ళు ఉంటాయి. ఆమెని వృద్ధుల కొరకు తయారు చేసిన ఒక ప్రత్యేకమైన భవనంలో పెట్టేరు. అటువంటి వ్యవస్థ ని చూడటం నాకు అదే మొదటి సారి. ఆమెకి అయే ఖర్చులన్నీ సూజన్ తండ్రే భరిస్తాడుట. అలాటప్పుడు ఆమెని ఇంట్లోనే పెట్టుకోవచ్చు కదా; ఖర్చుకి ఖర్చూ తగ్గుతుంది, ముసలావిడకి ఇంట్లో మనవలతో కాలక్షేపమూ అవుతుంది కదా అన్నాను. వయస్సు మీరిన తర్వాత ముదితులు కొడుకుల తోటీ, కోడళ్ళ తోటీ ఉండే కంటె ఇలా విడిగా వారి తోటి వయస్కులతో ఉండటమే అన్ని విధాలా అందరికీ అనుకూలమని అమెరికాలో చెలామణీలో ఉన్న ఆచారమని చెప్పింది. అప్పట్లో నాకు సూజన్

చెప్పిన మాట, వారు చేస్తూన్న పని అంతగా నచ్చ లేదు. అవసరం తీరిపోగానే పెద్ద వాళ్ళని బందిలి దొడ్లో పశువుని పడేసినట్లు మనం మన దేశంలో ఒదిలేయగలమా అని మనస్సు చివుక్కు మంది. కాని అనవసరంగా వాదించే తత్వం కాదు నాది. అందుకని పైకి ఏమీ అనలేదు. ఈ మధ్య మన దేశంలో ఇదే పరిస్థితిని నేను కళ్ళారా చూసేను. మన దాకా వస్తే కాని తెలియదంటారు.

ఆ నాయనమ్మగారి ఇంటి పక్కనే ఉన్న ఉడ్‌వర్డ్ ఎవెన్యూ మీద పెద్ద 'పెరేడ్' జరగబోతోంది. ఇది ప్రతి ఏటా 'థేంక్స్‌గివింగ్' నాడు డిట్రాయిట్ లో ఆనవాయితీగా జరుగుతుందిట. ఆ మాటకొస్తే ఈ రకం పెరేడ్లు అమెరికాలో అవకాశం దొరికినప్పుడల్లా జరుపుతూనే ఉంటారు: కొలంబస్ డె పెరేడ్, మార్డీ గ్రా, సెయింట్ పేట్రిక్స్ డె పెరేడ్, రోజ్ పెరేడ్, ఇలా పిల్లి పెద్దమనిషైతే చాలు పెరేడు పెట్టెస్తారు. ఈ పెరేడ్ జరుగుతున్నంత సేపూ ఉడ్‌వర్డ్ ఎవెన్యూ మీద ఒక పక్కనున్న ఐదు లేనుల ట్రేఫిక్ నీ ఆపేసేరు. ఆ పెరేడ్ దగ్గరకి సూజన్ అన్నదమ్ముడు తన స్నేహితులతో మరో కారులో వచ్చేడు. మేమంతా ఆ చలిలో స్వెట్టర్లు, కోట్లు వేసుకుని, ఇంకా చలేస్తే దుప్పట్లు కప్పుకుని, ఇంకా వణుకు పుడితే ఒకళ్ళనొకళ్ళు వాటేసి పట్టుకుని, ఆ రోడ్డు పక్క నిలబడి గంటన్నర సేపు ఆ పెరేడ్ చూసేం.

ఉరమరగా అది మన గణతంత్ర దినోత్సవం (రిపబ్లిక్ డె) నాటి పెరేడ్ లా ఉంది. అడుగున ఉన్న శకటం కనబడకుండా పైన రకరకాల అలంకరణలు చెయ్యటం వల్ల గాలిలో తేలుతూన్నట్లు కనబడే 'ఫ్లోట్లు,' కవాతు చేస్తూన్నట్లు బారులు తీరి నడుస్తూన్న బేండు మేళాలు, ఇటు అటు ఉన్న ప్రేక్షకులలోని పిల్లలని కవ్వించి నవ్వించి గారడీలు చేసేవారు, విదూషకులు, ఇలా రకరకాల ఆకర్షణలతో విరాజిల్లిన అటువంటి పెరేడ్ ని చూడటం అదే నాకు మొదటి సారేమో, చలిని లక్ష్య పెట్టకుండా – సూజన్ అన్ని వివరించి చెబుతూ ఉంటే – చూసి ఆనందించేను. ఆ పెరేడ్ లో ఆఖరున ఒక ఫ్లోటు లో పెద్ద బొజ్జ, దాని మీద నిలవకుండా కిందకి జారిపోతూన్న ఎర్రటి బెల్టు, పొడుగాటి తెల్లటి గెడ్డం ఉన్న ఒక ఆసామీ కూర్చుని 'ఓ హో హో' అని అరుస్తున్నాడు. అతన్ని చూసి పిల్లలంతా కేరింతాలు కొడుతున్నారు. అతనిని 'శాంటాక్లాస్' అంటారుట. రాబోతూన్న క్రిస్‌మస్ కాలంలో ఈ ఆసామీ చాల ముఖ్యుడుట. ఈ పెరేడ్ అయిపోగానే అఫీషియల్ గా క్రిస్‌మస్ సీజను మొదలవుతుందిట. ఈ రోజు లగాయతు క్రిస్‌మస్ అయిపోయే వరకు ఉన్న నెల రోజులలోనూ అమెరికాలో ఒక ఏడాదిలో అయే అమ్మకాలలో తొంభై

శాతం జరుగుతాయిట. కనుక క్రిస్మస్ కి మతపరమైన ప్రాముఖ్యత కంటె వ్యాపార పరమైన ప్రాముఖ్యత ఎక్కువ.

పెరేడ్ అయిన తర్వాత మళ్ళా మామ్మ గారింటికి వెళ్ళి, ఆమెని కూడ మా కారులో ఎక్కించుకుని, బ్లూంఫీల్డ్ హిల్స్ లో ఉన్న వారింటికి వెళ్ళే సరికి మధ్యాహ్నం పన్నెండు అయింది.

సూజన్ నన్ను తల్లిదండ్రులకి పరిచయం చేసింది. వారింటి పేరు 'సేవేజ్' ట. సరిగ్గా విన్నానో లేదో అని మరొక సారి చెప్పమని అడిగేను. "నువ్వు సరిగ్గానే విన్నావు. మేము ఉత్త సేవేజెస్ మి మాత్రమే కాని 'కేనిబల్స్' మి మాత్రం కాదు" అన్నది ఆ గృహిణి నవ్వుతూ. (ఇంగ్లీషులో 'సేవేజ్" అంటే కౄరుడు, 'కేనిబల్' అంటే నరమాంసం తినేవాడు అని అర్థం!) సూజన్ తండ్రికి అక్కడ ఉన్న కార్ల కంపెనీలలో ఒక దాంట్లో ఏదో పెద్ద ఉద్యోగమే!

పరిచయాలు, పలకరింపులు అయిన తర్వాత ఒక ఏట్లస్ పట్టుకొచ్చి అందులో మా ఊరు ఎక్కడుందో చూపించమన్నారు. మర్యాదకి మా కుటుంబ విషయాలు అడిగేరు. "మీ ఆడవాళ్ళు నుదిటి మీద చుక్క ఎందుకు పెట్టుకుంటారు?" అన్న కుతూహలపు ప్రశ్న లగాయతు, "మీరు రోడ్ల మీద నడుస్తున్నప్పుడు కాళ్ళకి పాములు చుట్టుకుంటాయిట, నిజమేనా?" వంటి చొప్పదంటు ప్రశ్నల వరకు పుంఖాను పుంఖంగా వచ్చిన ప్రశ్నలని సవ్యసాచిలా ఎదుర్కుంటూ ఉండగా కొత్తదనమనే మంచు తెరలు విడి, స్నేహపు రస్మి ప్రసరించటం మొదలైంది.

మామూలు రోజులలో లంచి పన్నెండు గంటలకే అయినా, థేంక్స్గివింగ్ నాడు మాత్రం భోజనాలు మధ్యాహ్నం మూడు గంటలకి చేస్తారు. అంతవరకు ఆకలి వెయ్యకుండా నమలటానికి ఇంటి నిండా ఎవేవో చిరు తిళ్ళు ఉంటాయి. వీళ్ళు పెట్టే తిండి నేను ఎలాగూ తినలేను కనుక అమెరికన్ ఇళ్ళకి భోజనానికి వెళ్ళినప్పుడు మొహమాట పడకుండా మన తిండి నిబంధనలని వాళ్ళతో చెప్పమని అన్నయ చెప్పి అట్టేపెట్టేడు.

పెద్ద పండగ నాడు ఒబ్బట్ల కోసం నేను ఎలా ఎదురు చూసేవాడినో, వీళ్ళు టర్కీ కోసం అలా లొట్టలు వేసుకుంటూ ఎదురు చూస్తున్నారు. ఆ సందర్భంలో, "నువ్వు టర్కీ కోసం ఎదురు చూస్తున్నావా?" అని అడిగింది, సూజన్ తల్లి.

నేను టర్కీ తిననన్నాను. పండగ భోజనానికి వెళ్ళి, "నేను పిండి వంటలు తినను" అంటే ఎలాగుంటుందో అలా ఉందన్న మాట, నా మాట. వాళ్ళకి ఏమనాలో తెలియలేదు. వాళ్ళు భోజనానికి పిలచినప్పుడే నేను చెప్పేను, "అమ్మా, నేను మాంసం తినను" అని. వాళ్ళు నేను చెప్పిన మాటని వినిపించుకున్నారో లేదో, విన్నా టెలిఫోనులో వారికి నా యాస అర్థం కాలేదేమో, లేక మరచి పోయేరో. "నేను చెప్పేను కదా, విన లేదా?" అంటే మర్యాదగా ఉండదని ఏమీ అనలేదు.

మాంసం అంటే వీళ్ళ దృష్టిలో గొడ్డు మాంసం. కనుక, "నేను మాంసం తినను" అనగానే, "పోనీ, కోడి తింటావా?" అని అడిగేరు. కోడిని తినగలిగేవాడినైతే టర్కీనే తినుండేవాడిని కదా. "అబ్బే, ఏ రకమైన మాంసమూ తినను" అన్నాను.

"అయ్యో! అలాగా. పోనీ  నీ కోసం చేపలతో ఏదైనా చేసి పెట్టేదా?"

వీళ్ళతో ఇలా కాదని, "అమ్మా! నేను గొడ్డు మాంసం కాని, పంది మాంసం కాని, చేపలు కాని, కోడి కాని, టర్కి కాని – ఇలాంటి జంతువులని వేటినీ తినను" అన్నాను. ఈ జాబితా లో కుక్కలని కూడ చేర్చే వాడినే కాని, 'హాట్ డాగ్'  కారం గానూ ఉండదు, అందులో కుక్క మాంసమూ ఉండదని నాకు అప్పటికి తెలిసి పోయింది.

వాళ్ళకి మతి పోయింది. భోజనానికి పిలచిన తర్వాత తినటానికి నాకు ఏదైనా పెట్టాలి కదా!

వాళ్ళు చేసుకున్న సేలడ్ (అంటే ఆకులు, అలములు), స్వీట్ పొటేటోస్ (తియ్య దుంపలు), పంప్కిన్ పై (తియ్య గుమ్మిడి పండు గుజ్జుతో చేసే ఒక తీపి వంటకం) వగైరాలు నా పొట్టని నింపటానికి సరిపోతాయని హామీ ఇచ్చేను.

"మరైతే ఇంటి దగ్గర ఏమిటి తింటావు?"

"రైస్ తింటా"

"అందుకనే నువ్వు బియ్యపు గింజలా సన్నగా, పీలగా ఉన్నావు" అందామె నవ్వుతూ.

నేను రైస్ తింటానన్నానని అప్పటికప్పుడు కొడుకుని బజారుకి పంపి, చిన్న పేకెట్టు బియ్యం తెప్పించి, దానిని ఎలా వండాలో ఆ పేకెట్టు మీద ఉన్న సమాదేశాలు ('ఇన్స్ట్రక్షన్స్') చదవటం మొదలు పెట్టింది, ఆ గృహిణి. చిన్న గిన్నెలో ఇన్ని నీళ్ళు కొలిచి పోసి, దాంట్లో ఒక చెంచాడు నూనె, చిటికెడు ఉప్పు వేసింది. ఈవిడ అన్నంతో పాటు చారో, పులుసో కాస్తోంది కాబోలని నేను సంబర పడిపోయే లోగా, ఆ పేకెట్టు బియ్యం ఆ నీళ్ళల్లో ఒంపింది. ఆ బియ్యం ఉడుకుతూన్నంతసేపూ దానిని కోవా తిప్పినట్లు చెంచాతో తిప్పుతూ ఉంటే, నాకు కడుపులో తిప్పి, "అమ్మా! అన్నం ఉడికేటప్పుడు ఊరికే గరిటెతో తిప్పకూడదు," అని నేను కనిపెట్టిన ప్రాథమిక సూత్రాన్ని ఆవిడకి చెప్పి, "బాగా కుతకుత ఉడుకుతూ ఒక పొంగు వచ్చేక, ఒక్క సారి గరిటెతో తిప్పి, గిన్నె మీద మూత పెట్టి, సన్నటి సెగ మీద దానిని అలా వదిలెయ్యండి" అప్పుడు అన్నం ఉరిమి, ఉమ్మగిల్లుతుంది, అని అన్నం వండటంలో ఒక సూక్ష్మం చెప్పేను. (నా శ్రీమతి నాకు వంట రాదంటుంది, మరీను!) ఉమ్మగిల్లటం అనే భావానికి ఇంగ్లీషులో మాట ఉందో, లేదో కాని, నాకు సమయానికి తట్ట లేదు.

తినటానికి ఆధరవులు లేకుండా ఉత్త అన్నం ఎలా తింటాం? ఆమె ఇంత కష్టపడీ వండిన తర్వాత తినకపోతే మర్యాదగా ఉండదు. నాతో పాటు ఒక ఆవకాయ సీసా అయినా తెచ్చుకున్నాను కాను! ఆ

తెల్లన్నం తింటూ – కనీసం ఇంత ఉప్పు, నెయ్యి, వాము కలుపుకుంటే బాగుండిపోయేది కదా అని అనుకున్నాను.

అతిథేయ గృహాలకి వెళ్ళటం తిండి కోసం కాదు కదా. కాని దేశం అంతా పండుగ జరుపుకుంటూ ఉంటే మనం ఇంటిదగ్గరే కూర్చుంటే బోరు కొడుతుంది. మానసిక మాంద్యత ఇలాంటి పండగ రోజులలో ఎక్కువ అవుతుంది. ఎక్కడికైనా వెళ్ళటమే మంచిది. అంతేకాదు. స్నేహాలు కలవాలంటే కలసి తాగటమో, కలసి తినటమో చెయ్యాలి అంటారు.

థేంక్స్‌గివింగ్ డిన్నరు నెమ్మదిగా ఒక గంట సేపు తిన్నారు. కప్పలని మింగిన పాముల్లా కదల్లేకుండా మెల్లిగా సోఫాల మీదకి డేకిరేరు, ఒకళ్ళూ, ఒకళ్ళూ. భుక్తాయాసం తగ్గగానే డెజర్ట్, అంటే తీపి వంటకం. తర్వాత కాఫీ. ఈ తతంగం అంతా అయిన తర్వాత సూజన్ నన్ను మా ఇంటి దగ్గర దింపేసి వెళ్ళిపోయింది.

తర్వాత సూజన్ ఇంటికి చాల సార్లు వెళ్ళేను. సూజన్ తో కలసి చాల చోట్లకి తిరిగేను. రెండు సందర్భాలు మాత్రం చెబుతాను. ఒక సారి, నేను, సూజన్ కారులో అలా షికారుకి వెళ్ళేం; ఒక గమ్యం అంటూ ఏదీ లేదు. సూజన్ టెలిగ్రాఫ్ రోడ్డు మీద కారుని నడుపుతోంది. అది కొంచెం ఊరు బైట ఉందేమో కార్ల రద్దీ అంతగా లేదు. రోడ్డు పక్కగా ఖాళీ స్థలం చూసి అక్కడ కొంత సేపు కారుని ఆపి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ కబుర్లు చెప్పుకుంటున్నాం. అలాగని 'నెక్కింగు', 'పెట్టింగు' వగైరాలు ఏమీ లేవు సుమండీ. నాకు అమ్మాయిలతో కూర్చుని కబుర్లు చెప్పే నేర్పు అంతగా లేదు. ఏదో నాకు తెలిసిన విషయాలే మాట్లాడుతూ ఐన్‌స్టయిన్ యొక్క సాపేక్ష సిద్ధాంతం లోని మెలికల గురించి చెబుతూ, వచ్చిన అవకాశాన్ని ఒదులుకోవటం ఇష్టం లేక, ఐన్‌స్టయిన్ సాక్షాత్తూ ఉపయోగించిన ఉపమానాన్నే ఉపయోగిస్తూ ఇలా అన్నాను. "చూడు, నీలాంటి అందమైన అమ్మాయితో కాలం గడుపుతూ ఉంటే గంటలు కూడ నిమిషాలలా ఎలా దొర్లి పోతున్నాయో. ఇదే గంట క్లాసులో కూర్చున్నప్పుడు ఒకంతట తెమలదు." నేనిలా వాక్యం పూర్తి చేసేనో లేదో సూజన్ కెవ్వుమని కేకేసి నన్ను వాటేసుకుంది. "ఏమైంది?" అని అడిగితే, "చూడు ఎదురుగా వస్తూన్న ఆ ఎర్ర కారు గభీ మని కిందకి

పడిపోయింది.” నేనూ చూసేను. ఒక్క క్షణం పాటు నేనూ అలాగే భ్రమ పడ్డాను. కారు ఏమీ పడిపోలేదు, మా వేపే వస్తోంది. ‘కింద” అంటూ ఉంటే కదా కింద పడిపోటానికి? ఎందుకిలా భ్రాంతి కలిగింది? రోడ్డు మీద ‘ట్రేఫిక్’ ఏమీ లేదు. ఇటో లేను, అటో లేను. ఇటూ, అటూ చెట్లు. ఆకాశం మబ్బుగా ఉంది. మా ఎదురుగా ఉన్న రోడ్డు యొక్క రంగు నేపథ్యంలో కలిసిపోయిందేమో రోడ్డు కొండ మీదనుండి కిందకి దిగుతూన్నట్లు ఖణిగా కనబడలేదు. కాని, ఎర్రటి కారు కొండ మీద నుండి కిందకి పడిపోతూన్నట్లు పరాగ్గా ఉన్న మా కళ్ళకి కనిపించింది. ఎక్కడికి పడి పోతుంది? అప్పుడు అకస్మాత్తుగా నా మనస్సులో ఒక ఊహ మెరిసింది. “సూజన్ చూడు. ఇదే ‘జనరల్ రెలెటివిటి’ కి ఉదాహరణ. ఎదురుగా ఉన్న రోడ్డులో ఉన్న దిగుడు మనకి కనిపించలేదు కనుక, ఆ దిగుడు మీద దొర్లుకుంటూ వస్తూన్న కారు కిందకి పడిపోయినట్లు కనిపించింది. ఏపిల్ చెట్టు నుండి పండు కిందకి పడ్డప్పుడు కూడ మనకి ఇలాంటి భ్రాంతే కలుగుతుంది” --- అని నేను ఇంకా ఏదో చెప్పబోతూ ఉంటే, "ఇంటికి పోదాం పద” అంది.

మరొక సారి సూజన్ తన స్నేహితులందరి తో ‘హే రైడ్’ కి వెళుతూ నన్నూ తీసుకెళ్ళింది. ఇది ఒక తమాషా కార్యక్రమం. ఒక లారీ లాంటి పొడుగాటి ట్రెయిలర్. దానిని లాగటానికి ఒక ట్రేక్టర్. ఆ ట్రెయిలర్ లో నేల మీద, బాగా ఒత్తుగా, మామిడి పళ్ళ కావులోలా ఒక స్తరం గడ్డి ఉంది. అందులోకి అబ్బాయిలూ, అమ్మాయిలూ అంతా ఎక్కేం. ఓ పదిహేను మంది దాకా ఉంటాం. ఇంతమందీ ఎక్కేసరికి ఆ ట్రెయిలర్ పిప్పళ్ళ బస్తాలా పిటపిటలాడుతూ ఇరుగ్గా తయారయింది. ఎంత ఇరుగ్గా ఉంటే అంత మంచిది. కూర్చోవాలనుకున్నవాళ్ళు కూర్చున్నారు. సాగిలబడాలంటే అదీ చెయ్య వచ్చు. చోటు లేక పోతే మరొకరి ఒళ్ళో కూర్చోవచ్చు. బందరు హిందూ కాలేజీలో ఉన్న రోజులలో అమ్మాయిల వైపు చూడటానికే సిగ్గు పడ్డ నేను ఇప్పుడు అమ్మాయిలు వచ్చి మీద పడి, ఒళ్ళో కూర్చుంటూ ఉంటే ఒద్దంటే ఏం బాగుంటుంది?

ఈ ట్రెయిలర్‌లో మమ్మల్ని అందరినీ ఊరు బయట ఒక పొలంలో ఉన్న ‘బార్న్’ లోకి తీసుకెళ్ళేరు. ‘బార్న్’ అంటే కళంజం, లేదా కొట్టాం. పొలంలో పండిన పంటని తాత్కాలికంగా పోగెయ్యటానికి, పశువులని కట్టటానికీ వాడే ‘షెడ్డు’ లాంటి కట్టడం, ఇది. ఈ కొట్టాం బాగా విశాలంగానే ఉంది, తప్ప

లోపల సోఫాలు, బెంచీలు, కుర్చీలు మొదలైన సదుపాయాలు లేవు. మేం వెళ్ళేసరికి ఇది ఖాళీగానే ఉంది, ఒకటో, రెండో గడ్డి మేట్లు తప్ప. అక్కడ ఈ కుర్రకారు మీద ఓ కన్నేసే పెద్దలెవ్వరూ లేరేమో, ఎవరికి వారే, యమునా తీరే! పక్కన యమున ఉండుంటే ఈ వ్యవహారం అంతటినీ మన రాసక్రీడలతో పోల్చేసి ఉండేవాడిని.

ఈ మాటు సూజన్ నన్ను ఇంటిదగ్గర దింపి వెళ్ళిన తర్వాత, మంచం మీద వాలిపోయాను తప్ప, నిద్ర పట్ట లేదు. నిలకడ లేని మనస్సు పరి పరి విధాల పరిగెట్టింది. మా ఇద్దరి మధ్య చనువు పెరుగుతోంది. చాల చోట్లకి కలసి తిరిగేం. కాని ఇవేమీ 'అఫీషియల్' గా 'డేట్'' అనే మాట యొక్క నిర్వచనం లో ఇమడవు. కలిసి తిరగటం వేరు, డేట్ చెయ్యటం వేరు. (ప్రెసిడెంట్ క్లింటన్ లా మాట్లాడుతున్నాను కదూ?) నా అంతట నేను ఎప్పుడు సూజన్ ని "ఎక్కడికేనా వెళదాం, వస్తావా?" అని ఆహ్వానించలేదు. సూజన్ తో పెరుగుతూన్న పరిచయం ఉత్త శేముష్య స్నేహమేనా, లేక మరో దిశలో ముదురుతోందా అని ఒక అనుమానం వెంటాడటం మొదలెట్టింది. ఈ ఆధునిక యుగంలో విచిత్రం ఏమిటంటే, ప్రేమించ గలిగే వయస్సులో ఉన్నప్పుడు పోషించే శక్తి ఉండదు. పోషించగలిగే శక్తి వచ్చే సరికి ప్రేమించటానికి పిల్లలు దొరకరు. ఒక పక్క ఇంకా చదువుకోవాలనే కోరిక. మరొక పక్క సనాతన సంప్రదాయికమైన బాధ్యతలు.

అమ్మాయిలని చూసి ఆకర్షితుణ్ణి కావటం నాకు ఇది మొదటి సారేమీ కాదు. మానునీ, మాకునీ కాదు కదా. నా రక్తనాళాల్లో ప్రవహిస్తూన్న ఉడుకు రక్తంలో హార్మోనులు అల్లరి పెట్టినంత సేపూ రాయినీ, రప్పనీ కానే కాను. మనసున్న మనిషినే నేను. మా ఇంటి దగ్గర ఉన్న పాపయ్య మేష్టారి వీధి బడిలో రాచకొండ లీల ని చూసినప్పుడు, "ఈ అమ్మాయి బాగుందే" అనిపించింది. ఇప్పుడు వెనక్కి తిరిగి చూస్తే అంత చిన్న వయస్సులో కూడ అమ్మాయిల వైపు చూడాలనే కోరిక పుట్టిందంటే నాకే ఆశ్చర్యం వేస్తోంది. తర్వాత హైస్కూలు రోజులలో రత్నమాల. బోగం వాళ్ళ పిల్ల. బాగా అలంకరించుకుని వచ్చేది. మా తెలుగు మేష్టారు శృంగారం ఒలికిస్తూ పాఠం చెబుతూ ఉంటే మాత్రం బయటకి వెళ్ళిపోయేది. ఈ అమ్మాయి మా హైస్కూలు బ్యూటీ అని అంతా ఒప్పుకునేవారు. తర్వాత బందరులో రోల్ నంబరు 100 కథ ఇంతకు పూర్వమే చెప్పేను కదా. వీళ్ళంతా నన్ను ఆకర్షించిన వాళ్ళు కనకనే

నాకు ఇంతవరకు గుర్తు ఉన్నారు. కాకినాడ ఇంజనీరింగు కాలేజీ ఒక ఎడారి అనుకుంటే అందులో ఎండమావిలా వసుంధర; ఈమె హిందీ సినిమాలో తున్‌తున్ లా ఉండేది. పైపెచ్చు ప్రయోగశాలలో నా జట్టులోనే వేసేరు. పెట్టి పుట్టాలంటారు! నేవేలీలో నా ఆఫీసు భాగస్వామిని పట్టమ్మాళ్. మరీ శ్రీనాధుడు వర్ణించినంత అన్యాయమేమీ కాదు; అరవ పిల్లైనా అందంగానే ఉండేది కాని లతా మంగేష్కర్ లా పమిట ని గట్టిగా భుజం మీంచి లాగి ఒళ్ళంతా చుట్టబెట్టుకునే పాత కాలపు పిల్ల. భిలాయిలో రష్యన్ అమ్మాయిలంతా అమ్మమ్మల్లా ఉండేవారు. వాళ్ళని 'బబూష్కా' లు అనే వాళ్ళం. అందమైన పిల్ల పేరుకి ఒక్కతె కనిపించలేదు.

చిక్కేమిటంటే, నా అక్క చెప్పినట్లు, నా కంటికి అమ్మాయిలందరూ అందంగానే కనిపించేవారు; కొంచెం ఎక్కువ తక్కువలతో.

"అప్రాప్త యవ్వనా నారీ, న కామాయన శాంతయే
సంప్రాప్తే షోడషే వర్షే, గార్ధభ చాప్సరాయతే

అన్నారు కనుక పదహారేళ్ళ వయస్సులో గాడిద కూడ అందంగానే కనిపిస్తుందిరా," అనేది అక్క. సూజన్ గురించి ఇలా ఆలోచిస్తూ మనస్సు తర్జన భర్జనలు పడుతూ ఉంటే, ఎప్పుడో నిద్ర పట్టేసి నన్ను రక్షించింది.

మనిషి మాంసం తినమరిగిన పులి మరో మాంసం ముట్టదంటారు. అలాగే అమ్మాయిల వెంట తిరగటం అలవాటైతే మరి పుస్తకాలు ముట్టబుద్ధి కాదేమో, అప్పుడు చదువు క్షవరం అవుతుందనే బెంగ ఒకటి వెనక్కి లాగుతోంది. "డేటింగ్ మొదలెట్టేవంటే ఆరిపోతావు, అసలే డబ్బులు లేవంటున్నావు," అన్నాడు అచ్యుతరావు. "వంట చేసుకోలేక వారానికోసారి లగెత్తుకొత్తావే, సూజన్ కి పప్పు, పులుసు చెయ్యటం నేర్పమంటావా?" అని లక్ష్మి వేళాకోళం చేసింది. సూజన్ లో మంచి ఆకర్షణ ఉన్నప్పటికీ, ఆమెతో ఉన్న చనువు, చొరవ లోకి దిగకపోవటానికి అనేక బలవత్తరమైన కారణాలు ఉన్నాయి. అందువల్ల వికారపు ఆలోచనలకి, చేష్టలకి తావు ఇవ్వకుండా స్నేహంతో సరిపెట్టేను. తమాషా

ఏమిటంటే, నేను డిట్రోయిట్ వదలిన తర్వాత, మాటవరసకైనా సూజన్ తో టెలిఫోనులో కూడ మాట్లాడిన జ్ఞాపకం లేదు.

ఒక్క హోస్ట్ ఫేమిలీ తోటే జీవితం ఇంత రంజుగా తయారయితే, నాకు కేటాయించిన హోస్ట్ ఫేమిలీ ఒక్క దాని తోటీ సంతృప్తి పడి ఎలా ఊరుకోగలను. గిరిష్ షా హోస్ట్ ఫేమిలీ ఇంటికి, అచ్యుతరావు హోస్ట్ ఫేమిలీ ఇంటికి కూడ వాళ్ళతో వెళ్ళేవాడిని. ఇంతే కాకుండా కొన్ని చర్చికి సంబంధించిన సంఘాలు విదేశీ విద్యార్థులని కూడగట్టుకుని, వాళ్ళని మిక్సర్ లకీ, ఫీల్డ్ ట్రిప్పు లకీ తీసికెళ్ళే వారు.

మిక్సర్ అంటే డేన్సు. అబ్బాయిలనీ, అమ్మాయిలనీ ఒక పెద్ద గదిలో వదిలేసి, అక్కడ ఒక బేండు పెట్టి, ఒకరినొకరికి పరిచయం చేసి డేన్సు చెయ్యమని ప్రోత్సహిస్తారు. అమ్మాయిలని కలుసుకోటానికి అమెరికన్ అబ్బాయిలకి కూడ సిగ్గే. అందుకని, ఈ మంచు తెరని విడగొట్టటానికి రెండుపద్ధతులు ఉన్నాయి. మొదటిది, అమ్మాయిలందరినీ ఒక పక్క, అబ్బాయిలందరినీ మరొక పక్కా నిలబెడతారు. ఒకొక్క అబ్బాయే వెళ్ళి ఒక అమ్మాయిని ఎంచుకుంటాడు. అలా అన్ని జోడీలు జతపెడతారు. రెండవ పద్ధతి. అబ్బాయిలందరినీ గుండ్రంగా ఒక పెద్ద వలయాకారంలో నిలబెడతారు. ఈ వలయం లోపల అమ్మాయిలందరినీ మరొక చిన్న వలయాకారంలో నిలబెడతారు. బేండు మేళపు నేపథ్య సంగీతం లో అబ్బాయిలంతా అనుఘడి దిశలోనూ, అమ్మాయిలంతా ప్రతిఘడి దిశలోనూ గుండ్రంగా నడుస్తూ ఉంటారు. సర్కస్‌లో గుర్రాలని నడిపించినట్లు అనుకొండి. అప్పుడు అకస్మాత్తుగా బేండు ఆపెస్తారు. సంగీతం ఆగిపోవటంతో అబ్బాయిలూ, అమ్మాయిలూ కూడ ఆగిపోతారు. అప్పుడు ఎవ్వరికి ఎదురుగా ఎవ్వరుంటే వారిరువురు కలసి డేన్సు చేస్తారు. డేన్సు అంటే ఈ రోజులలో లా ఎవరి మట్టుకు వారు గెంతటం కాదు. ఆ రోజుల్లో కొన్ని డేన్సులలో అబ్బాయిలు అమ్మాయిలని దగ్గరగా తీసుకుని, ఇద్దరి శరీరాలు స్పర్శిస్తూ ఉండగా డేన్సు చేసేవారు. నేను ఐదడుగుల ఆరంగుళాలు ఉన్నప్పటికీ, నా కెప్పుడూ నా కంటె రెండు గుప్పిళ్ళు పొడుగున్న అమ్మాయే దొరికేది. మన కంటే బాగా పొడుగైన అమ్మాయిలతో డేన్సు చెయ్యటంలో కొన్ని ఈతి బాధలు ఉన్నాయి. అవన్నీ చెబుతూ కూర్చుంటే ఇదొక భారతం అవుతుంది కనుక మీ ఊహకి ఒదిలేస్తాను.

ఫీల్డ్ ట్రిప్పు అంటే బయటకి వెళ్ళి తిరగటం. ఒక సారి అక్కడ పార్కీ డేవిస్ అనే మందుల కంపెనీ వాళ్ళు మమ్మల్ని – ఓ ఏభై మందికి పైగానే ఉంటాం – పిలచి, వాళ్ళ ఫేక్టరీ చూపించి, తర్వాత చిన్న విందులా లంచి ఏర్పాటు చేసేరు. మరొక సారి ఫోర్డు మోటర్ కంపెనీ వారూ వాళ్ళ స్టీలు ఫేక్టరీ, కార్ల ఫేక్టరి చూపించి, లంచి పెట్టి పంపించేరు.

మరొక సారి, మరొక సంసారులు క్రిస్మస్ రేపనగా వాళ్ళతో పాటు నన్ను 'మిడ్‌నైట్ మాస్' కి చర్చికి తీసుకెళ్ళేరు.

ఇలా చాల మందిని కలుసుకున్నాను కాని, ఇప్పుడు నాకు సూజన్ తప్ప మరెవ్వరూ గుర్తు లేరు.

ఒక సారి నేను, వాసిరెడ్డి సత్యనారాయణ ఒక అమెరికన్ స్నేహితుడితో కలసి ఒక రేడియో స్టేషన్ కి వెళ్ళేం. అప్పుడు కాదు కాని, తర్వాత అది నేషనల్ పబ్లిక్ రేడియో స్టేషన్ అని తెలిసింది. అప్పట్లో నాకు నేషనల్ పబ్లిక్ రేడియో అంటే ఏమిటో కూడ తెలియదు. మేమిద్దరమూ ఒక చిన్న గదిలోకి వెళ్ళిన తర్వాత అక్కడ ఉన్న ఆసామి మమ్మల్ని ఏవో నాలుగు కుశల ప్రశ్నలు వేసి, ఇండియా గురించి కొంత సేపు మాట్లాడి, ఏదైనా పాట పాడమన్నాడు. నా మాటటుంచి, సత్యనారాయణకి పాట పాడటం రాదని కచ్చితంగా చెప్పగలను. ఇంతలో రేడియో ఆసామీ, "యు ఆర్ ఆన్ ద ఎయిర్" అంటూ ఎర్రగా వెలుగుతూన్న దీపం చూపించి మమ్మల్ని పాట మొదలెట్టమని మా వేపు వేలు చూపించేడు. అకస్మాత్తుగా ఏం పాట పాడుతాం? సత్యనారాయణ "జనగణమణ" ఎత్తుకున్నాడు. నన్ను వంత పాడమని సైగ చేసేడు. చేసేది లేక నేను గొంతు కలిపేను. పాట అయిపోయిన తర్వాత, "మీరిద్దరూ ఇప్పుడు మాట్లాడిన మాటలు, పాడిన పాట నేషనల్ పబ్లిక్ రేడియో మీద దేశం అంతా ప్రసారితమైంది!" అన్నాడు. అంత చిన్న గది లోంచి ప్రసారితమైనది ఎంత దూరం వెళుతుందిలే, ఎవరు వింటారులే అని మేం సంజాయిషీ చెప్పుకున్నాం. తర్వాత తెలిసింది. అది చాల పాప్యులర్ స్టేషన్ అని. చాల మంది విన్నారుట. ఒకతను మొహమాటం లేకుండా, "ఖూనీ చేసేసేరు కదయ్యా! పాట పాడటం రానప్పుడు ఎందుకు పాడేరు?" అని కోప్పడ్డాడు.

# రాజకీయ స్పృహ – గోవా యుద్ధం

అప్పటికి అమెరికా వచ్చి మూడు నెలలు కావస్తోంది. క్రిస్మస్ సెలవులకి టొరాంటో లో ఉన్న బాబ్ వార్నర్ ఇంటికి తీసుకెళతానని అన్నయ్య చెప్పేడు కనుక ఆ రోజు కోసం ఎదురు చూస్తున్నాను. డిసెంబరు 18 న బయలుదేరి రాచెస్టర్ వెళ్ళటానికి ముహూర్తం పెట్టేను. డిసెంబరు 17 తెల్లారేసరికల్లా, ఇండియా గోవా మీద దండయాత్ర చేసి కొద్ది గంటలలో సునాయాసంగా ఆక్రమించుకుందని వార్త వచ్చింది.

ఈ వార్తతో అమెరికా అంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది. ఏ రోడ్ ఐలండ్ మీదకో దండయాత్ర చేసినట్లు అమెరికా ప్రభుత్వము, పత్రికలు, తద్వారా ప్రజలు అంతా ఏక కంఠంతో విరుచుకు పడ్డారు. అమెరికా ఇంత ఆగ్రహావేశాలతో స్పందించేసరికి నేను ఆశ్చర్య పోయేను.

ఈ నేపథ్యంలో అన్నయ్యతో కలసి కెనడా వెళ్ళేను. అక్కడ సత్రవ భోజనం, మఠం నిద్ర అన్నట్లు, వై. ఎం. సి. ఎ. లో బస పెట్టేం కాని అక్కడ ఉన్న మూడు రోజులూ బాబ్ వార్నర్ తల్లిదండ్రుల ఇంట్లోనే భోజనాలు చేసి కాలం గడిపేం. మధ్యలో ఒక రోజు మార్గరెట్ స్మిత్ ఇంటికి 'కాక్‌టెయిల్ పార్టీ' కి వెళ్ళేం. (వెళ్ళే ముందే చెప్పేడు అన్నయ్య; అక్కడ 'కాక్‌టెయిల్స్' ముట్టటానికి వీలులేదని.) కాక్‌టెయిల్ పార్టీల లో ఎవరికి ఏ విషయం తోస్తే వాళ్ళు దానిమీద మాట్లాడతారు. అప్పటికి గోవా గొడవ ఇంకా చల్లారలేదేమో, ఆ రోజు ప్రతి వాడి నోటా గోవా గురించే సంభాషణ. అక్కడ ఉన్న వాళ్ళల్లో మేమిద్దరిమే ఇండియా వాళ్ళం కనుక అంతా కూడగట్టుకుని మా ఇద్దరి మీదా దండయాత్ర చేసేరు. నేను దేశానికి కొత్త కనుక నన్ను ఒదిలేయమని అన్నయ్య వాళ్ళతో చెప్పేడు.

అమెరికాకి ఇండియా అంటే ఇష్టం లేకపోవచ్చు. కాని కెనడా 'కామన్‌వెల్త్' దేశం కదా. అయినా సరే కెనడాలో కూడ పెద్ద స్నేహభావం కనిపించ లేదు. టొరాంటో వార్తాపత్రికలో గాంధీ వీపు మీద నెహ్రూ బాకుతో పొడుస్తూన్నట్లు 'కార్టూన్' పడింది. నాకు ఒళ్ళు మండింది. నేను అప్పుడే ఇండియా నుండి వచ్చేను కనుక నాకు గోవా విషయాలు బాగా జ్ఞాపకం ఉన్నాయి. అందుకని, అన్నయ్య లేని ఒక

మూలకి  జారుకుని, నేను కూడ ఇండియా తరఫున వాదించటం మొదలు పెట్టేను. వాదన కేమి భాగ్యం! ముందు వాదన పుట్టింది, తర్వాత తెలుగువాడు పుట్టేడు. పైపెచ్చు మందు పుచ్చుకున్న వాడితో మందు పుచ్చుకోని వాడు వాదించటం తేలిక.

నేను ఇండియాలో ఉన్న రోజులలో రోజూ గోవా గురించి ఏదో ఒక వార్త వచ్చేది. గోవా మీద ఏ విధమైన చర్య తీసుకోవటం లేదని ఇండియాలో వామపక్షాలు, పత్రికలు నెహ్రూ మీద దుమ్మెత్తి పోసేవి. 'మదర్ ఇండియా' సంపాదకుడు, బాబూరావ్ పటేల్  వ్యంగ్యంతో అలా చురకలు పెడుతూనే ఉండేవాడు. కాష్మీర్  విషయంలోను, గోవా విషయంలోనూ, నెహ్రూ 'మెంటల్ మేస్టర్బేషన్' చేసుకుంటున్నాడని ఎగతాళి చేసేవాడు. వామ పక్ష పత్రిక బ్లిట్జ్ సంపాదకుడు ఆర్. కె. కరంజియా సంగతి సరేసరి. ప్రపంచానికి పంచశీల పాఠాలు నేర్పి, శాంతి కపోతాలని ఎగరవేసిన నెహ్రూ కి బలం ఉపయోగించి గోవాని ఇండియాలో కలుపుకోవటం ఇష్టం ఉండేది కాదు. నోబెల్ శాంతి బహుమానం కొరకు ఊరట పడుతూ సైనిక చర్యకి అయిష్టత చూపుతున్నాడని కొందరు అరోపించేరు. ఫ్రాంసుతో ఒడంబడిక చేసుకుని పుదుచ్చేరీ ని పుచ్చుకున్నట్లే, పోర్చుగల్ తో ఒడంబడిక కుదురుతుందేమో అని నెహ్రూ చాల ప్రయత్నించి విఫలుడయేడు. పోర్చుగల్ నియంత సాలజార్ కి 400 ఏళ్ళ పైబడి తమ అధీనంలో ఉన్న గోవాని అంత సుళువుగా ఒదులుకునే ఆలోచనలు లేవు. ఆఫ్రికాలో అంగోలా ప్రజలు చేసే స్వతంత్ర పోరాటంలో ప్రాణాలతో ఉన్న ప్రజల చర్మాలు పోర్చుగీసు సైనికులు ఒలిచేస్తున్నారని ఫిబ్రవరి నుండి వార్తలు వస్తున్నాయి. ఈ సందర్భంలో గోవా పోర్చుగల్ లో ఒక రాష్ట్రమూ, అంతర్భాగమూ అని సాలజార్ ప్రకటించేడు. అమెరికా కిమ్మన లేదు. కాష్మీర్ సమస్యని ఐక్య రాజ్య సమితికి తీసుకెళ్ళి దెబ్బ తిన్న నెహ్రూ ఈ పరిస్థితులలో గత్యంతరం లేక గోవాని ఆక్రమించటానికి పచ్చ దీపం చూపించేడు.

సాలజార్ ఒక నియంత. నెహ్రూ ఒక ప్రజాస్వామ్యంలో ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధి. న్యాయంగా అమెరికా నెహ్రూని సమర్థించాలి. గోవా భారత భూభాగం మీద మలయాళ, కన్నడ, మహారాష్ట్ర దేశాలని అనుకుని ఉన్న సముద్ర తీర ప్రదేశం; అప్పటి రోజులలో చాల మంది అమెరికా వాళ్ళూ, కెనడా వాళ్ళూ అనుకుంటూన్నట్లు ఎక్కడో అరేబియా సముద్రం మధ్యలో ఉన్న చిన్న ద్వీపం కాదు.

పోర్చుగల్  భారత దేశానికి ఐదు వేల మైళ్ళ దూరంలో ఉన్న చిన్న మూడో తరగతి లాతి దేశం. లాతి జాతి, లాతి భాష, లాతి సంస్కృతి. ఫ్రెంచి వాళ్ళు సౌమ్యంగా వెళ్ళిపోయేరు కానీ ఈ బుడతగీచులు మాత్రం గోవాని బంక నక్కిరి కాయలా పట్టుకుని, వదలి వెళ్ళటానికి ఒకంతట మొగ్గు చూపటం లేదు. అయినా సరే గోవా మీద ఇండియా దండయాత్ర చేసేసరికి ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించటానికే తను అవతరించేనంటూ కొప్పెక్కి కూసే అమెరికా ఆగ్రహావేశాలతో ఊగిపోయింది. అమెరికా కి ఎందుకు ఇంత కోపం వచ్చిందో నాకు అర్థం కాలేదు. ఇది అర్థం కావాలంటే ఆ రోజులలో రాజకీయ వాతావరణం అర్థం కావాలి.

అవి సోవియట్ యూనియన్ తో ప్రచ్ఛన్న యుద్ధం ('కోల్డ్ వార్') ముమ్మరంగా సాగుతూన్న రోజులు. ఈ యుద్ధం లో అమెరికా గ్రహస్థితి 1960-61 సంవత్సరాలలో అంతగా బాగు లేదనే చెప్పాలి. ఐసెన్ హోవర్ హయాం అంతం అవుతూన్న రోజుల్లో, 1960 లో, 12 మైళ్ళ ఎత్తులో ఎగురుతూన్న అమెరికా వారి యు-2 గూఢ విమానాన్ని సోవియట్ యూనియన్ కింద నుండి పంపిన రాకెట్టు తో కొట్టి కూల్చి వేసి అమెరికాని నలుగురిలోను నగుబాటు చేసింది. తర్వాత యూరీ గగరిన్, 1961 ఏప్రిల్ లో, అంతరిక్షంలో భూప్రదక్షిణ చేసి సోవియట్ యూనియన్ ప్రతిభ ని ప్రపంచానికి చాటేడు. అదే నెలలో ప్రేరేపణ లేకుండా చిన్న దేశమైన క్యూబా మీద, 'బే అఫ్ పిగ్స్' వద్ద, కెన్నడీ తో చెప్పకుండా సి. ఐ. ఎ. వాళ్ళు చేసిన దండయాత్ర బెడిసి కొట్టింది. అదే సంవత్సరం ఆగస్టులో తూర్పు, పశ్చిమ బెర్లిన్ నగరాలని విడదీస్తూ ఎరిక్ హోనెకర్ ఒక గోడ (ముందు ముళ్ళ కంచె, తర్వాత గోడ) కట్టటం మొదలు పెట్టేడు.

మొగుడు కొట్టేడని కాదు కానీ, తోటి కోడలు నవ్వినందుకు  కోపం వచ్చిందన్నట్లు, రష్యా ని ఏమీ చెయ్య లేక, రష్యా తో చెలిమి చేస్తూన్న ఇండియా మీద అమెరికా విరుచుకు పడిందేమో అని నా అనుమానం. సోవియట్ యూనియన్ 1956 లో సైనిక చర్య జరిపి   హంగరీని తమ పరిధి లోనికి లాక్కున్నప్పుడు నెహ్రూ తటస్థంగా ఊరుకున్నాడు. సూయజ్ కాలువని నాసర్ జాతీయం చేసి నప్పుడు నెహ్రూ నాసర్ ని నిర్ద్వందంగా బలపరచేడు. అంతకు ముందు తటస్థ దేశాలన్నిటిని కూడగట్టి బాండుంగ్ లో సమావేశ పరచి పెద్ద పెత్తందారీలా హడావుడి చేసేడు. అది అమెరికా కి నచ్చ లేదు.

అందుకే సి. ఐ. ఎ. వాళ్ళు  చైనా ప్రధాని జో ఎన్ లై ఉన్నాడనుకొని, ఎయిర్ ఇండియా వారి కాష్మీర్ ప్రిన్సెస్ అన్న పేరు గల విమానంలో బాంబు పెట్టి సౌత్ చైనా సముద్రం మీద పేల్చేసేరు. వీటన్నిటితో పాటు పుండు మీద కారం జల్లినట్లు ఐక్యరాజ్య సమితిలో వి. కె. కృష్ణమీనన్ కాష్మీర్ సమస్య ఎప్పుడు తలెత్తినా పాకిస్తాన్ని, అమెరికాని దుమ్మెత్తి పోసేవాడు. అందువల్ల అమెరికాలో ఎవ్వరికీ కృష్ణమీనన్ అంటే సుతరామూ కిట్టేది కాదు. అమెరికా వారి గూఢ విమానాన్ని సోవియట్లు పడగొట్టినప్పుడు మాత్రం అమెరికాని విమర్శించటానికి నెహ్రూ వెనుకాడలేదు. జాన్ ఫోస్టర్ డల్లెస్ మన తటస్థ రాజనీతి 'అవినీతి' అని బహిరంగాగానే విమర్శించేవాడు. బ్లిట్జ్ సంపాదకుడు డల్లెస్ ని 'డల్, డల్లర్, డల్లెస్ట్'  అని వెటకారం చేస్తూ తూలనాడేవాడు.

ఈ నేపథ్యంలో ఇండియా అంటే అమెరికాకి బహిరంగంగా బద్ధవైరమూ లేదు, తోటి ప్రజాస్వామ్యం కదా, ఇబ్బందులలో ఉందన్న పరితాపమూ లేదు.  ఈ రెండు దేశాల మధ్య సఖ్యత ఉండేది కాదనటం అతిశయోక్తి కూడా కాదు. పైపెచ్చు క్రమాంతరంగా పాకిస్తాన్ ఒక కీలు బొమ్మలా అమెరికా కి ఏది కావాలంటే అది – సైనిక స్థావరాలతో సహా – సమకూర్చిపెట్టటానికి ఎల్లప్పుడు సంసిద్ధత చూపేది. పాకిస్తాన్ లో ప్రభుత్వం నిత్యం నియంతల చేతులలోనే ఉండేది కనుక, ఆ నియంతని వీళ్ళు కొనేసి, వాడిని కీలుబొమ్మలా తైతక్క లాడించేవారు. కాని ప్రజాస్వామ్యపు కబంధ హస్తాలలో చిక్కుకున్న నెహ్రూ వీళ్ళు ఎలా చెపితే అలా ఆడటానికి వీలుపడేది కాదు.

ఈ వాతావరణంలో అమెరికా ఇండియాని బలపరచలేదు సరికదా పైపెచ్చు పోర్చుగల్ ని సమర్ధించింది. పోర్చుగల్ అధీనంలో, అట్లాంటిక్ సముద్రంలో ఉన్న అజోర్స్ దీవులలో నేటో (అంటే అమెరికా అని అన్వయించుకోండి) వారి నావిక స్థావరాలు ఉన్నాయి. వాటి మనుగడకి ఎక్కడ ముప్పు వస్తుందో అని ఈ సంవాదంలో అమెరికా భారత్ మీద శీతకన్ను వేసి పోర్తుగల్ ని సమర్ధించింది.

ఇటువంటి సందర్భంలో, పోర్చుగల్ గోవాలో సైనిక స్థావరం పెట్టిందంటే ఇంకేమైనా ఉందా? ఈ స్థావరాన్ని వాడుకోటానికి పోర్చుగల్ అమెరికాతో ఏదైనా ఒప్పందం చేసుకుందంటే, భారత భూభాగం మీద, భారత ప్రజల ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా, అమెరికా వారి సైనిక స్థావరం వెలిసుంటే

వారిని వెళ్ళగొట్టటం మన తరం అయేదా? క్యూబా లో 'గౌంటానమో బే' లా ఇండియాలో గోవా తయారయిందంటే అప్పుడు కాష్మీర్ తలనొప్పి అమృతాంజనం మంటలాగుండేది.

ఈ విషయాలే ఆ కాక్‌టైల్ పార్టీలో గంటల తరబడి గొంతు నొప్పెట్టేవరకూ వాదించుకున్నాం.

కెనడా ప్రయాణం అయిపోయింది. తిరిగి డిట్రాయిట్ వచ్చేసేను. కాలక్రమేణా అమెరికా వారికి ఇండియా మీద వచ్చిన కోపం చల్లారిందో లేదో తెలియదు కాని, నాలో రాజకీయ స్పృహ రగుల్కొంది. పేపర్లు చదవటం మొదలు పెట్టేను. ఇక్కడ పత్రికలలో ప్రకటనలు తక్కువ ఉండి, ఒక మోస్తరుగా ప్రపంచ వార్తలకి చోటిచ్చే బహు కొద్ది పత్రికలలో క్రీస్టియన్ సైన్స్ మానిటర్ అని బోస్టన్ నుండి వచ్చే పత్రిక కొంచెం మెరుగ్గా ఉండేది. చూట్టానికి మన హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ లని పోలి ఉండేది. పైగా మానిటర్ కి రూత్ పావర్  జబ్‌వాలా అనే పేరు గల ఒక విలేఖరి ఉండేది. ఆమె ఇండియా గురించి తరచుగా కొంచెం మంచిగా రాసేది. అప్పట్లో నూ యార్క్ టైంస్ కంటె కూడ మానిటర్ నాకు నచ్చేది. దీనితో పోల్చితే ప్రాంతీయంగా దొరికే పేపర్లు పొట్లాలు కట్టుకుందికి కూడ పనికిరావు. ఏదో ప్రకటనల కోసం చూడటమే. మానిటర్ చదవాలన్నా, నూ యార్క్ టైంస్ చదవాలన్నా లైబ్రరీకి పోయి చదవాలి. స్థానిక పత్రికలు మాత్రం ఆఫీసులలోను, కేఫిటేరియాలలోను, ఎక్కడ పెడితే అక్కడ దొరికేవి. వీటిలో 'ఆప్. ఎడ్' పేజీ తీసి అక్కడ జాతీయ స్థాయి విలేఖరులు రాసినవాటిల్లో ఎద్దైనా పనికొచ్చేది ఉంటే చదివేవాడిని.

ఒక సారి రాబర్ట్ రువర్క్ అనే విలేఖరి 'షూట్ ఆఫ్ యువర్ సేక్రెడ్ కౌస్' అన్న మకుటంతో రాసిన వ్యాసం ఒకటి నా కళ్ళ పడింది. ఆవులు, పాములు, స్వాములు,--- ఇలాంటి పేర్లు ఎక్కడ కనబడ్డా ఓపిగ్గా చదివేవాడిని. "దేశంలో తిండి లేదని ప్రజలు అలమటిస్తూ ఉంటే ఆ దేబిరిగొట్టు ప్రభుత్వం చిప్పుచ్చుకుని అమెరికా రాక పోతే, వాళ్ళ దేశంలో తిండి లేక, దిక్కూ, దివాణం లేకుండా రోడ్ల మీద తిరుగుతూన్న ఆవులని చంపుకుని తినొచ్చు కదా?" అంటూ రువర్క్ భారత దేశానికి ఉపదేశం చేసేడు.

ఈ రాబర్ట్ రువర్క్ గురించి కొంత వాకబు చేసేను. మరీ పేరు లేని వాడేమీ కాదు; కాని అతని రంగం ఆఫ్రికా, ఇండియా కాదు. ఇండియా గురించి ఇతనికి ఏమి తెలుసో, తెలియదో నాకు తెలియదు కాని, ఏమీ తెలిసున్న వాడిలా లేదని అతని వ్యాసంలో ఒక్క మెతుకు పట్టగానే నాకు తెలిసిపోయింది.

ఇంగ్లీషులో 'సేక్రెడ్ కౌ', 'అన్‌టచబుల్' మొదలైన పదబంధాలు అలంకారం కోసం వాడుతూ ఉంటారు. ఉదాహరణకి `అన్‌టచబుల్స్' అంటే 'అంటరానిది, విమర్శించటానికి వీలు లేనిది' అనే ంలో వాడతారు. దీనికే అస్పృశ్యులు అని మరో ం ఉంది కదా. ఇలాగే 'సేక్రెడ్ కౌస్' అన్న పదబంధానికి కూడ రెండు లు ఉన్నాయి. పవిత్రమైన గోవులు అన్నది వాచ్యం. ఆత్మవంచన చేసుకునే ఢంబాచారాలు అన్నది రెండో ం. ప్రతీ సమాజంలోను 'సేక్రెడ్ కౌస్' ఉంటాయి. మన దేశపు లోటు పాట్లు మనలో మనం ఎంతగా విమర్శించుకున్నా పరవా లేదు కాని, మరొకడు వేలెత్తి చూపితే కోపం వచ్చేది. అందుకని అదే అలంకారాన్ని తిరిగి వాడుతూ 'మీ సేక్రెడ్ కౌ లని మీరు కాల్చేయండి' అని విరుచుకు పడుతూ, 'షూట్ ఆఫ్ 'యువర్' సేక్రెడ్ కౌస్' అనే మకుటాన్నే ఉపయోగించి ఘాటుగా ఒక సమాధానం రాసేను. ఒక అమెరికన్ కుర్రాడి చేత అందులో ఇంగ్లీషులో తప్పులు దిద్దించి, టైపు చేయించేను – నూస్ పేపరుకి పంపుదామనే ఉద్దేశంతో. కాకతాళీయంగా ఆ అబ్బాయి 'కేంపస్ డిట్రాయిటర్' అని ఏటికి రెండు సార్లు ప్రచురితమయే ఒక పత్రిక సంపాదక వర్గం లో ఉన్నాడు. నా వ్యాసం తమ పత్రికలో వేసుకుంటామని కోరి వేసుకున్నాడు. ఉద్వేగంతో రాసిన వ్యాసమేమో అది చాల మంది దృష్టిని ఆకర్షంచింది. చిన్న సంచలనమే సృష్టించింది.

ఈ సందర్భంలోనే తెలిసింది. మన దేశం తరఫున వకాల్తా పుచ్చుకుని మాట్లాడటానికి నా దగ్గర వేత్తృత లేదనిన్నీ, ఆలోచనా సరళిలో నైశిత్యం లేదనిన్నీ. సూక్ష్మంగా చెప్పాలంటే, నాకేమీ తెలియదని. వీలు దొరికినప్పుడల్లా గ్రంథాలయానికి వెళ్ళి గాంధీ, నెహ్రూ, వివేకానంద, ఠాగోర్, రాధాకృష్ణన్, లిన్ యూటాంగ్,...ఇలా మన దేశం గురించి ఎవ్వరు ఏది రాసినా చదివేసేవాడిని. ఈ ఊపులోనే హిట్లర్ రాసిన 'మైన్‌కాంఫ్,' మేకియవిల్లి రాసిన 'ద ప్రిన్స్,' గిబ్బన్ రాసిన 'ద డిక్లైన్ అండ్ ఫాల్ అఫ్ ద రోమన్ ఎంపైర్', ఇమ్మేన్యువల్ కాంట్ రాసిన 'ద క్రిటీక్ అఫ్ ప్యూర్ రీసన్',... ఇలా ఎన్నో పుస్తకాలు చదివేను.

మనం, మన దేశం, మన చరిత్ర, మన సంస్కృతి, మన భాష అనే స్పృహ అప్పుడే పెరిగింది. ఇక్కడ 'మనం' అంటే భారతదేశం అనే దృక్పథమే; దక్షిణాత్యులు, తెలుగు వాళ్ళు, కోస్తా జిల్లా వాళ్ళు, మన కులం, మన శాఖ, మన జ్ఞాతులు మొదలైన సంకుచిత పరిధిలో ఆలోచించటం తర్వాత మొదలైంది. అప్పటి నా పరిచయ బృందంలో అమెరికా వాళ్ళు, హిందీ వాళ్ళు, గుజరాతీలు, మలయాళీ క్రైస్తవులు, తెలుగు వాళ్ళల్లో బ్రాహ్మలు, కమ్మ, రెడ్లు అందరూ ఉండే వారు. వీళ్ళు ఫలానా అనే వివక్షణ మనస్సులో మొలకెత్తేదే కాదు.

# రాజకీయ స్పృహ – చైనా యుద్ధం

డిట్రాయిట్ లో ఒక ఏడు గడిచి పోయింది. రెండవ సంవత్సరం మొదలై ఒక నెల దాటింది. అక్టోబరు 16 న చైనా సైన్యం భారత దేశం సైన్యం సరిహద్దులలో ఢీ కొట్టుకుంటున్నాయన్న వార్త ఒకటి వచ్చింది. పరిస్థితి విషమిస్తోందని అమెరికా గ్రహించి, ఆపద నుండి తాత్కాలికంగా ఆదుకోవటానికి అమెరికా రవాణా విమానాలు, రేడియోలు, 'స్పేర్ పార్ట్' లని సరఫరా చెయ్యటం మొదలు పెట్టింది. ఇండియా సహాయం కావాలని కోరితే ఇంకా యుద్ధ సామగ్రి పంపుతామని మాట ఇచ్చింది. చలికాలం వస్తోంది కనుక హిమాలయాల లోని లోయలు మంచుతో కప్పడి పోయి చైనా సైన్యం పురోగతికి ప్రతి బంధకాలు అవుతాయని అమెరికా ప్రభుత్వం ఆశించింది.

అదే సందర్భంలో, అంటే అక్టోబరు 16 మంగళవారం నాడు, అమెరికా ప్రభుత్వపు అంతర్మందిరాలలో మరొక ఆందోళన మొదలైంది. ఫ్లారిడా కి తొంభై మైళ్ళ దక్షిణాన ఉన్న క్యూబాలో సోవియట్ యూనియన్ రహస్యంగా నిర్మిస్తున్న స్థావరాలలో క్షిపణులు వెలుస్తున్నాయన్న వార్త వాషింగ్టన్ చేరుకుంది. ఈ విషయం ఇంకా బహిర్గతం అయి వార్తా పత్రికకలలోకి పాక లేదు.

అక్టోబరు 20 న చైనా సైన్యం తొంబ తొంబలుగా ఇండియాలోకి జొరబడిందన్న వార్త వచ్చింది. ఇండియా, చైనా సరిహద్దుల్లో ఘర్షణలు జరగటం 1959 నుండి మొదలయేయి. దీనంతటికీ మూల కారణం టిబెట్ భారత దేశాల సరిహద్దుని నిర్ణయిస్తూ 1914 లో బ్రిటిష్ వాళ్ళు ఏకపక్షంగా మేపులలో గీసిన గీత. ఈ గీత పేరు మెక్ మేన్ సరిహద్దు గీత. ఇదే సరిహద్దని ఎప్పుడూ ఎవ్వరూ ఒప్పందం పడలేదు. ఈ లోగా చైనా టిబెట్ ని ఆక్రమించింది. చైనా చర్యని భారత దేశం ఆక్షేపించ లేదు కాని, అంతవరకు టిబెట్–భారత్ ల మధ్య వాడుకలో చెలామణీ అవుతూన్న మెక్ మేన్ సరిహద్దు రేఖే ఇప్పుడు చైనా–భారత్ ల మధ్య సరిహద్దు అని ఇండియా అనటం మొదలు పెట్టింది. ఇండియా ఏకపక్షంగా చేసిన ఈ తీర్మానాన్ని చైనా అంగీకరించలేదు.

చైనా టిబెట్ ని ఆక్రమించటానికి పూర్వమే సి. ఐ. ఏ. వారు రహస్యంగా టిబెట్ లో ఉన్న దలై లామా కి మద్దత్తు ఇచ్చి స్వతంత్ర జ్వాలలు రేకెత్తించటం మొదలు పెట్టేరు. టిబెట్ లో రగులుతూన్న స్వతంత్ర జ్వాలలని సత్వరంగా ఆర్పి, అరికట్టడానికి చైనా 1959 లో పెద్ద ఎత్తున దండయాత్ర చేసి టిబెట్ ని ఆక్రమించింది. అప్పుడు దలై లామా ని, ఆయన అనుయాయులనీ ఇండియాలో తల దాచుకోటానికి నెహ్రూ అనుమతి ఇచ్చేరు. ఇది చైనా వారికి సహించరాని విషయం అయింది. అప్పటి నుండి చైనా వాళ్ళ మేపులలో 'తప్పులు' కనిపించటం మొదలయింది. తప్పులున్నాయని ఇండియా అనటం, వాళ్ళు 'చూద్దాం' అనటం తప్ప చూసిన జాడలు లేక పోవటం రివాజుగా జరుగుతున్న విషయాలే. అప్పుడు బ్రిటీష్ వాళ్ళ దగ్గర నేర్చుకున్న 'ఫార్వర్డ్ పోలసీ' ని అవలంబించి, ఇండియా-చైనా దేశాల మధ్య హిమాలయాలలో ఉన్న 2000 మైళ్ళ సరిహద్దు వెంబడి నెహ్రూ భారత సైన్యాలని మోహరించటం మొదలు పెట్టేరు.

దీనికి సమాధానంగా చైనా పెద్ద ఎత్తున దండయాత్ర చేస్తుందని ఎవ్వరూ కలలో కూడ ఊహించ లేదు. ఇండియా గోవా మీద దండెత్తటం చైనా ఇండియా మీద దండెత్తటానికీ ప్రేరణ కారణమైందా అని కూడ కొందరు ఊహాగానాలలో వ్యక్త పరచేరు. కారణాలు ఏవైతేనేమి, బుధవారం నాటికి 4,000 మంది భారతీయ సైనికులు హతులయారు. మెక్ మేన్ రేఖ ని దాటి చైనా సైన్యం వివాదాస్పదం కాని భారత భూభాగంలో జొరబడ్డాది.

గురువారం, అక్టోబర్ 18 నాటికే క్యూబా పరిస్థితి బాగా విషమించింది. దండయాత్ర చేసి క్యూబాని నేల మట్టం చేసెయ్యటం తథ్యమని అమెరికా అభిజ్ఞ వర్గాలలో అనుకోవటం మొదలుపెట్టేరు – ఇప్పటికి ఈ విషయం అమెరికా పౌరులకి తెలియదు. ఇలా వాళ్ళ దేశానికి వచ్చిన ముప్పు గురించి అమెరికా ప్రభుత్వం తర్జన భర్జనలు పడుతూ ఉంటే, ఈ క్యూబా సమస్య కీ, ఇండియా-చైనా సరిహద్దులలో జరుగుతూన్న యుద్ధానికీ ఏదైనా బాదరాయణ సంబంధం ఉందా అని ఊహాగానాలు మొదలయాయి. ఈ గందరగోళంలో అమెరికా రాయబారి గాల్‌బ్రైత్, ఇండియా-చైనా ల మధ్య మెక్ మేన్ రేఖని సరిహద్దుగా అమెరికా గుర్తిస్తుందని హామీ ఇచ్చేరు – ఇది వాషింగ్టన్ ప్రమేయం లేకుండా ఇచ్చిన హామీ అని తర్వాత తెలిసింది.

సోమవారం, అక్టోబర్ 22. మర్నాడు మంగళవారం నాడు థియరిటికల్ ఫిజిక్స్ లో చిన్న పరీక్ష. సెమెస్టర్ లో ఒకటో, రెండో ఇలాంటి చిన్న పరీక్షలు అయిన తర్వాత పెద్ద పరీక్ష వస్తుంది. గత నెల్లాళ్ళల్లో చెప్పిన పాఠాల మీదే ఈ పరీక్ష కనుక ఈ చిన్న పరీక్షలో ఎక్కువ మార్కులు తెచ్చుకోవటం తేలిక. అంతే కాకుండా ఈ గురువుగారు నాకు కొత్త. ఈయన ఎలాంటి ప్రశ్నలు అడుగుతారో తెలియదు. కనుక కొంచెం జాగ్రత్తగా చదవ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఈ ఫిజిక్స్ చెప్పే ఆచార్యుని పేరు డాక్టర్ గెర్హార్డ్ బ్లాస్. ఈయన జెర్మనీ వాడు. ప్రపంచంలోనే దిగ్గజం అనిపించుకుని నోబెల్ బహుమానం అందుకున్న హైజెన్‌బర్గ్ యొక్క శిష్యుడు. మనిషి ఆరడుగుల పొడుగు. ఒక కన్ను గాజు కన్నో, మెల్ల కన్నో. చిక్కటి జెర్మన్ యాస. పాఠం బాగానే చెప్పేవారు. 'బాగానే' ఏమిటి. ఆయన పాఠం విన్న తర్వాత నాకు భౌతిక శాస్త్రం లో అభిరుచి ఎంతగానో పెరిగింది. పాత దేశపు మనిషి అవటం వల్ల కాబోలు, కొంచెం పాత కాలపు మనిషి లా అనిపించే వాడు. అంటే అమెరికన్ ప్రొఫెసర్ల కంటే 'స్ట్రిక్టు' గా ఉండేవాడు.

ఒక వారం అయింది. అందరి లాగా ఈయన 'హోంవర్కు' అంటూ ఏమీ ఇవ్వ లేదు. ఆయన దృష్టిలో పడాలన్న కోరికతో నేను చొరవ తీసుకుని వెళ్ళి,

"ఏమీ 'హోంవర్క్' ఇవ్వరా?" అని అడిగేను.

ఆయన బుర్ర పక్కకి వాల్చి, నా వైపు ఎగా, దిగా ఆ గాజు కన్ను లోంచి అదోలా చూసి, "పుస్తకంలో ప్రతీ అధ్యాయం చివర ఉన్న ప్రశ్నలే హోంవర్కు అనుకొని ప్రతీదీ చేసెయ్."
దీని అర్థం? హోంవర్కు చేసినందుకు ప్రత్యేకం మార్కులు లేవన్న మాట. మార్కులు లేవు కనుక, సరైన సమాధానం ఏమిటో చెప్పవలసిన బాధ్యత ఆయనకి లేదు. నేను అమెరికా రాక పూర్వం మా అన్నయ్య కూడ ఇదే మంత్రం నా మీద ప్రయోగించేడు. "ప్రతీ అధ్యాయం చివరా ఉన్న ప్రశ్నలన్నిటినీ పరిష్కరించెయ్" అన్నాడు. వీళ్ళకి జాలి గుండెలు లేవా?

ఒక రోజు రాత్రి కూర్చుని మొదటి అధ్యాయం చివర ఉన్న మొదటి ప్రశ్నతో కొంత సేపు కుస్తీ పట్టి అలసిపోయేను.

మర్నాడు బ్లాస్ గారి దగ్గరకి వెళ్ళి, "ఈ మొదటి ప్రశ్న కొరుకుబడటం లేదు. ఎలా చెయ్యటమో కొంచెం చెప్పండి."

"నువ్వు ఇంతవరకు ఏమిటి చేసేవో చూపించు."

"నాకు ఎక్కడ మొదలెట్టాలో తెలియటం లేదండి."

"ఎక్కడ, ఎలా మొదలు పెట్టాలో నేను నీకు చెప్పేస్తే నీ ప్రయోజకత్వం ఏముంది?"

"నిజమేనండి. మీరు చిన్న 'హింటు' ఇచ్చేసేరంటే మిగిలిన పని నేను చేసేస్తాను."

"మిస్టర్ వేమూరి, నువ్వు రేప్పొద్దుట ఉద్యోగంలో చేరతావు. నీకు నీ బాసు ఏదో పని చెబుతాడు. నువ్వు, "ఎలా చెయ్యాలి? ఎక్కడ మొదలెట్టాలి? ఎక్కడ ఆపాలి? ఎవ్వరిని అడగాలి?" ఇలాంటి ప్రశ్నలు వేస్తూ కూర్చుంటే అతనికి నీ మీద గౌరవం పోతుంది. పైగా అతను నీకు పని చెయ్యటానికి జీతం ఇస్తూన్నప్పుడు, నువ్వేఅతని చేత పని చేయించుకుంటానంటే ఏమి బాగుంటుంది? చూసి రమ్మంటే కాల్చి రావాలి కాని, ఈ ప్రశ్నలు ఏమిటి?"

ఆ రోజుకి కడుపు నిండిపోయింది. ఇంటికి వెళ్ళి, పుస్తకం మరో సారి  చదివి, ఒక 'స్టెప్పు' వేసేను. (ఆ రోజులలో 'స్టెప్పులు' వెయ్యటం అంటే లెక్కలలో వేసే 'స్టెప్పులు', నాగేశ్వరరావు సినిమాలలో వేసేవి కాదు.) తర్వాత ఏమి చెయ్యాలో తెలియ లేదు.

నేను చేసిన మేరకి పట్టుకెళ్ళి మళ్ళా మేష్టారిని ఆశ్రయించేను. ఆయన అది చూసి, చేసిన మేరకి ఒప్పుగానే ఉందన్నారు.

"తర్వాత ఏమిటి చెయ్యాలో ఇప్పుడు చెప్పండి!"

"ఇంతవరకు ఎలా చెయ్యాలో ఎవ్వరు చెప్పేరు?"

"ఎవ్వరూ చెప్ప లేదు. నేనే చేసేను."

"ఇంతవరకు బాగానే చేసేవని చెబుతున్నాను కదా. ఇటు పైన కూడా మూడొంతులు బాగానే చేస్తావు. నేను మంచి వాడిని కనుక నువ్వు చేసింది తప్పో ఒప్పో చెబుతున్నాను. నువ్వు బయటి ప్రపంచం లోకి వెళ్ళిన తర్వాత నీ వెనకాతల కూర్చుని ఏది తప్పో, ఏది ఒప్పో ఎవ్వరూ చెప్పరు. ఏ దారెంట వెళ్ళలో కూడ ఎవ్వరూ చెప్పరు. నీ అంతట నువ్వే నిశ్చయించుకోవాలి. తప్పు చేస్తే అది గుర్తించి వెనక్కి తగ్గాలి. నువ్వు చేసే పని తప్పో, ఒప్పో గుర్తించ గలిగే స్థోమత నీకు ఎప్పుడైతే వస్తుందో అప్పుడే నువ్వు 'రిసెర్చి' చెయ్య గలవు. గట్టు మీద కూర్చుని చూస్తూ ఉంటే ఈత రాదు; నీళ్ళల్లోకి దిగాలి, కాలు తడవాలి."

హైజెన్‌బర్గ్ శిష్యుడి దగ్గర ఫిజిక్సు నేర్చుకుంటున్నానని గర్వ పడనా? నా ప్రాణాలు తోడేస్తున్నాడని ఏడవనా?

మొత్తం మీద 'ప్రయత్నిస్తే విఫలుణ్ణి అవుతానేమో' అనే భయం, బెదురు పోయాయి. ధైర్యం తెచ్చుకుని ఒకొక్క ప్రశ్ననే నరుక్కుంటూ వస్తున్నాను. నా శక్తి మీద నాకు విశ్వాసం పెరుగుతోంది. ఈ సమయంలో ఈ పరీక్ష వచ్చింది. ఈ పరీక్షలో బాగా చేసి గెర్హార్డ్ బ్లాస్ మీద కసి తీర్చుకోవాలనే పంతం పెరిగింది. ఇలా అనుకుంటూ, భోజనం చెయ్యటానికి సాయంత్రం ఇంటికి వచ్చి తలుపు తెరుచుకుని లోపలికి వస్తూ ఉంటే ఇంట్లో అంతా టి. వి. చుట్టూ మూగి ప్రెసిడెంట్ కెన్నడి ఏదో మాట్లాడుతూ ఉంటే,

‘ఉష్’ అని నా వైపు చూసి, అంతా ఏకాగ్రతతో వింటున్నారు. ప్రెసిడెంట్ కెన్నడి క్యుబా చుట్టూ నావిక దిగ్బంధం చేస్తున్నామని ప్రకటిస్తున్నాడు.

ప్రెసిడెంటు మాట్లాడటం అయిపోయిన తర్వాత నాలాంటి తమంధాలకి అర్థం అయిందో లేదో అని, ప్రెసిడెంటు ఏమన్నాడో విడమర్చి చెబుతున్నారు చెట్ హంట్లే, డేవిడ్ బ్రింక్లే అనే ఇద్దరు పాత్రికేయులు. వాళ్ళు చెప్పిన మాటల సారాంశం ఏమిటంటే, రేపు తెల్లారేసరికి ఈ ప్రపంచం ఉంటుందో లేక హైడ్రొజెన్ బాంబు పేలుళ్ళలో భస్మం అయిపోతుందో ఎవ్వరికీ తెలియదు.

ఈ పరిస్థితిలో ఫిజిక్సు పరీక్ష కి తయారవటం సుసంగతం కాదేమో అనిపించింది. నేను కాకినాడ లో ఇంజనీరింగు చదువుతూన్నప్పుడు దరిదాపుగా ఇటువంటి సంఘటననే ఎదుర్కున్నాను. రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాలలో ఎవ్వరో పరుగెట్టుకొచ్చి, ఆ రాత్రి ‘టైడల్ వేవ్’ వస్తోందిట అని వార్త అందించేరు. కాకినాడ ఉరంతా దరిదాపు సముద్ర మట్టం లోనే ఉంది. అందునా ఇంజనీరింగు కాలేజి వెనక ఉన్న సరుగుడు తోటలు దాటుకు వెళితే అక్కడే ఒక మైలు దూరంలో సముద్రం ఉంది. టైడల్ వేవ్ వస్తోంది అన్న వార్నింగు వచ్చింది. ఇప్పుడు ఏమిటి చేస్తాం? ఈ రాత్రి అకస్మాత్తుగా ఎక్కడికి పోతాం? తుని వెళ్ళే ఆఖరి బస్సు ఈ పాటికి వెళ్ళిపోయి ఉంటుంది. అసలు టైడల్ వేవ్ వస్తోందన్న విషయం ఎవరు చెప్పేరు? ఇదెంత వరకు నిజం? చెప్పిన వాళ్ళ మాట మీద మనకి నమ్మకం ఎంత? ఇలా ఎన్నో ప్రశ్నలు పుట్టేయి. పిండిప్రోలు వెంకటరావు అంతకు ముందే వేసుకున్న ప్లేను ప్రకారం రాజమండ్రి వెళ్ళిపోతున్నాని చెప్పి హాస్టల్ వదలి వెళ్ళిపోయేడు. నాకు తెలుసున్న మరికొందరు ఏ సాకు చెప్పకుండానే టైడల్ వేవ్ ని తప్పించుకుందికి ఊరు దాటి వెళ్ళిపోయేరు. లోపల బితుకు బితుకు మంటోంది తప్ప ఏమి చెయ్యటమో తెలియ లేదు. అప్పుడు ఎవ్వరో అన్నారు, “చూడండి. ఇక్కడ మన ప్రొఫెసర్లు పెళ్ళాం బిడ్డలతో సంసారాలు చేస్తూ ఉన్నారు కదా. వాళ్ళెవ్వరూ ఎక్కడికీ వెళ్ళటం లేదు. వాళ్ళకి లేని భయం మనకెందుకు?” అలా మొండి ధైర్యం తో అక్కడే ఉండి పోయేం. తెల్లారి లేచి చూసుకుంటే టైడల్ వేవూ లేదు, చిట్టి కెరటమూ లేదు.

ఇప్పటి పరిస్థితి కూడ అలాగే ఉంది. కెన్నడీ, మేక్‌నమారా, రస్క్, సేలింజర్ వీళ్ళంతా సంసారాలు చేస్తున్నారు కదా. వాళ్ళకి మన కంటె ఆస్తులూ, అంతస్తులూ, ఆభరణాలు ఎక్కువే కదా. యుద్ధం వస్తే మనకంటె వాళ్ళే ఎక్కువ నష్టపోతారు.  భయపడీ, బెంగ పెట్టుకునీ సాధించ గలిగేది ఏమీ లేదు. పౌరుష, పురాకృతాలలో ఏది ప్రాముఖ్యం? ప్రయత్నం పౌరుషం, పర్యవసానం దైవికం. కనుక, 'అన్నమైతే ఏమిరా, సున్నమైతే ఏమిరా ఈ పాడు పొట్టకి అన్నమే వేదామురా' అని యుగంధరుడు అన్నట్లు, చదివితే నేమిటి, చదవక పోతే నేమిటి, రేపేమౌతుందో తెలియని ఈ తరుణం లో చదివితేనే సరిపోతుంది కదా అని గుండె దిటవు చేసుకుని, పరీక్షకి తయారు కావటం మొదలెట్టేను.

తెల్లారి లేచేను. లేచేను కనుక ఇంకా ప్రపంచం సురక్షితంగానే ఉందని నిర్ధారించుకున్నాను. ఇంకా నయం. ప్రపంచం పేలిపోబోతోందన్న సాకుతో పరీక్షకి చదవకుండా ఉంటే నా నసీబు పేలిపోయి ఉండేది.

మెల్లిగా అక్టోబరు 28 నాటికి క్యూబా తెచ్చిపెట్టిన విషమ స్థితి అదుపులోకి వచ్చింది కాని, ఇంకా ఇండియా–చైనా సరిహద్దులలో సద్దు మణగ లేదు. అటు ఉత్తరాన అక్‌సై చిన్ లోను, ఇటు ఈశాన్యాన్ మెక్‌మేన్ రేఖని దాటి చైనా సేనలు బాగా లోపలికి చొరబడ్డాయి. ఆంబూరు కాద ఆటం బాంబు బద్దలవలేదు కాని, మన సైనికులు తొంబ తొంబలుగా చచ్చిపోయేరు. చైనా బంగాళాఖాతం వరకు తోసుకు వచ్చేస్తుందేమోనని కంగారు పడి నెహ్రూ అక్టోబరు 29 న లాంచనప్రాయంగా అమెరికా సహాయం అర్థించేరు. అమెరికా వారు యుద్ధ సామగ్రి సరఫరా చేసేందుకు సన్నద్ధులైయారు. ఆ సహాయం అందే లోగా కృష్ణ మీనన్ రాజీనామా చెయ్యాలని షరతు పెట్టి, వారం రోజులుల లోపున ముందు విమానాల మీదా, తర్వాత  పెద్ద పెద్ద ఓడల నిండా మిలియనుకి పైబడి తుపాకి గుళ్ళు, 40,000 లేండ్ మైన్ లు, లక్ష ఫిరంగి గుళ్ళు, రేడియోలు, వెరసి 60 మిలియన్ డాలర్లకి పైబడి విలువ చేసే యుద్ధ సామగ్రి ని పంపేరు. అగ్ర రాజ్యాలు చైనాని దూషించటం కూడ మొదలవటంతో చైన ఇక ముందుకి సాగ లేదు. కాని అమెరికా ఇండియాకి చేస్తూన్న సహాయం చూసి అసూయ పడో, కంగారు పడో, పాకిస్తాన్ కాష్మీర్ ని కెలకటం మొదలు పెట్టింది.

హిందీ, చీనీ భాయీ–భాయి ఇలా మంటల్లో కలిసిపోయే సరికి నెహ్రూ మానసికంగా కుదేలయిపోయేరు. నడ్డి విరిగిన పాము మీద మరో వేటులా అమెరికా వాళ్ళు నెహ్రూని మరింత చిన్నబుచ్చి అప్పుడు సహాయం చెసేరు.

ఈ సందర్భంలో డిట్రాయిట్ చుట్టుపట్ల ఉన్న భారతీయులం అంతా కలిసి డబ్బు పోగు చేసి ఇండియా పంపిద్దామనే సదుద్దేశంతో ఒక నాటకం వేసేం. హిందీ నాటకం. మేసానిక్ టెంపుల్ ఆడిటోరియం లో. ఐదు వేలు పోగు చేసేం. ఉన్న భారతీయులే తక్కువేమో, నాకు ఆ నాటకం లో ఒక పాత్ర ఇచ్చేరు. నాకు హిందీ రాదన్నాను. రావక్కర లేదు అన్నారు. నేనొక ద్వారపాలకుడిని, గిరిష్ షా మరొకడు. ఇద్దరూ చెరో ఈటె పట్టుకుని గంట సేపు అలా మాట్లాడకుండా నిలబడ్డాం – మన దేశం కోసం. నాటకం లో వేషం వెయ్యటం ఇదే మొదటి సారి.

నవంబరు 21 న అమెరికా క్యూబా మీది దిగ్బంధాన్ని సడలించింది. కాకతాళీయంగా, అదే రోజున చైనా అక్సైచిన్ భూభాగాన్ని అట్టేపెట్టుకుని, అస్సాం, నాగా లేండ్ ప్రాంతాల నుండి సైన్యాన్ని వెనక్కి మళ్ళించింది.

# ఉద్యోగాన్వేషణ లో

డిట్రాయిట్ వచ్చి ఏణ్ణర్ధం కావస్తోంది. ఇంకొక ఆరు నెలలలో  మాస్టర్స్ డిగ్రీ వచ్చేస్తుంది. “రెండేళ్ళల్లో తిరిగొచెస్తానమ్మా” అని చెప్పి వచ్చిన పెద్దమనిషిని కనుక న్యాయంగా ఆలోచిస్తే ఇహ ఇంటికి వెళ్ళిపోవాలి. ఈ రెండేళ్ళల్లోనూ ఖర్చులు పోను నేను కూడబెట్టిన డబ్బులతో అమెరికా వచ్చేముందు విమానం టికెట్టు కొనటానికి చేసిన 800 డాలర్లు అప్పు తీర్చేయగా నాలుగు వందలు మిగిలేయి. ఈ డబ్బు తిరుగు ప్రయాణపు టిక్కెట్టుకి చాలదు. అన్నయ్య చెప్పినట్లు ఈత కొట్టటమైనా నేర్చుకున్నాను కాను.

ఆలోచించగా రెండే రెండు ఉపాయాలు కనబడ్డాయి. ఒకటి, ఎక్కడో ఒక చోట పి. హెచ్. డి. లో చేరిపోవటం. రెండో ఉపాయం ఉద్యోగంలో చేరటం. ఇవి అనుకున్నంత సులభంగా అయే పనులు కావు కనుక ఎందుకైనా మంచిదని రెండు మార్గాలూ అన్వేషించటం ఒక్క సారే మొదలుపెట్టేను.

ఉద్యోగాలు వెతకటం లోనూ, పిల్లలని కనటం లోనూ చిన్న చిన్న సూక్ష్మాలు ఉన్నాయి. పిల్లలు కావాలని తపన పడే వాళ్ళు ఎంత తొందర పడితే అంత ఆలశ్యం అవుతుందంటారు. ఉద్యోగాలు వెతుక్కునేటప్పుడూ ఇదే పరిస్థితి. మనం తొందర పడకూడదు. అలాగని ఇంటి దగ్గర కూర్చుని “ఋణం కృత్వా” కాకపోయినా “ఘృతం పిత్వా” చేస్తూ కూర్చుంటే బేంకులో ఉన్న నాలుగు వందలూ తిన్న తిండి అరిగే లోగా హరించుకు పోతాయి. అసిస్టెంటుషిప్పు డబ్బులతో బతికిన నా పరిస్థితే ఇలా ఉంటే ఇంటి నుండి డబ్బులు తెచ్చుకుంటూన్న రామినేని అచ్యుతరావు, వాసిరెడ్డి సత్యనారాయణ ల తొందరకి హద్దులు లేకుండా ఎలా ఉంటుంది? అప్పటికే అచ్యుతరావు ఉద్యోగాన్వేషణలో కొన్ని నెలలబట్టి ఉన్నాడేమో ఉద్యోగం సంపాదించటంలో కాకపోయినా వెతకటంలో ఆరితేరిపోయేడు. అందుకని ముగ్గురం కలసి ఉద్యోగాలు వెతకటం మొదలుపెట్టేం.

ఈ తెల్ల వాళ్ళు మనకి ఉద్యోగాలు ఇస్తారా అని ఒక అనుమానం. ఉద్యోగాలు చేస్తూన్న భారతీయులు లేకపోలేదు కాని లోలోపల ఈ అనుమానం పీకుతూ ఉండేది. కేంపస్ లో జరిగే రెండు మూడు ఇంటర్వ్యూలకి వెళ్ళేను.

"నీకు అనుభవం ఉందా?"

"ఉంది. భిలాయిలో ఉక్కు కర్మాగారంలో ఉద్యోగం చేసేను." ఫోర్డ్ కంపెనీ వాళ్లకి ఒక ఉక్కు కర్మాగారం కూడా ఉంది, డిట్రాయిట్ లో!

"అమెరికాలో ఏమైనా అనుభవం ఉందా?"

ఇంటికి బిచ్చగాళ్ళు వచ్చినప్పుడు నోటితో లేదనకుండా చేతితో లేదనమని మా అమ్మ చెప్పేది. దానిని ఈ సందర్భానికి ఎలా అనువర్తించాలా అని జోరుగా ఆలోచించేను.

"మా ప్రొఫెసరు దగ్గర రిసెర్చి అసిస్టెంటుగా పని చేసేను."

వాడికి కావలసిన సమాధానం అది కాదని నాకు తెలుసు. నేను ఏ ఫోర్డు కంపెనీలోనో ఏ మస్టేంగ్ కో రూపకల్పన చేసేనని చెప్పాలి. కాని నేను అటువంటి పనులేమీ చెయ్యలేదు.

ఫోర్డు కంపెనీ, మస్టేంగూ అంటూంటే కొన్ని విషయాలు గుర్తుకు వస్తున్నాయి. ఎందుకు రావు. డిట్రాయిట్ కారుల నగరం. ఎంతో ప్రజాదరణ పొందిన రేంబ్లర్ ని ప్రవేశపెట్టిన జార్జి రోమ్నే పేరు ఇంటింటా మోగి పోయిన రోజులవి. అప్పటికి రెండు, మూడేళ్ళ క్రితమే ఎడ్సెల్ అనే పేరుతో ఒక కారు తయారు చేసి అది పరిపూర్ణంగా విఫల మవటంతో, మట్టి కరిచి, దెబ్బ తిన్న ఫోర్డు కంపెనీ ఆ పరాభవం నుండి ఎలా గైనా కోలుకోవాలనే తాపత్రయంతోటీ, రేంబ్లర్ గణించిన ప్రజాదరణ ఇచ్చిన స్పూర్తి తోటీ ఈ మస్టేంగు ప్రణాళిక మొదలు పెట్టింది. ఈ సమయంలోనే జెర్మనీ నుండి దిగుమతి

అవుతూన్న ఫోక్స్ వాగెన్ వారి చిన్న కారు బీటిల్ అమ్మకం పెరగటం కూడ ఫోర్డ్ కంపెనీ వారు గమనించే ఉంటారు. ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని, రథంలా కాకుండా కొంచెం చిన్నగా, ముద్దుగా, వయస్సులో ఉన్న కుర్రకారు అభిరుచులకి అనుకూలంగా ఒక "స్పోర్ట్స్ కారు" లాంటి కారుని తయారు చేసే ఉద్దేశంలో పడ్డారు. ఈ సారి, కొంచెం ముందు జాగ్రత్తతో, కారుని తయారు చేసే ముందు కారు ఆకారానికి ఒక బంక మట్టి నమూనాని చేసి, దానికి రంగులు పులిమి, అచ్చం నిజం కారులా కనిపించేటట్టు చేసి, దానిని ఊరూరా తిప్పి, ప్రజల (ముఖ్యంగా పిన్న వయస్కుల) అభిప్రాయం సేకరించటం మొదలు పెట్టేరు. ఈ సందర్భంలో ఆ నమూనా మా యూనివర్శిటీకి కూడా వచ్చింది. ప్రజలు విరగబడి చూసి ఆమోదాన్ని ప్రకటించేరు. నేనూ ఆమోదాన్ని ప్రకటిస్తూ "మీ కంపెనీలో నాకొక ఉద్యోగం ఇస్తారా?" అని ఉత్తరం రాసేను.

ఇలా ఫోర్డు కంపెనీని ఎంపిక చేసి దాని మీద గురి పెట్టటానికి మరొక కారణం ఉంది. డిట్రాయిట్ లో ఉన్న నాలుగు కార్ల కంపెనీలలోను ఫోర్డు కంపెనీ వారు కార్మికుల ఎడల కొంచెం సానుభూతి ఎక్కువ ఉన్న కంపెనీ అని చెప్పుకునే వారు. అందుకని కార్ల కంపెనీలలో పనిచేసే కార్మిక సంఘం కంపెనీ యజమానులతో జీత భత్యాల విషయంలో సంప్రదించే వేళల్లో, సమ్మె చెయ్యటం అనే బెదిరింపుని ఆయుధంగా ఉపయోగించవలసినప్పుడు సమ్మె చేస్తామని ముందుగా ఈ ఫోర్డు కంపెనీని ఎన్నుకుని బెదిరించేవారు. ఫోర్డు కంపెనీ కార్మిక పక్షపాతి గనుక త్వరగా లొంగదీసుకోవచ్చనిన్నీ, వీరు లొంగితే అదే నియమ నిబంధనలకి జెనరల్ మోటర్సూ, క్రైస్లరూ, అమెరికన్ మోటర్సూ లొంగుతాయనీ వీరి నమ్మకం. "ఇవ్వనమ్మ ఎలాగూ ఇవ్వ లేదు, ఇచ్చే ముండవి నీకేం పోయేకాలం వచ్చిందే" అనాట్ట వెనకటికి ఒక బిచ్చగాడు. అలా ఉంది ఈ కథ! ఇంతగా విశ్లేషణ చేసేను కదా, వెధవది చిన్న ఉద్యోగం ఇవ్వక పోతారా అని వీరిని ఎంపిక చేసి అడిగేను. ఇవ్వలేదు.

మరొక సారి మరొక ఇంటర్వ్యూకి వెళ్ళేను. వాడు నన్ను చూడగానే ఇండియా గురించి వాకబు చేసేడు. ఇండియా అభివృద్ధికి నాలాంటి యువకులు చాల మంది కావాలి అన్నాడు.

ఉద్యోగం ఇచ్చే వాడితో ఏకీభవించకపోతే బాగుండదు కదా అని, "అవును, కావాలి" అన్నాను.

"అలాంటప్పుడు నీ లాంటి యువకులు మీ దేశం వెళ్ళి మీ దేశాన్ని ఉద్ధరించాలి" అన్నాడు.

"ఉద్ధరించేవు, పో!" అందామనుకుని అనలేదు.

ఇలా ఉద్యోగాలు వెతుక్కుంటూన్న రోజులలోనే నాకూ, సత్యనారాయణకీ లివర్‌నాయ్ ఎవెన్యూ మీద ఒక వ్యాపారస్తుడితో పరిచయం అయింది. అతని పేరు రాబర్ట్‌ప్లంబ్. నడివయస్సొంటుంది. ఒకసారి గుండెపోటు కూడా వచ్చింది. అందుకని ఉన్న ఉద్యోగం వదిలేసి చాందినీలు (awnings) తయారుచేసి అమ్మే వాడు. చాందినీఅంటే గుమ్మం మీద ఎండ, వాన పడకుండా ఉండటానికి ఖాకి గుడ్డలాంటి గుడ్డతో చేసే చూరు లాంటి విశేషం. రకరకాల అవసరాలకి తగ్గట్టు రకరకాల చాందినీలు చేయించి అమ్మేవాడు. ఒత్తిడిలేని వ్యాపారమేమో, అతనూ, అతనిభార్యా కబుర్లు చెప్పుకుంటూ షాపులో కూర్చునేవారు. రోడ్డు వెంబడి వెళుతూన్న మమ్మల్ని పలకరించేవాడు. దారిలో చలి వేసేదేమో మాకూ ఆయన కొట్లో కొంతసేపు కూర్చుంటే ఒళ్ళు వెచ్చబడేది. అతను, "రావూ! ఎందుకొచ్చిన ఐశ్వర్యం. ఒక డోనట్టు తిని, కాసింత కాఫీ తాగటానికి వీల్లేకపోతోంది!" అని ఎప్పుడూ వాపోయేవాడు. మనకి మనదేశంలో ఇడ్లీ, కాఫీ ఎలాగో ఇక్కడ వీళ్ళకి డోనట్టు, కాఫీ అలాగానుకొండి. తేడా అల్లా ఆ డోనట్టు (గారె ఆకారంలో ఉంటుంది) నిండా కొవ్వు, పంచదార తప్ప పోషకపదార్థలు సున్న. అవి రోజూ తింటే గుండెలో పోటు రాక ఏంచేస్తుంది? ఏమైతేనేం?ఈ రాబర్ట్ ఉప్లంబ్ మాకు ఆత్మీయుడైపోయాడు. నాకు ఎక్కడా ఉద్యోగం దొరకకపోతే తనే స్వయంగా కల్పించుకుని AmericanStandard అన్న కంపెనీలో తన స్నేహితుడికి సిఫార్సు చేసి నన్ను అక్కడికి పంపేడు. ప్లంబ్ మాట కాదనలేక వాళ్ళు ఇంటర్వ్యూ చెయ్యటం చేసేరు కాని ఉద్యోగం ఇవ్వలేదని చెప్పక్కర్లేదనే అనుకుంటున్నాను.




ఇలా కంచి గరుడ సేవ చేస్తూండగానే జూన్ నెల వచ్చేసింది. డిగ్రీ కూడ వచ్చేసింది. నెలవారీ వచ్చే రెండు వందల డాలర్ల చెక్కు రావటం మానేసింది. ఈస్ట్ లేన్సింగ్‌లో ప్రొఫెసర్ కినిక్ "పి. హెచ్. డి. లో చేరటానికి అడ్మిషన్ ఇప్పిస్తాను కానీ మూడు నెలల పాటు నీ డబ్బులతో బతకగలవా?" అని అడిగేరు. వేసంగి మూడు నెలలు, ఆ తర్వాత డిసెంబరు వరకు బతకటానికి నా దగ్గర ఉన్న నాలుగు వందలు సరిపోవు.

అప్పుడు వాసిరెడ్డి సత్యనారాయణ, "వేమూరి గారూ, విస్కాన్సిన్ లో బ్రౌన్స్ లేక్ అనే ఊరి దగ్గర సమ్మర్ జాబ్‌లు ఉన్నాయిట, వస్తారా?" అని అడిగేడు.

"ఏమి పనేమిటి?" .

"సమ్మర్ జాబ్ కి ఏదైతే నేమిటి. ఏదో రిసార్ట్ ట. ఉండటానికి గది, తినటానికి తిండి పెట్టి, గంటకి మూడు డాలర్లు ఇస్తారుట. వారానికి నలభై గంటలంటే 120 డాలర్లు. నెలకి 360. యూనివర్సిటీ వారు మీకు ఇచ్చిన అసిస్టెంటుషిప్పు కంటె ఎక్కువ. మూడు నెలలు పని చేసేమంటే దరిదాపు వెయ్యి డాలర్లు మిగులుతాయి. నాకు విమానం టికెట్టు కొనుక్కుందుకి సరిపోతుంది. మీ జేబులో ఎంత కాదన్నా ఓ పన్నెండు, పదమూడు వందలు ఉంటాయి. ఈస్ట్ లేన్సింగ్‌లో పి. హెచ్. డి. లో చేరిపోవచ్చు," అని గుక్క తిప్పుకోకుండా చెప్పేడు.

సమ్మర్ రిసార్ట్ లో ఉద్యోగం అంటే ఏ రకం పని అయి ఉంటుందా అని ఆలోచించటం మొదలు పెట్టేను. అప్పుడు చావు వార్త చల్లగా చెప్పేడు. “మనం అక్కడ ఉన్న రెస్టరాంటులో గిన్నెలు కడగాలి.”

వాసిరెడ్డి సత్యనారాయణ ఇండియాలో గొప్పింటి కమ్మోరి బిడ్డ. ఇంటికి వెళ్ళగానే లక్షకి పైబడి కట్నం ఇచ్చి, పిల్లని ఇచ్చి, ఇల్లరికం ఉంచుకోటానికి తయారుగా ఉన్నారు. నాకేముంది? బూడిద! సత్యనారాయణకి లేని నామోషీ నాకు ఎందుకు? అయినా మనస్కరించలేదు.

డిష్ వాషింగ్ ఉద్యోగం అనగానే 3.8/4.0 గ్రేడ్ పోయింట్ ఏవరేజి తో మాస్టర్స్ డిగ్రీ సంపాదించుకున్న నేను, ఇంత బతుకూ బతికి ఇంటెనక్కాల చచ్చినట్లు, ఇప్పుడు గిన్నెలు కడగటమా? మనస్సు తటపటాయిస్తోంది.

“నాకు డబ్బు అవసరం. నేను ఈ రోజే వెళ్ళిపోతున్నాను. అక్కడ పరిస్థితి చూసి మీకు ఫోను చేస్తాను. ఈ లోగా ఆలోచించుకోండి” అని చెప్పి, సత్యనారాయణ వెళ్ళిపోయేడు, ఉద్యోగంలో చేరటానికి.

మర్నాడు ఫోను చేసేడు. “మీరు అనుకొంటున్నంత పాడుగా లేదు. వెంటనే బయలుదేరి వచ్చెయ్యండి. నాకు కూడా తోడు ఉంటుంది” అని బ్రతిమాలేడు. అచ్యుతరావు కూడ, “డిగ్నిటీ అఫ్ లేబర్” అంటూ వెళ్ళమని ప్రోత్సహించేడు.

ఆ మాట వినగానే లక్ష్మి ఒంటి కాలి మీద లేచింది. అంత “డిగ్నిటీ అఫ్ లేబర్” అయితే నువ్వు కూడా ఆ పని ఎందుకు చెయ్యకూడదూ? మా నాన్న పంపుతూన్న డబ్బులుతో ఇంట్లో కూర్చుని తినకపోతే!"

గ్రేహౌండ్ బస్సు వాడు హొటేల్ కి ఎదురుగా ఆపేడు. చిన్న సంచితో దిగేను. సత్యనారాయణని పట్టుకోవటం పెద్ద కష్టం కాలేదు. వంట గదికి మీదని అటక లాంటిది ఒకటి ఉంది. దానిని ఇంగ్లీషులో లాఫ్ట్ అంటారు. అదీ మా ఇద్దరికీ బస.

బ్రౌన్స్ లేక్ అనే ఊరు మిల్వాకీ కి నైరుతి దిశలో, బర్లింగ్టన్ వెళ్ళే దారిలో ఉంది. అక్కడ అదే పేరుతో ఉన్న ఒక సరస్సు ఒడ్డున ఒక హొటేలు, గాల్ఫ్ కోర్సు, గుర్రాల మీద తిరగటానికి సదుపాయాలు ఉన్నాయి. షికాగో, మిల్వాకీ నగరాలలో ఉన్న పెద్ద ఉద్యోగస్తులు, సకుటుంబంగా ఒక వారమో, రెండు వారాలో ఇక్కడ విశ్రాంతి తీసుకోటానికి వస్తూ ఉంటారుట. తిండి తినటం, సరస్సులో ఈత కొట్టటం, గుర్రాల మీద తిరగటం, గాల్ఫ్ ఆడుకోవటం, మరే పనీ లేక పోతే చెట్ల కింద కూర్చుని పానీయాలు తాగుతూ కాలక్షేపం చెయ్యటం. ఇదీ అక్కడికి వచ్చే వారి కార్యక్రమం.

రయన్ వాకర్ అక్కడి షెఫ్, అంటే పాచకుడు లేదా వంట వాడు. అతనే మా మీద పెత్తందారూ. పడవలకీ, విమానాలకీ పైలట్ ఎలాగో వంట గదిలో పాచకుడు అంతటి వాడు. అతను ఏది చెబితే అదే వేదం.

వంట గదిలో ఏది కావలిస్తే అది నిరభ్యంతరంగా, ఎవ్వరి అనుమతి అడగకుండా తినొచ్చు అని ముందస్తుగా చెప్పేడు రయన్. సత్యనారాయణ, నేనూ, ఇద్దరమూ శాకాహారులమే. మేము తినగలిగేవి లేకపోలేదు, కాని చాల తక్కువ:  పాలు, పళ్ళు, ఐస్ క్రీము, కాఫీ, రకరకాల పైలు, కేకులు, మొదలైనవి. వాటితో కడుపు నిండి పోయేది. అప్పుడప్పుడు కావాలంటే స్పగేటీ, మేకరోనీ లాంటి పదార్థం ఏదో ఒకటి రయన్ చేసి పెట్టేవాడు. తిండి గొడవ ముందుగా ఎందుకు చెప్పేనంటే, వంట గదిలో పని చేసే సిబ్బంది అంతటినీ 'హెల్ప్' అనే వారు. వంట గదిలో నియమం ఏమిటంటే, ఏ భోజనం వేళప్పుడైనా సరే 'హెల్ప్' కి ముందు తిండి పెట్టెస్తారు – ఆ తర్వాతే అతిథులకి సేవలు, వడ్డనలూను.

తిండి తినటం అయింది కనుక ఎంగిళ్ళు, అంట్ల గిన్నెల సంగతులు. అక్కడ రెండు రకాల గిన్నెలు ఉండేవి. మొదటి రకం "పాట్స్ అండ్ పేన్స్" – అంటే గంగాళాలు, గుండిగలు, పెనాలు, మొదలైన భారీ వంట పాత్రలు. రెండవ రకం "చైనా అండ్ సిల్వర్" – అంటే పళ్ళేలు, కప్పులు, సాసర్లు, గాజు గ్లాసులు, స్టీలు చెంచాలు, మొదలైనవి. మాది చైనా అండ్ సిల్వర్ డిపార్ట్మెంటు కనుక బతికి పోయేం. "పాట్స్ అండ్ పేన్స్" డిపార్ట్మెంటు వాళ్ళు ఇండియాలో మన ఆడ వాళ్ళు కచిక, బూడిద రాసి కొబ్బరి పీచుతో పామినట్లు పామాలి. ఏదో గుడ్డిలో మెల్ల.

నిజంగా గిన్నెలు కడగటం ప్రతి భోజనం తర్వాత రెండు గంటలలో అయిపోయేది. చేతులకి రబ్బరు తొడుగులు వేసుకుని, బట్టల మీద ఏప్రన్ వేసుకుని, పళ్ళేలలో మిగిలి ఉన్న పదార్థలని స్క్రేపర్ తో గార్బేజి డబ్బా లోకి కాని, డిస్పోసర్ లోకి కాని తోసేసి, పళ్ళేలని డిష్ వాషర్ లో పెట్టటం, డిటర్జెంటు వేసి స్విచ్చి నొక్కటం. రెండు మూడు పెద్ద పెద్ద డిష్ వాషర్లు ఉండేవి. ఆ మూడింటినీ నింపేసి ఒక అరగంట పాటు కాఫీ బ్రేకో, ఐస్ క్రీం బ్రేకో తీసుకునే సరికి కడగటం, పొడిబార్చటం (ఎండబెట్టటం అనటానికి వీలు లేదుగా) రెండూ అయిపోయేవి. అప్పుడు వాటిని తీసి దొంతులుగా అమర్చే వాళ్ళం.

అక్కడ సెర్వర్లు అంతా తెల్ల కుర్రాళ్ళే. వాళ్ళల్లో చాల మంది విద్యార్థులే. భోజనాలకి వచ్చే అతిథులని పలకరించటానికి 'మేటర్ డి' గా ఒక పెద్దాయన ఉండేవారు. గ్లాసులలో నీళ్ళు పొయ్యటం, ఖాళీ కంచాలని లోపలికి తీసుకు వచ్చి, బల్లలని శుభ్రం చెయ్యటం సాధారణంగా ఆడపిల్లల పనులు. వంటగదిలో పాచకుడుకి సహాయం చెయ్యటానికి ఆడా, మగా కూడ ఉండే వారు. అడపా, తడపా మేము కూడ చిన్న చిన్న పనులు చేసిపెట్టేవాళ్ళం.

ఇక టిప్పుల సంగతి. అతిథులు ఇచ్చిన టిప్పులు సెర్వర్లు, వంటవాడు, వంట సిబ్బంది, బల్లలు శుభ్రం చేసే అమ్మాయిలూ ఒక ఫార్ములా ప్రకారం పంచుకునే వారు. గిన్నెలు కడిగే వారికి అందులో వాటా లేదన్నారు. ముష్టిలో వీరముష్టిలా మేమిద్దరం ఆ టిప్పులలో కొంచెం వాటా కోసం ప్రయత్నించి చూసేం. "అది ఆనవాయితీ కాదు, ఇప్పుడు మార్చితే చిక్కులు వస్తాయి" అని రయన్ నచ్చ చెప్పేడు. ఈ టిప్పులు ఇవ్వటంలో కూడ కొన్ని కిటుకులు ఉన్నాయి. షికాగో నుండి వచ్చిన మేక్మిల్లన్ అనే ఆయన మొదటి రోజునే 'జే' అనే కుర్రాడికి పాతిక డాలర్లు టిప్పు ఇచ్చేసేరు. ఇచ్చి, తన అవసరాలన్నీ సరిగ్గా చూస్తే వెళ్ళిపోయేటప్పుడు మళ్ళా ఏదో ఇస్తానన్నారు. ఆ రోజు అదొక పెద్ద వార్త అయిపోయింది. ఆ రోజు నుండి మా జే ఆ మేక్మిల్లన్ గారి సర్వావసరాలూ శ్రద్ధగా చూసుకునేవాడు.

ఇక దైనందిన కార్యక్రమం. తెల్లారి లేచే సరికి ఒకావిడ పెద్ద పెద్ద పెర్కొలేటర్లలో కాఫీ కాచి తయారుగా ఉంచేది. పాచకుడు వచ్చి చిన్న గంగాళం లాటి గిన్నెలో ఓట్ మీలు తయారు చేసి ఉంచేవాడు. అంత కంటె కొంచెం చిన్న గంగాళంలో కోడి గుడ్లని కొట్టి ఆ సొనలన్నిటి తో నింపేవాడు. అలాగే మరొక

గుండిగలో పేన్ కేక్‌లూ, వాఫుల్‌లూ చెయ్యటానికి పిండి కలిపి అట్టేపెట్టేవాడు. ఓట్ మీలు, గుడ్లు, పేన్ కేకులూ వగైరాలు ప్రతి రోజూ మెన్యూలో ఉండేవే. నిజానికి ప్రతి రోజూ బ్రెక్‌ఫెస్ట్ మెన్యూ దరిదాపుగా ఒకటే. లంచి, డిన్నర్ లకి మెన్యూ మారుతూ ఉండేది.

అలాగే మరొక పాత్రలో వెన్న కడ్డీలు వేసి వాటిని కరిగించి (మరిగించి కాదు) ద్రవ రూపంలో ఉంచుకునే వాడు. అక్కడ రెండు రకాల టోస్టర్లు ఉండేవి. ఒక దానిని జిలుగు చట్రం అనవచ్చు. గుండ్రంగా తిరుగుతూన్న ఆ జిలుగు చట్రంలో ఒకటీ, ఒకటీ రొట్టె ముక్కలు పెట్టుకుంటూ పోతే, రెండవ పక్క నుండి కాలిన రొట్టె ముక్కలు బయటికి వచ్చేవి. రెండవది మన ఇళ్ళల్లో ఉండే టోస్టర్ లాంటిది – తేడా అల్లా ఈ టోస్టర్ లో ఇటు నాలుగు, అటు నాలుగు రొట్టె ముక్కలు పెట్టి కాల్చ వచ్చు. ఒక వాయి కాలిన తర్వాత మరొక వాయి. మొదటి పద్ధతిని కంప్యూటర్ పరిభాషలో "ఆన్–లైన్ ప్రోసెసింగు" అనీ, రెండవ పద్ధతిని "బేచ్ ప్రోసెసింగు" అనీ అంటారని తర్వాత తెలుసుకున్నాననుకొండి. టోస్టర్ లోంచి టోస్టు బయటకి రాగానే దాని మీద ఒక కుంచె తో కరిగించిన వెన్న రాసేవాళ్ళం.

పేరుకి ఎనిమిది గంటలు పని, కాని నిజానికి రోజుకి ఆరు గంటలకి మించి పని ఉండేది కాదు. పని లేనప్పుడు, మేము కూడ హొటేల్ కి వచ్చిన అతిథుల లాగే అక్కడ ఉన్న సదుపాయాలన్నిటిని అనుభవించేవాళ్ళం. సత్యనారాయణ మంచి బట్టలు వేసుకుని, చెట్ల నీడలో, జిన్ ఎండ్ టానిక్ చప్పరిస్తూన్న మేక్‌మిల్లన్ గారితోనూ, మిగిలిన హొటేల్ అతిథులతోనూ కబుర్లు చెబుతూ కూర్చునేవాడు.



నాకు ఈత కొట్టాలని ఉండేది. కాని ఈత రాదు. (అన్నయ్య చెప్పినట్లు ఈత నేర్చుకుని ఉండుంటే ఈ గిన్నెలు కడిగే ఖర్మ ఏమిటి? నిక్షేపంగా ఈత కొట్టుకుంటూ ఇండియా వెళ్ళిపోయి ఉండేవాడినేమో!) మా పాచకుడి కూతురు కేటీ కి ఈత, గుర్రపు సవారీ మొదలైనవి వచ్చు. ఆ అమ్మాయికి ఓ పద్దెనిమిది ఏళ్ళు ఉంటాయి. రోజూ వంట గదిలో చూసేవాడిని కనుక కొంచెం పరిచయం ఉంది. అందుకని కేటీ ని ఈత నేర్పమని అడిగేను. ఈత నేర్చుకునే ఉద్దేశం కంటె ఆ పిల్లతో నీళ్ళల్లో జలకాలాడుతూ, 'జిస్ దేష్ మే గంగా బహతీ హై' సినిమాలో పద్మినిని తలుచుకుంటూ ఈత నేర్చుకుంటూ ఉంటే అదొక రకం అనుభూతి అనుకొండి. ఈత అయిన తర్వాత, కేటీ గుర్రపు సవారీ కూడ నేర్పేది. తను ముందు కళ్ళెం పట్టుకుని కూర్చుంటే నేను వెనక కేటీ ని వాటేసుకుని కూర్చుంటే, గుర్రం చేత దౌడు తీయించేది. కేటీ తో కాలక్షేపం చెయ్యటం మరిగిన తర్వాత, వెధవ ఉద్యోగం లేక పోతేపోయిందిలే అనుకునేవాడిని.

రాత్రి భోజనాలయిన తర్వాత నిద్ర పోయే వరకు ఏమి చేస్తాం? ఆ హొటేల్లో ఒక మూలని ఒక పియానో ఉండేది. ఆ పియానో వాయించటానికి జూడీ అనే ఒక అమ్మాయి వచ్చేది. పాటలంటే సరదా ఉన్నవాళ్ళంతా అక్కడ చేరి జూడీ తో కలసి పాడటమో, లేకపోతే జూడీని అడిగి కావలసిన పాటలు పాడించుకోవటమో చేసేవారు. అప్పుడే మొదటి సారి "టై మి కేంగరూ డౌన్" అన్న పాట విన్నాను. రాల్ఫ్ హేరిస్ పాడిన ఆ పాట అప్పట్లో బాగా చెలామణీలో ఉండేదిట. అదే మొదటి సారి నేను వినటం.

"టై మి కేంగరూ డౌన్, స్పోర్ట్

టై మి కేంగరూ డౌన్”

అనే పల్లవిని మేమంతా రెండు సార్లు బృందగానం గా పాడితే, అసలు చరణాలు జూడీ పియానో మీద వాయిస్తూ పాడేది. అసలు పాటలో ఉన్న నేపథ్య సంగీతం సృష్టించటానికి మాకు మరొక వాయిద్యం కావలసి వచ్చింది. అది బుడబుడక్కుల వాడు డమరుకంతో చేసే శబ్దం లా, నీళ్ళల్లోంచి వస్తూన్న బుడగల మాదిరి వస్తుంది. అందుకని, నేను కిచెన్ లోకి వెళ్ళి ఒక పెద్ద పలచటి రేకు (కుకీ షీటు) ని పట్టుకొచ్చి, దానిని రెండుచేతులతోటీ రెండు కొసలనీ పట్టుకుని ఇటూ అటూ తాటించటం మొదలుపెట్టేను. కాకతాళీయంగా, ఆ ప్రకంపనంతో వచ్చిన శబ్దం నిజం రికార్డులో వచ్చిన శబ్దం లా ఉండటం తో నేనూ, జూడీ ఆప్త మిత్రులం అయిపోయేం.

ఇప్పుడు ఆ పాట సాహిత్యం ఇంగ్లీషులో చూపిస్తాను.

Tie Me Kangaroo Down Sport
Rolf Harris

SPOKEN: There's an old Australian stockman lying, dying. He gets himself up
onto one elbow and 'e turns to his mates, who are all gathered around and 'e says:

Singer: Watch me wallabies feed, mate
Watch me wallabies feed,
They're a dangerous breed, mate
So watch me wallabies feed

(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport
Tie me kangaroo down
Tie me kangaroo down, sport
Tie me kangaroo down

Singer: Keep me cockatoo cool, Curl,
Keep me cockatoo cool
Ah, don't go acting the fool, Curl
Just keep me cockatoo cool
(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport
Tie me kangaroo down
Tie me kangaroo down, sport
Tie me kangaroo down

Singer: 'n' take me koala back, Jack
Take me koala back
He lives somewhere out on the track, Mac
So take me koala back
(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport

- - - - - - - - - - -

Singer: Let me abos go loose, Lew

Let me abos go loose

They're of no further use, Lew

So let me abos go loose

(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport

- - - - - - - - - - -

Singer: And mind me platypus duck, Bill

Mind me platypus duck

Ah, don't let 'im go running amok, Bill

Just mind me platypus duck

(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport

- - - - - - - - - - -

Singer: Play your didgeridoo, Blue

Play your didgeridoo

Ah, like, keep playin' 'til I shoot thru, Blue

Play your didgeridoo

(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport

-----------

Singer: Tan me hide when I'm dead, Fred

Tan me hide when I'm dead

So we tanned his hide when he died, Clyde

And that's it hangin' on the shed!!

(Altogether now!)

Chorus: Tie me kangaroo down, sport!

-----------

ఆడవాళ్ళ వయస్సులు ఊహించటం కష్టమే కాని, జూడీ కి ఓ ముప్పై ఉంటాయని నా అంచనా. రూపవతే! బుజాల దిగువకి జారుతూన్న డర్టీ బ్లాండ్ జుత్తు ని పైకి ఎగదీసి, నిలువుగా మడతలు పెట్టి, వెనక ఒక పిన్నుతో ఆ జుత్తుని అదుపులో పెట్టేది. ముంగురులని సంరక్షణ లేకుండా ఒదిలేసేదేమో అవి ఆమె ముఖం మీద పడి దోబూచులాడుతూ ఉంటే అడుగు పెదవిని ముందుకి జాపి నోటితో గాలిని ఊది ఆ కురులని పైకి ఎగదోసేది. స్నేహశీలి. అందరితోటీ చనువుగా ఉండేది. ఒక శనివారం రాత్రి పది గంటల వరకు పియానో దగ్గర కూర్చుని పాటలు పాడి, తర్వాత అక్కడ సద్దు మణిగి పోవటంతో బారుకి వెళదాం అంటూ నన్ను తన కారులో లాక్కెళ్ళింది. బ్రౌన్స్ లేక్ చుట్టుపట్ల ఊరేమీ లేదు – ఈ ఒక్క రిసార్టు తప్ప. అందుకని పక్కనున్న బర్లింగ్‌టన్ వెళ్ళేం. అక్కడ ఒక బారులో బీరు తాగుతూ, రాక్ హడ్సన్, డోరిస్ డే లు నటించిన పిల్లో టాక్ సినిమాలో 'రోలీ పోలీ' పాటలాంటి పాటలు పాడుతూ, అల్లరి చేస్తూ, నెమ్మదిగా బయట పడేసరికి పన్నెండు దాటి పోయింది.

“ఇప్పుడు మళ్ళా హొటేల్ కి ఎక్కడ వెళతాములే, మా ఇంట్లో పడుక్కో, పొద్దుట తీసికెళ్ళి దింపేస్తాను” అంది జూడీ. ఇదే పరిస్థితిలో అబ్బాయి అమ్మాయిని “మా ఇంట్లో పడుక్కో” అంటే అమ్మాయి, “కాదు, కూడదు, నేను తిరిగి వెళ్ళిపోవాలి” అంటే అర్థం చేసుకోవచ్చు. ఇక్కడ పరిస్థితి తిరకాసాయె. నేనూ అలాగే ప్రవర్తిస్తే నన్ను “సిస్సీ” అనుకోవచ్చు కదా. కాదూ, కూడదు అని నేను ఆమెని అడిగితే నన్ను దింపి తిరిగి ఇంటికి వెళ్ళే సరికి ఏ రెండో అయిపోతుంది. అదీ మర్యాదగా అనిపించలేదు. అయినా వారింట పడుక్కుందుకి కొంచెం మొహమాట పడ్డాను. “నువ్వేమీ పంప్‌కిన్ వి అయిపోవులే. రేప్పొద్దుటే హొటేల్ దగ్గర దింపెస్తాను” అంటూ వెనకనుండి వచ్చి, రెండు భుజాల మీద చేతులు వేసి, వాటేసుకుని కారు దగ్గరకి తీసుకెళ్ళింది. ఇద్దరమూ చెరో చుక్కా వేసుకున్నాము కనుక నాకు అదేమీ అసభ్యపు చేష్టలా అనిపించ లేదు. అసభ్యపు ఆలోచనలు ఉన్న వాళ్ళకే ఇటువంటి చేష్టలు అసభ్యంగా కనిపిస్తాయని నాలో నేను సంజాయిషీ చెప్పుకుని, మరిక బెట్టు చెయ్యకుండా ఆమెతో వాళ్ళింటికి వెళ్ళేను.

మర్నాడు ఆదివారం. వేసవి కాలం కావటం వల్ల పొద్దుట అయిదు అయేసరికే భళ్ళున తెల్లారిపోయింది. అయినా ఒకంతట లేవ బుద్ధి కాలేదు. నా కంటె ముందుగానే జూడీ లేచి కాఫీ తయారు చేసి ఇచ్చింది. తర్వాత బ్రెక్‌ఫెస్ట్ తో పాటు బాతాకానీ. రాబోయే వారాంతంలో వీలు దొరికితే గాల్ఫ్ ఆడటం నేర్పుతానంది. తాపీగా తొమ్మిది అయేసరికల్లా నన్ను రిసార్టులో దింపేసింది.

పగటి పూట ఎంటర్‌టైన్‌మెంట్‌కి కేటీ, రాత్రి ఎంటర్‌టైన్‌మెంట్‌కి జూడీ. ఈ నేపథ్యంలో గిన్నెలు కడగటం నల్లేరు మీద మండి నడక అనిపించింది. అక్కడే మూడు నెలలూ ఉండిపోటానికి నిశ్చయించుకున్నాను.

# అభిముఖ సమావేశం

ఆదివారం పనిలోకి వెళ్ళగానే, "ఏం? గురువుగారూ, రాత్రి పడుక్కోటానికి గదిలోకి రాలేదేమిటి?" అని సత్యనారాయణ అడగనే అడిగేడు.

రూంమేట్లు ఉంటే కాలక్షేపానికి బాగానే ఉంటుంది కాని ఇటువంటి 'సొంత' విషయాలలో ముక్కు దూర్చి యక్ష ప్రశ్నలు వేస్తే నాకు ఇష్టం ఉండేదికాదు.

"బర్లింగ్‌టన్ వెళ్ళేను."

"ఎవరు తీసికెళ్ళేరు?"

అశ్వత్థామ హతః కుంజరః అన్నట్లు, "జే తో వెళ్ళేను" అన్నాను. అక్కడ పాతిక డాలర్లు టిప్పు పుచ్చుకున్న జే అనే వెయిటర్ ఒకతను ఉన్నాడని చెప్పేను కదా. ఈ సత్యనారాయణ వెళ్ళి ఆ జే (Jay) తో తనని కూడా ఒక సారి బర్లింగ్‌టన్ తీసికెళ్ళమని అడిగితే అసలు విషయం బయట పడితే అప్పుడు భుజాలు తడుముకోనక్కలేదు; జే (J) అన్నది జూడీ కి సంక్షిప్తం కనుక.

ఆ చిన్న గండంతో ఆ ఆదివారం గడిచిపోయింది. రాబోయే ఆదివారం కోసం ఎదురు చూడటం మొదలుపెట్టేను.

ఈ లోగా తంటసంలా, ఏవో కొంపలు అంటుకుపోతూన్నట్లు, సోమవారం మధ్యాన్నం రెండు గంటలకి నా పేర ఒక తంతివార్త వచ్చింది. అది ఆర్.సి.ఎ. కంపెనీ నుండి. "మేము నిన్ను చేరుకోవటానికి గత నాలుగు రోజులుగా ప్రయత్నం చేస్తున్నాము. ఈ టెలిగ్రాము అందిన వెంటనే ఈ దిగువ నంబరుకి కలెక్ట్ కాల్ చేస్తే ఇంటర్వ్యూకి ఏర్పాట్లు చేస్తాము. – బాబ్ బ్రూక్స్" అని దాని సారాంశం. నేను ఆర్.సి.ఎ. కంపెనీకి ధరఖాస్తు పెట్టిన జ్ఞాపకం కూడా లేదు.

వెంటనే పబ్లిక్ ఫోను దగ్గరకి వెళ్ళి ఆ కంపెనీకి కలెక్ట్ కాల్ చేసేను. వారు వెంటనే బయలుదేరి ఇంటర్వ్యూకి రమ్మని చెప్పేరు. "విమానం టికెట్టు ఎయిర్ పోర్ట్ లో తయారుగా ఉంచుతాం," అని చెప్పేరు. ఇహ బ్రౌన్స్ లేక్ నుండి ఎయిర్ పోర్ట్ కి ఎలా వెళ్ళడమన్నదే మిగిలిన ప్రశ్న.

ఇటువంటి సందర్భాలలో నా కంటే సత్యనారాయణ బాగా చొరవ ఉన్న మనిషి. అప్పటికే ఆ రిసార్ట్ లో ఉన్న అతిథులని చాలా మందిని పరిచయం చేసుకున్నాడు. వారిలో సర్వర్ కి మొదటి రోజే పాతిక డాలర్లు టిప్పు ఇచ్చిన పెద్ద మనిషి బ్రిటిష్ వాడనీ, అతను షికాగోలో ఏదో పెద్ద కంపెనీలో ఏదో చాలా పెద్ద స్థానంలోనే పని చేస్తున్నట్లు ఆరా తీసేడు. ఆయనతో నా కథనం చెప్పేడు. వెంటనే ఆయన, "దానికేమి భాగ్యం, నేను నా కారులో తీసికెళ్ళి ఎయిర్‌పోర్టులో దింపెస్తాను" అన్నాడు.

సాయంకాలానికల్లా ఇండియనాపొలిస్ ఎయిర్ పోర్ట్‌లో దిగేను. మొట్టమొదట నేర్చుకున్నది, ఈ ఊరు పేరు 'ఇండియానాపోలీసు' కాదనీ, 'ఇండియనాపొలిస్' అనీ. ఈ పాఠం కూడ నేను విమానాశ్రయంలో దిగి టేక్సీ చేయించుకున్నప్పుడు ఆ టేక్సీ డ్రైవరు చెప్పేడు: య కి దీర్ఘం లేదు, లి కి గుడిదీర్ఘం లేదు; రెండింటిని తేలికగా పలకాలి. ఆ టేక్సీవాడు చాల స్నేహభావంతో పలకరించి కబుర్లు మొదలు పెట్టేడు. నా వాలకం చూసి "దేశానికి కొత్తా?" అని అడిగేడు.

"మరీ కొత్త కాదు కానీ కొంచెం కొత్తే" అన్నాను.

"ఇండియనాపొలిస్ కి రావటం ఇదే మొదటిసారా?"

"అవును"

అలా అయితే నువ్వేమీ అనుకోనంటే మా వూరు కొంచెం చూపిస్తాను, నీకు తొందర లేదు కదా!"

"లేదు. అలాగే చూపించు"

"అయితే పక్క దారెంట తీసికెళతాను. నీకు టేక్సీ ఖర్చు ఎక్కువ అవకుండా మీటరుని ఆపెస్తాను," అంటూ మీటరుని ఆపేసి ఊరు చూపించటం మొదలు పెట్టేడు.

ఆ వూళ్ళో ఇండియన్ ముఖం కనిపించటం అదే మొదటి సారిట ఆ టేక్సీ మనిషికి.

రెండవ ప్రపంచ యుద్ధంలో పని చేసేడుట. ఎడం చేతి వేళ్ళు యుద్ధంలో పోయాయిట. వార్ వెటరన్ అన్న మాట. మా రోడ్డు క్రౌన్ హిల్ సిమెటరీ అనే శ్మశానం మధ్య నుండి వెళుతోంది. ఆ శ్మశానం గురించి చెప్పటం మొదలుపెట్టేడు.

"అమెరికాలో ఉన్న పెద్ద శ్మశానాలలో దీనిది మూడవ స్థానం!"

"---"

"దీని వైశాల్యం 550 యకరాల పై చిలుకే ఉంటుంది!"

"---"

"ఇందులో నూట ఏభై వేలకి పైగానే ఉన్నారు!"

"---"

"ఈ సిమెటరీలో ప్రతి అల్లాటప్పయ్యనీ పాతి పెట్టటానికి ఒప్పుకోరు."

"జాన్ డిల్లింజర్ ని ఇక్కడే పాతిపెట్టేరు!"

"---"

"డిల్లింజర్ ఎవ్వరో తెలుసా?"

"తెలియదు."

"వాడొక పెద్ద ఘరానా దొంగ. బేంకు దోపిడీ వాడి ప్రత్యేకత! ఈ ఊరుకి దగ్గర్లోనే పుట్టేడు. షికాగో లో ఉన్న బయోగ్రాఫు సినిమా హాలు దగ్గర పోలీసులు కాల్చి చంపేసేరు. ఈ ఊరు వాడని ఇక్కడికి తీసుకొచ్చి పాతిపెట్టేరు."

"---"



"వాషింగ్టన్ దగ్గర ఉన్న ఆర్లింగ్టన్ సిమెటరీ లో పాతి పెడితే ఎంత గొప్పో ఇదీ అంతే గొప్ప!"

వాషింగ్టన్ లో ఉన్న ఆర్లింగ్టన్ సిమెటరీ సంగతి కూడ నాకేమీ తెలియదు కనుక ఆ సారూప్యం నా మీద ఏమీ ముద్ర వెయ్యలేదు.

ఉలుకు, పలుకు లేకుండా వింటున్నాను తప్ప నేనేమీ స్పందించ లేదు. నా మనస్సంతా మర్నాటి ఇంటర్వ్యూ మీదే ఉంది. ఈ సిమెటరీలో ఎవడు ఎలా చస్తే నాకేమిటి.

నా చేత ఎలాగైనా మెప్పు పొందాలనే తాపత్రయంతో, ఆఖరికి, “Sir! People are just dying to get in here!” అన్నాడు.

ఆ వాక్యంలో ధ్వనించిన ద్వందార్థనికి చకితుణ్ణయేను. అందువల్ల ఇప్పటి వరకూ అది మనస్సులో నాటుకు పోయి ఉండిపోయింది.

టేక్సీ వాడు నార్త్ షెర్మన్ డ్రైవ్ మీద ఉన్న మెడోస్ మొటేల్ లో దింపేసి వెళ్ళిపోయేడు. అక్కడికి కాలి నడక దూరంలో, నార్త్ షెర్మన్ డ్రైవ్, ఈస్ట్ న్యూ యార్క్ వీధుల మొగలో ఆర్. సి. ఎ. వారి హోం ఇన్స్ట్రుమెంట్స్ డివిషన్ వారి ఆఫీసు.

మర్నాడు ఇంటర్వ్యూ కి వెళ్ళేను.

బాబ్ బ్రూక్స్ ముందుగా ‘బెనిఫిట్స్’ గురించి టూకీగా చెప్పేడు. జీతం తప్ప ‘బెనిఫిట్స్’ గురించి పట్టించుకునే వయస్సు కాదది. నా తెలివితేటలతో వాళ్ళని మెప్పించాలనే తాపత్రయమే నా ప్రవర్తనకి సారధ్యం వహించింది.

ఏప్రిల్ 14, 1912 న టైటేనిక్ మంచుకొండని ఢీక్కొన్నప్పుడు మోర్సు కోడు ద్వారా వచ్చిన ఆ వార్తని మొట్టమొదట అందుకున్నవాడూ, తర్వాత నిర్విరామంగా 72 గంటల పాటు కార్పేథియా పంపించిన మృతుల జాబితా ని బతికున్న వారి పేర్లనీ పత్రికలకి అందజేసిందీ డేవిడ్ సార్నాఫ్ అన్న 23 ఏళ్ళ కుర్రాడు. తర్వాత ఇతను పని చేసిన కంపెనీయే ఆర్. సి. ఎ. కంపెనీ అయింది; దానికి ఇతను అధిపతి అయేడు. ఈ “ట్రివియా” నేను చెప్పే వరకూ బ్రూక్స్ కి తెలియదు. తర్వాత నాకు తెలిసింది ఏమిటంటే, వీడు చిన్న గుమస్తా లాంటి ఉద్యోగి మాత్రమే ననిన్నీ, నేను మెప్పించ వలసిన వాడు వీడు కాదనిన్నీ.

తొమ్మిది గంటల నుండి పది వరకు రోలండ్ రోడ్స్ అనే మేనేజరు నన్ను ఇంటర్వ్యూ చేసేడు. అతను అడిగిన ప్రశ్న ఒకటే ఒక్కటి. టెలివిషన్ చూస్తూన్నప్పుడు ఛేనల్ మార్చటానికి సోఫాలో కూర్చున్న మనిషి లేచి, టి. వి. వరకు నడచి వెళ్ళి మార్చటం అప్పటి వరకు జరుగుతోంది. సోఫాలో మనిషి కదలకుండా, చానల్ ఎలా మార్చటం? అదీ ప్రశ్న.

నాకు టి. వి. తో అంతగా పరిచయమే లేదు. డిట్రాయిట్ లో మా ఇంటి యజమాని టి. వి. చూడనిచ్చేది కాని ముట్టుకోనిచ్చేది కాదు.

"నిజానికి నాకు టి. వి. ల గురించి ఏమీ తెలియదు. స్కూల్లో చదువుకో లేదు. కాని రేడియోల గురించి కొంత తెలుసు. మీకు అభ్యంతరం లేకపోతే అక్కడి నుండి నరుక్కొస్తా."

"సరే! అలాగే కానీ!".

"రేడియోలో స్టేషన్ మార్చటానికి ఉన్న టూనర్ లాంటిదే ఇక్కడ కూడా ఉండుంటుంది. రేడియో టూనర్ లో ఒక RLC సర్క్యూట్ ఉంటుంది కదా. దానిలోని కెపేసిటెన్స్ విలువ మార్చితే దాని రెసొనెన్స్ ఫ్రీక్వెన్సీ మారుతుంది, దానితో స్టేషన్ మారుతుంది. అలాగే ఇక్కడ కూడా అయుంటుంది."

"బాగుంది. కానీ."

ఇలా కొంత సేపు సంభాషణని సాగదీస్తూ ఆయన అడిగిన అసలు ప్రశ్నకి సమాధానం కోసం జోరుగా ఆలోచిస్తున్నాను.

"టి. వి. నుండి సోఫా వరకు ఒక తీగని లాగి దానితో తంటాలు పడొచ్చు కదా?"

"తీగలు లేకుండా ఏదైనా పద్ధతి చెప్పగలవా?"

నేను చదువుకున్న భౌతిక శాస్త్రం ఒక్క సారి గుర్తుకు వచ్చింది. అప్పుడు వరస పెట్టి విద్యుదయస్కాంత వర్ణ మాలలో ఉన్న ప్రతి తరంగ దైర్ఘ్యం యొక్క లక్షణాలని మననం చేసుకుని ఆ టూనర్ ని ఎలా నిర్మించ వచ్చో, ఒకొక్క పద్ధతిలో ఉన్న సాధక బాధకాలేమిటో అలా ఒక గంట సేపు అతని ఎదట ఆశువుగా ఊహాగానం చేసేను.

"రోలండ్ రోడ్స్ నోట్లో సిగార్ నములుతూ కన్ను రెప్ప వెయ్యకుండా విన్నాడు. అతని వాలకం చూడగానే నాకు ఆ ఉద్యోగం ఇచ్చెస్తారన్న ధీమా వచ్చేసింది.

"రావ్! అన్నీ బాగానే చెప్పేవు. ఇవన్నీ మేము పరిశీలించి విసర్జించిన ఐడియాలు. ఇంకా ఏమైనా కొత్త ఐడియాలు ఉన్నాయా?"

నాకు ఎంత ఆలోచించినా మరొక పద్ధతి తట్ట లేదు. అప్పుడు చెప్పేరు. మన చెవులకి వినబడని శబ్ద తరంగాలని ఉపయోగించి 'రిమోట్ కంట్రోలర్' నిర్మిస్తున్నారుట.

అలాంటి అతిధ్వని (అల్ట్రాసోనిక్) తరంగాలని ఎలా పుట్టిస్తున్నారని అడిగేను.

"మామూలు టూనింగ్ ఫోర్కుతో" అన్నారు ఆయన నవ్వుతూ.

ఇప్పటికీ ఆ రకం రిమోట్ మా ఇంట్లో ఒకటి ఉంది. పాత రోజుల జ్ఞాపకార్థం దాచేను. దరిమిలా నేను సూచించిన పరారుణ (ఇన్‌ఫ్రా రెడ్) తరంగాల వాడుక  ఈనాటి రిమోట్ కంట్రోలర్‌లలో బాగా కనిపిస్తుంది.

ఉండబట్టలేక అడిగేను. "అయ్యా, నా చదువు నేపథ్యంలో ఎక్కడా టెలివిషన్ లేదు. మీరు నన్ను ఎందుకు ఇంటర్వ్యూ చేస్తున్నారు?"

అప్పుడు చెప్పేడు. "నీ రెసుమే లో నువ్వు సిలికాన్ వేఫర్‌లు ఉపయోగించి రెక్టిఫయింగ్ జంక్షన్‌లు చేసేనని రాసుకున్నావు. ఆ రకం అనుభవం ఉన్నవాళ్ళు మాకు కావాలి. నీ ఆలోచనా సరళి ఎలా ఉంటుందో చూద్దామని రిమోట్ కంట్రోలర్‌గురించి అడిగేను. అంతే"

నిజానికి ఆ రకం పని నేను సెమెస్టర్ కంటె ఎక్కువకాలం చెయ్యలేదు. ఆ విషయం వాలంటీర్ చేసి చెబితే వచ్చే ఉద్యోగం రాదేమోనని కిమ్మనకుండా ఊరుకున్నాను.

నేను బ్రవున్స్ లేక్ కి తిరిగొచ్చిన మర్నాడు కొరియర్ ద్వారా ఉత్తరం వచ్చింది. నెలకి 800 జీతం.

మర్నాడు, ఎయిర్ పోర్టు కి వెళ్ళే ముందు తమతో కలసి లంచి తినమని మేక్‌మిల్లన్, ఆయన సతీమణి నన్ను ఆహ్వానించేరు – అదే రెస్టరాంటులో. ఆయన టేబుల్ దగ్గర ఎప్పుడూ జే కాపలా కాసేవాడని చెప్పేను కదా. అంతవరకూ నా మీద శీతకన్ను వేసిన జే ఆ రోజు నా దగ్గర ఆర్డర్ తీసుకున్నాడు. కాని నేను తిన్న లంచికి మాత్రం డబ్బులు బిల్లులో వెయ్య లేదు. పైపెచ్చు చిన్న కేకు మీద ఒక కొవ్వొత్తి పెట్టి,

For he's a jolly good fellow,
For he's a jolly good fellow,
For he's a jolly good fellow,
Which nob'dy can deny.
Which nob'dy can deny.
Which nob'dy can deny.
For he's a jolly good fellow,
For he's a jolly good fellow,
For he's a jolly good fellow,
Which nob'dy can deny!

అంటూ కిచెన్ స్టాఫ్ అంతా వచ్చి పాట పాడేరు.

మేక్‌మిల్లన్ గారి భార్య అంతటితో ఊరుకోకుండా, ఆ పాటని సందర్భ శుద్ధి కొరకు పొడిగించి పూర్తి చేసింది.

The other side of the mountain
The other side of the mountain
The other side of the mountain
Was all that he could see
Was all that he could see
Was all that he could see
The other side of the mountain
The other side of the mountain
The other side of the mountain
Was all that he could see.

For he's a jolly good fellow!

లంచి తర్వాత భార్యా భర్తలు ఇద్దరూ వచ్చి నన్ను మిల్వాకీ ఎయిర్‌పోర్టులో దింపేసి వెళ్ళిపోయారు.

బ్రౌన్స్ లేక్ లో చేసిన మూడు వారాల ముచ్చటకీ స్వస్తి చెప్పేసి, ఆలశ్యం చెయ్యకుండా ఉద్యోగంలో చేరిపోయాను.

# ఇండియనాపొలిస్ లో ఉద్యోగం

ఇండియనాపొలిస్ లో ఉద్యోగంలో జేరిన వెంటనే వాకబు చెయ్యగా నేనుగాక ఆ ఊళ్ళో ముత్యం మరో ముగ్గురు భారతీయులు ఉన్నారని తేలింది. మెహతా, ఖన్నా, ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ అఫ్ ఇండియా కి అధిపతి అయిన అయ్యగారి సాంబశివరావు గారి బంధువు అయిన చలపతిరావు. అతనికి గే అనే జొన్నపొత్తు జుత్తు గల స్నేహితురాలు ఒకామె ఉండేది. అందువల్ల కాబోలు కొంచెం అమెరికనైజేషన్ అయే తాపత్రయంలో ఉన్నాడేమో మా ఇద్దరి తత్వాలకీ పొంతన కుదరలేదు. ఆదిలోనే సంభవించిన ఈ హంసపాదు ఆ ఊళ్ళో నేను గడిపిన క్షణిక కాలానికి ఒక ప్రతీకగా నిలచింది.

నేను డౌన్‌టౌన్ లోనే, మాన్యుమెంట్ సర్కిల్ కి దగ్గరగా, ఉత్తర మెరిడియన్ వీధిలో ఎసెక్స్ హౌస్ అనే ఖరీదైన అంబరచుంబితంలో ఒక బ్రహ్మచారి వాటిక (studio apartment) అద్దెకి తీసుకుని మొదటి ఆరు నెలలు ఉన్నాను. అక్కడే మెహతా ఉండేవాడు కనుక కొంచెం తోడుగా ఉంటాడని డిట్రాయిట్‌లో స్నేహితులు సిఫారుసు చేస్తే కొంచెం ఖరీదైనా ఎసెక్స్ హౌస్ కి లీజు రాసేసేను. కాని మెహతా పలికితే బంగారం ఒలికిపోతుందేమో అన్నట్లు అంటీ ముట్టకుండా ఉండేవాడు. ఇహ నా తత్వానికి సరిపడ్డ వాడు ఖన్నా ఒక్కడే మిగిలేడు. వాడేమో ఎక్కడో ఊరికి అవతల చివర ఉండేవాడు. నాకు మొదటి ఆరు నెలలూ కారు లేదు కనుక వాడే రావాలి; కనుక తరచుగా కలుసుకుందికి అవకాశం దొరికేది కాదు.

అంతవరకూ స్నేహితుల మధ్య బతికిన బతుకు మళ్ళా ఏకాంతంగా తయారయింది. ఈ సందర్భంలో మా కంపెనీ వారు కావలిస్తే ఒక టి. వి. ని అరువుగా తీసికెళ్ళి ఎన్నాళ్ళు కావలిస్తే అన్నాళ్ళు వాడుకోమన్నారు. దీని ధర్మమా అని టి. వి. చూడటం ఒక వ్యసనంగా తయారయింది. What's My Line?, I've Got a Secret, Candid Camera, Hazel, Donna Reed Show, My Three Sons, The Fugitive, Inger Stevens నటించిన The Farmer's Daughter మొదలైన కార్యక్రమాలు క్రమం తప్పకుండా చూసేవాడిని. వీటిల్లో What's My Line? చాల సరదాగా ఉండేది. డోరతీ కిల్గేలన్, ఆర్లీన్ ఫ్రేన్సిస్, బెన్నెట్ సెర్ఫ్ – వీరు ముగ్గురూ నిలయ పేనలిస్టులు.

ఒక అతిథి పేనలిస్టుది నాలుగో స్థానం. వీళ్ళందరినీ పరిమితించేది (moderate చేసేది) జాన్ డేలీ. ఇలాగే మార్లిన్ పెర్కిన్స్, జిం ఫౌలర్ ల తో వచ్చే Mutual of Omaha  వారి Wild Kingdom చాలా బాగుండేది. వీటన్నిటి కంటె నాకు బాగా నచ్చిన కార్యక్రమం Jack Paar Show. "As I was saying..." అనే ఊత పదంతో బాగా కబుర్లు చెప్పేవాడు. నిర్ధారించి చెప్పలేనుకానీ ఆ ఏడే జాక్ పార్ కి ఎన్. బి. సి. వారితో తగువొచ్చింది. అప్పుడు అతని స్థానంలో జానీ కార్సన్ వచ్చేడు. ఆ రోజులలో జానీ కార్సన్ షో 90 నిమిషాలు ఆడేది. వీటన్నిటికన్న చెప్పుకోవలసినది Ed Sullivan Show. ఇతనే ఫిబ్రవరి 64 లో బీటిల్స్ ని అమెరికాకి పరిచయం చేసేడు.

టి. వి. చూడటం బోరు కొడితే పక్కనే ఉన్న బారులు తనిఖీ చెయ్యటం మొదలు పెట్టేను. అప్పుడే మాన్యుమెంట్ సర్కిల్ కి అవతలి పక్క, సౌత్ మెరిడియన్ వీధిలో ఉన్న 'స్లిప్పరీ నూడుల్ ఇన్' అనే గృహాన్ని కనుక్కున్నాను. ఇది 1850 నుండి రకరకాల అవతారాలు ఎత్తుతూ ఈ ఊరి ప్రజలని రంజింపజేస్తూ ఉందిట. కొన్నాళ్ళు దక్షిణాది లోని బానిసత్వపు సంకెళ్ళ నుండి పారిపోయి వచ్చిన బానిసలు ఇక్కడే తల దాచుకునే వారట. ప్రొహిబిషన్ వచ్చిన తరువాత దొంగ సారా తయారు చేసి అమ్మే చలివేంద్రంలా ఒక వెలుగు వెలిగి, ఆ తరువాత మరి కొన్నాళ్ళపాటు వేశ్యలతో కలకలలాడే శృంగారవాటికగా చెలామణీ అయి, నేను వెళ్ళేనాటికి మద్యపానాలు అమ్మే ఒక బారులా రూపాంతరం చెందింది. జాన్ డిల్లింజర్ తాగటానికి తరచు ఇక్కడకి వచ్చేవాడట!

పక్కనే ఉన్న మాన్యుమెంట్ సర్కిల్ లో 35 పైసలకి రోజల్లా ఎన్ని సినిమాలు కావలిస్తే అన్ని చూడనిచ్చేవారు. తల దిమ్మెక్కి పోయే వరకు సినిమాలు చూడగా చూడగా విరక్తి పుట్టింది. అందుకని పర్డ్యు యూనివర్సిటీ వారి ఇండియనాపొలిస్ ఎక్స్టెన్షన్‌లో (ఇదే ఇప్పుడు IUPUC గా అవతరించింది!) రాత్రి పూట సిటీ బస్సులో వెళ్ళి కోర్సులు తీసుకునేవాడిని. నాకు కావలసిన కోర్సు ఏదీ లేకపోతే కనీసం కాలక్షేపానికని 'థీరీ అఫ్ రెలెటివిటీ', 'మోడర్న్ కంట్రోల్ సిస్టంస్' తీసుకుంటూ, ఫోర్ట్రాన్ II లో ప్రోగ్రాములు రాయటం మొదటిసారి నేర్చుకున్నాను. నేను పని చేస్తూన్న ఆర్. సి. ఎ. లో ఒక్క కంప్యూటరు కూడా లేదు ఆ రోజులలో.

“అంతగా బోరు కొడుతూ ఉంటే ఒక సారి ఈస్ట్ లేన్‌సింగ్ రాకూడదా, ఇక్కడ అక్కినేని నాగేశ్వరావు గారు ఉన్నారు, కలుసుకోవచ్చు” అంటూ తుమ్మల మాధవరావు కేకేసేడు. నాకు సినిమా తారలంటే అంత వెర్రి లేదు; ఊళ్ళోకి వస్తే చూడటానికి వెళ్ళేవాడినేమో. “ఇంతోటి నాగేశ్వరావునీ చూడటానికి మూడు వందల మైళ్ళు ప్రయాణం చేసి రావాలా?” అని ఎదురు ప్రశ్న వేసేను. తర్వాత తెలిసింది, నాగేశ్వరావు సినిమా తారే కాకుండా, పైపెచ్చు మాధవరావు బంధువని. పొరపాటు జరిగిపోయిందని నాలిక కరుచుకున్నాను.

టి. వి. అదే పనిగా చూస్తూ ఉంటే అనేకమైన చెడ్డ వార్తలు, చావు వార్తలు వరసగా వినవలసి వచ్చేది. నవంబరు నెలలో – మొదట వియత్నాంలో గొడవ ఎక్కువగా టి. వి. లో చూపించేవారు. బౌద్ధ సన్యాసులు నడి వీధిలో శరీరం మీద పెట్రోలు పోసుకుని ఆత్మాహుతి చేసుకోవటం టి. వి. లో చూసి చాల మందిని కలవర పడ్డారు. తర్వాత వియత్నాం అధిపతి డియంనీ, అతని తమ్ముడిని దారుణంగా చంపించేయటం జరిగింది. ఇది అమెరికా ప్రభుత్వం సి. ఐ. ఏ. ద్వారా జరిపించిన కుట్రే అన్నది లోక విదితమైన బహిరంగ రహస్యం. అయినా అప్పట్లో అమెరికా ప్రభుత్వం తమకి ఈ కుట్రలో పాలు లేదని బల్లగుద్ది వాదించింది.

నవంబరు మొదటి వారంలో – ఇండియనాపొలిస్ కలోసియంలో Holiday on Ice అని ఒక కార్యక్రమాన్ని దరిదాపు 4500 మంది ప్రేక్షకులు చూస్తూ ఉండగా, వంట గదిలో ‘హాట్‌డాగ్’ బడ్డీ దగ్గర ఉన్న ప్రోపేను టేంకు పేలిపోవటంతో, 64 మంది చచ్చిపోయేరు. ఆ ఊళ్ళో ఒకే ఒక ప్రమాదంలో అంతమంది చచ్చిపోవటం అదే మొదటి సారిట. టి. వి. వాళ్ళు తెరిపిలేకుండా చూపించేరు. ముందు ముందు ఇంకా ఇటువంటి వార్తలు చాలా వినవలసి వస్తుందని నేను అనుకోలేదు.



ఇహ నా కొత్త ఉద్యోగపు వాతావరణం కొంచెం చెబుతాను. నేను అప్పటికి కంపెనీలో జేరి మూడు నెలలు దాటింది. అక్కడ మా అందరి పనీ టి. వి. ల మీద పని చెయ్యటమే. ప్రయోగశాలలో పని చేసే బల్ల మీద ప్రతీ వాడి ముందు ఒకటో, రెండో టి. వి. సెట్లు ఉండేవి. పైన ఉన్న టొపారాన్ని తీసేసి లోపల ఉన్న ఎలక్ట్రానిక్ భాగాలన్నీ బయటకి కనబడేటట్లు విడదీసి పెట్టి, తెర మీద ఆర్. సి. ఎ. వారి తెలుపు – నలుపులలో ఉన్న "ఇండియన్ హెడ్ టెస్ట్ పేటర్న్" బొమ్మో, రంగులలో ఉన్న ఎన్. బి. సి. వారి నెమలి బొమ్మో పెట్టుకుని, బొమ్మ ఎగుడుదిగుళ్ళు, వంకర టింకరలు లేకుండా ఉందో లేదో చూసుకుంటూ ప్రయోగాలు చేసేవాళ్ళం. లేదా అప్పుడు ప్రసారితం అవుతూన్న కార్యక్రమం ఏదైనా చూస్తూ పని చేసినా ఎవ్వరూ పట్టించుకునే వారు కాదు. అందుకని మేమంతా పని చేసుకునే వేళ టి. వి. మీద ఏ ప్రొగ్రాము వస్తూ ఉంటే అది చూస్తూ, శబ్దం తగ్గించి, "పని" చేసేవాళ్ళం. మేము పనే చేస్తున్నామో, టి. వి. కార్యక్రమమే చూస్తున్నామో ఆ బ్రహ్మకి కూడా తెలిసేది కాదు.

అప్పటికి టెలివిషన్ లో శూన్య నాళికలు (vacuum tubes) బాగానే వాడుకలో ఉండేవి. రేడియోలలో వచ్చినా, ట్రాన్సిస్టర్ల వాడుక టి. వి. లలో ఇంకా ముమ్మరంగా రాలేదు. ఇంటిగ్రేటేడ్ సర్క్యూట్ పేరుకి 1958 లోనే కనిపెట్టబడ్డా, అవి ఇంకా ప్రయోగ దశలోనే ఉన్నాయి. నా పని ఏమిటంటే ఇంటిగ్రేటేడ్ సర్క్యూట్ లని ప్రయోగాత్మకంగా తయారు చేసి (అవి పురాతన గాజు యుగం నుండి అధునాతన ఏకశిలా (monlithic) యుగానికి మారుతూన్న సంధి రోజులు అని

మరచిపోకండి.) వాటిని టూనర్ (చానల్ మార్చే ఉపకరణం) లో ఉన్న మామూలు ఎలక్ట్రానిక్ భాగాల స్థానంలో ప్రతిక్షేపించి ఎలా పని చేస్తుందో చూడటం.

ఈ పని లోని సాధకబాధకాలని సాంకేతిక భాషలో చెబితే ఇంకా బాగుంటుంది కాని సాంకేతిక నేపథ్యం లేని చదువరులకి బోరు కొట్టవచ్చు. సింగిల్ క్రిస్టల్ సిలికాన్ మీద ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్ లు నిర్మిచటం అప్పుడప్పుడే అర్థం అవుతూన్న రోజులవి. ఆ దారి వెంట వెళ్ళటానికి బదులు పోలీక్రిస్టలైన్ సిరామిక్ పలక మీద సిల్క్ స్క్రీన్ తో రెసిస్టర్లు, ఇండక్టర్లు, కెపేసిటర్లు అద్దకం అద్దినట్లు అద్ది టూనర్ నిర్మించాలని ఇండియనాపొలిస్‌లో ఉన్న విభాగం సమకట్టింది. ఇది జరిగే పని కాదని రెండు నెలలో నాకు తెలిసిపోయింది. ఎందుకంటే ఇండక్టర్లని తయారు చెయ్యటానికి పొగచుట్ట ఆకారంలో తీగని చుట్టబెడితే వచ్చే లక్షణం, సిరామిక్ పలక మీద చక్కిలంలా చుట్టబెడితే రాలేదు; రాదని లెక్క కట్టి నిర్ధారించేను. ఇండక్టర్ లేకుండా రెసిస్టర్లూ, కెపేసిటర్లూ, ట్రాన్సిస్టర్లూ ఉపయోగించి టూనర్‌లు ఎలా నిర్మించటమా అని ఇంకా పరిశోధనలు జరుగుతున్న రోజులవి. అయినా కొత్తగా ఉద్యోగంలో చేరిన నాకు ఈ విషయం తెగించి చెప్పటానికి ధైర్యం లేకపోయింది. అప్పటికే ఎంతో డబ్బు పెట్టి సిరామిక్ కొలిమి ఒకటి నిర్మించి చాలా హడావిడి చేస్తున్నారు కూడా.

నా పక్క బెంచీ దగ్గర వాలీ అని మరొకడు ఉండేవాడు.  వాడి పని ఏమిటంటే జీనిత్ మొదలైన పోటీ కంపెనీల వారు తయారు చేసిన టి. వి. లని ఏ కీలు కా కీలు విప్పేసి వాళ్ళు ఇదే పనిని ఎలా చేస్తున్నారో పత్తేదారులా కనిపెట్టటం. అందుకని వాడిని డిటెక్టివ్ వాలి అని పిలచేవాడిని.

ఇక్కడ ఈ జీనిత్ కంపెనీ గురించి ఒక్క మాట చెప్పాలి. మిగిలిన వాళ్ళంతా ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డులు వాడటం మొదలు పెట్టినా వీళ్ళు మాత్రం లోపల అన్ని భాగాలనీ తీగలతోటే జత చేసి చేత్తో టంకం (solder) వేసి అతికే వారు. పైపెచ్చు “మేము టి. వి. లని ఎంతో అల్లారు ముద్దుగా, సొంత చేతులతో, అసెంబుల్ చేస్తాం” అని అదేదో పెద్ద ఘనకార్యంలా ప్రకటనలలో చెప్పుకునేవారు.

ఆ రోజు ఇప్పటికీ నాకు కళ్ళకి కట్టినట్లు జ్ఞాపకం ఉంది. లంచి అయిన తర్వాత ప్రయోగశాలలో ఎత్తు బల్ల దగ్గర ఎత్తుగా ఉన్న స్టూలు మీద కూర్చుని – అలవాటు ప్రకారం టి. వి. మీద వస్తూన్న కార్యక్రమాన్ని ఒక కంట చూస్తూ – ఏదో ప్రయోగం చేస్తున్నాను. అకస్మాత్తుగా “న్యూస్ బుల్లెటిన్ వస్తున్నాది, ఎదురు చూస్తూ ఉండండి” అని తెర మీద ఒక ప్రకటనని వేసి జరుగుతూన్న కార్యక్రమాన్ని అర్థంతరంగా ఆపేసేరు. ఒక్క నిమిషం లోపలే వాల్టర్ క్రాంకైటు వచ్చి ప్రెసిడెంట్ కెన్నడీని ఎవ్వరో తుపాకితో పేల్చేసేరని వార్త చెప్పేడు. ఆ రోజు నవంబరు 22, 1963. ఆ వార్తకి స్పందిస్తూ ఆ లేబు లో ఉన్న వాళ్ళంతా ఒక్క సారి చప్పట్లు కొట్టేరు. అదొక అసంకల్ప ప్రతీకార చర్య. ప్రెసిడెంటు చావు బతుకుల్లో ఉంటే చప్పట్లా? అదీ, కుర్ర వయస్సులో ఉన్న వ్యక్తిని తుపాకితో కాల్చేసినప్పుడు సానుభూతి పుడుతుంది కానీ సంతోషమా? నేను చూసిన ఆ దృశ్యాన్ని నమ్మ లేక పోయాను. భౌగోళికంగా ఇండియానా ఉత్తరాది రాష్ట్రమే అయినా, వారి రాజకీయ దృక్పథం దక్షిణాది దృక్పథమే అని నేను అప్పటికే గమనించేను. కాని ప్రెసిడెంటు అంటే ఇంత ఏహ్య భావమా? ఆ సంఘటన చూసిన తర్వాత ఆ లేబులో ఉన్న వాళ్ళంటే నాకు అసహ్యం వేసింది.

కెన్నడీ చచ్చిపోయినప్పుడు ఆర్. సి. ఎ. లో నా సహోద్యోగులే కాకుండా ప్రపంచంలో తదితరులు కూడ దరిదాపు అదే స్ఫూర్తితో స్పందించినవారు లేకపోలేదు. ఉదాహరణకి వియత్నాంలో దారుణంగా ఖూనీ చెయ్యబడ్డ డియం మరదలు, మేడం ను, “నా మొగుడిని చంపించినందుకు తగిన శాస్తి అయింది” అనే అర్థం స్ఫురించేలా, జాక్వలిన్ కెన్నడీకి ఈ కింది విధంగా ఉత్తరం రాసింది: “I do not know you, but you must understand now what a wife feels when told that her husband has been brutally done to death. What has come to you is only one effect of the frightful injustice of which my husband was an innocent victim . . .

నేను ఇలా రాస్తూ ఉంటే మీకు నా మాటల మీద నమ్మకం కుదరక పోవచ్చు. కాని వీటికి సమాంతరమైన మరొక సంఘటన చదువరుల దృష్టికి తీసుకు వస్తాను. ఇందిరా గాంధీని సిఖ్ఖు రక్షక భటులు చంపేసినప్పుడు ఇంగ్లండు లో సిఖ్ఖులు వీధుల మీదకి వచ్చి నాట్యం చేసి, మిఠాయిలు పంచి పెట్టేరు. ఈ సంఘటన దృక్కోణంతో చూస్తే, ఆర్. సి. ఎ. లో నా సహోద్యోగులు చేసినది అంత

విపరీతంగా కనిపించదు. తర్వాత విడి విడిగా కలుసుకుని, సావధానంగా మాట్లాడితే "అయ్యో, ఎంతపని జరిగింది" అని అన్నారు, చాల మంది. కాదనను.

మనుష్యుల రాజకీయ దృక్పథం ఎలా ఉన్నా వ్యక్తిగత సంబంధాలలో చాల ఉదార భావాలు ఉన్న వాళ్ళు, స్నేహశీలులు వీళ్ళల్లో కనిపిస్తారు. ఈ అభిప్రాయాన్ని సమర్ధిస్తూ మరొక ఉదాహరణ చెబుతాను. నేను ఆర్. సి. ఎ. లో పని చేస్తూన్న రోజులలోనే ఒక సారి నాకు మా ఊరు నుండి ఒక ఉత్తరం వచ్చింది – మైలవరపు రమణమూర్తి మావయ్య గారి దగ్గరనుండి. ఈయనకీ, మాకూ బంధుత్వం ఏమీ లేదు. కాని మా సంసారానికి ఆప్త మిత్రులు వీరు. మా ఇంట వచ్చే కష్టసుఖాలలో "నా బొందో" అంటూ కలుగజేసుకుని సహాయం చేసే వారు. మేము తుని వెళ్ళిన కొత్త రోజులలో ఆర్ధికంగా మా నాన్న గారూ, ఈయనా ఒకే స్థాయిలో ఉండేవారు. మా కళ్ళ ఎదుటే కోమటి గుమస్తా నుండి పెద్ద కమిషన్ వ్యాపారస్తుడుగా ఎదిగి బాగానే డబ్బు గణించేరు. నాకు ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చిందని చెప్పటానికి వెళ్ళినప్పుడు, "వెంకటేశం, నీకు ఎప్పుడు డబ్బు కావలసి వచ్చినా మీ నాన్నగారిని అడగకు, నాకు రాయి, నేను పంపుతాను" అన్నారు. ఈ రెండు కుటుంబాల మధ్య స్నేహం ఎంతలా ఉండేదంటే వారింట ఉన్న అమ్మాయిలలో ఎవరినో ఒకరిని మా ఇంట ఉన్న అబ్బాయిలు చేసుకుంటే బాగుంటుందని ఇరువురూ అనుకునే వారు, కాని కులం ఒకటే అయినా శాఖ కలియ లేదు – వారు తెలగాణ్యులు, మేము వెలనాట్లు. ఆ రోజులలో శాఖ దాటి పెళ్ళిళ్ళు చేసుకుందుకి జంకేసే వారు.

ఈ స్నేహాన్ని పురస్కరించుకుని మావయ్య గారు నాకు స్వయంగా ఉత్తరం రాసేరు. మావయ్య గారి కూతురు అమ్మలు వదిన కి క్షయ వ్యాధి వచ్చి ఒక ఊపిరి తిత్తిని తీసేసేరుట. సరైన మందు వెంటనే పడక పోతే ఆ రెండో ఊపిరి తిత్తి దక్కదుట. ఆ మందు ఇంకా ప్రయోగ దశలోనే ఉండటం వల్ల ఒక్క అమెరికాలో తప్ప మరెక్కడా దొరకటం లేదుట. ఆ మందు పేరు రాసి, ఎలాగైనా ఆ మందు పంపమని రాసేరు. నేను డబ్బు ఖర్చుకి వెనకాడతానేమోనని ఆ ఉత్తరం చివర నాన్నగారు "డబ్బు ఎంత ఖర్చు అయినా వెనకాడకుండా విమానం టపాలో మందు వెంటనే పంపు" అని ఒక వాక్యం రాసేరు.

ఆ ఉత్తరం పట్టుకుని నలుగురైదుగురు డాక్టర్ల దగ్గరకి వెళ్ళేను. రోగిని చూడకుండా ప్రిస్క్రిప్షన్ ఇవ్వం పొమ్మన్నారు. నాకు ఏమి చెయ్యాలో పాలు పోలేదు. ఆ రోజు కేఫిటేరియాలో లంచి తింటూ ఇదే విషయం నా పక్కనున్న చార్లీతో అన్నాను.

"ఏదీ ఆ ఉత్తరం ఒక సారి చూపించు" అన్నారు ఆయన.

జేబులో ఉన్న ఉత్తరం ఇచ్చేను. ఉత్తరం అంతా తెలుగులోనే ఉంది కాని, మందు పేరు – ఎథాంబ్యుటాల్ – ఇంగ్లీషులో ఉంది.

ఆ ఉత్తరం తనతో తీసుకెళతానన్నాడు ఆయన. అలాగే ఇచ్చేను.

మర్నాడు ఆ మందు ప్రిస్క్రిప్షన్  పట్టుకొచ్చి నాకిచ్చేడాయన. "ఇదెలా సాధ్యం?" అని ఆశ్చర్యంతో అడిగేను.

చార్లీ పొరుగింటి వ్యక్తి  'ఈలై లిలీ' కంపెనీ కి అధిపతి ట. నాకు కావలసిన మందు ఆ కంపెనీ వారే తయారు చేస్తారుట. ఆ కంపెనీ వారి కేంద్రాలయం ఇండియనాపొలిస్ లోనే ఉందిట. ఆ కంపెనీలో డాక్టర్ ప్రిస్క్రిప్షన్ రాసి ఇచ్చేరుట. ఈ సంఘటన జరిగిన తర్వాత కెన్నడీ చచ్చిపోయిన సందర్భంలో నాకు వీళ్ళమీద కలిగిన కోపం కరిగి పోయింది.

నేను వెంటనే మందు కొనటం, విమానం టపాలో పంపటం చకచకా జరిగిపోయాయి. నేను పంపిన మందు అద్భుతంగా పని చేసిందిట. అమ్మలు వదిన పూర్తిగా కోలుకుంది. నేను తర్వాత ఇండియా ఎప్పుడు వెళ్ళినా మావయ్య గారూ, అత్తయ్య గారూ, "వెంకటేశం, మా అమ్మాయిని బతికించటానికే నువ్వు అమెరికా వెళ్ళేవు" అంటూ నన్ను కౌగలించేసుకునే వారు. నేను 2002 లో హైదరాబాదు వెళ్ళినప్పుడు అమ్మలు వదినని 1960 తర్వాత మొదటి సారి చూడటం సంభవించింది. తనింకా

బతికుండటానికి నేనే కారణం అని పదే పదే అంటూంటే నాకు ఒక విధంగా సిగ్గేసింది. నా సహోద్యోగి ఆ రోజున నన్ను ఆదుకుని ఉండకపోతే నేను చెయ్యగలిగేది ఏమీ లేదు కదా.

ఇలా రెండు మూడు సంఘటనలు తప్ప ఇండియనాపొలిస్ లో జీవితాన్ని ఒక్క మాటలో వర్ణించ వచ్చు. "బోరు." పులి మీద పుట్రలా క్రిస్మస్ వచ్చి పడి ఆ రోజులని మరీ మనోమాంద్యజనకం (depressive) గా తయారు చేసేయి. అప్పుడే నిశ్చయించుకున్నాను. ఆ ఫేషనబుల్ గా ఉన్న ఎస్సెక్స్ హౌస్ లో ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా ఫేషనబుల్‌గా ఉండే కంటె మామూలు సంసార పక్షంగా ఉన్న ఇంటికి మారిపోతే బాగుంటుందని. లీజు రాసేసేను కదా. దాన్ని తెగగొట్టటానికి ఒక నెల అద్దె నష్టపోయి నార్త్ టెంపుల్ వీధిలో ఒక ఇంటి మేడ మీది భాగం అద్దెకి తీసుకుని మనశ్శాంతి కొనుక్కున్నాను. ఇది మిలమిలా మెరుస్తూ లేకపోయినా విశాలంగా సదుపాయంగా ఉండేది. కింద వాటాలో ఉంటూన్న ఇంటావిడ అప్పుడప్పుడు తను చేసుకున్నవి – నేను తినగలవి - వంటకాలు పట్టుకొచ్చి ఇస్తూ ఉండేది.

అద్దె సగానికి సగం తగ్గటంతో $1000 పెట్టి ఒక పాత ఫోక్స్ వేగన్ కొన్నాను, కాని కారు నడపటం ఇంకా రాలేదు. అమ్మిన ఆసామీయే కారుని నా ఇంటి ముందు పార్కు చేసి వెళ్ళిపోయేడు. నడపటం సాధకం చెయ్య వలసి వచ్చి నప్పుడు లైసెన్సు ఉన్న డ్రైవరు పక్కన కూర్చోవాలి కదా. దానికి ఇంటివారి అమ్మాయి, బ్రెండా, సహాయపడేది. డ్రైవింగు పరీక్షకి దగ్గరుండి తీసికెళ్ళింది. ఆ పరీక్షలో నేను కారుని పేరలల్ పార్కింగు చెయ్యలేక పోయాను.

"నువ్వు మరో సారి రా!" అన్నాడు పరీక్ష చేసిన అధికారి.

"నా స్నేహితురాలి ఎదట నా పరీక్ష పోగొడితే నా పరువు పోతుంది, నేను పార్కింగు నేర్చుకుంటాను కానీ, ఈ మాటికి పేసు చేసెయ్" అని బతిమాలేను.

ఏ నక్కని తొక్కి వెళ్ళేనో, నన్నూ, బ్రెండానీ ఎగా దిగా చూసి, ఒక నవ్వు నవ్వి, లైసెన్సు కాగితం మీద సంతకం పెట్టి నాకు రెక్కలు ఇచ్చేడు.

ఊళ్ళో ఉండీ, చేతిలో కారు ఉండీ స్పీడ్ వే కి వెళ్ళక పోతే ఏమి బాగుంటుంది? అందుకని వాళ్ళు ట్రయల్స్ వేసుకుంటూన్న రోజులలో రెండు డాలర్లు పెట్టి టికెట్టు కొనుక్కుని ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఇండీ 500 కి వెళ్ళేను. గేలరీలో కూర్చున్నాను. బుర్రు బుర్రు మని చప్పుడు తప్ప కారు ఖణిగా కనిపించదే! కార్లు అంత జోరుగా వెళుతూన్నప్పుడు మరీ ముందు వరసలో కూర్చుంటే కనిపించవు, కొంచెం వెనక్కి వెళ్ళి కూర్చోమని చెప్పేరు ఒకాయన. క్వాంటం మెకానిక్స్ చదువుతూన్నప్పుడు కణిక చుట్టూ ప్రదక్షిణాలు చేసే ఎలక్ట్రానులు బంతులులా ఉండవు, ఒక మేఘంలా ఉంటుంది అని చెప్పేవారు. అప్పట్లో ఆ మేఘం ఎలా ఉంటుందో ఊహించుకోలేకపోయేవాడిని. ఇప్పుడు ఇక్కడ జోరుగా వెళుతూన్న కార్లు మసక మసకగా చిన్న మేఘపు ముక్కల్లా కనిపిస్తూ ఉంటే అప్పుడు చుట్లు తిరిగే ఎలక్ట్రాన్ మేఘం కూడ ఇలాగే ఉంటుంది కాబోలు అని సంజాయిషీ చెప్పుకున్నాను.

అసలు పందెం మెమోరియల్ డే రోజున, అంటే మే 30 శనివారం. చాలా ఆర్భాటం చేసేరు. ఈ ఆర్భాటానికి అప్పుడే కొత్తగా మార్కెట్ లోకి వస్తూన్న ఫోర్డ్ మస్టేంగ్ ని pace car గా వాడేరు. ఆ ముందు నెల ఏప్రిల్ 22 న ఇదే కారుని నూ యార్క్ వరల్డ్ ఫెయిర్ లో ఆవిష్కరణ చేసేరు. ఇదే మస్టేంగ్ ని బంక మట్టి నమూనా రూపంలో డిట్రాయిట్ లో విద్యార్థి దశలో చూసేనని చెప్పేను కదా. కొత్తగా వచ్చిన ఈ మస్టేంగు కారు ధర ఉరమరగా $2,400 ఉండేది. ముందు జరగవలసిన వేడుకలు జరిగిన తర్వాత పందెం మొదలైంది. మొదటి చుట్టు తిరిగేసరికి ఆరవ వరసలో ఉన్న ఎడ్డీ సేక్స్ ముందున్న రూథర్‌ఫర్డ్ ని దాటేసేడు. కాని రూథర్‌ఫర్డ్ రెండవ చుట్టులో ఎడ్డీ సేక్స్ వెనకాతలే అంటిపెట్టుకుని ఉన్నాడు. రెండవ చుట్టు పూర్తి అయే లోపునే డేవ్ మెక్‌డానల్డ్ వీళ్ళిద్దరినీ దాటేసేడు. నాలుగో చుట్టు పూర్తి అవుతూ ఉండగా మెక్‌డానల్డ్ కి కారు మీద పట్టు తప్పటంతో, లోపలి గోడని గుద్దుకుని, పరావర్తనం చెంది, జోరుగా వస్తూన్న మిగిలిన కార్లకి ఎదురుపడ్డాడు. కార్లు ఒకదానిని మరొకటి గుద్దుకోవటంతో పెద్ద ప్రమాదం జరిగింది. వెనకాతలే వస్తూన్న రూథర్‌ఫర్డ్ తన కారుని ఆపటానికి బ్రేకు పెడల్ మీద నిలబడ్డా ఆప లేక పోయేడు. దారికి అడ్డుగా ఉన్న మూడు కార్లని

గుద్దుకుని, వాటిని చెల్లా చెదరు చేసేసి, బయట పడి, వెనక్కి కూడ చూడకుండా జోరుగా వెళ్ళిపోతున్నాడు – తన కారుకి నిప్పంటుకుందన్న సంగతిని కూడ గమనించకుండా. మొత్తం మీద పచ్చ జెండాలు ఊపి రూథర్‌ఫర్డ్ కారు ఆపించి, కాలిపోతూన్న కారులోంచి అతనిని ప్రాణాలతో బయటకి లాగేరు. చావు తప్పించుకుని మెడ మీద కాలిన బొబ్బలతో బయట పడ్డాడు రూథర్‌ఫర్డ్ – కాని ఎడ్డీ సేక్సూ, డేవ్ మెక్‌డానల్డూ చచ్చిపోయేరు. ఎర్ర జెండా ఊపి పందెం ఆపేసేరు కొంత సేపు. మృత దేహాలని బయటకి తీసిన తర్వాత పందెం మళ్ళా మొదలైంది. ఇక మరేమీ అవాంతరాలు లేకుండా పందెం పూర్తి అయింది. ఎ. జె. ఫోయెట్ గంటకి 147.35 మైళ్ళ వేగంతో గెలిచి రికార్డు సృష్టించేడు.

ఈ పందెం మరో మూడు రోజులలో మొదలవుతుందనగా, మే 27, 1964 న, జవాహర్ లాల్ నెహ్రూ చచ్చిపోయేరు. ఆ రోజు సాయంకాలం చెట్ హంట్లే చాలా బాగా "యూలొజీ" చెప్పి ప్రపంచా రాజకీయాలలో నెహ్రూ పాత్రని శ్లాఘించేడు.

పుంఖానుపుంఖంగా వస్తూన్న చెడ్డ వార్తలతో ఇండియనాపొలిస్ ఊరిపై నాకు కొద్ది కొద్దిగా విముఖత కలగటం మొదలెట్టి అప్పటికి ఓ ఆరు నెలలు కావచ్చింది. ప్రత్యామ్నాయాల కోసం వెదకటం మొదలు పెట్టేను. నేను పర్డ్యు యూనివర్సిటీ లో కోర్సులు తీసుకుంటూన్న భవనంలో ఒక గాజద్దాల బీరువాలో కొత్తగా ప్రచురితమైన పుస్తకాలని ప్రదర్శించేవారు. వాటిల్లో ఒక పుస్తకం నన్ను ఆకర్షించింది. అది వాల్టర్ కార్‌ప్లస్, రాజ్‌కొ టమోవిచ్ కలసి రాసిన పుస్తకం. బీరువా తలుపుకి తాళం వేసుంది కనుక పుస్తకం చదవటానికి అవకాశం లేదు. అయినా ఆ పుస్తకం అట్ట మీద ఉన్న ఎడ్రస్ కాగితం మీద రాసుకుని కార్‌ప్లస్ కి ఒక ఉత్తరం రాసేను: "మీరు రాసిన పుస్తకం చూసేను, చాలా బాగుంది. మీ దగ్గర పి. హెచ్. డి. చెయ్యటానికి ఏమైనా సావకాశం ఉందా" అని.

నా రొట్టె విరిగి నేతిలోపడింది. ఆయన దరఖాస్తు కాగితాలు పంపించేరు. అవి నింపి పంపించేను. యు. సి. ఎల్. ఎ. వారు "ఎడ్మిషన్ ఇస్తాము, కాని అసిస్టెంటుషిప్పుకి ఏ ప్రొఫెసరుతోనైనా ఏర్పాట్లు చేసుకో" అంటూ ఉత్తరం రాసేరు. కాని కార్‌ప్లస్ 'అసిస్టెంటుషిప్' గురించి ఏమీ రాయలేదు. భయపడుతూనే,

తెగించి, ఆయనకి ఫోను చేసేను. సెక్రెటరీ, మాయా నిషినగా, ఫోను తీసి ఏమిటి కావాలని అడిగింది. చెప్పేను.

“కార్‌ప్లస్ గంటలో యూరప్ వెళ్ళిపోతున్నారు, మళ్ళా రెండు నెలల వరకూ తిరిగి రారు. కనుక నువ్వు తాడో పేడో ఇప్పుడే తేల్చేసుకో, అంటూ ఉచితంగా ఒక సలహా పారేసి ఆయనకి కనెక్ట్ చేసింది. ఆయన అసిస్టెంటుషిప్పు కి డబ్బులు ఉన్నాయి, కావాలంటే వచ్చెయ్ అని ఒక్క మాట చెప్పి ఫోను పెట్టెయ్యబోతూ ఉంటే నేను అడ్డుకుని, నాకు కనీసం ఒక కాగితం మీద ఆ మాట రాసి పంపండి, లేక పోతే ఇక్కడ ఉద్యోగం ఒదులుకుని రాటానికి ధైర్యం చాలటం లేదు” అన్నాను.

రెండు రోజులలో ఒకే ఒక వాక్యంతో ఉత్తరం వచ్చింది. గంటకి $2.45 చొప్పున వారానికి ఇరవై గంటలు ఉద్యోగం. తరువాత తెలిసింది, ఆ ఉత్తరం మీద సంతకం పెట్టినది మాయా అని!
ఇది రెండేళ్ళ క్రితం డిట్రాయిట్‌లో వచ్చిన డబ్బు కంటే నాలుగు డాలర్లు తక్కువ. పైపెచ్చు ఇక్కడ సెమెస్టర్ కి $400 పైచిలుకు జీతం, ఫీజులు కట్టుకోవాలి. నెలకి $800 వచ్చే ఉద్యోగాన్ని ఒదులుకుని మళ్ళా బీద బతుకు ఎలా బతకటమా అని ఒక్క క్షణమే తటపటాయించి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేయటానికి నిశ్చయించుకున్నాను.

దరిదాపు తూర్పు కోస్తా నుండి పశ్చిమ కోస్తాకి వలస ప్రయాణం! మళ్ళా ఇటు పక్క ఎప్పుడు వస్తానో అని వెంటనే అవకాశం చూసుకుని కెంటకీ లో ఉన్న మేమత్ కేవ్ ని చూసొచ్చేసేను. ఇది నిజంగా ప్రపంచంలో ఒక వింత. ఈ మేమత్ కేవ్ ని చూసినప్పుడు కలిగిన అనుభూతి తర్వాత గ్రేండ్ కేన్యన్ ని చూసినప్పుడు కలగనే లేదు. సొరంగం లోకి వెళ్ళినట్లు భూమి లోకి నడుచుకుంటూ వెళ్ళిపోతాం. లోపల ఎల్లోరా లోని దేవాలయాలలా సహజ శక్తుల ప్రభావం వల్ల వెల్లి విరిసిన కట్టడ దృశ్యాలు. ఇవి చూడాలి తప్ప వర్ణించటానికి నాకు శక్తి లేదు. దరిదాపు 500 మైళ్ళ పైబడి ఉన్న ఈ గుహలలో ఒక రోజులో ఒక మైలో, రెండు మైళ్ళో చూడ గలిగేను. గుహల బైట కూడా పచ్చటి చెట్ల మధ్య అత్యంత ఆహ్లాదకరమైన వాతావరణం. అక్కడ నుండి తిరిగి రాబుద్ధి కాలేదు. దీనికీ మన విశాఖపట్నం దగ్గర ఉన్న బొర్రా గుహలకీ హస్తి మశకాంతరం తేడా ఉంది.

తిరిగి వచ్చిన తర్వాత వారం రోజులు శలవు పెట్టి నూ యార్క్ లో వరల్డ్ ఫెయిర్ చూడటానికి వెళ్ళేను – నా కారులో. దారిలో రాచెస్టర్ లో ఆగి మా పిన్ని కొడుకు శాస్త్రి అన్నయ్యనీ, అక్కడే ప్రొఫెసరు గా పనిచేస్తూన్న M. V. R. K. మూర్తి గారిని కారులో ఎక్కించుకుని నూ యార్కు వెళ్ళేం. క్వీన్స్‌లో ఒక హొటేల్ లో మకాం. మేం ముగ్గురం ఒక స్వీట్ తీసుకున్నాం. ఆ హొటేలు గుమస్తా చెప్పేడు, మేము తీసుకున్న గదిని "సూట్" అనకూడదనీ, "స్వీట్ as in sugar అనాలనీ. అమెరికా వాడు చెప్పేడు కనుక విన్నాం; అదే ఇండియన్ వాడు చెప్పుంటే కోపం వచ్చి ఉండేది.

# సహోద్యోగుల ఇళ్ళు, తునిలో మా ఇల్లు

### ఫ్రీజర్ లో ఆవు

నేను ఇండియనాపొలిస్‌లో పని చేస్తూన్న రోజులలో – ఇంటి దగ్గర చేసే పని ఏమీ లేదు కనుక – ఇద్దరు సహోద్యోగుల ఇంటికి తరచు వెళ్ళేవాడిని. ఒకడు డేల్ లినివిల్. మరో నలుగురు కుర్రాళ్లతో కలసి ఇతను ఒక పెద్ద ఇల్లు అద్దెకి తీసుకున్నాడు. నలుగురూ కలసి ఖర్చులు పంచుకుంటూ ఉండేవారు. ప్రతి వారం చిల్లరగా కొనుక్కుంటే డబ్బు ఎక్కువ ఖర్చు అవుతుందని, ఒక సారి వీళ్లు ఒక "ఆవు" ని పూర్తిగా కొనేసి, కసాయి వాడి చేత చిన్నచిన్న ముక్కలుగా తరిగించి, ఆ ముక్కలు దాచడానికి ఒక పేద్ద ఫ్రీజరు కొని, రోజూ అందులోంచి ఒక ముక్క తీసుకుని, కాల్చుకుని, తినేవారు. ఆవంతటినీ ఒక్కసారే టోకున కొనేసేరు కనుక వీళ్ళకి బాగా కిట్టుబాటు అయింది. రోజూ ఆ "గొడ్డు మాంసం" (బీఫ్) ఎంతకని తింటారు? ఎన్నాళ్లు తిన్నా "ఆవు" ఖర్చు అవటంలా! అందుకని డేల్ నన్ను మచ్చిక చేసుకుని, వాళ్ళింటికి నాలుగైదు సార్లు తీసికెళ్ళి, ఫ్రీజర్‌లో ఉన్న పొట్లాలు కట్టిన "ఆవు"ని చూపించి, అది ఎంత లాభదాయకంగా ఉందో చెప్పి, నా చేత మెప్పులు పొంది, నాలుగైదు తడవలు వాళ్ళింటికి వెళ్ళిన తరువాత నన్ను కూడా వాళ్ళింట్లో ఒక గదిలో అద్దెకి ఉండమని అడిగేడు. నేను శాకాహారినన్న విషయం వాడికి తెలియదు. ఆ రోజుల్లో ఆవు అంటే నాకు ఇంకా గౌరవ భావం ఉండేదని కూడా వాడికి తెలియదు. (తునిలో మా పెరట్లోనే ఆవు ఉండేది!) చూస్తూ, చూస్తూ చవగ్గా వస్తున్నాది కదా అని ఆవు మాంసం అమాంతం ఎలా తినెస్తాను?) అసలు విషయం అర్థం అయిన తరువాత, డేల్ నిరాశ పొందకుండా నన్ను అర్థం చేసుకున్నాడు.

రెండో సహోద్యోగి పేరు జాన్ బెక్. ఇతనికి అప్పటికే పెళ్ళయి, ఒకటో, ఒకటిన్నరో పిల్లలు కూడా ఉన్నారు. తరచు వాళ్ళింటికి రమ్మని పిలచేవాడు; వెళ్ళేవాడిని. ఇతని భార్య పేరు షిర్లే. మంచి కలుపుగోలు పిల్ల. సంసారపక్షంగా ఉండేది. నేను వారింట్లో జొరబడి సొంత మనిషిలా తిరిగేవాడిని.

### అమెరికాలో ఇల్లు కట్టడం

“ఇల్లు” అన్నానే కాని, ఆ ఇల్లు కట్టడం పూర్తి కాలేదు; అది కేవలం ఇంటి యొక్క అస్థి పంజరం అనొచ్చు. కావలసిన ముఖ్యమైన వసతులు – వంట గది, పడక గది వంటివి కొన్ని సమకూరేయి కాని, మిగిలిన ఇంటి భాగాలు అన్నీ పూర్తి కాలేదు. లోపలి గోడలు లేచాయి కాని అవి డొల్లగా ఉన్నాయి. అమెరికాలో ఇళ్ళు ఇటికలతో కట్టరు; కలపతో కడతారు. గోడలని సిమెంటుతో గిలాబీలు చెయ్యరు; ఒక పేద్ద అట్ట లాంటి పలకని తీసుకువచ్చి, దానిని రాటలకి మేకులతో అతికించి, పైన రంగు వేసేస్తారు. గోడ లోపల అంతా డొల్లే. చలి దేశం కనుక ఆ డొల్లలో గాలి “ఉష్ణ నిరోధకి” లా పని చేస్తుంది. ఈ డొల్ల లోనే విద్యుత్ దీపాలకి కావల్సిన తీగెలని నడిపించి, గోడ మీద ఉన్న మీటలకి వెనకనుండి తగిలిస్తారు. అందువల్లనే అమెరికా ఇళ్లల్లో కరెంటు తీగలు గోడల మీద కనిపించవు.

జాన్ ఏమి చేసేడంటే పునాదులు వెయ్యడానికి, ఆ పునాదుల మీద కలపతో కళేబరం నిర్మించడానికి, పైన కొప్పు వేయడానికి కంట్రాక్టర్ని పెట్టి, డబ్బులిచ్చి, చేయించేడు. అలాగే మంచి నీటి సరఫరాకి కావలసిన గొట్టాలు, మురుగు నీరు బయటకి పోవడానికి కావలసిన అమరికలని కంట్రాక్టర్ చేత చేయించేడు. మిగిలిన పనులన్నీ తనే, ఒకటీ, ఒకటీ, తీరుబడి ఉన్నప్పుడు చేసుకునేవాడు. ఉదాహరణకి, గోడలని అట్టలతో మూసెయ్యక పూర్వం, తనే విద్యుత్తు కి కావలసిన తీగలు అన్ని గదులలోకీ లాగి, వాటికి మీటలు అమర్చి, దీపాలు తగిలించి, అన్నీ తనే చేసుకునేవాడు. నేను వాళ్లింటికి వెళ్లినప్పుడు తీగలు ఒక చివర నుండి మరొక చివరకి లాగడానికి, వగైరా సాయం చేస్తూ ఉండేవాడిని.



ఈ ఇల్లు చిన్నదేమీ కాదు. నాలుగు పడక గదులు, వంట గది, భోజనాల గది, రెండు స్నానాల గదులు, వగైరాలతో కనీసం 2400 చదరపు అడుగులు ఉంటుందని అంచనా వేస్తున్నాను. ఇంట్లో సగం భాగం అతనే పూర్తి చేసుకున్నాడు కనుక అతనికి కూలి ఖర్చులు బాగా కలిసొచ్చేయి. మొత్తం ఇల్లంతటికీ ఖర్చు దరిదాపు 15 వేల డాలర్లు అయిందని చెప్పేడు. అతని జీతం సాలుసరి 10,000 కి మించదు. అంటే ఏణ్ణర్థం పని చేసి గణించిన డబ్బుతో అతనికి ఒక ఇల్లు వచ్చింది. ఇప్పుడు సిలికాన్ వేలీలో పని చేస్తూన్న ఆసామీకి ఏటికి 200,000 జీతం అనుకుందాం. ఏణ్ణర్ధం పని చేస్తే ఆ వ్యక్తి 300,000 గణిస్తాడు. ఆ డబ్బుకి ఈ రోజుల్లో పశువుల పాక కూడా రాదు. ఇక్కడ ఆ రకం ఇల్లు ఇప్పుడు కొనాలంటే 2 మిలియను డాలర్లు అవుతుంది.

ఈ సందర్భంలోనే  ఇండియాలో ఇల్లు కట్టే పద్ధతికి, అమెరికాలో పద్ధతికీ మధ్య తేడా బాగా తెలిసొచ్చింది. ఇండియాలో, అప్పటికి కేవలం పదేళ్ళ క్రితమే, మా నాన్నగారు ఇల్లు కట్టిన వయినం చెబుతాను. ఆ ఇల్లు కట్టిన తరువాత ఆ ఇంట్లో మా చెల్లెలుకి పెళ్లి చేసేరు.

### ఇండియాలో నాన్నగారు కట్టిన ఇల్లు

అది 1955 వేసంగిలో సంగతి. అనగా నా ఇండియానా జీవితానికి పదేళ్ళ కిందటి మాట. అప్పట్లో నాన్నగారు ఇల్లు కట్టడం నాకు ఇంకా బాగా గుర్తు ఉంది. ఇంటికి కావలసిన కలప, ఇటిక, గునపాలు, పారలు, మొదలైన సరంజామా అంతా స్థలంలోనే ఉన్నయ్. పగలల్లా పని వాళ్ళు ఉంటారు గనుక పరవా లేదు కాని రాత్రి మాత్రం మనిషి కాపలా లేకపోతే సరుకులు మాయం అయిపోతాయి.

కనుక నూతికి ఎదురుగా చిన్న ఒంటిదూలం పాక వేసి, అందులో ఈ సామాను పెట్టి దానికి రోజూ కాపలాకని నాన్నగారు ఆ పాకలోనే ఒక మడత మంచం వేసుకుని పడుక్కునేవారు. సాయంకాలం ఏడింటికి ఇంటికి వచ్చి భోజనం చేసి మళ్ళా ఒక గంటలో తిరిగి వెళ్ళిపోయేవారు. ఆ గంటసేపూ కాపలా పని ఇంట్లో పిల్లల మీద పడేది. వేసంగికి ఇంటి దగ్గర ఉన్నాను కనుక ఆ బాధ్యత తరచు నా

మీద పడేది. నేనేమీ చిన్న వాణ్ణీ, చితక వాణ్ణీ కాదు. అప్పటికే కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో చేరి ఒక ఏడు పూర్తి అయింది.

ఇల్లు కట్టడం అంటే అప్పుడు మొదలు పెట్టేరు కాని, అసలు అమ్మకీ నాన్నగారికీ తమదంటూ ఒక ఇల్లు ఉంటే బాగుంటుందనే కోరిక చాల ఏళ్ళబట్టి ఉంది. కోరికలుండడంలో తప్పు లేదు. తీరే అవకాశాలు రావద్దూ?

అలాగని మాట అనుకున్నంత మాత్రాన వచ్చిన నష్టం ఏమిటి? అందుకనే "ఇల్లు కట్టుకుంటే బాగుండును" అని అనుకునేవారు అప్పుడప్పుడు. ఇలా మసకగా ఉన్న ఊహ ఘనీభవించి ఒక స్ఫటికాకారం దాల్చడానికి ఆ వేళ పోష్టు జవాను పట్టుకొచ్చిన ఉత్తరం నాంది పలికించింది.

ఉత్తరం చదివి నాన్నగారు చిందులు తొక్కడం మొదలు పెట్టేరు. వీలు చూసుకుని త్వరలో ఇల్లు ఖాళీ చేసెయ్యమని మా అద్దె ఇంటి కొత్త యజమాని ఉత్తరం రాసేడు. ఖాళీ చెయ్యమని అతను అడిగినందుకు నాన్నగారికి కోపం రాలేదు. అతను ఇల్లు కొనుక్కున్నప్పుడు, "ఏమయ్యా! నువ్వు ఉండడం కోసం కొనుక్కుంటే చెప్పు, ఖాళీ చేసెస్తాను," అని నాన్నగారే అన్నారు.

"పంతులు గారూ! పిల్లలతో ఉన్నారు. మీరు కోటయ్యకి ఎంత అద్దె ఇచ్చేవారో నాకూ అదే ఇవ్వండి. నేనెక్కడో ఖరగ్‌పూర్‌లో ఉద్యోగం చేసుకుంటున్నాను. నాకీ ఇల్లు ఇప్పట్లో అక్కర లేదు," అని తన ఇద్దరి పెళ్ళాల సమక్షంలోనూ చెప్పేడు. చెప్పి, మా ఇంట ముగ్గురూ భోజనం చేసి మరీ వెళ్ళేరు. అటువంటి ఆసామీ ఖరగ్‌పూర్ వెళ్ళిన వెంటనే మనస్సు మార్చుకుని ఇల్లు ఖాళీ చేసెయ్యమంటూ ఉత్తరం రాసేడు.

ఏమనుకున్నాడో ఏమో, తనెందుకు మనస్సు మార్చుకున్నాడో సంజాయిషీ కూడ రాసేడు.

ఈ సంజాయిషీ చదివిన తర్వాతే నాన్నగారికి కోపం వచ్చింది.

“పంతులుగారూ! మీకిచ్చిన మాట నిజమే. మీరు ఆ ఇంట్లో గత పదిహేను ఏళ్ళబట్టీ ఉంటున్నారు కనుక ఇల్లు మీదే అని మీరు అనే ప్రమాదం ఉందని అక్కడ మీ ఇరుగు పొరుగులు నాకు పిరికి మందు పోసేరు. అందుకనే మిమ్మల్ని ఖాళీ చెయ్యమని అడుగుతున్నాను,” అంటూ మర్మం లేకుండా మనసులో మాట రాసేడు.

ఆ ఇల్లు అధర్మంగా కొట్టేద్దామన్న ఊహ నాన్నగారికి ఏ కోశాన్నా లేదు.

నిప్పు లాంటి తనని రైలు ఇంజనులో ఫైర్‌మన్‌గా పనిచేసే ఒక అనామకుడు అనుమానిస్తాడా? అదీ నాన్నగారి కోపానికి కారణం.

ఈ వెధవ పని ఆ కొవ్వూరి వెంకయ్యే చేసుంటుందని ఒకరు, లేదు షరాయి మేష్టరు చేసుంటాడని మరొకరు పత్తేదారీ మొదలు పెట్టేరు.

చెప్పుడు మాటలు ఎవ్వరు చెప్పేరో మనకి తెలియదు. తెలియనప్పుడు మరొకరిని మాట అనడం ఏమి భావ్యం? “అమ్మన్న గారూ, అమ్మన్న గారూ” అంటూ ఇంట్లో పెట్టిన ఇంగువ చారు పట్టుకు పోయేది ఒకరైతే “పంతులు గారూ, పంతులు గారూ" అంటూ అవసరం అయినప్పుడల్లా ఇంటి పంచని వేల్లాడి హోమోపతీ మాత్రలు పట్టికెళ్ళేది మరొకరు. వీళ్ళేనా వెనక్కి తిరగ్గానే చెప్పుడు మాటలు చెప్పేది? చెప్పుడు మాటలు చెప్పినవాడిది కాదు తప్పు; విన్న వాడిది. అందుకని నాన్నగారికి ఇంటి ఓనరు మీదే కోపం వచ్చింది. అదే ఊపులో ఇరుగు పొరుగులందరిమీదా విరక్తి పుట్టింది.

ఆ కోపంతో ఉత్తరం వచ్చిన ఉత్తరక్షణం ఇల్లు ఖాళీ చెయ్యడానికి ఉద్యమించేరు. అనుకున్నంతలో అద్దె ఇళ్ళు ఎక్కడ దొరుకుతాయి? ఆఖరికి పక్క వీధిలో, పెత్తెలుగు మేష్టారి ఇంటికి ఎదురుగా ఉన్న ఇంద్రగంటి రత్తమ్మ గారింట్లో ముందు భాగం ఖాళీగా ఉందని తెలిసి అమ్మతో చెప్పకుండా ఒక నెల అద్దె బయానాగా ఇచ్చి చక్కా వచ్చేరు.

“చెరువు మీద అలిగి, నీలాంటి వాడే, ముడ్డి కడుక్కోవడం మానేసేడుట. అలా ఉంది నువ్వు చేసిన యవ్వారం,”  అని మామ్మ నాన్న గారిని మందలించింది. “ఆ రత్తమ్మ పరమ గయ్యాళి. గోడ మీద మేకులు కొడితే తన గుండెల మీద కొట్టినట్లు ఉందని ఆ ఇంట్లో ఇంతకు పూర్వం అద్దెకి ఉన్న వాళ్ళని తరిమి తగిలేసింది. మనింటి నిండా ఇంటిడు పిల్లలు. గంటల పంచాగం వేల్లాడదీసుకుందికైనా గోడకి మేకు కొట్టాలి కదరా! ఇహ ఇంట్లో ఆడ పిల్లలు ఉన్న తర్వాత కాటుక వేళ్ళని అద్దం పక్క గోడకి రాసి తుడుచుకున్నా తుడుచుకుంటారు. ఒక పూత వెల్ల వేస్తే పోయేదానికి బదులు అకస్మాత్తుగా ఇల్లు ఖాళీ చేసి పొమ్మంటే మళ్ళా ఎక్కడికి పోతాంరా?”

“ఆ రత్తమ్మ చండశాసనురాలుట. ఎడాది క్రితం మొగుడు చచ్చిపోయినప్పుడు శవాన్ని సావిట్లో పడుకోబెట్టి, అటకెక్కి ఆస్తులకి సంబంధించిన రాతకోతల కాగితాలన్నీ కొంగులో దోపుకుని, అటక దిగొచ్చి అప్పుడు ఘొల్లు మందిట! మనని బతకనిస్తుందా?” అంటూ చిన్నక్క తనకి తెలిసిన మసాలాని తను అందించింది.

నోరు మంచిదైతే ఊరుమంచిదౌతుందనే తత్త్వం అమ్మది. రత్తమ్మ గారితో వరస కలిపింది. ఆవిడ కొడుకునీ, కోడలునీ మచ్చిక చేసుకుంది. అయినా సరే రత్తమ్మామ్మ గారికి మా ఇంట్లో పిల్లలు చేసే రొద కిట్టలేదుట. కోడలా కోడలా అని వరసలు కలుపుతూనే ఇల్లు ఖాళీ చేసెయ్య మన్నారు. సంవత్సరం తిరగకుండా మళ్ళా మా పాత ఇల్లు ఉన్న వీధిలోనే అనకాపల్లి మేస్టారి ఇంట్లోకి మారేం.

ఈ ఇంట్లో సదుపాయం తక్కువ. వాస్తు కోసమనో మరెందువల్లో వీధి గుమ్మంలో, తలుపు తెరవగానే పాయిఖానా! దాని పక్కనే నుయ్యి. నూతికెదురుగా ప్రహారీ గోడని ఆనుకుని నేలమట్టంగా దింపిన పంచపాళీయే వంట గది. మిగిలిన ఇల్లంతా పది మెట్లు ఎగువ. పప్పు కావాలన్నా, ఉప్పు కావాలన్న కొండెక్కినట్లు ఈ మెట్లన్ని ఎక్క వలసిందే. పెద్దవాళ్ళందరికీ కీళ్ళ నొప్పులో, వాతపు నొప్పులో ఉండబట్టి ఈ ఎగుడూ, దిగుడూ ఇబ్బందే పెట్టింది. మరేవిధంగా చూసినా ఇల్లు వాసయోగ్యంగా లేదనే చెప్పాలి. కనుక మళ్ళా ఇల్లు మారవలసి వచ్చింది.  ఆ సందర్భంలో ప్రసాదరావు మావయ్య గారూ, రామం

అత్తయ్య ఉళ్ళో అద్దెకిచ్చిన వారిల్లు ఒక సారి చూసి పోదామని వచ్చి మమ్మల్ని పలకరించడానికి వచ్చేరు.

ప్రసాదరావు మావయ్య గారికి అమ్మన్నా, నాన్నగారన్నా మంచి భక్తి. ఆయన చదువుకునే రోజులలో ఆయన జాతకం చూసి, "ప్రసాదరావూ! నువ్వు మేజస్ట్రేటు ఉద్యోగం చేస్తావు" అని చెప్పేరుట. ఇప్పుడు ఆయన పెద్దాపురంలో ఆర్. డి. ఒ. గా పనిచేస్తున్నారు. అందుకని ఆయనకి నాన్నగారంటే అపరిమితమైన గురి. రామం అత్తయ్య కి అమ్మ దేవతే. ఇంటిని అద్దెకి ఇచ్చేసి పెద్దాపురం వెళ్ళిపోయినా తుని వచ్చినప్పుడు మమ్మల్ని పలకరించకుండా వెళ్ళేవారు కాదు.

మా పరిస్థితి చూసి ఎవరో పరాయి వాళ్ళు ఉండే కంటె మేముంటే బాగుంటుందని మమ్మల్ని వారింట ఉండమని అడిగేరు. "సొంత ఇల్లే అనుకుని ఉండండి. మీరు ఇల్లు కట్టుకునే వరకు ఇల్లు ఖాళీ చెయ్యమని అడగం," అని హామీ ఇచ్చేరు. కనుక నేను స్కూలు ఫైనలు పూర్తి చేసి ఇంటరులో జేరే వేళకి మేము ప్రసాదరావు మామయ్య గారి ఇంట్లోకి మారేం.

ఆ ఇంట్లో ఉన్న రోజులలో అమ్మ చిట్టన్నయ్యతో అనేది, "చిట్టిపంతులూ, ఇలా పిల్లి పిల్లల్ని మార్చినట్లు సంసారాన్ని ఎన్ని సార్లురా మార్చడం? మీ నాన్న గారు రిటైరయే రోజులు వచ్చేయి. ఆయన ప్రోవిడెంట్ ఫండు పెట్టి చిన్న స్థలం కొనుక్కుని, అందులో మనదంటూ ఒక చిన్న ఇల్లు – కనీసం ఒక పాక – ఉంటే బాగుంటుందిరా అబ్బాయ్."

అప్పుడు చిట్టన్నయ్య ప్రోద్బలంతో నాన్నగారు స్థలం కోసం వెతకడం మొదలు పెట్టేరు.

తునిలో మేముండే కొత్తపేట ఊరుకి ఓ చివర ఉంది. కంది చేలు నరికి, రోడ్లు వేసి కట్టగా వెలిసిన శివారు. బజారులో బయలుదేరి – పోలీసు నుయ్యి దాటిన తర్వాత – సూరవరం రోడ్డు వెంబడి లక్షిందేవి చెరువు వైపు వస్తూ ఉంటే ముందుగా "సెంటుజార్జి కోట" తగులుతుంది. ముక్కు మూసుకుని పదడుగులు జోరుగా వేసి ముందుకి వస్తే ఎడం పక్క రాజు గారి తోట. దీనినే ఏనుగు తోట అనేవారు.

ఈ తోటలో ఒక మూల రాజుగారి ఏనుగు ఉండేది. అక్కడ కంపు భరించలేకనో ఏమో దరిమిలా ఆ ఏనుగుకి పిచ్చెక్కింది. తుపాకితో కాల్చేసి అక్కడే పాతి పెట్టేసేరు. తర్వాత సెంటు జార్జి కోటని పడగొట్టేసి ఏనుగు దిబ్బ మీద ఒక పార్కు కట్టేరనుకొండి.

ఆ పార్కు వెనక గుర్రాల సాలలు. ఈ సాలలు శిధిలావస్థలోనే ఉన్నాయి తప్ప నాకు గుర్రాలెప్పుడూ కనిపించ లేదు. ఈ ఏనుగు దిబ్బ, గుర్రాల సాలలు మొదలుకొని, ఇటు సూరవరం రోడ్డు వెంబడి – ఒక అర మైలు పైగా విస్తరించి ఉండేది, రాజుగారి తోట. ఆ తోటలో అపురూపమైన రకరకాల ఫలవృక్షాలు ఉండేవి. దక్షత లేక పాడయి పోయింది. ఈ తోటకి ఎదురుగా, సూరవరం రోడ్డుకి కుడివైపున శ్రీ రాజా ఉన్నత పాఠశాల వారి బంతుల బీడు. ఆ బీడు పక్కనే రాణీ సుభద్రయ్యమ్మ వారి పేర కట్టించిన ఘోసాసుపత్రి. అదీ దాటుకు వస్తే దయ్యాల తోట, దాని తర్వాతే కొత్తపేట మొదలవుతుంది.

ఈ కొత్తపేటలో మేముండే వాళ్ళం. బజారుకి వెళ్ళాలన్నా, రైలు స్టేషన్ కి వెళ్ళాలన్నా, ఊళ్ళో మరెక్కడికి వెళ్ళాలన్నా ఈ పేట దాటి, ఆ దయ్యాల తోట దాటి, బంతుల బీడు గేటు దాటి వెళ్ళేవాళ్ళం.

కనుక చీకటి పడ్డ తర్వాత మాకు అటువేపు వెళ్ళడానికి భయం వేసేది.

దరిమిలా 1952 నాటికి రాజు గారు తోటంతటినీ కొట్టించేసి, రోడ్లు వేయించి ఇళ్ళ స్థలాలుగా అమ్మకానికి పెట్టేరు. రిజిస్ట్రీ చెయించుకునేటప్పుడు ఇటు అమ్మేవాళ్ళూ, అటు కొనేవాళ్ళూ కూడ నాన్నగారి సలహా కోసం వచ్చేవారు. కనుక ఊళ్ళో ఎక్కడెక్కడ ఏయే స్థలాలు ఉన్నాయో, ఎక్కడెక్కడ ధరలు ఎలా పలుకుతున్నాయో ఈ వివరాలన్నీ నాన్నగారికి బాగా తెలిసేవి.

ఏనుగు తోటలో స్థలాలు వేడి వేడి పకోడీలలా అమ్ముడు పోయాయి కాని, ఘోసాసుపత్రికి ఎదురుగా ఉన్న వీధిలో మంగలి మాన్యపు స్థలాలు గభీమని అమ్ముడు పోలేదు. అక్కడ గజం రెండు రూపాయలు పలుకుతోంది అప్పట్లో. అందులో వెయ్యి గజాల స్థలం – రిజిస్ట్రేషన్ విషయాలలో సహాయం

చేసినందుకు గాను – రూపాయిన్నర చొప్పున బేరం కుదుర్చుకున్నారు. తనకి వచ్చిన రెండు వేల ప్రోవిడెంటు ఫండులోనూ పదిహేను వందలు పెట్టి ఆ స్థలం కొనేసేరు.

ఆ స్థలంలో ఒక తోట వేసి, ఆ తోట మధ్యలో – అప్పారావు డాక్టరు గారి ఇల్లు మాదిరి – ఒక ఇల్లు ఉంటే బాగుంటుందని అమ్మ, చిట్టన్నయ్య ఏవేవో పథకాలు వేస్తున్నారు. స్థలం మధ్యలో మంచి మేడ, చుట్టూ ప్రహరీ గోడ, గోడ మీదనుంది బయటకి ఒరుగుతూ బోగన్‌విలియా మొక్కలు, వీధి వాకట్లో పువ్వుల మొక్కలు, క్రోటన్లు, పెరట్లో అరటి బోదెలు, మామిడి చెట్లు – ఇలా ఏదో పెద్ద పథకమే ఉంది అమ్మ బుర్రలో.

స్థలం కొనేయడం కొనేసేరు కాని, నన్ను కాకినాడలో చదివిస్తూ ఇల్లు కట్టడానికి నాన్నగారికి దమ్ములు చాలలేదు. చేతిలో చిల్లి గవ్వ లేదు.

వెధవ డబ్బు అదే వస్తుంది. అంతకీ అవసరమైతే తన ఒంటి మీద బంగారం అమ్మేస్తానంటూ అలవాటుగా అమ్మ మెడ తడుముకుంది. అప్పటికి కాని ఆమెకి గుర్తుకి రాలేదు. కూతురి పెళ్ళికి కాసుల పేరూ, కొడుకుల చదువులకి ఎనిమిది పేటల చంద్రహారాలు వెళ్ళిపోయాయని.
ఈ సందర్భంలో దాసు మావయ్య గారు – ఈయన నాన్నగారి స్నేహబృందంలో ఒకరు – ఒక సలహా ఇచ్చేరు. మా ఊళ్ళో సలహాలు ఇచ్చే వాళ్ళు చాలమందే ఉండేవారు. అది కూడ డబ్బు పుచ్చుకోకుండా ఫ్రీ గా ఇచ్చేవారు.

"వెయ్యి గజాలు ఏమిటి చేసుకుంటారండీ? అయిదు వందల గజం అమ్మేసి ఆ డబ్బుతో మిగిలిన జాగాలో ఒక పాక వేసుకుని ఉండండి. మీదంటూ ఒక ఇల్లు ఉన్న తర్వాత అందులో మీరు కల్లే తాగేరో, గంజే తాగేరో ఎవరు చూడొచ్చారు."

దస్తావేజు మీద సిరా ఇంకా ఆరకుండానే స్థలాన్ని రెండు ముక్కలు చేసి ఒక ముక్కని అమ్మేయడానికి అమ్మ ఇష్టపడ లేదు. చిట్టన్నయ్య ససేమిరా అన్నాడు.

“చేతిలో చిల్లి గవ్వ లేకుండా ఇల్లెలా కడతావోయ్. కాలేజీ చదువులు చదివేవు కాని, కానీ లంచం పుచ్చుకోవడం చేతకాలేదు నీకు. మేడ కడతాడుట! ఇల్లు కట్టి చూడు, పెళ్ళిచేసి చూడు అన్నారు,” అంటూ దాసు మావయ్య గారు అన్నయ్య మీద ఒక వెటకారపు విసురు విసిరేరు.

“అమ్మా, నేను అప్పో సొప్పో చేసి ఎలాగో డబ్బు పట్టుకొస్తాను. అంతవరకు దాసు మావయ్య గారి మాట వినేసి తొందరపడి ఏమీ చేసెయ్యకండి,” అని పదే పదే చెప్పి అన్నయ్య తన ఉద్యోగపు ఊరు వెళ్ళిపోయేడు.

అన్నయ్య ఎక్కిన రైలు బండి ఔటర్ సిగ్నల్ దాటే వరకు ఆగి, దాసు మావయ్య గారు నాన్న గారి మీద పనికి ఉపక్రమించేరు. “ మీ వాడికి ఆవేశం తప్ప అనుభవం లేదు. కరువు కాలం. సిమెంటు దొరకడం లేదు. కలప దొరకడం లేదు. పునాదులేసి డబ్బు లేక పదేళ్ళ పాటు ఒదిలేసేరు ఆ దేవరకొండ వారు. చూస్తున్నాం కదా! పరిగెత్తి పాలు తాగే కంటె నిలబడి నీళ్ళు తాగడం మేలు. మీరు అందని వాటికి అర్రులు చాచి తూగ లేరు. నా మాట వినండి,” అంటూ అక్కడ ఉన్న నాన్నగారిని ఉద్దేసిస్తూ కొంచెం ఘాటుగా ఉపన్యాసం ఇచ్చేరు.

అప్పట్లో నా దగ్గర తంతే దమ్మిడీ లేదు కనుక ఇంటి విషయంలో నాకు ఓటు హక్కు లేదని నాకూ తెలుసు, ఆయనకీ తెలుసు. కుర్రాడినని నన్ను పూర్తిగా కొట్టిపారెయ్యడనికా వీలు లేదు. ఎందుకంటే మా వూళ్ళో మొదటివాడిగా నాకు ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చింది. ఆయనేమో బట్టల కొట్లో గుమస్తా. అందుకని నన్ను మాటలలో కలిపీ కలపనట్లు మాటవరసకి కలిపేరు.

దాసు మావయ్య గారు అమ్మ దగ్గరకి వచ్చి,

“చెల్లమ్మా, చూడండి. స్థలం కొని చాల రోజులు అయిపోతోంది. ధరలా పెరిగి పోతున్నాయి. మీరు ఈ వేసంగిలో ఏదో విధంగా ఇల్లు కట్టేయ్యాలి. మీ చిట్టిపంతులు డబ్బు గణించి మేడ కడతానంటే నేను వద్దంటానా! పోనీ, అందాకా స్థలంలో ఓ మూలకి చిన్న పంచ దింపుదాం. డబ్బు సర్దుబాటు

అయినప్పుడు ముందుకి మేడ కట్టుకుందాం. చిట్టిపంతులుకీ, శాస్త్రికీ ఈ పని అప్పజెబితే వాళ్ళు గాలిలో అలా మేడలు కడుతూనే ఉంటారు."

వేడిగా ఉన్న ఇనప కడ్డీ మీద సమ్మెటతో దెబ్బ వేసినట్లు, ఏమీ పాలు పోని స్థితిలో అమ్మకీ, నాన్నగారికీ దాసు మావయ్యగారి బోధ నచ్చింది.

దీర్ఘ చతురంగా ఉత్తరముఖంగా ఉన్న స్థలంలో నైరృతి మూల చిన్న పంచ దింపడానికి నిశ్చయం చేసేరు. ఉన్న స్థలంలో సగానికి పైగా తూర్పుకీ ఈశాన్యానికీ ఒదిలేయడం వాస్తు ప్రకారం మంచిదే అని దాసు మావయ్య గారు చెప్పగానే "సరే" అన్నారు నాన్న గారు.

"ఇల్లు మరీ మూలకి వచ్చినట్లుంది. అప్పారావు డాక్టరు గారి ఇల్లులా స్థలంలో మధ్యకి ఇల్లు ఉంటే బాగుంటుందని అన్నయ్య అంటున్నాడు  కదా" అన్నాను.

"అనడానికేమి! అంటాడోయ్. ఇల్లు ఇలా ఒక మూలకి ఉంటే, రేపొద్దున్న డబ్బు అవసరం వస్తే ఆ తూర్పు భాగాన్ని మరొక స్థలంగా అమ్మేసుకోవచ్చు. అంతే కాకుండా తూర్పు వైపు ఎక్కువ జాగా వదిలెయ్యడం వాస్తు ప్రకారం మంచిదోయ్."

నాన్న గారు స్థలం కొనడం చూసి మరికొంత మంది ముందుకి వచ్చి ఇటూ అటూ ఉన్న స్థలాలని కొనేసేరు. కాని ఆ నిర్జన ప్రదేశంలో మొట్టమొదట శంకు స్థాపన జరిగిందీ, గృహప్రవేశం జరిగిందీ మా ఇంట్లోనే.

ఇల్లు కట్టాలంటే నీళ్ళు కావాలి కదా. అందుకని ముందస్తుగా నుయ్యి తవ్వించేరు. శాస్త్రం మాట ఎలా ఉన్నా ఇంటిని నైరృతి మూలలో ఇరికించడానికి నిర్ణయం అయింది కనుక, నుయ్యి వీధి గుమ్మంలోకి వచ్చింది. అంటే ఇంటికి ఎవ్వరు వచ్చినా ముందు వాళ్ళకి కనబడేది నూతి దగ్గర స్నానాలు చేస్తూన్న ఆడవాళ్ళు. ఈ విషయం ఇల్లు కట్టడం పూర్తి అయేవరకు అవగాహన కాలేదు.

నుయ్యి తవ్వడం మొదలు పెట్టేరు. లంకెల బిందెలేమైనా దొరుకుతాయనుకున్నారో ఏమిటో, నాన్నగారు తవ్వకం అవుతూన్నంత సేపు నన్ను అక్కడ కాపలా పెట్టేరు. నూతిలో నీళ్ళకి బదులు పెట్రోలియం పడితే బాగుండునని నేను కోరుకున్నాను. లంకెల బిందెలూ దొరకలేదు, ఖనిజపు నూనే పడలేదు, కాని కొబ్బరి నీళ్ళల్లాంటి తియ్యటి నీళ్ళు పడ్డాయి.

ఇల్లు కట్టడానికి కావలసిన ఇటికలు, సున్నం, కలప వగైరాలన్నీ సమకూర్చడం మొదలు పెట్టేరు నాన్నగారు. అన్నీ ఒక్క సారి కొనలేరు కనుక ఒకటీ, ఒకటీ కొనడం మొదలు పెట్టేరు. ఇలా కొన్న సరుకంతా ఎక్కడ దాచుతారు? మా స్థలంలోనే నిల్వ చెయ్యడానికి నిశ్చయించేరు.

పునాదులు తవ్వడం మొదలు పెట్టేరు. తవ్వకం సగం అయేసరికి పక్క స్థలం కొనుక్కున్న బెహరా డాక్టరు గారు ముగ్గు, పురికొస తాడుతో ఒక సర్వే చేసే మనిషితో తన స్థలం సరిహద్దులు గీసుకుందికి వచ్చేరు. ఆ కొలతలు అయేసరికి మా పునాదులు ఒక అడుగు ప్రాప్తికి వాళ్ళ స్థలంలోకి వెళ్ళినట్లు తేలింది.

నిజానికి తప్పు మాది. సూరవరం రోడ్డు మొగలో ఉన్న మాటేటారి స్థలం మరీ రోడ్డు మీదకి వెళ్ళిపోయిందని పంచాయితీ బోర్డు వారు వారి స్థలం పడమటి సరిహద్దు నుండి ఒక అడుగు కోసేసి, వారి తూర్పు సరిహద్దుని ఒకడుగు తూర్పుకి జరిపేరు. దాంతో బెహరా వారి స్థలం ఒకడుగు తూర్పుకి జరిగింది. ఈ విషయం మా వాళ్ళు చూసుకోలేదు. మా ఇల్లు స్థలం మధ్యలో ఉండుంటే ఈ మాత్రపు సరిహద్దులలో సర్దుబాటు వల్ల ఎవ్వరికీ నష్టం రాకపోను – ఇంకా ఎవ్వరూ ప్రహరీ గోడలు కట్టలేదు కనుక. కాని మా వాళ్ళు మేడ, మేడ నుండి మిద్దె, మిద్దె నుండి పంచపాళీ, పంచపాళీ నుండి పాక అనుకుంటూ ఇంటి పునాదులని నైరృతి మూలకి తోసెయ్యడంతో మా పునాదులు – ఒక అడుగు మేరకి – బెహరావారి స్థలంలోకి వెళ్ళేయి.

తవ్విన గోతులన్నీ కప్పేసి మళ్ళా కొత్త పునాదులు తియ్యాలంటే తడిపి మోపెడవుతుంది. అపసంతికి పనెక్కువ, లోభికి ఖర్చు ఎక్కువ అని ఊరకనే అనలేదు.

స్థలాన్ని మధ్యకి కోసి రెండు స్థలాలు చేస్తే గీస్తే నుయ్యి మనకి ఉండాలని నూతిని స్థలం మధ్యలోకి వచ్చెటట్లు తవ్వించేసేరేమో, ఇప్పుడు పునాదులని తూర్పుకి జరిపితే ముందుముందు ముంగిటి వాకిలిలో మేడ కట్టుకోవాలంటే నుయ్యి అడ్డొస్తుంది. కనుక పునాదులని మరీ ఎక్కువగా తూర్పుకి జరపడానికి వీలు లేకపోయింది. ఎలాగైతేనేమి అతి కష్టం మీద పునాదులని రెండడుగులు జరిపి పని తిరిగి ప్రారంభించేరు. దీని పర్యవసానం ఏమిటయ్యా అంటే – పక్కింటి వారింటికి మా ఇంటికి మధ్య అనుకున్న ప్రహారీ గోడ కాస్తా హరీమనిపోయింది. వాళ్ళింటి గోడకీ మా ఇంటి గోడకీ మధ్య గోచీ అంత గంత మిగిలింది.

అన్నయ్య సెలవు పెట్టి ఇంటికి వచ్చేసరికి పునాదుల పని పూర్తి అయిపోయింది. అనుకున్నది ఒకటి, అయింది మరొకటీ అయేసరికి అగ్గిరాముడై పోయేడు.

ఎలాగైతేనేమి వాడిని సముదాయించేరు. తెల్లారి లేచి పునాది గోడలు చూడడానికి వెళ్ళేడు. చూసి చకితుడయేడు. నేలమట్టానికి సమాంతరంగా, చదునుగా ఉండవలసిన పునాదిమట్టం, కుంభాకారంగా ఉబ్బెత్తుగా కనిపించింది.

మేస్త్రీని పిలిచేడు.

"అది అలాగే ఉంటది బాబూ! మేం పద్దినవూ ఇళ్ళు కడతనాం గందా," అంటూ పెద్ద మేస్త్రి సూరన్న అన్న మాటలు అగ్గి మీద గుగ్గిలమే అయింది. దీనిని ఇప్పుడు గోటితో మీటక పోతే తర్వాత గొడ్డలి కావలిసి వస్తుందని అన్నయ్య ఆ పునాది గోడని పడగొట్టించి మళ్ళా చదునుగా వచ్చేటట్లు కట్టించేడు. తను కట్టిన గోడని పడగొట్టించేడని అన్నయ్య మీద సూరన్న వారం రోజుల పాటు అలిగేడు.

ఇంకా గోడలకి గిలాబీలు అవలేదు. గదులలో నేలకి ఇంకా గచ్చు పడ లేదు. ఇల్లు పూర్తయేవరకు ఆగడం వాస్తుకి మంచిది కాదన్నారు. గృహప్రవేశానికి నేను కాకినాడ నుండి ఇంటికి వచ్చేసరికి వాకట్లోనూ, ఇంట్లోనూ అంతా బురద బురద.

బురద కాకపోతే మరేమిటి ఉంటుంది? గుమ్మిడికాయని దొలిచి, దాంట్లో వసంతం పోసి ఆ కాయని గుమ్మం మీద వేసి పగలగొట్టేరుట. మనుషుల కంటె ముందుగా ఒక ఆవుని తీసుకొచ్చి, దాని చేత మెట్లెక్కించి, దానిని ప్రతి గదిలోకీ తీసుకెళ్ళి చూపించేరుట. ఈ హడావిడికి అది దేవుడి గదిలోకి వెళ్ళి అక్కడ ఉచ్చ పోసేసుకుందిట. ఇంకా నయం పేడ వేసెయ్యలేదని నేను సంబరపడబోతూ ఉంటే, అది పేడ కూడ వేస్తే ఎంతో శుభప్రదం అని ఇంటిల్లిపాదీ ఎంతో ఎదురు చూసేరుట. ఆ ఆవు అనుకున్నంత పనీ చేసిందిట. మామ్మ గోపంచితాన్ని తలమీద జల్లుకుని, ఆ గోమయంతో దేవుడిగదంతటినీ అలికేసిందిట!!

సొంత ఇంటి కోసం కలలు కని కలవరించిన అమ్మ గృహప్రవేశం హడావిడిలో పందిట్లో ఎక్కడో ఉంది; కనబడనే లేదు. రిటైరైన తర్వాతనైనా ఇల్లు కట్టుకో గలిగిన నాన్నగారు కనిపించ లేదు; ఆయన వడ్రంగులతోటీ, తాపీ మేస్త్రీలతోటీ కుస్తీ పడుతున్నట్లున్నారు, బయటెక్కడో. ఇల్లు తననుకున్నట్లు కట్టలేదని అలిగేడో ఏమో దేశానికి స్వతంత్రం వచ్చినప్పుడు గాంధీగారిలా చిట్టన్నయ్య గృహప్రవేశానికి రానేలేదు.

కాని, మడిగట్టుకుని ఎప్పుడు పెట్టేసిందో దేవుడి గదిలో దేవుడి మందిరం ఒక మూల, ఆవకాయ జాడీలు మరొక మూల సర్దేసి, గుమ్మానికి అడ్డుగానిలబడి చాటంత మొహంతో మామ్మ కనిపించింది.

నన్ను చూడగానే,

"నా వరాల తండ్రే! నా ధనాల కుప్పే! చక్కదనాల చుక్కే! ఏడు కొండలవాడా!! వచ్చావా, నాయనా. ఈ రోజు కోసం అరవై ఏళ్ళ బట్టి ఎదురు చూస్తున్నానురా!" అంది!

# వెస్ట్‌వర్డ్ హో!

యు. సి. ఎల్. ఎ. లో చదువు ప్రారంభించటానికి పశ్చిమ దిక్కుగా ప్రయాణానికి ప్రయత్నాలు ప్రారంభించేను.

అప్పటికి కారు తోలటం నేర్చుకుని ఆరు నెలలు కూడా కాలేదు. ఫోక్స్ వేగన్ బీటిల్ కారు – పాతది – $1000 పెట్టి కొని నాలుగు నెలలు అయిందేమో. ఎక్కువ అనుభవం లేకుండా అంత దూరం ఒంటరిగా ప్రయాణం చెయ్యటం కష్టమని బ్రెండా నన్ను AAA (Automobile Association of America) ఆఫీసుకి తీసుకెళ్ళి అక్కడ వారి సహాయంతో నా ప్రయాణానికి ఒక పథకం సమకూర్చిపెట్టింది. నాకు తొందర లేదు కనుక, నెమ్మదిగా దారిలో దేశం అంతా చూస్తూ వెళ్ళమని సలహా ఇచ్చింది. AAA వారు ఒక మేపు మీద పచ్చటి మార్కర్ తో ఇండియనాపొలిస్ నుండి లాస్ ఏంజిలిస్ వరకు ఒక పేద్ద గీత గీసి, దారిలో చూడదగ్గ ప్రదేశాల చుట్టూ సున్నలు చుట్టి, అక్కడ ఏమి చూడాలో చెప్పి, దారిలో రోడ్డు పక్క ఉండే వసతి సౌకర్యాలు అభివర్ణించబడ్డ ఒక పుస్తకాన్ని ఇచ్చి నన్ను సాగనంపేరు.

అప్పటికి ఇంకా junk కూడబెట్టే దురలవాటు కాలేదు కనుక నా యావదాస్తినీ కారు వెనక సీటు లోనూ, పక్కనున్న ముందు సీటులోనూ, ముందున్న ట్రంకులోనూ సర్దేసి ప్రయాణానికి సిద్ధం అయేను.

ఓజార్క్ కొండలలో మొదటి మజిలీ వేద్దామని పథకం. ఈ ఓజార్క్ అనేది Aux Arc అనే ఫ్రెంచి మాటకి భ్రష్ట రూపం. Aux Arc అంటే ఇంగ్లీషులో trading post అని అర్థం. కాని నిజానికి ఈ ప్రాంతానికి ప్రాముఖ్యత రావటానికి కారణం ఇక్కడి ప్రకృతి సౌందర్యం. నీటి బుగ్గలు, చిన్న చిన్న జలపాతాలు, సెలయేరులు, కొండలతో ఎంతో మనోహరంగా ఉంటుందని చెప్పి నన్ను అక్కడ కనీసం రెండు–మూడు రోజులైనా ఆగి వెళ్ళమని చెప్పి పంపేరు.

ఇండియనాపొలిస్ నుండి సెయింట్ లూయిస్ వెళ్ళటం ఎలాగో, అక్కడ మిసిసిపీ నది దాటిన తర్వాత రూట్ 66 పట్టుకుని ఓజార్క్ కి వెళ్ళటం ఎలాగో అంతా కాగితం మీద రాసుకున్నాను. వీడ్కోళ్ళు ఇవ్వటానికీ, చేతులు ఆడించటానికీ ఎవ్వరూ లేరు కనుక, ఆర్భాటం లేకుండా ఇంటి దగ్గర బయలుదేరేను.

ఇండియనాపొలిస్ లో I-70 తీసుకుని సెయింట్ లూయిస్ దగ్గర మిసిసిపి నదిని దాటే వరకు ప్రయాణం సజావుగానే సాగిపోయింది. దారిలో ఇక్కడా అక్కడా విశ్రాంతి తీసుకుందుకి అగుతూ సెయింట్ లూయిస్ చేరుకునే సరికి దరిదాపు నాలుగు అయిపోయింది. రోడ్డు మీద రద్దీ ఎక్కువ అయింది. ఆ రద్దీలో అనుభవం లేదేమో, షికాగో నుండి జాప్లిన్ వెళ్ళే రూట్-66 ని పట్టుకోవటం చేత కాలేదు. ఇంకా రూట్-66 ఎదట వస్తుందనుకుంటూ గుడ్డి నమ్మకతో కారుని తోలుతున్నాను. సాయంకాలం అయిపోతోంది. దారి తప్పేనని గమనించి ఎక్కడైనా ఆగుదామని ఫ్రీవే నుండి బయటకి వచ్చేసి చూసుకుందును కదా! నేను జెఫర్సన్ సిటీ అనే ఊరు డౌన్‌టౌన్ లోకి వచ్చేసేను. ఎదురుగా పెద్ద హొటేలు కనిపిస్తే అక్కడ ఆగి వారిని రూట్-66 కి వెళ్ళే దారి తప్పిపోయేనా అంటూ వాకబు చేసేను. ఆ దారి ఎప్పుడో తప్పిపోయాననని వారు చెప్పగా, ఆ నాటికి అక్కడే ఉండిపోదామని నిశ్చయించుకుని ఆ హొటేల్లో రాత్రికి $5 ఇచ్చి ఉండిపోయేను.

పగలల్లా ఎండలో, వాతనియంత్రణ (ఎయిర్ కండిషన్) లేని కారులో ప్రయాణం చెయ్యబట్టి, చాలా అలసటగా ఉంటే ఆ హొటేల్లో ఉన్న బారులోకి బీరు తాగుదామని వెళ్ళేను. కౌంటరు దగ్గర ఒంటరిగా కూర్చుని బీరు చప్పరిస్తూ ఉంటే బారు వెనక బల్ల దగ్గర కూర్చున్న ఒక వ్యక్తి వచ్చి పలకరించేడు. ఏదో మర్యాదకి తిరిగి పలకరించి నా బీరు వైపు తిరిగితే అతను వదలిపెట్టడే. ఏదో స్నేహశీలిలా ఉన్నాడని కబుర్లు మొదలు పెట్టేను. బారు స్టూలు మీద నుండి నన్ను లేవగొట్టి తను కూర్చున్న బల్ల దగ్గరకి తీసికెళ్ళేడు. నేను తాగుతూన్న బీరుకి తనే డబ్బులు ఇచ్చి మరొక బీరు కూడ తెప్పించేడు. అతని వాలకం చూస్తే అతను ఎప్పుడూ ఇండియా వారిని చూడలేదనిపించింది. నేను చదువుకుందుకని అయిన వాళ్ళందరినీ వదిలేసి పది వేల మైళ్ళు వచ్చి పరాయి దేశంలో మాస్టర్స్ డిగ్రీ చేసి, ఉన్న మంచి ఉద్యోగం

వదిలేసి పి. హెచ్. డి. చెయ్యటానికి లాస్ ఏంజిలిస్  వెళుతున్నానని తెలిసి మురిసి పోయేడు. ఇలా కబుర్లలో ఒక గంట గడిచింది.

అప్పుడు, "నిన్ను మా అబ్బాయికి చూపించాలని ఉంది. వాడు ఫుట్ బాల్ వెర్రిలో పడి అస్సలు చదువు చదవటం లేదు. నిన్ను చూపించి కొంచెం బుద్ధి చెబుతాను, మా ఇంటికి ఒక సారి వస్తావా?" అని అడిగేడు.

ముక్కూ, మొహమూ తెలియని మనిషి. చూడ్డానికి దరిదాపు నా అంత పొడుగే ఉన్నాడు. ఒక కాలి పాదం మడత పడ్డట్లు ఒంగిపోవటం వల్ల కుంటుతూ నడుస్తున్నాడు.  అతను పిలచేసరికల్లా తగుదునమ్మా అని వెళ్ళటానికి నేను కొంచెం తటపటాయించేను. అతని ముంజేతి మీద ఏదైనా పచ్చ బొట్టు కాని, చెవిలో బీడీ కాని కనిపించలేదు. గళ్ళ లుంగీ, మెళ్ళో తావీజు కూడ కనపడ లేదు. పరవాలేదనుకొని ఏ సమాధానం ఇవ్వకుండా ఆలోచిస్తున్నాను.

"నిన్ను మా ఆవిడకి, నా స్నేహితులకి కూడ చూపిస్తాను రా!" అంటూ బ్రతిమాలటం మొదలు పెట్టేడు. అంతగా అతను మొహమాట  పెట్టెస్తూ ఉంటే ఏ సాకు చెప్పాలో తోచక,

"నేను విద్యార్థిని. ఇలా తిరుగుళ్ళు తిరుగుతూ ఉంటే కాలేజీకి ఆలశ్యం అయిపోవచ్చు. పైపెచ్చు కారు ఖర్చులు నా బడ్జెట్ ని మించి అయిపోతాయి" అంటూ నసిగేను.

"ఓస్ అంతేనా! మా ఊరు వరకూ అయే రాను పోను గేసు ఖర్చులు నేను ఇచ్చేస్తాను. అక్కడ మా ఇంట్లోనే ఉంటావు కనుక నీకు అస్సలు ఖర్చే ఉండదు." అన్నాడు.

నాకు మరొక సాకు దొరక లేదు. లోపల్లోపల అతనితో వెళ్ళి వాళ్ళ ఊరు చూడాలనే ఉత్సాహం ఉండటంతో సరే అని ఒప్పుకున్నాను.

మర్నాడు తొమ్మిది అయేసరికల్లా కొత్తగా తళ తళ మెరుస్తున్న అతని ఎర్ర కారు ముందూ, వెనక నా గచ్చకాయ రంగు ఫోక్స్‌వేగన్లో నేను. అది డివైడెడ్ హైవే కాదు. కొంచెం పల్లెటూరి రోడ్డులా ఉంది. ఇటొక లేనూ, అటొక లేనూ. దారంతా ఎగుడు దిగుళ్ళూ, వంకర టింకరలూ. ఇటువంటి ప్రదేశాన్నే ఇంగ్లీషులో rolling hills అంటారు. రోడ్డు మీద రద్దీ లేదేమో బాబ్ తన కారుని చాలా జోరుగా నడుపుతున్నాడు. ఆ రోడ్ల మీద అంత జోరుగా నేను నడపలేక పోయేను. నడుపుదామన్నా ఎగుడు వచ్చినప్పుడల్లా నా కారు అరవై దాటి వెళ్ళటానికి మొరాయించేది. నేను బాగా వెనకపడి పోయేను. బాబ్ ని కొంచెం నెమ్మదిగా వెళ్ళమని చెప్పటానికి సెల్ ఫోనులు గట్రా లేవుగా. ఏమి చెయ్యాలో తోచక నేను జోరు తగ్గించేసి కావాలనే ఇంకా వెనక పడి పోయేను. వెనక చూపు అద్దం లో నేను కనిపించక పోయేసరికి గురుడుకి అర్థం అయినట్లుంది. జోరు తగ్గించేడు. ఏతా వాతా, వాళ్ళ ఊరు వెళ్ళేసరికి సాయంకాలం మూడు అయిపోయింది.

బాబ్ ఉంటూన్న ఊరి పేరు మేరీవిల్. అది మిస్సోరీ లోనే కేన్సస్ సరిహద్దుకి దగ్గరగా ఉంది. జెఫర్ సన్ సిటీ నుండి దరిదాపు 250 మైళ్ళు వచ్చేను. ఎక్కడా ఆగకుండా వచ్చేసేమేమో ఇంటికి వెళ్ళగానే అతని భార్య తినటానికి ఒక గ్రిల్డ్ చీజ్ సేండ్విచ్, గ్లాసుడు పాలు ఇచ్చింది. ఆవి తింటూ ఇల్లంతా కలయజూసేను. వారిది సామాన్యమైన మధ్య తరగతికి ఒక మెట్టు దిగువేమో అనిపించే భేషజాలు లేని చిన్న ఇల్లు. చిన్న వసారాలా ఉన్న వంట గదిలో ఒక పక్క స్టౌ, రెఫ్రిజిరేటరు వగైరాలు ఉన్నాయి. వాటికి ఎదురుగా బార్ లో ఉండే బల్ల లాంటి ఎత్తైన బల్ల, ఆ బల్లకి రెండవ పక్కన ఎత్తైన నాలుగుకాళ్ళ కుర్చీలు. ఆ ఎత్తు బల్ల దగ్గర కూర్చుని నా సేండ్‌విచ్ తినేసేను. నడి వయస్సులో ఉన్న ఆ గృహిణి కొంచెం పోతరించిన శరీరంతో పుష్టిగా కనిపించింది తప్ప నాజూకుగా లేదు. బాబ్ జెఫర్‌సన్ సిటీలో చూపించినంత ఆప్యాయత ఈమె బాహాటంగా చూపించ లేదు కానీ నాకు కావలసినవి అన్నీ చూసి వేళకి ఇంత తిండి పెట్టేది.

సాయంత్రం అయింది కానీ ఫుట్‌బాల్ ఆటగాడు ఇంటికి రాలేదు. నాకు అలసటగా ఉంటే బేస్‌మెంట్ లో ఒక చిన్న గదిలో నాకు పక్కేసి పడుక్కోమన్నారు.

మర్నాడు పొద్దుట ఏ పదకొండింటికో కనిపించేడు మన ఫుట్‌బాల్ ఆటగాడు! తల్లిని పోలిన కొడుకేమో చూడటానికి ఫుట్‌బాల్ ఆటగాడిలాగే ఉన్నాడు. వాడికి చదువు మీద ఈషణ్మాత్రం దృష్టి లేదు. అలాగని పెద్ద ఆటగాడా అంటే అదీ కాదు. ఏదో ముక్తసరిగా మూడు మాటలు మాట్లాడి తప్పించుకుని పోయాడు. బాబ్‌పడ్డ శ్రమ అంతా వృధా అయిందే అని కించిత్తు చింతించేను.

కనీసం అక్కడ ఉన్న కాలాన్ని సద్వినియోగం చేసుకుందామని బాబ్ ని అడిగేను, "నీ స్నేహితులు ఎవ్వరైనా ఉంటే పలకరిద్దాం పద" అని. బాబ్ నా కోరిక మేరకి నన్ను ఊళ్ళోకి తీసికెళ్ళి తనకి తెలిసున్న వాళ్ళకి ఒక సారి చూపించి పరిచయం చేసేడు: మంగలివాడు, పాలవాడు, కసాయివాడు, తపాలావాడు, పంతులమ్మ, మొదలైన వాళ్ళు.

ఏవో కుశలప్రశ్నలతోమొదలై కుతూహలపు ప్రశ్నల వరకు ఒక అరగంట జరిగిన సంభాషణలన్నీ నాకు కొట్టిన పిండే. అప్పుడు మంగలి భార్య అనుకుంటాను, డోరతీ, ఇండియాలో మా సంసారం గురించి చెప్పమని అడిగింది. ఆవిడ కోరిక ఏమిటంటే నేను ఉన్న ఊరు వదలి అమెరికా వచ్చినట్లే మా పూర్వీకులలో ఎవరైనా ఒక దేశం వదలి మరొక దేశం వెళ్ళేరా అని.

"నా కంటె ముందు మా అన్నయ్య రాచెస్టర్ వచ్చి చదువుకున్నాడు"

"అది సరే. ఇండియాలో మీ తాతలు, ముత్తాతలు ఎక్కడ నుండి వచ్చేరు? ఏ దేశం నుండి వచ్చేరు?"

అప్పుడు నాకు అర్థం అయింది ఆమె వేసిన ప్రశ్న లోని ధోరణి. ఈ అమెరికాకి వచ్చిన తెల్ల వాళ్ళంతా యూరప్‌లో ఏదో ఒక దేశం నుండి వచ్చిన వారే కదా. వీళ్ళల్లో కొందరికి ఆ పాత దేశంలో ఉన్న పూర్వీకుల చరిత్రలు తవ్వి తియ్యటం అంటే సరదా. ముఖ్యంగా వాళ్ళ ప్రవరలో రాచ రక్తం ఉంటే ఇంకా సరదా.

"అది చాలా పెద్ద కథ. ఓపిక ఉండి వినగలమంటే టూకీగా చెబుతాను." తీరామోసి నేను కథ మొదలెట్టిన తర్వాత జోగి పోతారేమోనన్న బెంగతో ముందర కాళ్ళకి వేసిన బంధం ఇది.

అందరూ చెప్పమని నన్ను ప్రోత్సహించేరు. నేను చెప్పటం మొదలు పెట్టేను.

"నాకు తెలుసున్న మేరకి చెబుతాను. మా నాన్నగారు ఎప్పుడో నా చిన్నతనంలో చెప్పగా విన్నాను.

"మా పూర్వులు గుంటూరు జిల్లాలో వేమూరు అనే ఊళ్ళో ఉండేవారు. ఆ ఊరి నుండి వచ్చిన వారంతా వేమూరి వారే.

"సా. శ. 1650 ప్రాంతాలలో పోర్చుగీసు వారూ, డచ్చి వారూ బందరు అనే రేవు పట్టణానికి పడవలు తీసుకొచ్చి వ్యాపారం చేసే రోజులలో అక్కడ ఉద్యోగాలకి అవకాశాలు ఎక్కువ ఉంటాయని వేమూరు నుండి కొన్ని సంసారాలు బందరు తరలి వచ్చేసేయి. ఈ వంద మైళ్ళ ప్రయాణం మా వేమూరి వారి వంశంలో మొదటి వలస.

"ఇలా బందరు వలస వచ్చిన కుటుంబాలలో కొన్నాళ్ళకి వేమూరి భగీరథ భొట్లు అనే వ్యక్తి పుట్టేడు. ఈయన జాతకాలు చెప్పటం లోనూ, అంజనం వేసి పోయిన వస్తువులు ఎక్కడ ఉన్నాయో చెప్పటంలోనూ కొంత ప్రావీణ్యత సంపాదించి కొంత పేరు తెచ్చుకున్నాడు."

"అంజనం అంటే?" అంటూ అక్కడకి వచ్చిన ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయిని అడగనే అడిగింది.

"అంజనం వెయ్యటం ఒక మంత్ర శక్తిని ప్రేరేపించటం లాంటిది. ఇంకా ప్రపంచపు పోకడలు తెలియని ఒక చిన్న పిల్లడిని కానీ, పిల్లని కానీ తీసుకుని, వాళ్ళ కళ్ళకి మంత్రించిన కాటుక రాస్తారు. తర్వాత వారి అరిచేతిలో మంత్రించిన ముగ్గులు లాంటి బొమ్మలు వేసి ఆ ముగ్గులలోకి చూడమంటారు. మీ అందరికీ క్రిస్టల్ బాల్ అంటే ఏమిటో తెలుసు కదా. అంజనం వెయ్యటం అంటే క్రిస్టల్ బాల్ లోకి

చూసినట్లు చూడటం అనుకొండి. చూస్తూన్న పిల్ల కంటికి ఏమి కనిపిస్తోందో చెప్పమంటారు. అర్థం అయిందా అమ్మా?”

ఆ గుర్విణి మందహాసంతో తల పంకించింది. క్రిస్టల్ బాలూ, మేజిక్కు అనే సరికి మగతగా జోగుతూన్న ముసలి వారికి ఉత్సాహం పెరిగింది. నేను మళ్ళా కథ అందుకున్నాను.

“ఈ భగీరథ భొట్లు కీర్తి ఆ చుట్టుపట్ల చాలా దూరం వ్యాపించింది.

“ఇది ఇలా ఉండగా బందరుకి ఓ 150 మైళ్ళ ఉత్తరాన కాకినాడ అనే మరో రేవు పట్టణం ఉంది. అక్కడ మల్లాది సత్య లింగ నాయకర్ అనే పేరుగల ఒక సముద్రపు వ్యాపారి ఉండేవాడు. ఆయన పడవలు కొన్ని వ్యాపారానికని సముద్రంలోకి వెళ్ళి తిరిగి రాలేదు. ఆ పడవలు ఎక్కడున్నాయో తెలుసుకుందికి వారు వేమూరి భగీరథ భొట్లు ని సంప్రదించటానికి ఒక మనిషిని బందరు పంపించేరు.

“ ‘అంజనం వెయ్యాలంటే పడవల స్థావరం కాకినాడ కనుక నేను కాకినాడ రావాలి’ అని భగీరథ భొట్లు చెప్పేరు. వ్యాపారస్తులు భొట్లు గారికి ముందస్తుగా కొన్ని పారితోషికాలు ఇచ్చి, పడవలు దొరికినట్లయితే ఇంకా పెద్దగా గౌరవిస్తామని మాట ఇచ్చి ఆయనని కాకినాడ తీసుకుని వచ్చేరు.

“కాకినాడ వచ్చి భగీరథ భొట్లు అంజనం వేసి పడవలు ఎక్కడ ఉన్నాయో చెప్పేరు. మునిగిపోయాయని భయపడుతూన్న పడవలు ఆయన చెప్పిన రేవులో సురక్షితంగా ఉన్నాయని తెలిసిన తర్వాత వ్యాపారస్తులు భొట్లు గారిని బాగా సత్కరించి సంతోష పెట్టేరు. భగీరథ భొట్లు తిరిగి బందరు వెళ్ళే ప్రయత్నంలో ఉంటే, వ్యాపారులు భొట్లుని రామచంద్రపురం సంస్థానానికి తీసికెళ్ళి ఆస్థాన పండితుడిగా స్వీకరించమని రాజుగారికి సిఫారుసు చేసేరు. భొట్లు గారి ప్రతిభ అప్పటికే ఆ నోటా, ఈ నోటా విన్న రాజు గారు భగీరథ భొట్లు కి దగ్గరలో ఉన్న మాచవరం అనే పల్లెటూళ్ళో 1500 ఎకరాల భూమిని ఈనాముగా ఇచ్చి అక్కడే ఉంచేసుకున్నారు. ఈ 150 మైళ్ళ ప్రయాణం వేమూరి వారి వంశంలో రెండవ వలస.

“ఈ వ్యాపారస్తులే వారు గణించిన డబ్బుతో M. S. N. Charities అనే సంస్థని స్థాపించి ఆ సంస్థ ద్వారా ఇప్పటికీ విద్యార్థి వేతనాలు ఇవ్వటం, పాఠశాలలు కట్టించటం మొదలైన మంచిపనులు చేస్తున్నారు.

“మన భగీరథ భొట్లుకి కలిగిన ఆరుగురి మగ పిల్లలలో ఆఖరి వాడి పేరు చల్లయ్య. ఈ చల్లయ్య గారిని నుండి లెక్క పెడితే మా నాన్న గారిది ఆరవ తరం, నాది ఏడవ తరం. నేను మా ఊరు వదలి అమెరికా రావటం వేమూరి వారి వంశంలో మూడవ వలస అనుకోవచ్చు,” అంటూ టూకీగా తేల్చేసి, ఆ రోజు సమావేశానికి భరతవాక్యం పలికేసి అందరిదగ్గరా శలవు తీసుకున్నాను.

మర్నాడు ఉదయమే మళ్ళా ప్రయాణానికి సన్నద్ధ మయేను. నేను కారు ఎక్కే ముందు బాబ్‌నా దగ్గరకి వచ్చి ఎంతగానో ధన్యవాదాలు చెప్పి చేతిలో ఎనిమిది డాలర్లు పెట్టి “గేసు ఖర్చులకి ఉంటాయి ఉంచుకో” అన్నాడు.

నేను జెఫర్సన్ సిటీలో మాట వరసకి అన్న మాటని గుర్తు పెట్టుకుని అతను నాకు ఆ డబ్బు ఇచ్చేసరికి చకితుణ్ణయేను. నేను పుచ్చుకోటానికి మొహమాట పడుతూ ఉంటే పరవాలేదని కారు తలుపు తీసి నన్ను లోపల కూర్చోబెట్టేడు.

ఈ మేరీవిల్ కోసం 500 మైళ్ళు అధికంగా ప్రయాణం అయింది కదా. గేలను కి 30 మైళ్ళు చొప్పున ఓ 16 గేలన్లు గేసు ఖర్చయి ఉంటుంది. గేలను కి 20 సెంట్లు వేసుకున్నా నాకు అయిన ఖర్చు నాలుగు డాలర్లు మించి ఉండదు. అమాంబాపతులు (అంటే అరిగిపోయిన టైర్లూ, వగైరాలు) కలుపుకుంటే బాబ్ ఇచ్చిన ఎనిమిది డాలర్లూ లెక్కకి సరిపోతుంది. ‘తెలివైనవాడే’ అనుకున్నాను.

మేరీవిల్ అనుభవం అంతా ఒక కలలా అయిపోయింది. నేను వెళ్ళ వలసిన దారి తప్పి మరొక పక్కకి 250 మైళ్ళు వచ్చేసేనేమో తిరిగి రూట్ 66 పట్టుకుందుకి ఆ మెలికలు తిరిగిన రోడ్డు కాకుండా మరొక ఇంటర్ స్టేట్ హైవే వెంబడి ఒక రోజల్లా కారుని తోలుకుంటూ వెళ్ళేను. దారి పొడుక్కీ మేరీవిల్ లో

డొరతీకి చెప్పిన మా పూర్వుల కథ అలా మనస్సులో దోబూచులాడుతూనే ఉంది. గత ఇరవై మూడు ఏళ్ళల్లోనూ ఎప్పుడూ, 'నేను ఎవరిని?' అని కాని, 'నేనూ ఎక్కడి నుండి వచ్చేను?' అని కానీ ప్రశ్నించుకున్న పాపాన పోలేదు – డోరతీ అడిగే వరకు. కారు ఫ్రీవే మీద జోరుగా ముందుకి వెళుతున్నాది, మనస్సు మరింత జోరుగా వెనక్కి పరిగెట్టింది.

అది 1952 జూన్ నెల అనుకుంటాను. కన్న తల్లిదండ్రులనీ, పెరిగిన ఊరునీ వదలి పెట్టి మొదటి సారి తుని నుండి బయట పడి బందరులో ఇంటర్ చదవటానికి వెళ్ళేను. అప్పుడు పెద్దన్నయ్య అక్కడ పని చేసేవాడు. వాడి దగ్గర ఉండి చదువుకోమని నన్నూ, చిన్నక్కనీ బందరు పంపించేరు. అప్పుడు బందరు హిందూ కాలేజీకి మంచి పేరు ఉండేదేమో, గోదావరి జిల్లా నుండి వెళ్ళిన నాకు సీటు ఇస్తారో ఇవ్వరో అని భయపడుతూ పెద్దన్నయ్య నన్ను ప్రిన్స్‌పాలు గారి ఆఫీసుకి దగ్గరుండి తీసుకెళ్ళేడు. అప్పుడు ప్రిన్స్‌పాలు డాక్టర్ M. గౌరీనాథ శాస్త్రి గారు. ఆయన D. Sc. చేస్తూన్న రోజులలో కాంతి పుంజాల మీద ఏదో ప్రయోగం చేస్తూ ఉంటే ఆయన కళ్ళు దెబ్బతిన్నాయిట. అందుకే కాబోలు దళసరి గాజుద్దాల కళ్ళజోడుతో ఉన్నా మంచి ఠీవీగా కనిపించేరు. నా గుండెలు లబ్ డబ్ మని కొట్టుకుంటూ ఉండగా, అన్నయ్య వెనకాతలే అడుగులు వేసుకుంటూ, ఆయన ఆఫీసులోకి ప్రవేశించేను.

"నువ్వు తుని నుండి ఇంత దూరం ఎందుకు రావలసి వచ్చింది? అక్కడ కాలేజీలు లేవా?" అని మొదటి ప్రశ్న అడిగేరు.

"కాలేజీలు లేక కాదండి. ఇద్దరు పిల్లలు ఒకే సారి కాలేజీలోకి వచ్చేరండి. ఇద్దరినీ హాస్టల్ లో పెట్టి చదివించటం కష్టం అని నాన్నగారు వీళ్లని నా దగ్గరకి తోలేసేరండి. ముందు వీడి సంగతి చూసి తర్వాత అమ్మాయి సంగతి చూడాలండి."

"అతన్ని మాట్లాడనియ్యవోయ్" అంటూ అన్నయ్యని మందలించి, నన్ను అడగవలసిన ప్రశ్నలు అడిగి, దరఖాస్తు కాగితాలమీద సంతకాలు పెట్టేసి, మేము బయటకి వెళ్ళబోతూ ఉంటే, "వేమూరి రామకృష్ణరావు గారు ఏమౌతారోయ్?" అన్నారు.

నాకు మా అన్నదమ్ములని తప్ప మరొక వేమూరి వ్యక్తిని ఎవ్వరినీ తెలియదు. అదే మాట ఆయనతో అనబోతూ ఉంటే గౌరీనాధ శాస్త్రి గారు మరొక వేమూరి ఆయన పేరు చెప్పి ఆయనని తెలుసా?" అన్నారు. అప్పుడు అన్నయ్య అడ్డుకుని, "కుర్రాడు. వాడికేమీ తెలియదండి. మీరు చెప్పిన ఇద్దరూ కూడ మా బంధువులేనండి?"

"అలాగా. ఫలానా అతను ఇప్పుడు ఎక్కడ ఉంటున్నాడోయ్? అతని కొడుకు ఒకతను బెజవాడలో ---. అవునూ--- అతనికీ, మీకూ బంధుత్వం ఎలా?"

పెద్దన్నయ్యకి పచ్చి వెలక్కాయ గొంతుకలో పడ్డట్లయింది. "నాకూ బాగా బంధుత్వాలు చెప్పడం తెలియదండి. మా నాన్న గారు అంటూంటే వినడం తప్ప. ఇంటికి ఉత్తరం రాసి కనుక్కుంటానండి."

ఈ చిన్న విపత్తుతో బయట పడ్డాం. బయటకి వచ్చిన తర్వాత అన్నయ్య చెప్పేడు, "ప్రిన్సిపాలు గారు అడిగిన ఇద్దరూ చాలా పేరున్న వాళ్ళే. అలాంటి వాళ్ళతో మనకి బంధుత్వం ఉందని చెపితే ఎంతో గొప్ప."

"అయితే మనకి నిజంగా వీళ్ళంతా చుట్టాలేనా?" అని అమాయకంగా అడిగేను.

"లేదురా. ఇంటి పేరు తప్ప మనకీ ఈ బందరులో ఉన్న వేమూరి వారికీ ఏమీ సంబంధం లేదు."

"అయితే మనం ఎక్కడ నుండి వచ్చేం?"

"అమ్మ చెప్పడం మనం మాచవరం వేమూరి వారిమనీ, బందరు వేమూరి వారు వేరనీ."

"అయితే మన మాచవరం వేమూరి వారిలో పేరు పడ్డ వాళ్ళు ఎవ్వరూ లేరా?"

“ఏమోరా. నాన్న గారికి రెండేళ్ళప్పుడు, ఇంకా సుభద్రత్తయ్య కడుపులో ఉండగానే, మన తాత గారు చచ్చిపోయేరు. అప్పుడు మాచవరం నుండి మామ్మ పుట్టింటి వారింటికి విశాఖపట్నం జిల్లాలో గవరవరం వచ్చేసింది. నిజానికి మనకి మాచవరంలో ఉన్న వేమూరి వారితో కూడ చాల మట్టుకు బంధుత్వాలు తెగి పోయాయి – రాక పోకలు లేక.”

ఈ సంభాషణ 1952 లో జరిగింది. అప్పటి నుండి అసలు వేమూరి వారు ఎక్కడ నుండి వచ్చేరని నాకు ఒక కుతూహలం పట్టుకుంది. అందుకని వీలయినప్పుడల్లా కొంత విషయ సేకరణ చేసేను. చేసి, బందరు వేమూరి వారికీ, తదుపరి మాచవరం వేమూరి వారికీ, ఆ తర్వాత తుని వేమూరి వారికీ, ఆఖరుగా అమెరికా వచ్చిన నాకు మధ్య ఉన్న లంకెలని నిర్ధారించగలిగేను. ఈ కథలోని ముఖ్యాంశాలని టూకీగా మేరీవిల్ లో డొరతీకి చెప్పేను.

కారు లో ఉన్న రేడియో మీద వస్తూన్న పాటలని నేపథ్యంలో వింటూ,  ఇలా పగటి కలలు కంటూ ఉండగానే  సాయం సమయం కావచ్చింది. జాప్లిన్ అనే ఊరు వచ్చేసింది. ప్రయాణం మొదలు పెట్టిన నాడే చీకటి పడ్డ తర్వాత కారు నడప కూడదని ఒక నిశ్చయానికి వచ్చేను కనుక  అక్కడ దారి పక్క ఉన్న ఒక మొటేల్లో ఆ రాత్రికి ఆగి, నేను మొదట్లో సరదా పడి చూద్దామనుకున్న ఓజార్క్ సరస్సుల ప్రాంతం దాటి చాలా ముందుకొచ్చేసేనని తెలుసుకున్నాను. మళ్ళా వెనక్కి వెళ్ళటానికి ఉత్సాహం లేక మర్నాడు ఉదయం ప్రయాణం ముందుకే కొనసాగించటానికి నిశ్చయించి, ఇంత తిండి తిని పక్క మీద సాగిల పడ్డాను.

# రూట్ –66 మీద ప్రయాణం

షికాగో నుండి లాస్ ఏంజిలిస్ వెళ్ళటానికి ఆ రోజుల్లో రూట్–66 అని ఒక రహదారి ఉండేది. అప్పట్లో ఇది అమెరికాలోని రహదారులన్నిటిలోకీ పొడవైనదీ, పాతదీ అవటంతో దీనిని The Mother Road అనేవారు. అనటమే కాదు, దీని యెడల ఒక రకం భావుకత పెంచుకుని, దీని మీద చేసిన ప్రయాణాన్ని మనం కాశీ ప్రయాణం చెప్పుకున్నట్లు చెప్పుకునేవారు. దీని మీద కవులు పాటలు రాసేరు, నిర్మాతలు సినిమాలు తీసేరు. దరిమిలా దీనిని మించిన ఆధునిక రహదారులు రావటంతో దీని వాడకం క్రమేపీ తగ్గిపోయి ఇప్పుడు మేపులలో కూడ కనిపించకుండా పోయింది.

పోగొట్టుకున్న తర్వాత కాని వస్తువ విలువ తెలియదు. అలాగే ఈ మార్గం కాల గర్భంలో కలిసిపోతూ ఉంటే చూస్తూ ఊరుకోలేక ఇప్పుడు దీని అవశేషాలని సంపాదించి వస్తుప్రదర్శన శాలలు కట్టటం మొదలుపెట్టేరు – అభిమానులు. దీని మీది ప్రయాణపు అనుభవాలని కథలుగా చెప్పుకుంటున్నారు. ఈ రహదారి ఇంకా వాడుకలో ఉన్న రోజులలోనే నేను దీని మీద ప్రయాణం చెయ్యటం జరిగింది. తరువాత దీని స్థానంలో వచ్చిన ఆధునిక రహదారి వెంబడి రెండు, మూడు సార్లు దేశం ఈ కొస నుండి ఆ కొసకి కారు తోలుకుని వెళ్ళేను కాని ఆ మొదటి సారి చేసిన ప్రయాణమే నాకు ఇప్పటికీ గుర్తు ఉంది.



రూట్-66 నిజానికి ఒక పథకం ప్రకారం వేసిన రోడ్డు కాదు. పూర్వం గుర్రబ్బళ్ళల్లో ప్రయాణం చేసేవారూ, గుర్రాల మీద సవారీ చేసి టపాలు మోసుకెళ్ళేవారూ వాడిన బాటలన్నిటిని కలుపుతూ మొదట కంకర, ఆ తర్వాత తారు వేసి సంఘటిత పరచిన రాజమార్గమే ఈ రూట్-66.

"అశోకుడు ప్రయాణీకుల సౌకర్యం కొరకు బాటలు వేయించెను, బాటకి ఇరుపక్కలా నీడ కొరకు చెట్లు నాటించెను, బాటసారుల సౌకర్యానికి సత్రవలు కట్టించెను, నూతులు తవ్వించెను," అని నేను చిన్నప్పుడు తెలుసుకున్న బాటల వెంబడే బ్రిటిష్ వాళ్ళు గ్రేండ్ ట్రంకు రోడ్డు ని ఎలా నిర్మించేరో అలాగే పూర్వకాలపు బాటలని ఆనుకుంటూ ఈ రూట్-66 ని నిర్మించేరు. అందుకనే కాబోలు మన గ్రేండు ట్రంకు రోడ్డు లాగే ఈ రూట్-66 కూడ వంకర టింకరలతో, ఊళ్ళ మధ్యనుండి వెళుతూ, ఊరు బయటకి వచ్చిన తర్వాత హైవే గా మారుతూ ఒక నిర్దిష్టమైన పథకం లేకుండా ఉండేది. మధ్యే మార్గంలో అడ్డు రోడ్లు వస్తే అక్కడ ఒక సంచార దీపం (ట్రేఫిక్ లైటు) పెట్టి కార్ల ప్రవాహాన్ని అవసరాన్ని బట్టి అదుపులో పెట్టే వారు. ఈ రోడ్డుకి ఇటొక వాదారి ('లేను' కి నేను వాడుతూన్న తెలుగు మాట, వాహనాలు నడపటానికి వాడే దారి కనుక వాదారి అయింది.), అటొక వాదారి – అంతే. ఈ రెండు వాదారుల మధ్యా జాగా ఉండేది కాదు. ఊరు బయట వేగానికి అవధి సాధారణంగా గంటకి 55 మైళ్ళు. మధ్యలో ఊరు తగిలినప్పుడల్లా అకస్మాత్తుగా ఈ పరిమితి ఏ 25 కో, 15 కో పడిపోయేది. జోరుగా బండ్లని నడపటానికి అలవాటు పడిపోయిన ప్రయాణీకులు అకస్మాత్తుగా వచ్చే ఈ మార్పులకి సర్దుకోలేక, ఊళ్ళల్లో కూడ వేగపు అవధిని దాటి కార్లు నడిపితే జరిమానా వెయ్యటానికి పోలీసులు మాటు వేసి, కాసుకుని ఉండేవారు. రూట్-66 మీద రెండు వేల మైళ్ళు కారు నడిపి పోలీసు దగ్గర టికెట్టు పుచ్చుకోకుండా గమ్యానికి చేరుకున్న ఘనాపాటీలలో నేనొకడిని.

నేను 1964 లో ఈ రూట్-66 మీద ప్రయాణం చేసే రోజులకే ఈ రోడ్డులో చాలా మార్పులు వచ్చేయి. ప్రభుత్వం 'ఇంటర్ స్టేట్ హైవే సిస్టం' అని ఒక ప్రణాళిక రూపొందించి దేశం ఈ మూల నుండి ఆ మూలకి, ఆధునిక రహదారులు నిర్మించటానికి సమకట్టటం ఈ మార్పులకి నాంది. ఇప్పటి రోజుల్లో ఆ పాత రూట్-66 అవశేషాలు పనిగట్టుకు వెతికితే కాని కనిపించవు. ఇప్పుడు రూట్-66 స్థానంలో

షికాగో నుండి సెయింట్ లూయిస్ వరకూ I–55, అక్కడనుండి ఓక్లహోమా సిటీ వరకూ I–44, అక్కడనుండి నెవాడా–కేలిఫోర్నియా సరిహద్దులలో ఉన్న బార్‌స్టో వరకూ I–40, అక్కడనుండి కేలిఫోర్నియాలోని శేన్ బెర్నర్డీనో వరకు I–15, ఆఖరి దశలో శాంటా మానికా వరకు I–10 అనే పెద్ద పెద్ద రోడ్లు వచ్చేయి. ఇక్కడ I అన్నది “ఇంటర్ స్టేట్ హైవే” ని సూచిస్తుంది; అంటే అంతర్ రాష్ట్రీయ రహదారి. ఈ కొత్త రహదారులలో  కనీసం ఇటు రెండు వాదారులు, అటు రెండు వాదారులు ఉండటమే కాకుండా, ఈ రెండింటినీ విడదీస్తూ మధ్యలో ఒక పచ్చిక మైదానాన్ని ప్రవేశపెట్టేరు. రాత్రి ప్రయాణం చేసే వారికి ఎదటి కారు దీపాలు కళ్ళల్లో పడకుండా కాపాడింది, ఈ మైదానం. అంతే కాకుండా, రోడ్డు మీద వంకర టింకరలని సరి చేసి, దారిలో వచ్చే ఎర్ర–పచ్చ సంచార దీపాలని తీసేసి, అడ్డుగా వచ్చే రోడ్లని మీదకి ఎగిసే వంతెనల మీదకి మళ్ళించి, వాహనాలని జోరుగా నడపటానికి వీలుగా కట్టేరు. పూర్వం రూట్–66 మీద వేగానికి అవధి 55 మైళ్ళు అయితే ఈ కొత్త రహదారుల మీద అవధి సాధారణంగా గంటకి 70 మైళ్ళు.

నేను ఇండియనాపొలిస్ వదలి దారిలో పెత్తనాలు చేసుకుంటూ లాస్ ఏంజిలిస్ చేరుకునే సరికి పది రోజులు పట్టింది. కారులో నేను ఒక్కడినే కనుక ఒక విధమైన సర్వ స్వతంత్రం; ఎప్పుడు ఎక్కడ ఆగాలని ఉంటే అక్కడ ఆగేవాడిని, ఏది చూడాలని ఉంటే అది చూసేవాడిని. కాని కారులో ఎవ్వరూ తోడు లేకపోవటం వల్ల ఏకాంతం భరించటం కష్టంగా ఉండేది. బోరు కొట్టేది. అలసట వచ్చేది. గంటల తరబడి కళ్ళని రోడ్డు మీదే నిలిపి కారు నడుపుతూ ఉంటే ఒక్క సారి నిమిషం పాటు కళ్ళు రెండూ గట్టిగా మూసుకోవాలనే కోరిక తీవ్రంగా వచ్చేది. అప్పుడప్పుడు ఆపుకోలేనంతగా కునుకుపాట్లు వచ్చేవి. కనుక ప్రతీ వంద, నూట ఏభై మైళ్ళకి – అవసరం ఉన్నా, లేకపోయినా – కారు ఆపి, కిందకి దిగి, కాళ్ళు సాగదీసుకుని, కొంచెం సేద తీర్చుకుని మళ్ళా రోడ్డున పడేవాడిని. ఎప్పుడో జరిగిన ఈ ప్రయాణపు అనుభవాలు పూర్తిగా గుర్తు లేవు. నాకు బాగా జ్ఞాపకం ఉన్న విషయాలు కొన్ని చెబుతాను.

ముందుగా చెప్పుకో దగ్గది దారి పొడుగునా అవిరామంగా కనిపించే వ్యాపార ప్రకటనలు. ఈ రూట్–66 వెంబడి రోడ్డు మీద వందల కొద్దీ ‘బిల్ బోర్డు’ లు కనిపించేవి. ‘బిల్ బోర్డు’ అంటే ప్రకటనలు ఉన్న బల్లలు. ఖాళీగా కనిపించిన గోడ మీద మన వాళ్ళు పిడకలు పెట్టకుండా వదిలెస్తే దాని మీద

ఖచ్చితంగా సినిమాల వాళ్ళు "వాల్ పోస్టర్లు" అంటించినట్లే ఈ రూట్-66 వెంబడి అవకాశం దొరికినప్పుడల్లా ఎదట రాబోతూన్న ఆకర్షణలు, రాత్రి పడుక్కోటానికి మొటేళ్ళు, తినటానికి తిండి వస్తువులు దొరికే ఫలహారశాలలూ, ఓహ్, ఒకటేమిటి, దారి పొడుక్కీ ప్రకటనలే. మూడు తలల పాములని చూడండి, అయిదు కాళ్ళ ఆవులని చూడండి, చేప తోకలు ఉన్న మత్యకన్యలని చూడండి అని ఊరిస్తూ అమాయకులని మభ్యపెట్టే ప్రకటనలు,... ఇలా దారి పొడుక్కీ ఈ ప్రకటనలు తెగ కనిపించేవి. ఈ వేలం వెర్రి ఎంతగా ప్రబలి పోయిందంటే Wall Drug అనే కంపెనీ "827 మైళ్ళ దూరంలోనే మా షాపు. అక్కడ ఆగేరంటే ఉచితంగా మంచు ముక్కలు ఇవ్వబడును" అంటూ ప్రకటనలు చేసే వారు. ఎక్కడెక్కడ ఏయే సదుపాయాలు లభ్యమవుతాయో చెప్పే ప్రకటనలు ప్రయాణీకులకి అవసరమే, కాదనను. కాని ఏదైనా శృతి మించితే వెగటు పుడుతుంది. ఒక దానితో పోటీ పడుతూ మరొకటి చొప్పున ఈ ప్రకటనలు ఉండటంతో వాహనాలు నడిపే చోదకుల ఏకాగ్రతకి భంగం కలగటమే కాకుండా మనకి నిజంగా అవసరమైన విషయాలు — అంటే, ఏ రోడ్డు ఎక్కడికి వెళుతుందో, ఎదట రోడ్డులో ఎక్కడ మళుపులు వస్తాయో చెప్పే హెచ్చరిక సూచికలు – ఈ ప్రకటనల సముద్రంలో పడి – జోరుగా ప్రయాణం చేస్తూన్న ప్రయాణీకుల కళ్ళకి కనిపించేవి కావు.

ఈ పరిస్థితి ఎంతవరకు వచ్చిందంటే అక్టోబర్ 22, 1964 న ప్రెసిడెంట్ లిండన్ జాన్సన్ 'హైవే బ్యూటిఫికేషన్ ఏక్ట్' అనే చట్టం మీద సంతకం పెట్టేడు. ఈ చట్టానికి ప్రేరణ కారణాలలో ఒకటిగా నేను పైన చెప్పిన Wall Drug వారి ప్రకటనలని ఉదహరించేరు. ఈ చట్టం వల్ల రహదారుల వెంబడి విశృంఖలంగా ప్రకటనలు చెయ్యటానికి వీలు లేక పోయింది. రహదారుల వెంబడి ఎక్కడెక్కడ ఎటువంటి ప్రకటనలు ఉండొచ్చో, ప్రయాణీకుల సౌకర్యం కొరకు వాడే సూచిక బల్లలు ఏయే రంగులలో ఉండాలో, ఏయే కొలతలు కలిగి ఉండాలో, వాటి మీద అక్షరాల పరిమాణం ఎంత ఉండాలో, ఎటువంటి వ్యాపార ప్రకటనలు రోడ్ల పక్కన ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ ఉండొచ్చో, వగైరా విషయాలన్నిటినీ ఈ చట్టం క్రమ బద్ధం చేసింది. ఈ చట్టం మీద ప్రెసిడెంటు సంతకం పడే వేళకి నా ప్రయాణం అయిపోయింది కనుక నేను చెప్పేదంతా ఈ చట్టం అమలు లోకి రాక పూర్వం.

రోడ్డు పక్కని కనిపించే ప్రకటనలు అన్నీ ఒక ఎత్తు అయితే 'బర్మా షేవ్' వారి ప్రకటనలు మరొక ఎత్తు. ఇవి వెగటు పుట్టించేవి కావు. పైపెచ్చు వీటికోసం ఎదురు చేసేవాడిని. ఈ 'బర్మా షేవ్' ప్రకటనలు నా దృష్టిలో పడటం కేవలం కాకతాళీయం.  రోడ్డు మీద కారుని తోలుకు వెళుతూ ఉంటే పక్కనున్న పొలాల గట్ల వెంబడి ఉన్న కంచె పక్కనే ఒక చిన్న బోర్డు కనిపించింది. దాని మీద ఏదో రాసి ఉంది కానీ, ఆ బల్ల చిన్నది అవటం వల్ల, ఆ రాత వెలిసిపోవటం వల్ల ఖణిగా కనిపించ లేదు. మరొక మైలు పోయిన తర్వాత అలాంటిదే మరొకటి కనిపించింది. నా మనస్సు నాకు తెలియకుండానే అటువంటి బోర్డు కోసం వెతుకుతున్నాది కాబోలు, ఈ మారు ఆ బోర్డు మీద అక్షరాలు చదివేను: "our part" అని ఉంది. దాని తలా తోకా తెలియలేదు. ఏదో పిచ్చి రాతలే అనుకుంటూ ఉండగా మరొక మైలు వెళ్ళేసరికి మరొక బోర్డు మీద "to make your face" అని ఉంది. 'దీని భావమేమి తిరుమలేశ' అనుకుంటూ ఉండగా మరొక మైలు వెళ్ళే సరికి "a work of art" అని కనిపించింది. ఉత్త పుణ్యానికి ఎవ్వరైనా కష్టపడి ఈ రోడ్డు వెంబడి ఎందుకు ఈ బల్లల మీద ఈ మాటలు పెడతారు? అలా ఆలోచిస్తూ ఉండగా మరొక బల్ల కనిపించింది. దాని మీద  "Burma Shave!" అని ఉంది. ఈ స్థాయికి చేరుకునే సరికి నేను మొట్టమొదట చూసిన బల్ల మీద ఉన్న మాటలేమిటో మరచి పోయాను. నాకు మతి పోయింది. తర్వాత చాల సేపటి వరకు మళ్ళా ఏమీ కనిపించ లేదు. అదేమైనా పాటేమో అనుకున్నాను. ఆఖరికి ఏమి చెయ్యాలో తోచక కారుని వెనక్కి తిప్పి  పది పదిహేను మైళ్ళు వెనక్కి వెళ్ళి మళ్ళా ప్రయాణం మొదలు పెట్టేను. ఈ మాటు జాగ్రత్తగా కనిపించిన బోర్డులన్నీ చూసుకుంటూ వస్తే మొదట్లో తప్పిన బల్లలు కనిపించేయి. ఇప్పుడు వాటన్నిటినీ ఈ దిగువ చూపిస్తాను.

Everyday

We do

Our part

To make your face

A work of art

Burma–Shave!



అప్పుడు అర్థం అయింది, ఇదేదో గెడ్డం గీసుకుందుకి వాడే సామగ్రి అని. ఆ తర్వాత ఇటువంటి ప్రకటనలు చాలా కనిపించేయి. వేమన పద్యాలలాగా, హైకూ ల లాగా ఉండే వీటికి మరికొన్ని ఉదాహరణలు చెబుతాను. వందకి పైనే ఉన్న వీటిని ఒక శతకంలా కూర్చవచ్చు.

Substitutes
Can let you down
Quicker
Than a
Strapless gown
Burma-Shave!

This will never
Come to pass
A back-seat
Driver

Out of gas

Burma-Shave!

కారు ముందుకి దూసుకు పోతోంది. జాప్లిన్ నుండి ఓక్లహోమాలో ఉన్న టల్సా దాటేసేను. ఆ తరువాత ఓక్లహోమా సిటీ. ఈ పట్టణం తరువాత ఎదట మరింక పెద్ద ఊళ్ళేమీ లేవు. దరిదాపు నిర్మానుష్యంగా ఉన్న బయళ్ళ మధ్యనుండి దిగంతం వరకూ సన్నటి రూట్-66 అలా కనిపిస్తూనే ఉండేది – ఎంత దూరం కారు తోలినా అంతు కనిపించేది కాదు. దారిలో అడపా, తడపా చిన్న చిన్న ఊళ్ళు తగిలేవి, అంతే.

అమెరికాలో ఎంత చిన్న ఊరైనా దాని వెనక – గోరంతలని కొండంతలు చేసే వీరి తత్వానికి సరిపడా – పెద్ద చరిత్రే ఉంటుంది. ఉదాహరణకి ఓక్లహోమా సిటీ దాటిన కొద్ది సేపట్లో El Reno అనే చిన్న ఊరు తగులుతుంది. నేనక్కడ కారులో పెట్రోలు పోయించుకుందికి ఆగేను. ఆ రోజులలో గేసు పోయించుకుందికి ఆగినప్పుడు – ఒక్క డాలరు గేసు కొన్నా సరే – పరిచార కేంద్రం (service station) లో ఉన్న కుర్రాళ్ళు మనకి సకల రాచ మర్యాదలూ చేసేవారు. కేంద్రం లోకి కారు ప్రవేశిస్తూన్నప్పుడు ఒక రబ్బరు గొట్టం మీదనుండి చక్రాలు వెళ్ళేసరికల్లా లోపల టంగ్ మని ఒక గంట మోగేది. వెంటనే ముగ్గురు కుర్రాళ్ళు బయటకి పరిగెత్తుకుని వచ్చేవారు. ఒకడు కారుకి ముందు వెనక ఉన్న గాజు అద్దాలని తుడిచి శుభ్రం చేసేవాడు. మరొకడు ఇంజన్ లో ఆయిలు సరిగ్గా ఉందో లేదో చూసేవాడు. మూడవ వాడు పెట్రోలు కొట్టేవాడు. ఈ పనులకి వేటికీ మనం డబ్బు ఇవ్వక్కర లేదు. వాళ్ళు ఈ పనులన్నీ చేస్తూ ఉంటే మనం లోపలికి వెళ్ళి అల్పాచిమానం వంటి పనులు చేసుకోవటం, కాఫీయో, చల్లని పానీయమో తాగటం, ఏవైనా ప్రశ్నలు ఉంటే లోపల ఉన్న మనుష్యులని అడిగి తెలుసుకోవటం చెయ్యవచ్చు. కావాలంటే ఉచితంగా ఒక రోడ్డు మేపు కూడ ఇచ్చేవారు. అమెరికాలో గేస్ స్టేషన్ అంటే ఒక చలివేంద్రం, కిరాణా కొట్టు, పెట్రోలు బంకు, పాయిఖానా అన్నీ కలిసున్న ఒక ఎండమావి అన్నమాట. గేలను 21 సెంట్ల చొప్పున నా కారులో ఆరు గేలన్లు పోయించేను. (ఆ రోజులలో unleaded పెట్రోలు ఉండేది కాదు; దానిని 1970 లో ప్రవేశపెట్టేరు). కారులో గేసు పోయించుకున్న తర్వాత నా చేతులకి కందెన చమురు అంటుకుంటే చేతులు కడుక్కోటానికి –

చెంబుతో నీళ్ళు పోసినట్లు – చేతుల మీద పెట్రోలు పోసి, చేతులు తుడుచుకుందికి ఒక కాగితపు తువ్వాలు ఇచ్చి, ఆ తర్వాత చేతులు కడుక్కుందికి సబ్బు ఇచ్చేదు అక్కడ ఉన్న పరిచారకుడు. నా జాతకంలో రాజయోగాలు ఉన్నాయనేవారు నాన్నగారు. వాటిల్లో ఇదొకటనుకుంటాను!

'నాకు ఇన్ని రాజయోగాలు ఉన్నాయి, వీళ్ళు ఇంతలా మర్యాదలు చేస్తున్నారు,' అనుకుంటూ నేను వీరభోగ వసంతరాయుడులా మురిసిపోయి కారుని వాళ్ళ దగ్గర వదిలేసి కాళ్ళెగరేసుకుంటూ లోపలికి వెళ్ళిపొయేననుకున్నారేమో. వాళ్ళు కారు మీద చెయ్యవలసిన పనులన్నీ పూర్తి చేసిన తర్వాత, కారుని తోలుకు వెళ్ళి నీడలో ఆపి అప్పుడు పైన చెప్పిన కాలకృత్య కార్యక్రమాలన్నీ తెముల్చుకునేవాడిని. ఎందుకంటారా? ఈ దారిలో ఏ ప్రయాణీకుడూ ఒక సారి ఆగిన పెట్రోలు బంకు దగ్గర మరొకసారి ఆగే సావకాశాలు తక్కువ కదా. అందరూ దూర ప్రయాణీకులే. అందరూ ప్రయాణపు బడలికతో ఉన్నవారే. ఇటువంటి వాళ్ళని మోసగించటం తేలిక. కారుని పెట్రోలు పంపు దగ్గర ఆపి మనం లోపలికి వెళ్ళగానే ఇంజను అడుగున కాసింత కందెన చమురు (lubricating oil) ఒంపేవారు – అందరూ కాదు, కొంచెం పేరాశ ఉన్నవాళ్ళు. మనం తిరిగొచ్చే సరికల్లా నేల మీద ఉన్న ఆ చమురు మడుగుని చూపించి ఇంజను లీకు అవుతోంది అని భయపెట్టి 'మరమ్మత్తులు' చేస్తామనేవారు. ఎర్రగా కాస్తోన్న ఎండ! ఎడారిలాంటి జన సంచారం పలచగా ఉన్న ప్రదేశం! అందుకని ఆ మెకానిక్ ఏది చెపితే అది వేదం అయిపోయేది.

ఇంతకీ ఈ El Reno గురించి చెప్పొచ్చేదేమిటంటే ఇక్కడ రూట్-66 చూడటానికి చాలా బాగుంటుంది. అంతవరకూ ఓక్లహోమాలో ఉన్న రోలింగ్‌హిల్స్ అయిపోయి, రాబోతూన్న టెక్సస్ లో ఉన్న మైదానాల్లోకి ప్రవేశించబోతున్నామో ఏమో ఊరు దాటగానే కనుచూపు మేర, దిక్చక్రం వరకు, రోడ్డు తిన్నగా, ఎగుడు దిగుళ్ళు లేకుండా  అనంతంలోకి వెళిపోతూన్నట్లు ఉంటుంది. ఇటూ, అటూ బీడు భూములు. ఈ దృశ్యం చూడాలని ఉంటే Rain Man సినిమా చూడండి. ఈ సినిమాలో ఈ ఊళ్ళోనే, ఈ రోడ్డు మీదే ఉన్న Big 8 మొటేల్లో, 117 నంబరు గదిలో  డస్టిన్ హాఫ్‌మన్, టాం క్రూజ్ ఒక రాత్రి గడిపి తర్వాత లాస్ వేగస్ లో ఆగుతారు. సినిమాలో ఈ మొటేలుని  Amarillo's Finest అని అనటం అన్నారు కానీ నిజానికి ఈ మొటేలు ఉన్నది ఓక్లహోమా లోని ఎల్ రీనో లో; అమరిల్లో

పక్కనున్న టెక్సస్ రాష్ట్రంలో ఉంది. ఇలా భౌగోళికమైన దృశ్యాలని చూపించేటప్పుడు కథనానికి అనుకూలంగా మార్పులు చెయ్యటం సినిమాలలో సర్వసాధారణం. ఉదాహరణకి The Graduate సినిమాలో మనందరికీ యూనివర్సిటీ అఫ్ కేలిఫోర్నియా, బర్కిలీ కేంపస్, అంటూ చూపించిన కేంపస్ నిజంగా లాస్ ఏంజిలిస్ లో ఉన్న యూనివర్సిటీ అఫ్ సదరన్ కేలిఫోర్నియా. నాకు ఎలా తెలుసంటారా? డస్టిన్ హాఫ్‌మన్ తన స్నేహితురాలుగా వేషం వేసిన కేథరిన్ రాస్ కోసం ఎదురు చూస్తూ ఒక అంబుస్పోటం (fountain) దగ్గర కూర్చుని ఉన్నప్పుడు, ఆ చుట్టూ తచ్చాడుతూన్న విద్యార్థి బృందంలో నేనూ, నా శ్రీమతీ ఉన్నాం.

El Reno దాటిన తర్వాత కొద్ది దూరం వెళ్ళేసరికి, Texola అనే ఊరు దగ్గర టెక్సస్ రాష్ట్రంలో ప్రవేశిస్తాం. ఈ రెండు రాష్ట్రాల సరిహద్దులో ఉంది కదా అని ఈ ఊరికి టెక్సస్, ఓక్లహోమా అనే మాటలని కలిపి టెక్సోలా అని పేరు పెట్టేరు (వాహనం, దారి అన్న మాటలని కలిపి వాదారి అని నేననగా లేనిది, వాళ్ళు కూడా అదే సూత్రాన్ని కాపీ కోడితే 'వాళ్ళే పోయేర్లే' అని నేను నిమ్మకి నీరెత్తినట్లు ఊరుకున్నాను.) ఆ రాత్రికి అక్కడే మకాం వేసేను.
మర్నాడు పొద్దుటే టెక్సోలా కి సలాం కొట్టేసి, మళ్ళా ప్రయాణం మొదలు పెట్టేను. అంతులేని బూడిద రంగు సముద్రంలో ఈదుకు పోతూన్నట్లు ఉందా ప్రయాణం. ఎండిపోయిన బీడు భూములు, ఈదర గాలిలా ఒకే గాలి. ఆ గాలిలో చిన్న చిన్న ముళ్ళమొక్కలలాంటి తుప్పలు (వీటిని sage brush అంటారు) గాలిలో బంతుల్లా దొర్లుకుంటూ కనిపించేవి. దూరంగా సుడులు తిరుగుతూ చిన్న చిన్న ధూళి చక్రాలు (వీటిని dust devils అంటారు) కనిపించేవి. అసలే చిన్న కారేమో ఆ గాలిలో ఊగిసలాడి పోయేది. తరగని దంపు లా ఎంతకీ ఈ ప్రయాణం తరగదే! కార్లు నడుస్తూన్న కొద్దీ అప్పడాల కర్రతో ఒత్తుతూన్న కాజాల మాదిరి రోడ్డు సాగుతోందేమో అని ఒక అనుమానం పట్టుకుంది. అందుకోసమనే కాబోలు, ఎవ్వరో అనామకుడైన కవి ఈ ప్రయాణాన్ని ఇలా వర్ణించేడు:

The sun has riz
The sun has set
And here we is
In Texas yet

టెక్సోలా తర్వాత Shamrock అనే ఊరు వస్తుంది ఆ తరువాత  McLean రాబోయే ముందు ఉన్న ప్రదేశానికి చారిత్రకంగా చిన్న ప్రాముఖ్యత ఉంది – అని అక్కడి వాళ్ళు చెప్పుకుంటారు. మా తునిలో ఏమీ లేక పోయినా దాని చుట్టుతా ప్రపంచం తిరుగుతోందని నేను వేయి నోళ్ళ కొనియాడి నట్లు అనుకొండి. రెండవ ప్రపంచ యుద్ధంలో ఖైదీలుగా పట్టుకున్న జెర్మనీ దేశపు సైనికులని తీసుకువచ్చి ఇక్కడే ఒక శిబిరంలో బంధించేరుట. ఎంత జైలు అయినా వారాంతం వచ్చే సరికి సినిమాలు చూడటానికో, సోడా తాగటానికో అనే మిష మీద ఈ జైలు పక్షులని పోలీసుల పర్యవేక్షణ లేకుండా ఊళ్ళో తిరగటానికి ఒదిలేసేవారుట. వాళ్ళు పారిపోయి ఎక్కడికి పోతారని వీరి ధీమా. ఒకటి, వాళ్ళకి ఇంగ్లీషు రాదు; కనుక పారిపోయినా పట్టుకోవటం తేలిక. రెండు, వాళ్ళు ఎలాగో ఒకలాగ జెర్మనీ వెళ్ళిపోగలిగితే అక్కడ హిట్లరు వీళ్ళని ఏ సైబీరియాలోనో యుద్ధం చెయ్యటానికి తోలెస్తాడు. అది తధ్యం. అక్కడ చావు అంతకన్నా తధ్యం. సైబీరియాలో ఎముకలని కొరికే చలిలో చచ్చే కంటె ఈ టెక్సస్ పెనం మీద వేడిలో మాడి చావటమే మెరుగనిపించి ఆ ఖైదీలు ఎక్కడికీ పోరని వీరి ధీమా. దరిమిలా జెర్మనీ ఓడిపోయిన తర్వాత ఈ ఖైదీలు అక్కడ ఉన్న అమ్మాయిలని పెళ్ళిళ్ళు చేసుకుని అక్కడే స్థిరపడిపోయేరు. తంతే బూరెల గంపలో పడటం అంటే ఇదేనేమో.

ఈ రూట్–66 మీద కారుని తోలటంలో అప్పుడప్పుడు చిన్న చిన్న  'పరిస్థితులని' ఎదుర్కోవలసి వచ్చేది. ఒకటి, నా కారు చిన్న కారేమో ఎదట నుండి పెద్ద ట్రక్కు వచ్చిందంటే ఆ గాలికి  నా కారు రెపరెప లాడిపోయేది. రెండు, నేను వెళ్ళే దిశలోనే ఏదైనా పెద్ద ట్రక్కు వెళుతూ ఉంటే దానిని అధిగమించకుండా దానిని వెన్నంటి వెళ్ళేవాడిని. పెద్ద ఏనుగంత ట్రక్కు అరవై మైళ్ళ వేగంతో గాలిని చీల్చుకుని ముందుకి పోతూ ఉంటే దాని వెనక కొంచెం శూన్యం ఏర్పడుతుంది కదా! (విమానం గాలిలోకి లేవటానికీ ఇదే సూత్రం.) ఆ శూన్యం లోకి నా ఫోక్స్ వేగన్ ని నడిపేనంటే ఇహ పెట్రోలు ఖర్చు లేకుండా నా కారుని అదే ఈడ్చుకు పోతుందని ఒక సిద్ధాంతాన్ని నా మనస్సులో కల్పించుకుని, ఆ ట్రక్కుని అంటిపెట్టుకుని వెంబడించేవాడిని.

ఇహ మూడో పరిస్థితి నాకే కాదు, అందరికీ ఎదురైయేదే. ఇటూ, అటూ ఒకే ఒక్క వాదారి ఉండటం వల్ల వచ్చేది ఈ పరిస్థితి కలిగించిన ఇబ్బంది. సాధారణంగా రోడ్డు మీద పలు విధాలైన వాహనాలు

నడుస్తూ ఉంటాయి కదా. అందరూ ఒకే వేగంతో ఈ వాహనాలని నడపటానికి వీలు కుదరక పోవచ్చు. ఒక ముసలావిడ--- ఒక ట్రేక్టరు--- వెనక ట్రెయిలర్ ని పెట్టుకుని లాగుతూన్న కారు--- ట్రక్కులు, కార్లు, స్కూలు బస్సులు, --- ఇలా రకరకాల వాహనాలు ఒకే రోడ్డుని ఉమ్మడిగా వాడుతూన్నప్పుడు ఈ ఇబ్బందులు తప్పవు. వీరిలో ఎవరో ఒకరు, తప్పకుండా, మిగిలిన వారి కంటె కొంచెం నెమ్మదిగా నడుపుతారు. వారి వెనకకి జోరుగా మరొక బండి వస్తుంది. ముందు నెమ్మదిగా నడుస్తున్న కారుని అధిగమించి ముందుకి వెళ్ళాలంటే ఎడం పక్కనున్న వాదారిలోకి వెళ్ళి అధిగమించాలి. కాని ఆ వాదారి అటు నుండి వచ్చే వారికి – అది మనది కాదు. కనుక అందులోకి వెళితే ఎదటినుంచి వచ్చే కారులేవీ లేకుండా చూసుకుని మరీ వెళ్ళాలి. ఈ సందర్భంలో కొన్ని చిక్కులు వస్తాయి. ఉదాహరణకి – మనం మన వాదారి వదలి అవతలి వాడి వాదారిలోకి ఎప్పుడు పెడితే అప్పుడు వెళ్ళిపోవటానికి వీలు లేదు. మనం అటునుండి వచ్చే కారులని ఢీ కొట్ట కుండా ఉండేందుకు ప్రభుత్వం వారు ఒక నియమం పెట్టేరు. ఆ నియమం ఏమిటో రెండు వాదారులనీ విడదీస్తూ రోడ్డు మధ్యలో గీసిన రంగు గీతలు మనకి మౌనంగా వెల్లడి చేస్తాయి. రోడ్డు మధ్య, రోడ్డు వెంబడి, తెల్ల రంగు గీత ఒకటీ, పసుపు రంగు గీత ఒకటి ఉంటాయి. పచ్చ రంగు గీత ఎవరి వైపు ఉంటే వారు దానిని దాటి అవతలకి వెళ్ళకూడదు. పచ్చ గీత రెండు వైపులా ఉంటే వీరు అటూ, వారు ఇటూ రాకూడదు; ఎవరి వాదారులలో వారు ఉండాలి. కనుక మన ముందున్న బండిని అధిగమించాలంటే మనం ముందుగా మన వైపు తెల్ల గీత వచ్చే తరుణం కొరకు వేచి ఉండాలి. అప్పుడు అటు నుండి వచ్చే కారులేవీ లేకుండా చూసుకుని, జోరు పెంచి, పక్క వాదారిలోకి వెళ్ళి, మన ముందు అడ్డుకున్న కారుని జోరుగా దాటేసి, కనీసం 300 అడుగులు ముందుకి వెళ్ళిపోయి, అప్పుడు గబగబా మళ్ళా మన వాదారిలోకి మనం వచ్చేయ్యాలి – ఎదట నుండి వచ్చే కారు మనని ఢీ కొట్టే లోపల. ఈ పని చెయ్యటానికి కొంచెం గుండె ధైర్యం ఉండాలి. అందుకని అందరూ చెయ్యలేరు. చెయ్యలేక ముందు నెమ్మదిగా నడుస్తూన్న కారు వెనక ఈసురోమంటూ పడుంటారు. ఇప్పుడు మూడవ కారు వెనక నుండి వస్తుంది. రెండవ కారు వాడికి దమ్ములు లేక వెనకని ఉండి పోయేడు కదా. మూడో కారు వాడికి దమ్ములు ఉన్నాయనుకుందాం. ఇప్పుడు వీడు రెండు కార్లని అధిగమించాలి. ఒక కారుని దాటటానికే ప్రాణాలు అరిచేతిలో పెట్టుకునే పరిస్థితాయె. అలాంటిది రెండు కారులని దాటటం అంటే మాటలా. అందుకని వాడూ జంకేసి వెనక ఉండి పోతాడు. వరసలో నాలుగవ కారు వాడికి ఈ పని మరీ కష్టం అయిపోతుంది. ఇలా ఒక కార్ల

చయనిక (platoon) తయారవుతుంది. ఈ పరిస్థితి ఇలా విషమించటానికి కారకులు ఎవ్వరనేది ఒక జటిలమైన ప్రశ్న.

ఒక సారి రీడర్స్ డైజెస్ట్ లో ఈ పరిస్థితిని కూలంకషంగా చర్చించి, వరసలో రెండవ స్థానంలో ఉన్నవాడిది తప్పని తేల్చేరు; మొదటి వాడిది తప్పు కాదన్నారు. ఎందుకంటే ఏ కారణాంతరాల వల్లనో మొదటి వాడు నెమ్మదిగా వెళుతున్నాడు. వాడిని అధిగమించటం రెండవ వాడు చెయ్య గలిగినంత సులభంగా మూడవ వాడు చెయ్య లేడు. మొదటి ఇద్దరినీ మూడవ వాడు దాటగలిగినంత సులభంగా నాలుగవ వాడు దాట లేడు. ఇలా ఏర్పడిన వాహనాల చయనికలు రూట్–66 మీద తరచుగా సాక్షాత్కరించేవి. నేను చిన్నప్పటి నుండి రీడర్స్ డైజెస్ట్ క్రమం తప్పకుండా చదివేవాడినేమో – గభీ మని ఆ నడి రోడ్డు మీద ఆ వ్యాసం జ్ఞాపకం వచ్చింది. ఆ రోజుల్లో అప్పుడప్పుడు టి. వి. మీద కూడ ఒంటి–వాదారి రోడ్ల మీద కారులని నడపటంలో నేర్చుకోవలసిన సూక్ష్మాలని తరచు చర్చించేవారు. ఇప్పుడు ఇదంతా నేను ఇంతలా విడమర్చి చెబుతూ ఉంటే చదువరులకి కొంచెం ఆశ్చర్యం వెయ్య వచ్చు; కాని ఆ రోజులలో రూట్–66 వంటి రోడ్ల మీద కారు నడపటానికి ఒక రకం తెగింపు కావలసి వచ్చేది.

ఇలా టెక్సస్ లో ప్రయాణం చేసి చేసి Amarillo దాటి, నూ మెక్సికోలో ఉన్న Tucumcari దాటేను. తర్వాత Albuquerque వచ్చే ముందు రోడ్డు అత్యంత సుందరమైన కొండ చాలు మీద పోయి, Albuquerque ఊరు మధ్యనుండి పరుగు తీస్తుంది. ఎక్కడో ఉత్తరాన కెనడాలో మొదలైన రాకీ పర్వతాల దక్షిణపు సరిహద్దు ఈ కొండ చాలులు. ఇక్కడ నుండి ఇంకా దక్షిణ దిక్కుగా పోతే మెక్సికో సరిహద్దు నుండి దిగువకి పోయే కొండలని 'సియారా మాద్రే' అంటారు. Albuquerque ఊరు దాటిన తర్వాత Continental Divide తగులుతుంది. అంటే, ఈ సరిహద్దు దాటిన తర్వాత పడే వర్షపాతం అంతా పడమరకి పసిఫిక్ సముద్రం వైపు ప్రవహిస్తుందన్న మాట. భౌగోళికంగా పశ్చిమ దేశానికి వచ్చేసేమన్న మాట.




చీకటి పడే వేళకి Gallup చేరుకుని, ఊరు బయట రోడ్డు పక్కన ఉన్న ఒక చిన్న మొటేల్లో ఆ రాత్రికి పడుక్కున్నాను. మొటేలంటే దానిని మొటేలు అనటానికి వీలు లేదు. ఒక ఇల్లు లా ఉంది. ఒక ముసలతను, ముసలావిడ దానిని నడుపుతున్నారు. ఆ ఇంట్లో ఒకటో, రెండో గదులున్నాయి – అంతే. నాకిచ్చిన గదిలో ఒక కుక్కి మంచం. గదిలో కొప్పు నుండి వేలాడుతూ ఒక లైటు బల్బు. బాత్ రూం సంగతి సరేసరి. మా తునిలో పెద్ద బజారులో రాత్రి పడుక్కోటానికి అర్ధరూపాయి ఇస్తే ఒక నులక మంచం అద్దెకి ఇచ్చే వారు. రాత్రి సద్దు మణిగిన తరువాత దానిని వీధి అరుగు మీదో, వీధి వాకిట్లోనో, వీధులోనో వేసుకుని పడుక్కోవటమే. ఈ మొటేలు చూసిన తరువాత ఆ రోజులు జ్ఞాపకం వచ్చేయి. నాలుగు డాలర్లకి అంతకంటె ఏమి వస్తుందిలే అనుకుని అక్కడే పడుక్కుందుకి నిశ్చయించేను. అర్ధరాత్రి వేళనుకుంటాను, ధన్ ధన్ మని చప్పుడు చేసుకుంటూ ఒక రైలు బండి వెళ్ళింది. నా అనుమానం ఆ రైలు పట్టాలు ఈ ఇంటి వెనకాతలే ఉండి ఉంటాయి. ఆ రైలు కుదుపుకి మంచం పైకీ కిందకీ గెంతటం మొదలు పెట్టింది. కుక్కి మంచం కనుక కింద పడిపోకుండా ఉయ్యాలలో ఊగినట్లు ఊగేను. ఎందుకైనా మంచిదని దండెం గట్టిగా పట్టుకుని ఎలాగో రాత్రి గడిపేను.

నాలుగైదు ఏళ్ళు పోయిన తరువాత అనుకుంటాను, లూసీ షోలో ఇటువంటి సంఘటననే చూపించేరు. ఆ ప్రహసనం చూస్తే పొట్ట చెక్కలయేటట్టు నవ్వు వచ్చింది. కాని దరిదాపు నాకూ అటువంటి అనుభవమే అయింది కనుక అది ప్రహసనం అనిపించలేదు.

# అరిజోనా నుండి నెవాడా వరకు

Gallup లో ఉదయం లేచి, కాసిన్ని కాఫీ నీళ్ళు కతికి మళ్ళా రోడ్డు మీద పడ్డాను. అరిజోనాలో ప్రవేశించినది మొదలు చూడతగ్గ ప్రదేశాలు కొల్లలుగా కనిపించటం మొదలయాయి. ముందుగా Petrified Forest, Painted Desert అని రెండు జంట ఆకర్షణలు తగిలేయి. Painted Desert ప్రాంతంలో అనేక రసాయన ప్రక్రియల ప్రభావం వల్ల మట్టి పంచరంగులీనుతూ – ఫలకం మీద గీసిన చిత్తరువులా – కనిపిస్తుంది. ఒక పక్క నుండి చూస్తే ఒక రంగులోనూ, మరొక పక్క నుండి చూస్తే మరొక రంగులోనూ కలనేత బట్టలా కనిపిస్తుంది. Petrified Forest అంటే శిలలుగా మారిన అరణ్యం. ట్రయాసిక్ యుగం లో (అంటే 200–250 మిలియన్ సంవత్సరాల క్రితం) ఈ అరిజోనా ప్రాంతం భూమధ్య రేఖకి దగ్గరగా ఉండేది. పలకల వలస సిద్ధాంతం (Theory of Plate Tectonics) ప్రకారం అప్పుడు ఈ భూభాగం పాంజేయా అనే ఖండంలో ఉండేది. కాలక్రమేణా ఈ పాంజేయా ప్రక్కలయి, అందులో ఒక భాగం ఇప్పుడు ఇక్కడికి చేరుకుందన్నమాట. ఆ పాంజేయాలో ఉండే సతతహరితారణ్యాల లోని చెట్లు కింద పడి, అక్కడి ఇసక నేలలలో కూరుకుపోవటం వల్ల కుళ్ళిపోకుండా, నేటికి శిలలుగా మారిపోయాయి. అలా శిలలుగా మారిన వృక్షాల అవశేషాలే ఈ Petrified Forest. కనుక దీనిని కావలిస్తే శిలాజారణ్యం అనొచ్చు. ఇప్పటి వాతావరణం అడవిలా కాక ఎడారిలా ఉంటుంది. పడిపోయిన చెట్ల మానులు రాళ్ళ రూపంలో ఉన్నప్పటికీ, ఇప్పటికీ వాటి రూపురేఖలు చెట్ల మానుల లాగే ఉంటాయి. ఇలా శిలలుగా మారిన మానులు ప్రపంచంలో చాలచోట్ల కనిపిస్తాయి. కాని ఇక్కడ దొరికినన్ని నమూనాలు, ఇక్కడ ఉన్న వైవిధ్యత మరెక్కడా లేదంటారు ఈ అమెరికా వాళ్ళు. ఇది అమెరికా వాళ్ళు రిజాజుగా చేసుకునే స్వోత్కర్ష కాదు; నిజం.

ఈ జంట ఆకర్షణలలోనే Petroglyphs అనే మరొక ఉప ఆకర్షణ ఉంది. Petro అంటే 'రాయి,' glyph అంటే 'రాత' కనుక petroglyphs అంటే రాతి మీద రాసిన రాతలు, లేదా 'రాతిరాతలు.' పాశ్చాత్య ప్రభంజనపు సుడిగాలిలో కొట్టుకుని పోక పూర్వం ఇక్కడ ఉండే ఇండియన్ అనే జాతి ప్రజలు ఉండేవారు. వారి పూర్వులు పన్నెండు, పదమూడు శతాబ్దాల ప్రాంతాలలో ఇక్కడ రాతితో కట్టిన

ఇళ్ళల్లో నివసించేవారు. వారెవరో ఈ రాతి రాతలు రాసేరని సిద్ధాంతం. ఇవి కొక్కిరి బిక్కిరి గీతలులా కొన్ని, చిన్న పిల్లలు గీసే కార్టూను బొమ్మలలా కొన్నీ ఉన్నాయి. వాతావరణం సానుకూలంగా ఉండి, ఒంట్లో ఓపిక ఉంటే ఇవన్నీ సావధానంగా చూడొచ్చు. కానీ మన నైజం ఏమిటంటే 'వెళ్ళే వరకూ తోచదు, వెళ్ళిన తర్వాత బయటకి వచ్చే వరకు తోచదు. అంతా స్పీడుగా అయిపోవాలి!' లోకమంతా స్పీడే!



నాకు ఈ ఆకర్షణలు తీరుబడిగా ఎంత చూడాలని ఉన్నా ఆ రోజు ఎండ విపరీతంగా ఉండటం ఒకటి, అక్కడ సందర్శకులకి సదుపాయాలు తక్కువగా ఉండటం మరొకటి కారణాలు కాగా ఎక్కువ సేపు గడపలేక పోయాను. ఉదయం పదింటికే తల మాడిపోయే వేడి. ఈ రోజుల్లోలా అప్పుడు సీసానీళ్ళు వాడుకలో లేవు. ఒక పక్క దాహం, ఒక పక్క వేడితో ఈ ఆకర్షణని చూసి ఆనందించే మనోస్థితి లేదు. పైపెచ్చు ముందు ముందు రాబోయే ఆకర్షణల మీద మనస్సు లగ్నమైపోయిందేమో, ఈ ఎండలో తిరిగే ఉత్సాహం లేక ఏదో మొక్కుబడికి చూసినట్లు చూసేసి, నా 'నోటు పుస్తకం' లో ఒక టిక్కు పెట్టేసి, మళ్ళా కారెక్కి రోడ్డు మీద పడ్డాను.



కారులో వాత నియంత్రణ లేదేమో బయట కంటె కారు లోపల అధ్వాన్నంగా ఉంది. చొక్కా విప్పేసి, పేంటు నుండి నిక్కరు లోకి దిగి, మళ్ళా రోడ్డున పడ్డాను. Holbrook దాటిన తర్వాత Winslow ప్రాంతాలలో  Barringer Meteorite Crater అని మరొక ఆకర్షణ ఉంది. ఇదేమి ఊడబొడిచిందో చూడాలన్న తొందరే Petrified Forest ని హడావుడిగా వదలిపెట్టెయ్యటానికి కారణం. రూట్-66 ని వదలి పెట్టి దక్షిణంగా రెండు మైళ్ళు చిన్న రోడ్డు మీద వెళితే అక్కడ ఉంది ఉల్కాపాతం వల్ల ఏర్పడ్డ ఈ పెద్ద గొయ్యి. అసలు క్రేటర్ (crater) అంటే ఏదైనా పేలినప్పుడు ఏర్పడిన గొయ్యి. అగ్నిపర్వతం శిఖరం మీద ఉన్న గోతిని, ఉల్కా పాతం వల్ల ఏర్పడిన గోతినీ, ఆఖరికి బాంబు పేలినప్పుడు ఏర్పడిన గోతినీ క్రేటర్ అనే అంటాం. పేలుడు వల్ల ఏర్పడిన గొయ్యి కనుక దీనిని పేగొయ్యి అందాం – సరదాగా. లేదా, పేద్ద గొయ్యి కాస్తా పేగొయ్యి అయిందనుకోవచ్చు. ఓలగము అంటే సభ, పేరోలగము అంటే పెద్ద సభ అయినట్లే ఇక్కడ కూడా అన్వయం చెప్పుకోవచ్చు అనుకొండి.

ఇంగ్లీషులో meteor అనీ meteorite అనీ రెండు మాటలు ఉన్నాయి. చీకటి రాత్రులలో ఆకాశం వైపు చూస్తే అప్పుడప్పుడు నక్షత్రాలు రాలుతూన్నట్లు వెలుగు చారికలు కనిపిస్తాయి. ఇవి ఆకాశపు లోతుల్లోంచి భూమి వాతావరణం  లోనికి ప్రవేశించిన రాళ్ళు. వాతావరణపు ఒరిపిడికి ఈ రాళ్ళు ఎర్రగా వేడెక్కి, వెలుగు చారికలులా మనకి కనిపించి,  కాలి బూడిద అయిపోతాయి. అప్పుడప్పుడు ఈ రాళ్ళు పూర్తిగా కాలిపోక భూమి మీద పడతాయి. ఇలా భూమి మీద పడ్డ రాళ్ళే meteorites.

ఆకాశంలో భస్మమైపోతే దానిని meteor అనీ, కిందకి పడితే meteorite అనీ అంటారు. ఈ meteor ని తెలుగులో ఉల్క అంటారు. కనుక meteorite ని ఉల్కాశిల అనొచ్చు.

ఈ రాళ్ళు ఆకాశంలోకి ఎక్కడ నుండి వచ్చేయి? ఇదంతా ఒక పెద్ద గాథ. మన సూర్య మండలం పుట్టినప్పుడు గ్రహాలు కూడా ఏర్పడ్డాయి. గురుడు (Jupitar) కీ, అంగారకుడు (Mars) కీ మధ్య ఒక గ్రహం ఏర్పడవలసినది కాని, కారణాంతరాల వల్ల అలా జరగలేదు అని ఒక సిద్ధాంతం. అక్కడ ఒక గ్రహం ఉండేదనీ, అది పేలిపోయిందనీ, ఆ పేలుడు ముక్కలే ఈ గ్రహశకలాలు అనీ మరొక సిద్ధాంతం ఉంది. ఈ రెండు సిద్ధాంతాలలోనూ మొదటి దానికే చెలామణీ ఎక్కువ. ఈ గ్రహశకలాలనే ఇంగ్లీషులో asteroids అంటారు. కాని asteroids అంటే నక్షత్రశకలాలు అనే అర్థం స్ఫురిస్తుంది కనుక ఆ పేరు సరి కాదు. వీటిని planetoids (గ్రహశకలాలు) అనటమే సమంజసం. కాని నా ఈ చాదస్తపు పోరుని ఎవ్వరూ వినరుగా. ఈ శకలాలు అప్పుడప్పుడు వాటి గతి తప్పి ప్రయాణం చేసినప్పుడు మన భూమి ఆకర్షణ శక్తి పరిధి లోకి వచ్చి, భూమి ఆకర్షణ కి లోనై, భూమి మీద పడతాయి. అలా పడ్డప్పుడు చాల మట్టుకు మన వాతావరణంలో కాలి పోయి భూమి మీదకి వాటి నుసి రాలుతుంది. కాని అడపా తడపా ఆ శకలం మరీ పెద్దదయినా, ఆ శకలం లో ఇనుము, నికెలు ఎక్కువగా ఉన్నా అది రాయి రూపం లోనే భూమిని ఢీ కొట్టుకుంటుంది. అలా ఢీ కొట్టుకున్నప్పుడు శకలం బాగా పెద్దదయితే పెద్ద అణు బాంబు పేలినంత శక్తి విడుదలై భూమి మీద పెద్ద గొయ్యి ఏర్పడుతుంది. అలా ఏర్పడిన గొయ్యే ఇప్పుడు నేను చూడబోతూన్న విశేషం.

అసలు ఉల్కాపాతం వల్ల ఇట్లా ఏర్పడ్డ పేగోతులు మన చంద్రుడి మీద విస్తారంగానూ, అంగారక గ్రహం మీద కొంత చిన్న మోతాదులోనూ మనం చూస్తూనే ఉన్నాం. విడ్డూరమల్లా మన భూగ్రహం మీద ఇటువంటి పేగోతులు తక్కువ. మిగిలిన గ్రహాల మాదిరే మన భూమి కూడ ఉల్కాపాతాల ధాటికి లోనై ఉండే ఉంటుంది. కాని మన వాతావరణం యొక్క ప్రభావం వల్ల చాలా పేగోతులు అరిగి పోవటమో, కప్పడి పోవటమో, నీళ్ళతో నిండి ములిగి పోవటమో జరిగి ఉంటుంది. కాని ఈ అరిజోనా ఎడారిలో, ఎండుగా, పొడిగా ఉన్న ఇసక రాతిలో పడటం వల్ల ఈ ఉల్క చేసిన పేగొయ్యి ఇప్పటికీ చెక్కు చెదరకుండా మనకి కనిపిస్తోంది. ఇలా ఒక పక్క నుండి బుర్రలో ఎన్నో ఆలోచనలు ముసురుకొంటున్నాయి, ఈలోగా క్రేటర్ దగ్గరకి చేరుకున్నాను. ఈ ఆకర్షణ ప్రత్యేకత ఏమిటంటే

ప్రయివేటు సంస్థ అధీనంలో ఉండబట్టి దీనిని చూడటానికి టికెట్టు పెట్టేరు.  టికెట్టు కొనుక్కుని లోపలికి వెళ్ళి చూస్తే దరిదాపు మైలు వ్యాసం, 570 అడుగుల లోతు ఉన్న పెద్ద గొయ్యి కనిపించింది. అంతే. ఇంకేమీ లేదు. గోతిని ఎంతసేపని చూస్తాం? కనుక అక్కడ గోడల మీద రాసిన దీని చరిత్రని చదవటం మొదలు పెట్టేను. సిద్ధాంతం ప్రకారం దరిదాపు 50,000 సంవత్సరాల క్రితం 150 అడుగుల వ్యాప్తి, 300,000 టన్నుల బరువు ఉన్న ఒక పెద్ద రాయి గంటకి 30,000 మైళ్ళ జోరుతో వచ్చి భూమిని ఇక్కడ ఢీకొందిట. హీరోషిమాని నాశనం చేసిన బాంబుల వంటివి 150 పేలితే పుట్టినంత శక్తి పుట్టిందిట. అని అంటారు. నిజం లాగే అనిపిస్తోంది కనుక నమ్మవచ్చు.

ఇలా ఆకాశం నుండి కింద పడ్డ రాతి అవశేషాలు ఏమైనా మిగిలాయా అని మనకి కుతూహలం పుట్టటం సహజం. తెల్ల వాడు ఈ అమెరికా ఖండాన్ని ఆక్రమించుకున్న కొత్త రోజులలో ఈ గోతి చుట్టూ, పది మైళ్ళ వ్యాప్తి వరకు, వెదజల్లబడ్డ ఇనప ముక్కలు కనిపించేయిట – ఓ ముప్పై టన్నుల ప్రాప్తికి. ఇలాంటి ఆధారాలతో అల్లిన కథ అక్కడ గోడ మీద ఉంది తప్ప అక్కడ చూడటానికి మరేమీ లేదు. ఆశించినంతగా ఇది నన్ను ఆకర్షించలేదు. చూడక పోతే అయ్యో చూడలేదే అని బాధ పడతాం. చూసిన తర్వాత 'ఓస్ ఇంతేనా!' అనిపిస్తుంది. మళ్ళా కారు ఎక్కి ప్రయాణం కొనసాగించేను.



ఈ ఉల్కాపాతాల గురించి మరొక్క మాట.  ఇవి మనం అనుకుంటూన్నంత అరుదేమీ కాదు. ఉదాహరణకి 1908 లో సైబీరియాలో తుంగుస్కా అడవులలోని ఆకాశంలో పెద్ద పేలుడు పేలింది.

జనావాసాలు లేని అడవి మధ్య జరిగింది కనుక ఆ పేలుడుని చూసిన సాక్షులు లేరు కాని, ఆ కారణంగా 40 చదరపు మైళ్ళ ప్రదేశంలో చెట్లు బోడిబారి, కూలిపోయాయి. కాని ఎంత వెతికినా గొయ్యి కాని, కిందకి రాలిన ఇనప ముక్కలు కాని కనపడలేదు. ఈ పేలుడు చాలా ఏళ్ళ పాటు పరిష్కారం లేని సమస్యగా మిగిలిపోయింది. నేను యు. సి. ఎల్. ఎ. లో జేరిన కొత్త రోజుల్లో ప్రొఫెసర్ విల్లర్డ్ లిబ్బీ దగ్గర పని చేసే అట్లూరి చంద్రశేఖర రావు అనే తెలుగు విద్యార్థిని కలిసేను. ఆతను ఈ సమస్యని పరిష్కరించటం పై పరిశోధన చేసేవాడు. ఒక రోజున ఈ సంఘటనని వర్ణిస్తూ రష్యా పత్రికలలో పడ్డ ఒక కాగితాన్ని పట్టుకొచ్చి ఇంగ్లీషులోకి అనువదించపెట్టమని అడిగేదు. నేను భిలాయిలో వెలగబెట్టిన వెలిగింపు ధర్మమా అని నాకు రష్యన్ వచ్చు. ఆ కాగితం అనువదించి పెట్టేను. అప్పుడు అతనూ, లిబ్బీ కలసి ఒక పేపరు రాసేరు. రష్యాలో కిందకి పడ్డది ఉల్క కాదనీ, అది ప్రతిపదార్థం (anti matter) అనీ ఆ సిద్ధాంతం సారాంశం. కార్బన్-14 తో కాలనిర్ణయం చెయ్యటం కనిపెట్టి నోబెల్ బహుమానం అందుకున్నాడేమో, లిబ్బీ ఈ పరిశోధన పత్రం ప్రచురించేసరికల్లా Time మేగజీన్ వారు ఈ కొత్త సిద్ధాంతాన్ని తమ పత్రికలో వేసేసేరు – మన చంద్రం పేరుతో సహా. అప్పుడు అదొక పెద్ద వార్త. ఇంత హడావుడీ చేసి, చంద్రం డిగ్రీ పని పూర్తి చెయ్యకుండా స్కూలు వదలి వెళ్ళిపోయేడు. కొద్ది వారాల తరువాత ఆ పరిశోధనా పత్రం లోని ఫలితాలలో తప్పులుండబట్టి వెనక్కి తీసుకోవలసి వచ్చిందని ప్రొఫెసర్ లిబ్బీ ప్రకటించేరు. ఇలా ప్రతిపదార్థ సిద్ధాంతం వీగిపోయింది. చంద్రం మాత్రం ఒక్క క్షణిక కాలం ఆకాశంలో ఉల్కలా వెలిగేడు.

కాలక్రమాన్ని వ్యతిక్రమణ చేస్తూ కథా గమనాన్ని పెడ దారి పట్టించినందుకు క్షంతవ్యుడిని. ఏతావాతా, ఈ ఉల్కాపాతపు గోతినుండి ఎంతో దూరం వెళ్ళనక్కర లేకుండానే Flagstaff అనే ఊరు మధ్య నుండి రూట్-66 వెళ్ళటం తటస్థపడింది. ఆ ఊరు పెద్ద బజారులో రోడ్డు మళుపు తిరిగే చోట ఎదురుగా Lowell Observatory అని ఒక బాణం గుర్తు కనబడ్డాది. దానిని చూడగానే నా గుండె ఆగినంత పని అయింది.

ఎందుకంటారా? నేను కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో చదువుకునే రోజులలో ఈ వేధశాల గురించి మా గ్రంథాలయంలో చాలా చదివేవాడిని. ఈ వేధశాల కి ఇంత పేరు రాటానికి కారణం పెర్సివల్

లోల్ (Percival Lowell) అనే ఖగోళ శాస్త్ర వేత్త ఇక్కడ పని చెయ్యటం. ఈయన పందొమ్మిదో శతాబ్దపు ఆఖరి రోజులలో ఈ వేధశాల నుండి దుర్భిణితో అంగారక గ్రహాన్ని పరిశీలించి అంగారక గ్రహం మీద ఎన్నో కాలువలు ఉన్నాయని ఒక సిద్ధాంతాన్ని లేవదీశాడు. ఏరో, నదో అనుంటే అంత రాద్ధాంతం అయి ఉండేది కాదు. ఆయన కాలువలు అన్నాడు. కాలువలు ఎక్కడి నుండి వస్తాయి? మనలాంటి తలకాయలో బుర్రగుజ్జు ఉన్న శాల్తీలు తవ్వితే వస్తాయి. కాలువలు తవ్వ వలసిన అవసరం ఎమిటి వచ్చిందిట? ఈ గ్రహమధ్య రేఖ ప్రాంతాలన్నీ ఎడారులలా ఉండటం వల్ల, ధ్రువ ప్రాంతాలు మంచుతో కప్పడి ఉన్నాయి కనుక, ఆ మంచు నీటిని వ్యవసాయానికి కాలువల ద్వారా తరలించేరుట. ఆ కాలువలలో నీరు ప్రవహించిందో లేదో తెలియదు కాని ఈ లోల్ గారి ఊహాగానాలు విశృంఖలంగా విలయ తాండవం చేసేయి. అప్పట్లో ఈయన పెద్ద పేరున్న శాస్త్రవేత్తేమో, సిద్ధాంతాలు అర్థం కాకపోయినా అంగారక గ్రహంలో (మన కంటె) తెలివైన శాల్తీలు ఉన్నాయని (ఇప్పుడు చెబితే పృష్ఠ భాగంతో నవ్వి పోతారు) చాల మంది నమ్మేసేరు.

లోల్ గారు మరీ నవ్వుల పాలైపోకుండా ఆయన తరఫున వాదించే బృందం ఆయన channel అందామనుకుని పొరపాటున canal అనుంటారని ఒక ఉపసిద్ధాంతం లేవదీసేరు. ఇంగ్లీషులో channel అంటే స్వతస్సిద్ధంగా ఏర్పడిన కాలువ అనీ, canal అంటే ఎవ్వరో నాగరికులు తవ్వినదనీ అర్థాలు స్ఫురిస్తాయి. 'ధ్రువ ప్రాంతాలలో మంచుని కరిగించి ఆ నీటిని ఎడారి ప్రాంతాలలోకి కాలువల ద్వారా పంపిస్తున్నారు అంగారక గ్రహ వాసులు' అని ఆయన మొర పెట్టుకుంటూ ఉంటే ఇంకా ఈ శిష్యుల దుకృంకరణాలు ఎందుకు?

ఇంత కథ వెనక ఉంది కనుక ఈ వేధశాల చూడాలనే కోరిక బలవత్తరంగా పుట్టింది. వాకబు చేసేను. అది 7,700 అడుగుల ఎత్తున ఉన్న ఒక కొండ మీద ఉందనిన్నీ, ఆ కొండ ఎక్కటానికే చాల సేపు పడుతుందనిన్నీ, దానిని ఆషామాషీగా సందర్శకులు వెళ్ళి చూడటానికి అనుకూలంగా ఉండదనిన్నీ చెప్పేరు. పోనీ ఆ రాత్రికి అక్కడ పడుక్కుని వెళదామంటే మర్నాడు ఆదివారం కావటం తో మనకి ఆ వేధశాల చూసే ప్రాప్తం లేదనుకొని ముందుకి కదిలేను. అప్పుడు తొందరపడి అలా చేసిన పొరపాటుకి ఇప్పటికీ చింతిస్తున్నాను. ఈ ప్రయాణంలో చూడాలనుకొని చూడలేక పోయినవి: మిస్సురా లోని ఓజార్క్ కొండలు, అరిజోనా లోని లోల్ వేధశాల.

కారు ముందుకి కదిలింది. Williams దగ్గర రూట్-66 ని వదలి పెట్టి గ్రేండ్ కేన్యన్ వైపు ప్రయాణం మొదలు పెట్టేను. గ్రేండ్ కేన్యన్ దక్షిణపు అంచుని చేరేటప్పటికి సాయంత్రం అయింది. ఈ కేన్యన్ ని చూడటానికి ఉదయం, సాయంత్రం బాగా అనుకూలమైన సమయాలని ముందే తెలుసుకున్నాను కనుక, ఆ సాయంకాలపు ఎండలో మొదటి సారి చూడటం జరిగింది.

టూకీగా చెప్పాలంటే, గ్రేండ్ కేన్యన్ ఒక పొడుగాటి, పేద్ద గొయ్యి. ఇంగ్లీషులో కేన్యన్ (canyon) అన్నా, గోర్జ్ (gorge) అన్నా ఇటూ, అటూ నిటారుగా కొండలు ఉండి మధ్య లోతుగా ఉన్న లోయ అని అర్థం. గ్రేండ్ కేన్యన్ కి ఇంత పేరు రాటానికి కారణాలు అనేకం. వీటన్నిటిలోను ముఖ్యమైనది భూగర్భ శాస్త్రానికి సంబంధించినది. మన భూగ్రహం పుట్టిన దగ్గర నుండీ ఇప్పటి వరకూ ఎలా పరిణతి చెందిందో ఆ చరిత్ర అంతా ఈ గోతి గోడల మీద కనిపిస్తుంది – చదవ గలిగే సాంకేతిక పరిజ్ఞానం ఉన్న వారికి. సాధారణంగా మనం ఏదైనా లోయ లోకి వెళ్ళినప్పుడు ఆ లోయ నేల మీదకి (అంటే, అడుగుకి) వెళతాము – ఇటూ, అటూ కొండలు పైకి లేచి ఉంటాయి (కేలిఫోర్నియా లోని యోసమిటీ లోయ ఇలానే ఉంటుంది.) ఇక్కడ, ఈ గ్రేండ్ కేన్యన్ దగ్గర, అంతా తిరకాసు వ్యవహారం. మనం లోయకి ఇటూ, అటూ ఉన్న కొండల శిఖరాల మీదకి (అంటే, కొప్పు మీదకి) వెళతాము. అంటే మనకి ఎదురుగా - కొండలు కాదు – ఒక గొయ్యి కనిపిస్తుంది. ఇది మామూలు కేన్యన్ కాదు, ఇది గ్రేండ్ కేన్యన్. కనుక మన ఎదట కనపడేది మామూలు గొయ్యి కాదు – ఒక మహా గొయ్యి. ఇది ఇంతా అంతా అని చెప్పటానికి వీలు కాని మహామహా గొయ్యి. దీని పొడుగు దరిదాపు 300 మైళ్ళు. ఈ గట్టున నిలబడితే ఆవలి గట్టు 10 నుండి 18 మైళ్ళ దూరంలో ఉంటుంది. లోతు తిన్నగా గీత గీసినట్లు కొలిస్తే ఒక మైలు ఉంటుంది, పుంతల వెంబడి దిగి వెళితే ఏడు మైళ్ళు ఉంటుంది. ఈ గోతిలో అట్టడుగున ప్రవహిస్తూన్న కలరాడో నదిని చూడాలంటే కాలి నడకని గాని, కంచర గాడిదల మీద కాని దిగి వెళ్ళి తిరిగి రాటానికి రెండు రోజులు పడుతుంది. టూకీగా అదీ ఈ గోతి పరిమాణం. నేను దిగి వెళదామని అంతా ఆయత్త పడ్డాను కాని ఆఖరి క్షణం లో చిన్న ధర్మ సందేహం వచ్చి దిగ లేదు. నేనెక్కిన గాడిద కాలు జారి ఇద్దరం కింద పడితే మా అమ్మకీ, నాన్నగారికీ వార్త కూడా తెలియకుండా పోతుందేమో అని నా కంగారు.

సాంకేతికంగా చెప్పుకోవాలంటే ఇక్కడ ఉన్నన్ని రాతి నమూనాలు ప్రపంచంలో మరెక్కడా కనబడవు. రకరకాలు ఉండటమే కాకుండా, మ్యూజియం లో ప్రదర్శించినట్లు ప్రకృతి ఈ రాతి నమూనాలని ఎంతో సోయగంతో ప్రదర్శించి, భూమి చరిత్రని అరటి పండు ఒలచి నట్లు చెబుతుంది.

ఈ మహాలోయ ఒకటి కాదు, రెండు చరిత్రలని చెబుతుంది. లోయ గోడల మీద ఉన్న రాతి పొరలు చెప్పే కథ పురాతన జీవయుగం (Paleozoic Era) నాటి కథ. అంటే 550–250 మిలియన్ సంవత్సరాల కిందటి కథ. ఈ లోయ నేలమట్టంలో 2000 మిలియన్ సంవత్సరాల కిందటి రాళ్ళు కూడ కనబడతాయి. ఈ రాళ్ళు చెప్పే కథ లోయ పుట్టక పూర్వపు పాత రోజుల కథ. ఇహ ఈ మహాలోయ చెప్పే రెండో కథ తన సొంత కథ. అంటే ఈ లోయ ఎలా తయారైందో తెలియజేసే కథ. నిజానికి ఈ మహాలోయ పుట్టడానికి కారణం కలరాడో నది. ఈ నది కోరేయగా, కోరేయగా ఈ మహాగొయ్యి ఏర్పడింది. సాధారణంగా భూమిని నదులు, వర్షాలు అరగదీస్తాయి. ఇక్కడ వర్షపాతం చాల తక్కువ కనుక ఇక్కడ జరిగిన కోరుడు అంతా నది ప్రభావం వల్లనే. నదీప్రవాహపు కోతకి అన్ని రకాల రాళ్ళూ ఒకేలా అరగవు కాబట్టి, ఇక్కడ ఉన్న రకరకాల రాళ్ళు వివిధమైన మోతాదులలో కోయబడటం వల్ల ఈ లోయకి తనదైన ఒక ప్రత్యేకమైన రూపు రేఖలు, రంగులు వచ్చేయి.

ఈ కోత ఎప్పుడు మొదలైందంటారా? నిజానికి కలరాడో ని ఒక శిల్పిగానూ, ఈ మహాలోయని ఒక శిల్పంగానూ ఊహించుకుంటే ఈ శిల్పి ఈ పనిని మొదలుపెట్టి ఆరు మిలియన్ సంవత్సరాలు మాత్రమే అయింది. అంటే భూమి వయస్సుతో పోల్చి చూస్తే నిన్న గాక మొన్న. ఈ శిల్పం ఇంకా రోజూ చెక్కబడుతూనే ఉంది. గ్రేండ్ కేన్యన్ గురించి ఎంత గొప్పగా చెప్పినా, నా దృష్టిలో దీని కంటె నేను కెంటకీలో మేమత్ కేవ్ (మహా గుహ) ని చూసినప్పుడు కలిగిన ఆనందం అనుభూతి ఇక్కడ కలగలేదని ఒప్పుకుని తీరాలి. ఇది మరీ పెద్దది అయిపోవటంతో దీని అందాన్ని ఆస్వాదించటానికి సానుకూలత కలగలేదు.

ఈ మహా లోయ దగ్గర ఉన్న వసతిలో రెండు రోజులు గడిపి, అక్కడ ఉన్న ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించి, కొంచెం ప్రయాణపు బడలిక తీర్చుకుని, మళ్ళా ప్రయాణం మొదలు పెట్టేను –

సాయంకాలం అయేసరికి లాస్ వేగస్ చేరుకోవాలనే ఉద్దేశ్యంతో. ఇక్కడనుండి అడ్డు దారి వెంబడి Kingman వరకు వెళ్ళి, అక్కడ రూట్-66 మీద నామ మాత్రం కొద్ది దూరం నడపి Las Vegas వెళ్ళే రోడ్డు పట్టుకుని కొంత దూరం వెళ్ళేసరికి రోడ్డు కొండల మీదకి మళుపులు తిరుగుతూ ఎక్కటం మొదలు పెట్టింది. ఎక్కడకి వెళుతున్నానో నాకే తెలియలేదు. ఇంతలో అకస్మాత్తుగా నా ఎదట Hoover Dam అని ఒక పెద్ద ఫలకం కనిపించింది. ఈ డేం నాకు దారిలో తగులుతుందని అనుకోనే లేదు. డేం లు కట్టటం ఎలాగో చదువుకున్నాను కాని, వాటిని ఎప్పుడూ చూడ లేదు. అనుకో కుండా కలిగిన ఈ అవకాశానికి ఎంతగానో సంతోషిస్తున్నాను. ఇంతలో కారు డేం మీదకివచ్చేసింది. ఒక పక్క పెద్ద జలాశయం, మరొక పక్క అగాధం, మధ్యలో నేను. నాకు ఒక్క సారి కాళ్ళు గజగజ లాడేయి. డేం ని దాటేసి నెవాడా వైపు వచ్చేసి, కారు ఆపి డేం ని చూడటం మొదలు పెట్టేను. మన దేశంలో భాక్రా డేం ని చూడటానికి అవకాశం దొరక లేదు కనుక అదీ ఇలాగే ఉంటుందని ఊహించుకుంటూ ఉంటే, “ఈ రోజుకి ఆఖరి సారి పవర్ హౌస్ టూరు” అంటూ ఎవ్వరో కేకేసేరు. వెంటనే పరుగెత్తుకుని వెళ్ళి ఆ టూర్ లో జేరేను.



భిలాయిలో పని చేసినప్పుడు విద్యుత్తు ని వాడుకుని తిరిగే భారీ యంత్రాలు (వీటిని ‘మోటర్’లు అంటారు) చూసేను కాని విద్యుత్తుని పుట్టించే భారీ యంత్రాలు (వీటిని ‘జెనరేటర్’లు అంటారు) ఎలా ఉంటాయో ఇప్పటి వరకు చూడ లేదు. కనుక హూవర్ డేం కి అనుసంధించి ఉన్న పవర్ హౌస్ ని

చూడటం ఒక మంచి అవకాశం. రోడ్డు మట్టం నుండి కొన్ని అంతస్తులు ఎలివేటర్ లో కిందకి దిగిన తర్వాత పవర్ హౌస్ వస్తుంది. ఇవి ఇటు నెవాడా వైపు ఒకటి, అటు అరొజోనా వైపు ఒకటి ఉన్నాయి. పదిహేడు టర్‌బైనులు, వాటితో జతగా జెనరేటర్‌లు (విద్యుత్తుని పుట్టించే యంత్రాలు) వరసగా బారుతీరి ఉన్నాయి. అదొక రకం నిశ్శబ్దమైన శబ్దంతో అవి జుయ్ మంటూ తిరుగుతూ ఉంటే నా శరీరం లో నవనాడులలోంచీ ఒక రకం విద్యుత్తు ప్రవహించినట్లయి ఒళ్ళంతా పులకరించింది. మామూలుగా ఉండే గాలిలా కాకుండా అక్కడ గాలికి ఒక రకమైన స్వచ్ఛమైన వాసన ఉందేమో అనిపించింది. ఇప్పుడు ఆలోచిస్తే ఆ వాసన ఓజోను వాసనేమో అని అనిపిస్తున్నాది.

ఈ జెనరేటర్‌లు ఉన్న భాగం చూడటం అయిన తర్వాత మరొక అంతస్తు దిగువకి వెళితే అక్కడ టర్ బైనులు ఉన్నాయి. పై అంతస్తులో ఉన్న జెనరేటర్‌లలో ఉన్న చట్రాన్ని గిర్రున తిప్పటానికి ఈ టర్ బైనులు కావాలి. డేం వెనక నిల్వ చేసిన నీటిని గొట్టాల ద్వారా తీసుకు వచ్చి చేదలతో చేసిన చక్రం మీదకి పోనిస్తారు. అప్పుడు ఆ చేదచక్రం గిర్రున తిరుగుతుంది కదా. ఈ చేదల చక్రాన్నే టర్‌బైన్ అంటాం. ఇలా తిరుగుతూన్న చక్రానికి జెనరేటర్ ని తగిలిస్తారు. అప్పుడు జెనరేటర్ లో ఉన్న కదురుకి అతికించి ఉన్న అయస్కాంతపు ధ్రువాలు గిర్రున తిరుగుతాయి (ఇక్కడ సూక్ష్మంలో మోక్షం కోసం కథని టూకీస్తున్నాను). ఈ కదురు స్థిరంగా ఉన్న తీగల చట్రంలో ఉంటుంది కనుక అయస్కాంత క్షేత్రం తీగల చుట్టూ తిరుగుతుంది. అలా తీగల సమక్షంలో అయస్కాంతాలు కదిలినప్పుడల్లా ఆ తీగలలో విద్యుత్తు పుడుతుందని ఫేరడే కనిపెట్టేడు. అతని చలవే ఇదంతా. మరొక అంతస్తు కిందకి వెళితే టర్‌బైనులని నడపటం అయిన తర్వాత బయటకి వచ్చే నీటి ప్రవాహం కనిపిస్తుంది. దానిని మళ్ళా దిగువన ప్రవహిస్తూన్న కలరాడో నదిలోకి వదిలెస్తారు.

పవర్ హౌస్ చూడటం అయిన తర్వాత మరొక విశేషం చూసేను. డేం అంటే నదికి అడ్డుగా కట్టిన గోడ కదా. నది జోరుగా ప్రవహిస్తూ ఉంటే గోడ కట్టటం కష్టంకదా. అందుకని కాలువలతో నదిని ఇటూ, అటూ మళ్ళించి నది గర్భం అంతా పొడిగా తయారుచేస్తారు. ఈ మళ్ళింపు కాలువలు (diversion canals) నదికి ఇటూ, అటూ ఉంటాయి. ఇక్కడ ఇటూ అటూ కొండలే. కనుక ఆ కొండలలో సొరంగాలు తవ్వి ఆ సొరంగాల గుండా నదీ ప్రవాహాన్ని మళ్ళించేరు. డేం కట్టటం పూర్తి అయిన

తర్వాత ఈ సొరంగాలు (diversion tunnels) అనవసరం. అందుకని వాటిని కాంక్రీటుతో కప్పేసేరు. నేను అడిగేనని నన్ను ప్రత్యేకం తీసికెళ్ళి చూపించేరు – ఇలా కప్పేసిన సొరంగాలని.

ఆఖరున టూర్ అయిపోయే ముందు డేం అట్టడుగుకి వెళ్ళేను. అక్కడ నుండి ఎగువకి చూస్తే తప్ప ఈ డేం నిజంగా ఎంత పెద్దదో తెలియదు. ఎగువ నుండి దిగువకి చూడటం లో కలిగే అనుభూతి వేరు, దిగువ నుండి ఎగువకి చేసినప్పుడు కలిగే అనుభూతి వేరు.

## లాస్ వేగస్ నుండి లాస్ ఏంజిలిస్ వరకు

హూవర్ డేము ని ఒకంతట వదల బుద్ధి కాలేదు. సాయంకాలం కావచ్చింది. చీకటి పడే లోగా లాస్ వేగస్ చేరుకుంటే అక్కడ పడుక్కో వచ్చనే ఆతృతతో మళ్ళా కారు ఎక్కేను. నాకు ఆ రోజులలో లాస్ వేగస్ అంటే ఏమిటో తెలియదు. డేము కి దగ్గరగా ఉంది కనుక ఆ డేము కి సంబంధించిన సిబ్బంది ఉండే ఊరనే నా నమ్మకం. గంటలో ఊరు శివార్లు చేరుకున్నాను. నేను సాధారణం గా ఊరు మధ్యని కాకుండా ఊరుకి  ఈ కొసనో ఆ కొసనో మొటేలు చూసుకుని పడుక్కునే వాడిని. ఇక్కడా అలాగే ఇంకా ఊరు ఎదట ఉన్నదనగా ఒక చిన్న మొటేలు కనిపిస్తే అక్కడ ఆగి, ఖాళీలు ఉన్నాయని తెలుసుకుని అందులో దిగేను. రాత్రికి ఎనిమిది డాలర్లు అద్దె; ముందే కట్టేయమన్నాడు.

ఆ రోజులలో క్రెడిట్ కార్డులు ఇప్పటిలా అందరికీ అందుబాటులో ఉండేవి కాదు.  సెల్ ఫోనులు లేనేలేవు. ఇప్పటిలా పెద్ద పెద్ద గొలుసుకట్టు మొటేళ్ళు తక్కువగానే ఉండేవి. నిజానికింత దూరం ప్రయాణం చేసినా దారిలో Holiday Inn కాని, Best Western Motel కాని, ఇప్పుడు మనకి తరచుగా తారసపడే మొటేళ్ళు కాని చూసిన జ్ఞాపకమే లేదు.  ప్రయాణంలో ఎక్కడా ముందుగా గది రిజర్వేషన్ చేయించుకున్న పాపాన్న పోలేదు. ఎప్పుడు ఎక్కడ ఆగాలని ఉంటే అక్కడ ఆగటం. ఖాళీ ఉంటే అక్కడ దిగటం, లేకపోతే మరొక చోటు వెతుక్కోవటం. సాధారణంగా హొటేలు వాళ్ళు చెక్కు రాసి ఇస్తే గది ఇచ్చేవారు; బిళ్ళకుడుములు చెల్లించుకుంటాం అంటే గొడవే ఉండేది కాదు. అంతే కాని క్రెడిట్ కార్డుల వాడకం సామాన్యుల వరకూ రాలేదు. సినిమాలలో వినటమే Diners Club, Carte Blanche మొదలైన పేర్లు. క్రెడిట్ కార్డుని మొట్ట మొదటి సారి నా కళ్ళతో చూసినది లాస్ ఏంజిలిస్ లో; 1966 లో కాట్రగడ్డ గంగన్న దగ్గర. Bank of America వాళ్ళు BankAmeriCard అన్న పేరుతో ఉద్యోగాలున్న మధ్య తరగతి వారికి ఇవ్వటం మొదలు పెట్టేరు. గంగన్న ఆ కార్డు చూపించి పెద్ద పోజు కొట్టేసేవాడు మా దగ్గర. నిజానికి The Gradaute సినిమాలో "భవిష్యత్తు ప్లేస్టిక్స్ లో ఉంది" అని ఒక చిన్న సంభాషణ ఉంది. సినిమా ఎంత విజయవంతం అయిందో ఆ ఒక్క సంభాషణ కూడా అంతగాను నలుగురి నోటా నలిగింది. కారణం? అక్కడ plastic అంటే  క్రెడిట్ కార్డు అని మనం అన్వయించుకోవాలి. అప్పుడు ఆ సంభాషణ లోని అంతరార్థం అర్థం అవుతుంది. మళ్ళా

క్రమానుగతంగా కథ చెప్పకుండా పక్క దారి తొక్కుతున్నాను. భవిష్యత్తులో చెప్పబోయే కథనానికి నా మనస్సు నాందీ ప్రస్తావన చేస్తోందో, ఏమో మరి.

ఆకలేస్తోంది. స్నానం చేసి, ఇంత తిండి తిందామని మొటేలు యజమానిని దగ్గరకి వెళ్ళి, "అయ్యా! భోజనం చెయ్యటానికి ఏదైనా కేఫిటేరియా లాంటిది ఈ దగ్గరలో ఉందా?" అంటూ వాకబు చేసేను. అతను నా వైపు అదోలా ఎగా దిగా చూసి, "ఈ వీధి దిగువ బోలెడు ఉన్నాయి" అని చెప్పేడు. అప్పటికే దూరంలో దీపాలు కనిపిస్తున్నాయేమో అదేమై ఉంటుందా అని, "ఎదురుగా దీపాలు కనిపిస్తున్నాయి, అక్కడ ఏదైనా సంబరం జరుగుతోందా? ఈ ఊళ్ళో మరేవైనా చూడ్డానికి ఉన్నాయా?" అంటూ మరొక ప్రశ్న వేసేను. ఆ హోటేలు యజమానికి నా వరస అర్థం అయిపోయింది. "చూడు బాబూ, ఈ రోడ్డు వెంబడి అలా నాలుగు బ్లాకులు నడుచుకుంటూ వెళ్ళేవంటే అన్నీ నీకే అర్థం అవుతాయి" అన్నాడు. అని ఏమనుకున్నాడో ఏమో, "జేబులో మాత్రం ఎక్కువ డబ్బులు పట్టుకెళ్ళకు. కావలిస్తే ఇనప్పెట్టె ఒకటి ఇస్తాను," అని ఒక సలహా పారేసేడు. వాడి దగ్గర అప్పుడు ఆ ఇనప్పెట్టె పుచ్చుకుంటే నా దగ్గర డబ్బు ఉందని నేను ఒప్పుకుంటూన్నట్లే కదా. అందుకని నవ్వేసి, 'నా దగ్గర అంత డబ్బు లేదులే' అంటూ బయటకి జారుకున్నాను.
నేను మళ్ళా గదిలోకి వెళ్ళి, దగ్గర ఉన్న కొద్ది డబ్బునీ లోపల దాచేసి, జేబులో నాలుగు డాలర్లు మాత్రం పెట్టుకుని ఊళ్ళోకి నడవటం మొదలు పెట్టేను. నాలుగు బ్లాకులు దాటి వెళ్ళేనో లేదో అక్కడి దీపాలు, వ్యవహారం చూసి నా కళ్ళని నేనే నమ్మలేక పోయాను. ఆ వెలుగులో పగలేదో, రాత్రేదో తెలియలేదు. చుట్టూ జూదగృహాలు. వాటి నిండా కిటకిటలాడిపోతూ ప్రజలు. కాకినాడలో సినిమా హాళ్ళు ఉన్నట్లు ఈ కెసీనోలు వరసగా ఒక దాని తర్వాత ఒకటి చొప్పున ఓ నాలుగైదు బ్లాకులు ఉన్నాయి. అక్కడ నేను చూసిన కొన్ని కెసీనోల పేర్లు: The Sands, The Dunes, Flamingo, The Mint, Sahara, Desert Inn, Ceasers' Palace, Riviera, Stardust, Tropicana.

పైకి వాటి అలంకారాలలో తేడాలు కనపడ్డా లోపలికి వెళ్ళిన తర్వాత అన్నీ ఒకేలా ఉండేవి. ప్రతీ జూదగృహం లోనూ రకరకాల జూదాలు ఆడొచ్చు. ఒకటి, నాకు వాటిని ఆడటం తెలీదు. రెండు, తిండి తినగా చేతిలో ఒక డాలరు మిగిలింది. పోనీ మళ్ళా మొటేలుకి వెళ్ళి కొంత డబ్బు తెచ్చుకుందామా అని

ఆలోచించేను. దానికి మళ్ళా ఐదారు బ్లాకులు నడచి వెనక్కి వెళ్ళాలి. తీరామోసి డబ్బు పట్టుకొచ్చేననే అనుకుందాం. అది కాస్తా క్షవరం అయిపోతే ఎలా? ఇలా ఆలోచించి రాత్రి పది గంటల వరకు ఇతరులు ఆడుతూ ఉంటే చూడటం తప్ప నేను నా డాలరు ఖర్చు పెట్టటానికి ఇష్టపడ లేదు. ఇలా తిరుగుతూ ఉంటే అక్కడ పని చేసే ఒక పిల్ల నా దగ్గరకి వచ్చి ఒక డాలరు విలువ చేసే 20 నికెలులు ఉన్న చిల్లర కడ్డీ ఒకటి ఉచితంగా ఇచ్చి ఆడుకోమంది. నికెలంటే ఐదు పైసలు. మన డబ్బు కాదు కదా అని slot machine దగ్గర ఆట మొదలు పెట్టేను. ఈ ఆటకి కౌశల్యం, నేర్పు అక్కర లేదు. చిన్న కంతలో ఒకొక్క నికెలు బిళ్ళ వెయ్యటం, పక్కనున్న కడ్డీని పట్టుకు లాగటం. సాధారణంగా దేవుడి డిబ్బీలో వేసిన డబ్బులా ఆ కంతలో వేసిన డబ్బు స్వాహా అయిపోవటం తప్ప మళ్ళా మన కళ్ళ బడదు. కాని, అప్పుడప్పుడు ఒకటికి రెండు బిళ్ళలు తిరిగి కిందనున్న రేకు జంగిడిలోకి రాలుతూ ఉంటాయి. అప్పుడు వినబడే గలగలా రావం – సాక్షాత్తూ లక్ష్మి దేవి ఘల్లు ఘల్లు మంటూ గడపలో అడుగు పెట్టినట్లు వినటానికి ఎంతో బాగుండేది. మనం గెలవక పోయినా, పక్కవాళ్ళు గెలిచినప్పుడు వచ్చే గలగలారావం విన్నప్పుడు నాకు అసూయ పుట్టేది కాదు.

నా అదృష్టానికేమీ తక్కువ లేదు. ఎక్కడో నక్కని తొక్కొచ్చేనో ఏమో, అడపా తడపా ఐదేసి, పదేసి నికెలులు గెలుచుకుంటూ నా దగ్గర ఉన్న 20 నికెలులు పూర్తిగా ఖర్చయి పోకుండా ఒక అర గంట పైగా ఆడేను. పూర్తిగా ఓడి పోను, అలాగని ఒక Jack pot గెలిచినదీ లేదు. గజకేసరి యోగం అంటే ఇదే కాబోలునని సరిపెట్టుకున్నాను. ఇలా కొంత కాలం గడిచిన తర్వాత గజాన్ని ఓడగొట్టి కేసరి గెలిచిందో ఏమో కాని, వరసగా రెండు, మూడు జాక్ పాట్ లు వచ్చేయి. ఆ రాత్రి ఒక సమయంలో నా జేబులో ఒక డాలరు తో మొదలైన డబ్బు అరవై డాలర్ల వరకూ పెరిగింది. అర్ధ రాత్రి కావస్తోంది. ఈ అరవై డాలర్లూ పట్టుకుని వెళ్ళిపోతే హాయిగా ఉండి ఉండేది. వెళుతూ, వెళుతూ ఉండ బట్టక మరొక కెసీనోలో జొరబడి మరొక సారి ఆడటానికి ప్రయత్నించేను. ఇక్కడ వరసగా నష్టం తప్ప ఒక్క దమ్మిడీ తిరిగి రాలేదు. జేబులో నికరం 60 నుండి 45 కి పడి పోయింది. నాకు తెలివి వచ్చి, ఆ నలభై అయిదూ పట్టుకుని రాత్రి ఒంటి గంటయే సరికల్లా మళ్ళా మొటేలుకి వచ్చేసి, శుభ్రంగా పడుక్కున్నాను.

అప్పటి నుండి ఇప్పటి వరకు లాస్ వేగస్ కనీసం ఓ పది సార్లు వెళ్ళుంటాను. ఎంత జూదం ఆడకూదని అనుకుంటూ వెళ్ళినా ఇక్కడో డాలరు, అక్కడో రెండు పోగొట్టుకుంటూనే ఉన్నాను తప్ప మళ్ళా ఒక్క సారి – మచ్చుకి ఒక్క సారి – డబ్బు గెలిచిన పాపాన్న పోలేదు. మొదట్లో గణించుకున్న 45 డాలర్లూ, వడ్డీతో సహా ఈ పాటికి చెల్లించేసే ఉంటాను.

అప్పటికీ ఇప్పటికీ లాస్ వేగస్ బాగా పెరిగి పోయింది. అక్కడి వ్యాపారుల దృక్పథం లో కూడ చాల మార్పులు వచ్చేయి. ఇప్పటికీ జూదానికి ప్రాముఖ్యత తగ్గ లేదు కానీ ఇప్పుడు జూదం తో పాటు అనేక వ్యాపార కోణాలు తలెత్తేయి.

మర్నాడు తొమ్మిదింటికల్లా బయలు దేరి లాస్ ఏంజిలిస్ వైపు ప్రయాణం కట్టేను. ఇక్కడ నుండి లాస్ ఏంజిలిస్ శివార్లు తగిలే వరకు ప్రయాణం అంతా మొహావీ ఎడారిలోనే జరుగుతుంది. ఎండ, వేడి తప్ప దారిలో మరేవీ చూడటానికి లేవు. ఈ ఎడారిలోనే 1950 లలో అమెరికా ప్రభుత్వం దరిదాపు ఎనభై అణు బాంబులని ప్రయోగాత్మకంగా పేల్చింది. పేలుడు జరిగినప్పుడల్లా వేగస్ హొటేళ్ళల్లో ఉన్న అతిధులు బయట కుర్చీలు వేసుకుని బాణసంచా సంబరాలని చూసినట్లు చూసేవారట. వాతావరణంలో పేల్చటం మానేసిన తర్వాత, మొన్న మొన్నటి వరకూ ఈ ఎడారిలోనే భూగర్భంలో అణు బాంబులు పరీక్ష నిమిత్తం పేల్చేవారు. ఇప్పుడు అంతర్జాతీయ ఒప్పందం వల్ల భూగర్భంలో కూడ అణు పరీక్షలు నిషిద్ధం కనుక, అమెరికా వారు ఇదే ప్రక్రియని ప్రయోగ శాలలో లేసర్లు ఉపయోగించి చేస్తున్నారు. ఇతర దేశాలు ఈ పద్ధతి ఏమిటో అర్ధం చేసుకుని అంత డబ్బు ఖర్చు పెట్టగలిగే స్థోమత సంపాదించిననాడు, అమెరికా 'ఈ రకం పరీక్షలని ఇప్పుడు నిషేధించేం' అంటుంది.

ఈ లాస్ వేగస్ లో ఆ మాత్రమైనా అగటం చాలా మంచి పని అయింది. నేను యు. సి. ఎల్. ఎ. లో జేరిన తర్వాత అక్కడి విద్యార్థి బృదం మాట్లాడుకునే సందర్భాలలో లాస్ వేగస్ గురించి తరచు చర్చలు వచ్చేవి. ఒక సారి చూసేను కనుక ఆ చర్చలలో కలుగజేసుకుని మాట్లాడటానికి నాకు వీలయేది. ఈ చర్చలు సాధారణంగా రెండు దిశలలో వెళ్ళేవి. జూదం లో గెలవటం, ఓడటం అనేవి పూర్తిగా యాధృచ్ఛిక ప్రక్రియలా, లేక గణిత శాస్త్రమో, సంభావ్య సిద్ధాంతమో ఉపయోగించి మనం గెలవగలిగే

సావకాశాలని పెంచుకోవటానికి వీలవుతుందా అనేది మొదటిది. హవర్డ్ హ్యూస్ (Howard Hughes) లాస్ వేగస్‌లో ఏమిటి చేస్తున్నాడనేది రెండవది.

పైన చెప్పిన రెండు విషయాలలోనూ మొదటిది, స్థూలంగా విచారిస్తే, గణిత శాస్త్రపు సమస్య. జూదంలోని ఆటలన్నిటిలోనూ గణిత శాస్త్ర పరంగా విశ్లేషణకి లొంగేది బ్లేక్ జాక్ (Black Jack) అనే పేక ముక్కలాట. సంభావ్య సిద్ధాంతపు పుస్తకాలలో సాధారణంగా  పేక దస్త్రం తో ఆడే ఆటలనీ, పాచికలతో ఆడే ఆటలనీ ఉదాహరణలుగా చెబుతూ ఉంటారు. ఈ సందర్భంలోనే బ్లేక్ జాక్ ఆడుతూన్నప్పుడు, ముక్కలని లెక్కపెట్టి కెసీనో వారిని ఎలా ఓడించాలో కిటుకులు చెబుతూ కేలిఫోర్నియా విశ్వ విద్యాలయపు ఆచార్యుడు, ఎడ్వర్డ్ థోర్ప్ అనే గణిత శాస్త్ర వేత్త, 1962 లో ఒక పుస్తకం ప్రచురించేరు. కాలక్రమేణా ఈయన సిద్ధాంతం కంటె మంచి సిద్ధాంతాలు వచ్చేయి అనుకొండి. కాని 1964 లో నేను యు. సి. ఎల్. ఎ. లో జేరిన కొత్తలో ఈయన సిద్ధాంతాలని చర్చ చేసే వాళ్ళం. దరిమిలా ఈయన ఆచార్య పదవికి స్వస్తి చెప్పి తన సిద్ధాంతాలని స్టాక్ మార్కెట్ మీద ప్రయోగించి బాగా డబ్బు గణించుకున్నాడని విన్నాను. తెలివైనవాడు కనుక మేష్టరీ వదలిపెట్టి మెరిగేడు. “చేతనైన వాళ్ళు చేసి చూపిస్తారు, చేతకాని వాళ్ళు పాఠాలు చెప్పుకుంటారు” అనే నానుడిలో నిజం లేకపోలేదని రుజువు చేసేడు.

లాస్ వేగస్ గురించి ఎక్కువగా చర్చకి వచ్చే రెండవ విషయమేమంటే ఆ రోజుల్లో హవర్డ్ హ్యూస్ కీ లాస్ వేగస్ కీ మధ్య ఉన్న అవినాభావ సంబంధం. ఈ హవర్డ్ హ్యూస్  జీవిత చరిత్రని రెండు సార్లు సినిమాలుగా తీసేరు. మొదటిది 1964 లో The Crapetbaggers అన్న పేరుతో తీసేరు. జార్జి పెప్పార్డ్ నటించిన ఈ సినిమాని నేను ఇండియనాపొలిస్‌లో ఉన్నప్పుడు 35 పైసలు టికెట్టు కొని చూసేను.  రెండవది The Aviator  అన్న పేరుతో ఈ మధ్య సినిమా తీసేరు. 1950 నాటికే ఇతను Hughes Aircraft అన్న యుద్ధ విమానాల కంపెనీని పెట్టి, మిలటరీ వారి నుండి కాంట్రాక్టులు సంపాదించి బిలియన్ల కొద్దీ డబ్బు గణించి, 1966 నాటికి ప్రపంచంలో అందరికంటె ఐశ్వర్యవంతుడు అనిపించుకున్నాడు.

1953 నాటికి హవర్డ్ హ్యూస్ ప్రవర్తనలో గంభీరమైన మార్పులు రావటం మొదలయింది. ఎవ్వరితోనూ కలవక, ఎవ్వరికీ కనిపించకుండా ఏకాంతంగా ఉంటూ, టెలిఫోను ద్వారానే వ్యాపారం నడిపేవాడు. ఒక సారి అమెరికా ప్రభుత్వపు వాయుదళాల అధిపతిని హొటేలు లాబీలో గంటకి పైగా వేచి ఉండేటట్లు చేసినప్పుడు అతను ప్రభుత్వపు కాంట్రాక్టులు రద్దు చేస్తానని బెదిరించేడు. వెంటనే హవర్డ్ హ్యూస్ Howard Hughes Medical Insititite అనే స్వచ్ఛంద సంస్థని స్థాపించి దానికి ఏడాదికి బిలియన్ డాలర్లు వ్యాపారం చేస్తూన్న తన కంపెనీని దానం చేసేసేడు. ఈ దెబ్బతో ప్రభుత్వం చేసిన బెదిరింపుకి కోరలు లేకుండా పోయింది. ఇతని గురించి ఇలా చెప్పుకుంటూ పొతే భారతం అంత కథ అవుతుంది. ఇక్కడ స్థలం చాలదు.  కనుక ఇతనికీ లాస్ వేగస్ కీ మధ్య ఉన్న సంబంధం కొద్దిగా చెబుతాను.

నేను లాస్ వేగస్ లో మొదటి సారి కాలు పెట్టిన రోజులలో ఈ ఊరు అంతా మాబ్ కబంధ హస్తాలలో ఉండేది. ఈ మాబ్ నే మాఫియా అని కూడ అంటారు. వీళ్ళు ప్రభుత్వానికి సమాతరంగా మరొక 'రాజ్యాన్ని' నడిపి, ప్రజలని బెదరగొట్టి వారి రక్తం తాగే జెలగలలాంటి దుండగీడులు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత అంతవరకు వారికి ఆలవాలమైన నూ యార్క్, బఫలో, క్లీవ్‌లండ్, షికాగో, కేన్సస్ సిటీ లలోని వ్యాపారాన్ని వదలి పెట్టి వేగస్ లో ఉన్న జూదపు వ్యాపారానికి దిగటం మొదలు పెట్టేరు. ఇది ఎలా జరిగిందో తెలుసుకోవాలనే కుతూహలం ఉంటే మారియో పూజో రాసిన The Godfather పుస్తకం చదవండి. పుస్తకాలు చదివే అలవాటు తప్పిపోతే కనీసం అదే పేరుతో వచ్చిన సినిమా చూడండి. తూర్పు కోస్తా నుండి తరలి వచ్చిన మాబ్ లాస్ వేగస్ ని తమ గుప్పిట్లో పెట్టుకుని ఉంచుకున్న రోజులవి.  ఈ సందర్భంలో, 1966 లో, హవర్డ్ హ్యూస్ తన సిబ్బందితో డెసర్ట్ ఇన్ అనే హొటేల్లోకి పెద్ద ఎత్తున విడిదికి దిగేడు. ఆ హొటేల్లో ఎనిమిదో అంతస్తూ, తొమ్మిదో అంతస్తూ పూర్తిగా తనకీ, తన సిబ్బందికీ పది రోజుల పాటు కావాలని అద్దెకి తీసుకున్నాడు. రెండు నెలల పాటు ఉన్నాడు కాని, కదలడే. హొటేలు యాజమాన్యానికి ఈ రకం అతిథుల వల్ల నష్టమే కాని లాభం లేదు. ఎందుకంటే హొటేలులో దిగిన వాళ్ళు జూదం ఆడి డబ్బు పోగొట్టుకుంటూ ఉంటేనే జూద గృహాలకి లాభం. హ్యూస్ కి కాని అతని సిబ్బందికి కాని జూదం మీద ఏమీ వ్యామోహం లేదు. వాళ్ళేదో వ్యాపార కోణం లో ఆలోచించి అక్కడ మకాం వేసేరు, అంతే. కనుక హొటేలు వారికి ఈ అతిథి అక్కడ

ఉండటం నచ్చ లేదు. ఖాళీ చెయ్యమన్నారు. ఖాళీ చెయ్యటానికి బదులు హ్యూస్ ఆ హొటేలుని అప్పటికప్పుడు, అక్కడికక్కడ దాని బజారు ధర ఆరు మిలియన్లు అయితే, $13.25 మిలియన్‌లు ఇచ్చి కొనేసేడు. ఆ తర్వాత 1967 లో వరసగా Frontier, Sands, Silver Slipper, Castaway అన్న హొటేళ్ళని కూడ కొనేయటం తో మాఫియా కి వేగస్ లో ఉన్న స్థిరాస్థి మీద ఉన్న పట్టు సడలటం మొదలైంది. తర్వాత Stardust ని 30 మిలియన్లకి కొనేయటానికి సిద్ధ పడ్డాడు. అదే జరిగుంటే వేగస్ లో ఉన్న హొటేళ్ళన్నిటి మీదా ఇతనికి గుత్తాధికారం వచ్చేస్తుందని భయపడి అమెరికా ప్రభుత్వం ఈ అమ్మకం జరగకుండా అడ్డుకుంది. ఈ విషయాలన్నీ నా సహాధ్యాయి రిచర్డ్ రస్సెల్ ఇలా చిలవలు, పలవలతో – పాత్రికేయుల కంటె బాగా  చెప్పేవాడు.

నేను యు. సి. ఎల్. ఎ. లో చదువుకుంటూన్న  రోజులలో ఈ రిచర్డ్ రస్సెల్ ఒక్క హవర్డ్ హ్యూస్ గురించే కాదు, లాస్ వేగస్ లో ఆడే బ్లేక్ జాక్ ఆట గురించీ, బేస్ బాల్ ఆటలో  మొనగాళ్ళయిన సేండీ కోఫేక్స్, డాన్ డ్రైస్‌డేల్ మొదలైన ఆటగాళ్ళ గురించీ ఎన్నో విషయాలు మాట్లాడేవాడు.

ఒక విధంగా హవర్డ్ హ్యూస్ లాస్ వేగస్ రావటం లాస్ వేగస్ అభివృద్ధికి ఎంతగానో దోహదం చేసింది. మాఫియా వాళ్ళ పట్టు సడలటంతో ఊరు జూదరులకి, రంకు వ్యాపారులకి ఆటపట్టనే చెడ్డ పేరు తగ్గి ఇప్పుడు రకరకాల వినోదాలకి ఆటపట్టుగా మారి సంసార పక్షంగా తయారయింది.

నా కారు లాస్ ఏంజిలిస్ శివార్లులోకి వచ్చేసరికి దరిదాపు పన్నెండు అయింది. అంతవరకూ రోడ్డు మేపు పక్కన పెట్టుకుని ఎక్కడా తప్పడిపోకుండా వచ్చేసేను. కాని లాస్ ఏంజిలిస్ ఊళ్ళో ప్రవేశించినది మొదలు అల్లిబిల్లిగా అల్లుకు పోయిన ఫ్రీవే ల మధ్య పడి, పద్మ వ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడిలా తిరుగుతున్నాను తప్ప ఎక్కడికి వెళుతున్నానో నాకే అర్థం కాలేదు. ఈ పరిస్థితికి కారణం ఆ రోజుల్లో శాంటా మానికా ఫ్రీవే డౌన్‌టౌన్ నుండి క్రెన్‌షా బులవార్డ్ వరకూనే ఉండేది; అక్కడనుండి శాంటా మానికా వరకు I 10 ఇంకా కడుతున్నారు. కనుక డౌన్‌టౌన్ నుండి యు. సి. ఎల్. ఎ. వెళ్ళటం నాకు తెలియక, శాంటా ఏనా ఫ్రీవే వెంబడి హాలీవుడ్ వరకు వెళ్ళిపోయి, అక్కడ నుండి I 405 తీసుకుని దక్షిణంగా వచ్చినట్లున్నాను. అలా తిరగ్గా తిరగ్గా, రెండు గంటల వేళకి అకస్మాత్తుగా ఎదట యు. సి.

ఎల్. ఎ. అని ఒక మార్గ దర్శిక సూచి కనబడ్డాది. ఆడబోయిన తీర్థం ఎదురయిందని ఇలాంటి సందర్భాలలోనే అంటారు. ఆ దారి వెంబడి బయటకి వస్తూనే సన్ సెట్ బులవార్డ్ మీద పడ్డాను. అక్కడ నుండి కాలేజీ ప్రాంగణానికి వంకర టింకర రోడ్ల మీద రెండు ప్రదక్షిణాలు చేసిన తర్వాత ఒక చోట కారు ఆపుకుందుకి చోటు దొరికింది. అమెరికాలో కావలసిన చోట కారు నిలపటానికి చోటు దొరికితే లాటరీ వచ్చినంతగా సంతోషిస్తారు ప్రజలు. నేను కూడ దరిదాపు అలాగే సంతోషించి, కారుని అక్కడ నిలేసి, బడి లోకి నడుచుకుని వెళ్ళి, ముందు స్టూడెంట్ యూనియన్ లో ఆగి, ఆత్మా రాముడిని శాంతింప చెయ్యటానికి ఇంత ఎంగిలి పడి, ఇంజనీరింగు భవనం లోనికి వెళ్ళేను – నాకు కాబోయే గురువు గారి ఆఫీసు వెతుక్కుంటూ. ఆయన ఊళ్ళో లేరని నాకు ముందే తెలుసు కనుక ఆయన సెక్రటరీ తో మాట్లాడి ఉద్యోగంలో జేరితే నాలుగు జీతపు రాళ్ళు రావటమే కాకుండా, ఆరోగ్య బీమా వంటి అమాంబాపతుల వల్ల కొంచెం రక్షణ ఉంటుందని ఊహించి అప్పటికప్పుడు ఉద్యోగంలో జేరిపోతే బాగుంటుందనే ఉద్దేశంతో లోపలికి నడుచుకు వెళ్ళేను.



ఆచార్య కార్ప్లస్ ఆఫీసు లోపల గదిలో ఉంది; బయట గదిలో ఇద్దరు సెక్రటరీలు ఉన్నారు. ఒకామె పేరు మాయా నిషినగా. రెండవ ఆమె మేక్సీన్ హంటర్. వీళ్ళిద్దరికీ మధ్య అందాల పోటీ పెడితే ఎవరు గెలుస్తారో చెప్పటం కష్టం. ఇద్దరి వయస్సూ దరిదాపు 20 25 సంవత్సరాల మధ్యలో ఉంటుంది. మాయ ప్రవర సగం జపాను, సగం తెల్ల అమెరిక్ అని అడక్కుండానే తెలిసిపోతోంది. బుజాల వరకూ

దిగజారే నల్లటి జుత్తు, ఆకర్షణీయమైన ముఖ సౌందర్యం. ఒంపు సొంపులు బహిర్గతం చెయ్యకుండా ఉండే ఆహార్యంతో ఉన్న ముగ్ధ. మేక్సీన్ పక్కా అమెరికన్ పిల్ల. జొన్న పొత్తు జుత్తుని పైకి ఎగదీసి ముడి వేసింది. పెదాలకి రంగు వేసింది. మాయ కంటె పొడగరిలా కనిపించింది. ఒంపులన్నీ బయటకి కనిపించేలా దుస్తులు వేసుకుంది. ఇద్దరూ ఎంతో స్నేహశీలులే.

నేను వీళ్ళిద్దరినీ ఇలా నఖశిఖ పర్యంతం సమీక్షిస్తూ అక్కడ నిలబడితే మాయ కలుగజేసుకుని ఏమిటి కావాలని అడిగింది. చెప్పేను. వెంటనే ఉద్యోగంలో జేరిపోతే ఏవో నాలుగు జీతపు రాళ్ళు వస్తాయి కనుక జేరిపోమని చెప్పి, కాగితాలు మీద సంతకాలు పెట్టించుకుంది. తర్వాత "ఎక్కడ ఉంటున్నావు?" అని అడిగింది. కారు రోడ్డు మీద పార్కు చేసుకుని తిన్నగా లోపలికి వచ్చేనని చెప్పేను. అప్పటికప్పుడు ఫోను తీసి ఎవ్వరినో పిలచి నాకు ఒక వారం రోజులు ఉండటానికి ఒక గది కుదిర్చి పెట్టింది. అది Delta Delta Delta సరోరిటీ వారి ఇల్లు. సరోరిటీ అంటే అమ్మాయిల సంఘం. అబ్బాయిల సంఘాలని Fraternity అంటారు. ప్రతీ సంఘానికి ఒక ఇల్లు ఉంటుంది. ఆ ఇంట్లో ఉమ్మడిగా ఉంటూ, కాలేజీలో చదువుకుంటారు. ఇంకా కాలేజీ తెరవటానికి పదిహేను రోజులు సమయం ఉంది కనుక ఈ ఇళ్ళన్నీ వేసవిలో ఖాళీగా ఉన్నాయి. కనుక ఎవరికైనా కావాలంటే లింగ విచక్షణ లేకుండా అద్దెకి ఇచ్చే వారు. అటువంటి ఇంట్లో నాకు వసతి సదుపాయం కుదిర్చి పెట్టింది, మాయ. ఆడపిల్లల మధ్య వెళ్ళి ఉండటానికి నేను తటపటాయిస్తూ ఉంటే, మరేమీ పరవా లేదని ధైర్యం చెప్పి మరీ పంపింది.

కాగితపు పనులు, సంతకాలు అయిన తర్వాత బయటికి వస్తూ ఉంటే వరండాలో ఒక ఇండియన్ ముఖం కనిపించింది. మనిషి మరీ అంత పొడుగు కాదు. చామన చాయ రంగు. తెల్లగా మల్లె మొగ్గల్లా మెరుస్తూన్న పళ్ళు బయటకి చూపిస్తూ నన్ను చూసి నవ్వేడు. నేను పలకరించేను. తెలుగు వాడు! పేరు అబ్బరాజు పీతాంబరరాజు. అక్కడే మెటీరియల్ సైన్సులో డాక్టరేటు చెయ్యటానికి వచ్చేడుట. పరిచయాలైన తర్వాత చెప్పేను, చీకటి పడే లోపుగా ఆ Delta Delta Delta సరోరిటీ హౌస్‌ని వెతికి పట్టుకోవాలని. తనూ వెనక సాయం వచ్చేడు. బయటకి వచ్చిన తర్వాత నాకు కారు ఉందని తెలియగానే అబ్బరాజు దగ్గర నా స్టాకు పెరిగిపోయింది. అక్కడ కారున్న ఇండియన్ విద్యార్థిని నేను

ఒక్కడినే. కారు ఎక్కడ పార్కు చేసేనో గుర్తుకి రాలేదు. తిరిగి తిరిగి, అలసి పోయి ముందు రాత్రి పడుక్కుందుకి వసతి సౌకర్యాలు కుదుర్చుకోకపోతే మరీ ఇబ్బందని ఆ పని పూర్తి చేసుకుని, చీకటి పడే వరకు అక్కడ ఉన్న రోడ్లన్నీ తిరగ్గా, తిరగ్గా ఆఖరికి కారు కనిపించింది. అక్కడ రెండు గంటలకి మించి కారు నిలప కూడదుట. అందుకని రెండు డాలర్లు జరిమానా వేసేరు. ఇంత బతుకూ బతికి ఇంటెనక్కాల చచ్చినట్లు, దేశం అంతా టికెట్టు రాకుండా కారు తోలుకు వచ్చి ఇక్కడ పార్కింగు టికెట్టు పుచ్చుకోవలసి వచ్చిందే అని కొంచం బాధ పడ్డాను.

మర్నాడు అబ్బరాజు నన్ను తీసికెళ్ళి అట్లూరి చంద్రశేఖరరావు అని చెప్పేనే, అతనికి పరిచయం చేసేడు. నేను అప్పుడే ఇండియా నుండి దిగొచ్చిన శాల్తీని అనుకొని చంద్రం నన్ను కొంచెం చులకన చెయ్యబోతే అబ్బరాజు అడ్డుకుని, నా కారు, వ్యవహారం చెప్పేసరికి, చంద్రం తగ్గేడు. నా స్టాకు అలా పెరుగుతోంది. చంద్రం నన్ను తీసికెళ్ళి బిస్వాస్ అనే ఒక బెంగాలీ కుర్రాడికి పరిచయం చేసేడు. అతను పూర్వాశ్రమంలో ఒక కమ్యూనిస్టో, లేక కనీసం కమ్యూనిస్టులంటే సానుభూతి ఉన్నవాడో నట. అతను నన్ను చూసి, “ఆర్ యూ మిస్టర్ భెమూరి? ఐ సా యు  భాండరింగ్ ఇన్ ద భరండాస్” అన్నాడు. ఈ ఇంగ్లీషు కొచ్చిన తిప్పలు తలుచుకుని బాధ పడ్డాను. ఈ ఇంగ్లీషుని బెంగాలీ వాడు బెంగాలీలా మాట్లాడెస్తాడు, మళయాళీ వాడు మలయాళీలా మాట్లాడెస్తాడు. తెలుగువాడు తెలుగులా మాట్లాడేసును కాని మన వాడికి తెలుగు అంతంత మాత్రమే వచ్చును  కనుక వాడు మాట్లాడే ఇంగ్లీషూ అంతంత మాత్రమే.

ఇహ ఉండటానికి ఇల్లు వెతుక్కోవాలి. యూనివర్సిటీ చుట్టుపట్ల బోలెడు ఎపార్ట్‌మెంట్లు ఉన్నాయి కానీ, అదేమిటో ఒక్కడూ నాకు ఇవ్వటానికి ఒప్పుకోలేదు. బయట ‘అద్దెకు ఇవ్వబడును’ అని బోర్డు కనిపిస్తుంది. నేను వెళ్ళి అడిగేసరికల్లా “ఇప్పుడే ఎవ్వరికో ఇచ్చేసేము” అని సమాధానం. “మరయితే బయట బోర్డు సంగతి ఏమిటి?” అని అడిగితే, “అది తీసెయ్యటం మరచి పోయేను” అని సమాధానం. నా యెడల విచక్షణ చూపిస్తున్నారేమోనని నాకు అనుమానం పట్టుకుంది. “అదేమీ కాదు” అన్నాడు, అబ్బరాజు. కేలిఫోర్నియాలో రంగు భేదం చూసి విచక్షణ చెయ్యటానికి సావకాశాలు తక్కువ. ఇక్కడ మెక్సికో వాళ్ళు, చైనా, జపాను వాళ్ళు చాల మంది ఉన్నారు. కాని నా మనస్సులో మాత్రం ఆ అనుమానం పీకుతూనే ఉంది.

పాదాలకి కట్టుకుందుకి బలపాలు ఎక్కడా దొరలేదేమో, వారం రోజుల పాటు కారు టైర్లు అరిగేలా తిరిగేను   కాని ఉండటానికి చోటు దొరకలేదు. "నీకు ఉండటానికి గది చూసిపెట్టే బాధ్యత నాది" అని అబ్బరాజు ధైర్యం అంటే చెబుతున్నాడు కాని ఒక్క సారైనా వెనక వచ్చి గది వెతికిపెట్టిన పాపాన పోలేదు. ఇక రేపో, మాపో కాలేజీ తెరిచెస్తారు, పాఠాలు మొదలైపోతాయి. నాకు ఉండటానికి చోటు దొరకలేదు. నాకు అబ్బరాజు మీద కోపం వచ్చి కొంచెం నిష్ఠూరంగా మాట్లేడేను. అప్పుడు కేంపస్ నూస్ పేపరు, డైలీ బ్రూయిన్,  తీసి అందులో ప్రకటనలు చూడటం మొదలు పెట్టేడు. అందులో ఒక ప్రకటనని చూపించి ఆ ఇల్లు చూడమని సలహా ఇచ్చేడు. అది కేంపస్ కి ఓ పది మైళ్ళ దూరంలో ఉంది. ఒకరి ఇంట్లో ఒక గది అద్దెకి ఇస్తారుట. అద్దె ఏభై డాలర్లు. అప్పటికే ఎక్కీ గుమ్మం, దిగే గుమ్మం తో విసుగేసి ఉన్నానేమో, తీరా ఈ పది మైళ్ళూ వెళ్ళిన తర్వాత ఆమె గది మరెవ్వరికో ఇచ్చేసేనంటే నేను చెయ్యగలిగేది ఏమీ లేదు కదా. అందుకని ఆ ఇంటావిడకి ఫోను చేసి,

"గది ఇంకా ఉందా?" అని అడిగేను.

"ఉంది"

"నేను ఇండియా వాడిని. తెల్లగా ఉండను. నల్లగా ఉంటాను. అద్దెకి ఇవ్వటానికి మీకు ఏదైనా అభ్యంతరం ఉంటే ఇప్పుడే చెప్పండి."

"నాకేమీ అభ్యంతరం లేదు సరికదా, నాకు విదేశీ విద్యార్థులంటే ఇష్టం.  ఈ గది నీ కోసమే అట్టేపెట్టేను. వచ్చి చూసుకో" అందామె.

అప్పటికే చీకటి పడిపోతోంది. వారింటికి వెళ్ళటానికి ఆవిడ ఇచ్చిన సూచనలన్నీ కాగితం మీద రాసుకుని బయలుదేరేను. వెస్ట్‌వుడ్ బులవార్డ్ మీద వెళ్ళి, శాంటా మానికా, ఒలింపిక్ దాటిన తర్వాత పికో మీద ఎడం పక్కకి తిరిగి, మే కంపెనీ దాటగానే మోటర్ మీద కుడి పక్కకి తిరిగి, బాగా ఎత్తుపల్లాలు ఉన్న ఆ రోడ్డు చివర ఉన్న నేషనల్ బులవార్డ్ చేరుకుని, అక్కడ ఫ్రీవే కిందుగా వెళ్ళి, షెల్బీ

డ్రైవ్ మీద ఎడం పక్కకి తిరిగితే ఎడం పక్క మూడో ఇల్లని ఆవిడ ఆనవాలు చెప్పింది. కొత్త కనుక, ఈ దారి చూసుకుంటూ చీకటిలో వెళ్ళేసరికి ఒక అరగంట పట్టింది. ఆ ఇల్లు బాగానే ఉంది. డిట్రాయిట్ లో నేను ఉండిన ఫేనీ ఫ్రీడ్‌మన్ ఇల్లు కంటె చాల బాగుంది. గది చిన్నదే కాని, అందులో ఒక వ్యక్తి పడుక్కోటానికి సరిపోయే చిన్న మంచం, పరుపు, దాని పక్కనే చదువుకుందుకి ఒక మేజా ఉన్నాయి. కాని ఆ ఇల్లంతటినీ, నా ఇల్లులా వాడుకోవచ్చని చెప్పింది. ఇంట్లో ఉన్న టెలివిషన్, మ్యూజిక్ సిస్టం అన్నీ నేను వాడుకోవచ్చని చెప్పింది. ముఖ్యంగా టి. వి. గదిలో ఎప్పుడు కావలిస్తే అప్పుడు టి. వి. చూడొచ్చని చెప్పింది.

ఆ ఇంటావిడ పేరు రే ఆస్‌గుడ్ (Rae Osgood). వయస్సు ఏభై మించి ఉండదు. నడి వయస్సన్న మాట. నిజంగా నడి వయస్సే; ఎందుకంటే ఆ తర్వాత ఆమె దరిదాపు మరో ఏభై ఏళ్ళు బతికింది. ప్రాధమిక పాఠశాలలో ఉపాధ్యాయిని. అప్పటికి ఒక ఏడాది క్రితమే ఆమే భర్త అకస్మాత్తుగా గుండె పోటు వచ్చి పోయాడుట. కొడుకు సిన్‌సినాటి లో మెడిసిన్ చదువుతున్నాడుట. కూతురు హైస్కూలు పూర్తి చేసి బెర్క్లీ లో సోఫమోరుట (అంటే, రెండవ సంవత్సరం చదువు). ఇద్దరు పిల్లలూ ఇంటి దగ్గర లేరు. భర్త లేడు. కొంచెం తోడుగా ఉంటుందని ఒక గది అద్దెకి ఇస్తున్నాదిట. ఆవిడ మాట తీరు చూసి వెంటనే ఒక నెల అద్దె ఇచ్చేసి గదిలో ఉండటానికి నిశ్చయించుకున్నాను.

ఆ 1964 సెప్టెంబరు సాయంకాలం నుండి మొన్న మొన్న, అనగా మార్చి 2005 లో, తన 94 వ ఏట, ఆమె స్వర్గస్తురాలయే వరకూ రే ఆస్‌గుడ్ తో పరిచయాన్నీ, స్నేహాన్నీ ఒదులుకోకుండా కాపాడుకుంటూ వచ్చేను. కేలిఫోర్నియా వదలి మళ్ళా ఇండియానా, ఆ తర్వాత నూ యార్క్ వెళ్ళి దరిదాపు 15 సంవత్సరాలు అరణ్య వాసం చేసినా ఆమెతో పరిచయం పోగొట్టుకోలేదు. ఆమెతో పాటు, ఆమె పిల్లలు, ఆమె స్నేహబృందమూ, అంతా నాకు స్నేహితులయారు. ఆమె ఒక అసాధారణమైన వ్యక్తి. మానవీయత ఉన్న మనీషి.

# లాస్ ఏంజిలిస్ లో మొదటి రోజులు

నేను లాస్ ఏంజిలిస్ చేరిన కొత్త రోజుల్లో మొదటి సారి స్మాగ్ అన్న మాట విన్నాను. Smoke, fog అన్న రెండు ఇంగ్లీషు మాటల మధ్య సంధి కార్యం వల్ల కొత్తగా వచ్చిన మాట ఇది. పొగనీ, మంచునీ కలిపి పొగమంచుని కనిపెట్టిన తెలుగు వాడికి 'రోయల్టీ' ఇవ్వకుండా వీళ్ళు ఇంత ధైర్యంగా మన భాషలలో ఉన్న సంధి కార్యాన్ని వాడేసుకుంటూ ఉంటే చూస్తూ ఉరుకోవటం కొంచెం కష్టమే అయినా, 'నా వైపు, నా హసుబెండు' అంటూ మన తెలుగు వాళ్ళు మాట్లాడే తీరు చూసిన తర్వాత నా ఈ గోడు ఏ మొహం పెట్టుకుని ఎవరితోనైనా ఎలా చెప్పుకుంటాను? మీరే చెప్పండి!

Smog అంటే పొగమంచులా వేలాడే పొగ అని అర్థం. 'పొగమంచు' అంటే తెలుగులో మరొక అర్థం ఉంది కనుక smog ని 'మంచుపొగ' అందాం. ఇంగ్లీషులో carbohydrates అంటే ఒక అర్థం, hydrocarbons అంటే మరొక అర్థం వచ్చినట్లే పొగమంచు, మంచుపొగ అన్న మాటలు కూడా. ఈ స్మాగ్ అనే పదార్థమూ, smog అన్న మాటా, రెండూ పుట్టటం లాస్ ఏంజిలిస్ లోనే పుట్టినా, క్రమేపీ ఈ స్మాగు ప్రపంచ వ్యాప్తంగా పెద్ద, పెద్ద పట్టణాలలోకీ, ఈ మాట ఇతర భాషలలోకి పాకి, ఒక అంటురోగంలా వ్యాపించిపోయింది.

ఈ మంచుపొగకి ముఖ్య కారణం కారులలోంచి వచ్చే పొగ. ఈ పొగలోని ఉదకర్బనాలు (hydrocarbons) సూర్యరశ్మితో సంయోగం చెందినప్పుడు స్మాగ్ పుడుతుంది. మామూలు పొగమంచు పొద్దెక్కినకొద్దీ ఆ వేడికి కరిగి చెదిరిపోతుంది. కాని మంచుపొగ తత్త్వం వేరు; ఇది వేడికి కరిగిపోదు. పోనీ సముద్రపు గాలికి చెదిరిపోతుందా అంటే, లాస్ ఏంజిలిస్ ఉన్న ప్రదేశపు నైసర్గిక స్వరూపం, స్థలాకృతీ అలా చెదరటానికి అవకాశాన్ని ఇవ్వవు. లాస్ ఏంజిలిస్ కి ఒక పక్క పసిఫిక్ సముద్రం, మూడు పక్కల ఎత్తయిన కొండలు: శాంటా ఏనా, సేన్ గేబ్రియల్, శాంటా మానికా. సముద్రపు గాలి వేసినప్పుడు ఈ మంచుపొగ ఎక్కడికీ కొట్టుకు పోకుండా ఈ కొండలు అడ్డుకుంటాయి. పోనీ పొగ తేలిక కనుక గొట్టాలలోని పొగలా ఆకాశం లోకి పైకి ఎక్కడికో పోతుందా అంటే అదీ కుదరదు. ఎందుకంటే లాస్ ఏంజిలిస్ ప్రాంతాలలో ఒక వాతావరణ ప్రక్రియ కారణంగా ఒక త్రిశంకు

స్తరం (inversion layer) ఏర్పడి చల్లటి గాలి పైన తిష్ట వేసి, వేడి గాలి పైకి ఎగసి వెళ్ళకుండా కిందని నొక్కి పెట్టి అట్టేపెడుతుంది. కనుక కల్మషమైన గాలి పంజరంలో చిలకలా ఎక్కడికీ పోలేక ఎక్కడ వేసేమో అక్కడే ఉంటుంది. లాస్ ఏంజిలిస్ ప్రజలు వారి ముద్దులొలికే కార్లు విసర్జించిన పొగతో కల్మషమైన గాలినే తిరిగి పీలుస్తూ, ఆ పొగ వల్ల వచ్చే దగ్గు, ఉబ్బసం మొదలైన వ్యాధులని భరిస్తూ, పక్కనే ఉన్న హాలీవుడ్ లో ఉన్న తారలని మంచుపొగతో ఎర్రబడ్డ కళ్ళతో చూస్తూ, ఆ మంచుపొగ వల్ల కళ్ళ వెంబడి కారే నీళ్ళని తుడుచుకుంటూ, అదే స్వర్గం అనుకుంటూ, బతికేసేవారు. అలా ఆనంద డోలికలలో ఊగులాడిన శాల్తీలలో నేనొకడిని కనుక ఎవ్వరినో ఏదో అనేస్తున్నానని కంగారు పడిపోకండి. చచ్చి ఏ లోకాన్న ఉన్నాడో కాని కాట్రగడ్డ గంగన్న అనేవాడు, "మనం అంతా ఒట్టి వెధవాయిలమోయ్" అని. తనని కూడా కలుపుకుని అందరినీ తిట్టేసేడు కనుక నేనేమీ అనలేక పోయేవాడిని.

ఆశ్చర్యం ఏమిటంటే, ఈ లాస్ ఏంజిలిస్ ఒక ఎడారి ప్రదేశం. హూవర్ డేము దగ్గర నుండి ఏటేటా 4 మిలియన్ యకరపుటడుగుల కలరాడో నీటి సరఫరా లేక పోతే ఇంత పెద్ద నగరమూ గోవిందా! ఈ పట్టణం ఇంతలా ఎదగటానికి హూవర్ డేము సరఫరా చేసే నీరు, విద్యుత్తూ ఒక విధంగా కారణమైతే కారులు మరొక కారణం. కారులు పెరగటం వల్ల ఊరు ఎదిగిందో, ఊరు ఎదగటం వల్ల కార్లు అత్యవసరమయాయో – గుడ్డే ముందు పుట్టిందో, పిల్లే ముందు పుట్టిందో – మీ లాంటి కుశాగ్ర బుద్ధులు విశ్లేషించి చెప్పాలి కాని, నేను ఏపాటి వాడిని? ఏమైతేనేమి, లాస్ ఏంజిలిస్ నిండా ఊరు పట్టనన్ని కారులు ఉన్నాయి. ఈ కారులే ఇక్కడి smog కి ముఖ్య కారణం.

ఈ మంచుపొగ గాలిలో వేల్లాడుతూ ఉండటం వల్ల అది ఆరోగ్యాన్ని పాడుచెయ్యటమే కాకుండా అందంగా ఉన్న ఊరు కంటికి ఖణిగా కనబడకుండా కప్పేస్తుంది. ఈ మంచుపొగ వెనక ఉన్న భవనాలు, కొండలు, వగైరా ఎప్పుడో కాని బాగా కనిపించవు. కనుక లాస్ ఏంజిలిస్ వినురేఖ (skyline) ఎలా ఉంటుందో చూసిన వాళ్ళు బహు తక్కువ. చూడాలని సరదా ఉన్నవాళ్ళు ఒక 'మంచి' రోజు చూసుకుని కొండ చాలులో ఉన్న మా యు. సి. ఎల్. ఎ. లో, మా ఇంజనీరింగు భవనం

ఎనిమిదో అంతస్తు ఎక్కి చూస్తే ఊరంతా కనిపిస్తుంది. ఈ సందర్భంలో నేను రీడర్స్ డైజెస్ట్ లో చదివిన ఒక చిన్న జోకు చెబుతాను.

"On a smoggy day, what do you see from the top of the Engineering building?"
"UCLA"
"On a clear day?"
"U C LA (You see L. A.)"

"L. A. అనే పొడి అక్షరాలు లాస్ ఏంజిలిస్ కి సంక్షిప్త నామం అని గుర్తు పెట్టుకుంటే పై సంభాషణ లోని చమత్కారం అర్థం అవుతుంది.

పొగ, మంచు, పొగమంచు, మంచుపొగ, వీటితో పాటు అడపా తడపా కంపించే భూమి, ఇన్ని అవలక్షణాలు ఉన్నా లాస్ ఏంజిలిస్ ప్రత్యేకంగా యు. సి. ఎల్. ఎ. ఉన్న వెస్ట్‌వుడ్ ప్రాంతం ఎంతో అందంగా ఉంటుంది. అప్పటికి ఇంకా సెంచరీ సిటీ వెలియ లేదుకనుక, వెస్ట్‌వుడ్ ని ఆనుకుని ఉన్న విల్‌షైర్ బులవార్డు, సన్‌సెట్ బులవార్డు ల మీద ఉన్న బజారులే ఫేషన్‌ల కి కాణాచి. చాల చోట్ల వీధులకి రెండు పక్కలా పోక, తాటి, ఈత జాతి చెట్లు ఉండి ఈ అందాన్ని ఇనుమడింప చేస్తాయి. ఇటూ, అటూ వెళ్ళే కార్ల ప్రవాహాలని విడదీస్తూ రోడ్డు మధ్య ఉన్న ద్వీపాలలో పువ్వుల మొక్కలు. అంతవరకూ డిట్రాయిట్, ఇండియనాపొలిస్ వంటి మంచు ప్రదేశాలలో ఉండి వచ్చిన కళ్ళకి ఈ దృశ్యాలని చూడగానే స్వర్గం అనిపించింది. పక్కనే బ్రెంట్‌వుడ్, బెల్ ఎయిర్ అనే ఊళ్ళల్లో హాలీవుడ్ తారల ఇళ్ళు ఉన్న తర్వాత స్వర్గం కాక మరేమిటి. పైపెచ్చు ఎప్పుడూ సమశీతోష్ణమైన మధ్యధరా వాతావరణం. 'అందాన్ని కొరుక్కుతింటామా?` అన్నట్లే, 'వాతావరణాన్ని కొరుక్కు తింటామా?' అని తూర్పు కోస్తాలో ప్రజలు అనటం కద్దు. ఇక్కడా, అక్కడా ఉన్న తర్వాత కేసవాసి లోతు ఉన్న అందం సంగతి చెప్పలేను కాని వెచ్చగా, ఆహ్లాద కరంగా ఉన్న వాతావరణాన్ని కొరుక్కు తినొచ్చు అని చెప్పగలను.

ఊరే కాదు, యు. సి. ఎల్. ఎ. ప్రాంగణం కూడ చాల విశాలమైనదీ, అందమైనదీ. తూర్పు కోస్తాలో చూసిన భవనాల కంటె ఇక్కడ కేంపస్ లో భవనాలు కొత్తగాను, ఆకర్షణీయంగాను కనిపించేయి. భవనాల చుట్టూ దిగుమతి చేసి పెంచిన పచ్చటి అపురూపమైన చెట్లు.

నేను ఇక్కడికి వచ్చిన కొత్తలో యు. సి. ఎల్. ఎ. లో ఓ ఏభై మంది భారతీయ విద్యార్థులు ఉండే వారు. ఇదే సైజు ఉన్న యూనివర్శిటీ అఫ్ ఇల్లినాయ్, పర్డ్యు, విస్కాన్సిన్ మొదలైన చోట్ల రెండేసి వందలకి పైగా ఉండేవారు. నేను మొదట్లో కలుసుకున్నది పీతాంబరరాజునీ, చంద్రాన్ని అని చెప్పేను కదా. వీళ్ళిద్దరూ కాకుండా రమణరావు గారనే వ్యక్తి Woodland Hills లో ఉండేవారు; అప్పటికి అమెరికాలో నాకు తెలుసున్న తెలుగు వాళ్ళల్లో ఈయనే మొట్టమొదటి ఉద్యోగస్తుడు. వృద్ధుల కృష్ణమూర్తి, ఆయన తమ్ముడు రాయుడు; గీత, ఆమె భర్త సుందరరామన్ (తెలుగు వాళ్ళే); విమల అని కెమెస్ట్రీలో పి. హెచ్. డి. చేసే ఒక అమ్మాయి మిగిలిన తెలుగు వాళ్ళు. ఇక్కడ జాబితా ఇచ్చిన అందరిలోనూ మొదట్లో నాకు బొత్తిగా పరిచయం లేనిది విమల ఒక్కరితోనే. అప్పుడు ఉన్న విద్యార్థి బృందంలో ఆమె ఒక్కరే ఆడపిల్ల కనుకనున్నూ, ఇండియన్ ఆడ వారితో చొరవగా మాట్లాడటానికి నేను కొంచెం బిడియపడేవాడిని కనుకనున్నూ (నిఝం!) ఏర్పడిన పరిస్థితి ఇది. కాని, ఇప్పుడు ఇక్కడ జాబితా చేసిన అందరిలో ఆమెతో పరిచయమే మిగిలింది. మిగిలినవాళ్ళు చాలామంది, రకరకాల కారణాలవల్ల నా జీవిత రంగం నుండి నిష్క్రమించేరు. ఈ వ్యాసం రాస్తూన్న తరుణంలో విమలని పిలచి అడిగితే జ్ఞాపకం చేసేరు తనూ, నేనూ ఒకే సారి లాస్ ఏంజిలిస్ వచ్చేమని.

ఏభై మంది మగ పిల్లల మధ్య ఒకే ఒక్క ఆడ పిల్ల ఉండటం లోని కష్టసుఖాలని చెబుతూ విమల ఆ రోజులలో జరిగిన ఒక చిన్న ఉదంతాన్ని చెప్పేరు. ఆ రోజులలో పరీక్షలు అయిన తర్వాత విద్యార్థుల పేర్లు, వారికి వచ్చిన మార్కులూ ఒక కాగితం మీద రాసి గోడకి అంటించేసేవారు. ఎవరికి ఎన్ని మార్కులు వచ్చేయో అందరికీ తెలిసిపోయేది. ఈ రోజుల్లో privacy rules వచ్చిన తర్వాత అలా చెయ్యటానికి వీలు లేదు. మన పిల్లలే వాళ్ళకి ఎన్నేసి మార్కులు వచ్చేయో చెప్పరు. ఇలా రోజులు మారక ముందు సంగతి చెబుతున్నాను. విమలకి ఒక సబ్జక్ట్ లో A – వచ్చిందిట. ఈ రోజులలో అన్నిటితో పాటు grade inflation వచ్చేసింది కనుక పరిస్థితులు మారేయి కాని, ఆ రోజుల్లో A –

చచ్చు గ్రేడు కాదు. కనుక మన ఇండియన్ అమ్మాయికి బాగా మార్కులు వచ్చేయని మనం న్యాయంగా సంతోషించాలి. కాని అదే భవనంలో మరొక రెక్కలో ఉండే ఒక తెలుగు విద్యార్థి ఆ మార్కులని చూసి, "ఆ! మీ ఆడ వాళ్ళకి మరేమి పనులుంటాయి. ఇంటి దగ్గరా, స్కూలు లోనూ చదవటమే కదా. కనుక మంచి మార్కులు రాకేంచేస్తాయి" అన్నాడుట. ఏం? ఇతను ఇంటికొచ్చిన తర్వాత పెద్ద గుర్రానికి పళ్ళు తోమాలా? ఆమె ఈ చిన్న సంఘటన ఇప్పటికీ తలుచుకుని బాధ పడుతుంది.

మరొక ఉదంతం చెబుతాను. ఒక సారి ఏదో ముఖ్యమైన అవసరమే వచ్చి అబ్బరాజు దరిదాపు వెయ్యి డాలర్ల దాకా ఇంటికి పంపవలసి వచ్చింది. ఆ రోజులలో డాలరుకి ఐదు రూపాయలు ఇచ్చేవారు. నల్ల బజారులో అయితే పన్నెండు రూపాయలకి పైనే పలికేవి. ఈ నల్ల బజారు వ్యాపారం చేసే హిందుస్తానీ వారెవరో లాస్ ఏంజిలిస్ లో ఉన్నారుట. వారి ద్వారా డబ్బు పంపితే ఒకటికి రెండింతలు పైగా వస్తుంది కదా. ఆ రోజుల్లో మాలో చాలా మంది కింది మధ్య తరగతి కుటుంబాల నుండి వచ్చిన వాళ్ళమే. చేతిలో చమురు ఇక్కడా ఉండేది కాదు, అక్కడా ఉండేది కాదు. కనుక ఇక్కడ నుండి ఒక వంద డాలర్లు పంపినా అది ఎక్కీతొక్కీగా ఉండేది అక్కడి వారికి. కనుక అబ్బరాజు తెగించి ఆ హిందుస్తానీ వారి ద్వారా డబ్బు పంపటానికి నిశ్చయించుకుని వారికి వెయ్యి డాలర్లు ఇచ్చి చక్కా వచ్చేడు. ఎన్ని రోజులు పోయినా ఆ డబ్బు అందిన వార్త రాదే! వాళ్ళు ఇదిగో పంపుతున్నామని కొన్నాళ్ళు, అదిగో పంపుతున్నామని కొన్నాళ్ళూ, పంపేసేమని కొన్నాళ్ళు కబుర్లు చెబుతూ ఉంటే ఇక్కడ మనవాడు చాలా కంగారు పడుతున్నాడు. ఆ హిందుస్తానీ వాళ్ళు ఎక్కడో మన్రోవియాలో నో మరెక్కడో దూరంగా ఉండేవారు. అక్కడికి వెళ్ళటానికి అబ్బరాజు దగ్గర కారు లేదు. నేను నా కారులో రెండు మూడు సార్లు తీసుకెళ్ళేను. వాళ్ళు అయిపూ ఫికరూ లేకుండా అదృశ్యం అయిపోయేరు. అబ్బరాజు కళ్ళ వెంబడి నీళ్ళు వస్తూ ఉంటే చూడలేక పోయేను.

ఇలాంటి వెధవ పనులు ఒక్క హిందుస్తానీ వాళ్ళే కాదు మన నలుగురిలో తలలో నాలుకలా తిరుగుతూన్న ఒక తెలుగు వాడు కూడా చేసేడు. ఆ ఆసామీ విమల దగ్గర $300, గంగన్న దగ్గర $800 అప్పు చేసి, వాళ్ళు అప్పు తీర్చమని అడిగితే "ఏ డబ్బు?" అని అడిగేడుట. గంగన్న లబో దిబో అని మా అందరితో చెప్పుకుని ఏడ్చేడు. విమల కోర్టులో దావా వేసి collection agency ద్వారా

$200 రాబట్టి, ఆ మధ్యవర్తికి $100 ఫీజు ఇచ్చుకుని కొంత మనశ్శాంతి కొనుక్కున్నారు. ఇలా మోసం చేసిన వ్యక్తి ఇప్పటికీ అమెరికాలో సిగ్గు లేకుండా పెద్ద మనిషిలా చెలామణీ అయిపోతున్నాడు. చెప్పుకుంటూ పోతే కొట్టుగదిలో దాచిన ఇటువంటి కంకాళాలు చాలా ఉన్నాయి. (ఇండియాలో పెళ్ళాం ఉండగా ఇక్కడ అమెరికన్ పిల్లలని డేట్ చెయ్యటం, అదే పెద్దమనిషి చేసిన మరొక ఘన కార్యం.) క్లాసులో పాఠం విన్నట్లే, ఒక చెవితో వినేసి మరొక చెవి గుండా బయటకి వదిలేసేవాడిని. అలా పట్టించుకోకుండా తటస్థంగా ఊరుకుంటే మరొక ప్రమాదం. ఈ రకం కథలు ఇండియా వరకూ పాకినట్లున్నాయి; నా లాంటి అమాయకుడు పెళ్ళి చేసుకుందుకి ఇండియా వెళితే ఇటువంటి ఉదంతమే ఒకటి ఉదహరించి, నాకు పిల్లని ఇవ్వం పొమ్మన్నారు. (దూరదృష్టి లేకుండా వాళ్లు ఏమి పోగొట్టుకున్నారో ఉమని అడగండి, చెబుతుంది!)

మాకు పదిహేను మైళ్ళ దూరంలో, డౌన్‌టౌన్ కి దగ్గరగా ఉన్న యూనివర్శిటీ అఫ్ సదరన్ కేలిఫోర్నియా లో మనవాళ్ళు మరికొంత మంది ఉండేవారు. వారిలో ముఖ్యులు సూర్యనారాయణ మూర్తి, ప్రభావతి అనే జంట, పుట్రేవు రామదాసు అనే నాతిగల బ్రహ్మచారి.

వీరిలో రామదాసు గారి గురించి నాలుగు ముక్కలు చెబుతాను. ఈయన నాటకాలనీ, సినిమాలనీ అధ్యయనం చెయ్యటానికి లాస్ ఏంజిలిస్ వచ్చి అప్పటికే మూడేళ్ళు అయి ఉంటుంది. మా అందరి లాగే చాలీ చాలని జీతం. శ్రీనాధుడు రాసిన పద్యంలా ఈయనది దోసెడు అద్దె కొంప; అందులో ఇద్దరు నిలబడితే మూడోవాడు పట్టడు. సినిమాల వాడు కనుక హాలీవుడ్ లో ఉన్న సినిమా వాళ్ళతో కొంత పరిచయం ఉంది. ఇంతలో అక్కినేని నాగేశ్వరరావు అమెరికా వచ్చేడు కదా. ఆయన్ని ఓ ఫైవ్ స్టార్ హొటేల్లో పెట్టి సకల మర్యాదలూ చెయ్యాలని స్టేట్ డిపార్ట్‌మెంటు వాళ్ళు తంటాలు పడుతూ ఉంటే, మన 'రాఀవాసారు' (రామదాసు గారిని మేము, రా తరువాత అర సున్నా పెట్టి అలా పిలిచేవాళ్ళం) హొటేలు కెళ్ళి, నాగేశ్వర్రావుని కలుసుకుని, "అయ్యా! మీరు ఈ హొటేలులో తిండి ఏమిటి తినగలరు. ఇప్పటికే ఈ అమెరికా తిండి తిని మీ నాలిక తాటిపట్టిలా తయారయి ఉంటుంది. మా ఇంటికి వస్తే మీకు పెసరట్టు, ఉప్మా చేసి అందులో నంచుకుందికి ఉల్లి ఆవకాయ బద్ద వేసి పెడతాను" అన్నారుట. నాకు బొబ్బట్లు ఇష్టమని మా అమ్మకి తెలుసో తెలియదో నాకు తెలియదు కాని,

నాగేశ్వర్రావుకి పెసరట్టు ఉప్మా ఇష్టమని మా అమ్మకి కూడా తెలుసు కనుక రాఁవాసారికి తెలియటంలో వింతేముంది? ఇంత మెగా స్టారు నాగేశ్వర్రావుకీ పెసరట్టు పేరు చెప్పేసరికి ప్రాణం లేచొచ్చుంటుంది. వెంటనే ఆయన ఈయన కొంపకి వచ్చేసేడుట. కాని మనిషిలో సినిమా తారకి ఉండవలసిన బింకం, బిగి తగ్గకపోతే వృద్ధుల కృష్ణమూర్తి ఏక వచనంతో – "నాయనా, నాగేశ్వర్రావూ, ఇక్కడ నిన్ను విరగబడి చూడ్డానికి ఎవ్వరూ లేరు. కనుక ఇక్కడ ఉన్న రెండు రోజులూ హాయిగా మాతో కలిసిపోయి, కడుపు నిండేలా నాలుగు కబుర్లు చెప్పుకుని వెళ్ళు" అన్నారుట. "నా అమెరికా ప్రయాణం" లో నాగేశ్వరరావు ఈ కృష్ణమూర్తిగారి పేరు ప్రస్తావించేరు కాని, పెసరట్టు ఉప్మా, వంకాయ కూర, తర్వాత ఉలవ చారు కాచి పెట్టి, వెనకాతల ఉండి హాలీవుడ్ ప్రొడ్యూసర్లకి పరిచయం చేసిన రామదాసు గారి పేరు ఉటంకించకుండా మరచిపోవటం నా ఉద్దేశంలో తప్పే. కాని నాగేశ్వర్రావు మా అమ్మకి, మా మామ్మకి కూడ ఫేవరిట్ కనుక నేనేమీ అనను. కొన్ని సంవత్సరాల తరువాత రామదాసుగారికి హైదరాబాదులో (ఒస్మానియా విశ్వవిద్యాలయంలో అనుకుంటా) నటుల కోసం పెట్టిన కళాశాలకి ప్రిన్సుపాలుగా ఉద్యోగం వచ్చింది. ఈ సంఘటన వెనుక నాగేశ్వరరావు చెయ్యి ఉందో లేదో నాకు తెలియదు.

రామదాసు గారు అప్పటికే లాస్ ఏంజిలిస్ లో చాల రోజులబట్టి ఉన్నారు కనుక ఆయనకి ఊరు బాగా తెలుసు; కాని ఆయనకి కారు లేదు. అంధపంగ న్యాయంలా దారి చెప్పటానికి నాకు ఆయన కావాలి, ఊళ్ళో పనులు చేసుకోటానికి నేను ఆయనకి కావాలి. కనుక తరచు నా పక్కనున్న ముందు సీట్లో ఆయన కూర్చుని నాకు దారిచెబుతూ ఉంటే వెనక సీట్లో నిర్వాహకులైన (అంటే వాహనాలు లేని వారు) ఇతర విద్యార్థులు కూర్చునేవారు. రామదాసు గారు "ఇక్కడ ఇలా తిరగండి" అంటూ చెయ్యి చాపే వారు. డ్రైవు చేసేవాడు ఆయన చెయ్యే చూస్తాడా, రోడ్డే చూస్తాడా? పైపెచ్చు రామదాసు గారి చేతికి ఆరు వేళ్ళు ఉండేవి. ఆయన చేతి వేళ్ళని విడివిడిగా పెట్టి, "మీరు ఇలా తిరగండి" అన్నప్పుడు రెండు వేళ్ళు కుడి పక్కకి, రెండు ఎడం పక్కకి, ఒకటి ముందుకి, ఆరో వేలు వెనక్కీ చూపించేవి. ఎటు తిరగటం?

పక్కని కూర్చుని దారి చెబుతూన్నప్పుడు ఒక సారి ఎడం పక్కకి తిరగవలసి వచ్చింది. ఎడమకి తిరిగే లేను లోకి వచ్చేను. ఎదురుగా ఎడమకి తిరిగే బాణం గుర్తు కనిపించింది. దానిని చూపించి, "అదిగో, అదే రామన్ ఎఫెక్ట్" అన్నారు. నా తలకాయ! నేను చదువుకున్న భౌతిక శాస్త్రంలో ఎక్కడా రామన్

ఎఫెక్ట్ కీ అక్కడ ఉన్న సంచార దీపానికి మధ్య లంకె ఉన్నట్లు చెప్పలేదు. ఆయన్ని డబాయించి కొట్టి పారేసి అప్పటికి నోరు మూయించేసేను. కాని అప్పటి నుండి ఎడం పక్కకి తిరగటానికి ఎప్పుడు ఎడం వాదారి లోకి వచ్చినా నాకు రామదాసు గారు అన్న మాటలు అలా చెవులలో మోగుతూనే ఉండేవి. కాని అక్కడ రామన్ ఎఫెక్ట్ ఏమిటో బోధపడి చావలేదు. పాపం, ఆయన ఇప్పుడు ఏ స్వర్గంలో ఉన్నారో కాని, ఈ మధ్య ఆయన మాటల వెనక అర్థం చూచాయగా స్ఫురించింది. మీరూ గమనించే ఉంటారు. కొన్ని ట్రేఫిక్ దీపాలు మనం వాటికి ఎదురుగా ఉన్న లేనులో ఉన్నప్పుడే కనిపిస్తాయి; పక్క లేనులో ఉంటే కనబడవు. ఆ రకంగా దీపాలు కనబడాలంటే ఆ దీపం ముందు ఒక ప్రత్యేకమైన కటకం (lens) పెడతారు. ఆ రకం కటకాన్ని ఇంగ్లీషులో ఫ్రెన్నెల్ లెన్స్ (Fresnel lens) అంటారు. ఈ రకం కటకాలని లైట్ హౌస్ ల లోనూ, కార్ల హెడ్ లైట్ల లోనూ కూడ వాడతారు. దానిని ఫ్రెన్నెల్ లెన్స్ అనటానికి బదులు రామదాసు గారు 'రామన్ ఎఫెక్ట్' అనుకుని ఉంటారు.

నేను యు. సి. ఎల్. ఎ. లో చేరే వేళకి మరొక ఇద్దరు తెలుగు వాళ్ళు ఆ ఊరు వదలి కొద్ది రోజుల ముందటే వెళ్ళిపోయేరుట. ఒకరు గోటేటి బాలకృష్ణమూర్తి గారు. ఆయన మేరీ అనే అమెరికన్ అమ్మాయిని పెళ్ళి చేసుకుని, ఇండియా వెళ్ళిపోయి, ఢిల్లీలో ఉన్నారుట. మేరీ ఆమె అత్తగారి దగ్గర వంట నేర్చుకుని, మడి కట్టుకుని, రుబ్బురోలు దగ్గర కూర్చుని కంది పచ్చడి రుబ్బేదని రామదాసుగారు అనుకుంటాను (అనుకోవడమేమిటి? రామదాసుగారే!) చెప్పేవారు. ఇది నిజమో కాదో తెలియదు కాని, అమెరికన్ అమ్మాయి, తల స్నానం చేసి, తడి జుత్తుని విరగబోసుకొని, మడి బట్టలతో రుబ్బురోలు దగ్గర రుబ్బుతూన్న దృశ్యం ఊహా చిత్రణకి బాగుండేది.

మరొక తెలుగాయన పేరు కోనేరు రాజేశ్వరరావు. ఈయన గురించి రెండు చోట్ల విన్నాను. నా పేరులో కూడ 'రావు' ఉంది కనుక, చాల మంది అమెరికన్ ప్రొఫెసర్లు నన్ను చూసినప్పుడు "నువ్వు కూడ ఆ రావు అంత తెలివైనవాడివేనా?" అని అడిగేవారు. తర్వాత చంద్రం, అబ్బరాజు చెప్పగా విన్నాను – ఈయన ఎంతో తెలివైన వాడనీ, రెండేళ్ళ లోపులోనే లెక్కలలో పి. హెచ్. డి. పట్టా పుచ్చుకుని ఇండియానాలో ఉన్న పర్డ్యు యూనివర్సిటీలో అప్పుడే చేరేరని. ఆయన అంత తెలివైన వాడని వీళ్ళంతా చెబుతూ ఉంటే ఊరుకో లేక గ్రంథాలయానికి వెళ్ళి ఈయన రాసిన పరిశోధనా గ్రంథం

(dissertation) వెతికి పట్టుకుని పరీక్షించేను. సాధారణంగా ఇటువంటి థీసిస్‌లు ఓ వంద పేజీలకి తక్కువ ఉండవు. రాజేశ్వరరావు గారు రాసిన థీసిస్ లో సంతకాలు ఉన్న మొదటి కాగితాన్నీ, సంప్రదించిన గ్రంధాల జాబితా ఉన్న ఆఖరు కాగితాన్నీ మినహాయిస్తే మరొక రెండు కాగితాలు ఉన్నాయి. ఆయన రాసిన కాగితాలతో పోల్చితే బైండు చేసిన అట్ట మందం ఎక్కువ ఉంది. పత్రాలు తిరగేసి చూసేను. మొదటి పుటలో ఒక సిద్ధాంతపు ప్రవచనం, దాని రుజువు. రెండవ పుటలో మరొక సిద్ధాంతపు ప్రవచనం, దాని రుజువు. సమాప్తం! ఈయన ఎవడో అఖండుడే అనుకున్నాను. తరువాత రోజులలో గోటేటి బాలకృష్ణమూర్తి గారూ, కోనేరు రాజేశ్వరరావు గారూ నా జీవితంలో నాకు తారసపడ్డారు. వారితో బాగా పరిచయం కూడా అయింది. బాలకృష్ణమూర్తి గారు 1999 ప్రాంతాలలో స్వర్గస్తులయారు. దురదృష్టవశాత్తూ రాజేశ్వరరావు గారు అతి చిన్న వయస్సులో, 1972/73 ప్రాంతాలలో గొంతుక కేన్సరు వచ్చి పోయారు. నేను పర్డ్యూలో ఉపాధ్యాయ వృత్తి చేసినప్పుడు ఈయనతో బాగా పరిచయం అయింది. అహంకారం లేని వ్యక్తి.

ఇక్కడికి వచ్చినది తెలుగు వాళ్ళ మీద పరిశోధన చెయ్యటానికి కాదుగా! కనుక ఇంక చదువు సంగతి. నేను యు. సి. ఎల్. ఎ. లో జేరిన మొదటి సంవత్సరం – అంటే 1964 65 లో చేతిలో కారున్నా సరే ఎక్కడికీ తిరగ కుండా బుద్ధిగా చదువు మీదే దృష్టి కేంద్రీకరించేను. ఆ రోజుల్లో పట్టా పుచ్చుకుందుకి మొదటి అంచెగా ఒక విదేశీ భాషని చదివి తర్జుమా చెయ్యగలిగే సమర్ధత, మూడు విభిన్నమైన పాఠ్యాంశాలలో ప్రావీణ్యత రాత పరీక్షల ద్వారా చూపించాలి. ఈ రాత పరీక్ష ఒక పెద్ద గండం లాంటిది. నేను భిలాయిలో నేర్చుకొన్న రష్యన్ భాషని ఎంపిక చేసి అవలీలగా భాష పరీక్షని గట్టెక్కింపించేను. ఇక, పాఠ్యాంశాలకి కంప్యూటర్లు, కంట్రోల్ సిస్టంసు, సోలిడ్ స్టేట్ ఎలక్ట్రానిక్సు ఎంచుకున్నాను. ఇండియనాపొలిస్ లో చేసిన పని వల్ల సోలిడ్ స్టేట్ ఎలక్ట్రానిక్సు కొంచెం తేలికయింది. ఆ రోజులలో అమెరికా చంద్రలోక యాత్ర చేయటానికి సన్నద్ధ మవుతోంది కనుక కంట్రోల్ సిస్టంసు అంటే చాలా మంది ఇష్టపడి చదివేవారు. కప్యూటర్ల సంగతి సరేసరి; అది మా గురువుగారు రిసెర్చి చేసే విభాగం.

రాత్రీ, పగలూ నేను ఎన్నుకున్న మూడు పాఠ్యాంశాలనీ పారాయణ చేసి, పామి, తోమి, మే నెలలో పరీక్షకి కూర్చుని ఉత్తీర్ణుడనయిపోయేను. ఈ పరీక్ష పేసయే వరకు పొద్దుట ఎనిమిదింటికి వచ్చిన వ్యక్తిని రాత్రి పన్నెండు గంటలవరకు స్కూల్లోనే ఉండి చదివేవాడిని. ఎప్పుడూ అక్కడే ఉండేవాడిని కనుక అక్కడ ఉన్న గురువుల దగ్గరనుండి గదులు ఊడ్చే చప్రాసీ దాకా అందరూ పరిచయస్తులే. ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే, నా డిగ్రీ వచ్చేసిన తర్వాత – దరిదాపు పదేళ్ళ తర్వాత – మా గురువుగారిని పలకరించడానికి వెళ్ళినప్పుడు అక్కడ ఇంజనీరింగు భవనంలో గదులు ఊడ్చే జానిటర్ నన్ను గుర్తు పట్టి గట్టిగా కౌగలించేసుకున్నాడు!

అప్పుడు, అంటే 1964 లో, అక్కడ ఇంజనీరింగు భవనంలో SWAC అనే కంప్యూటరు ఒకటీ, ఐ. బి. ఎం. వారి 7094 కంప్యూటరు ఒకటీ, బెక్మన్ కంపెనీ వారి ఎలక్ట్రానిక్ ఏనలాగ్ కంప్యూటరు ఒకటీ ఉండేవి. ఎలక్ట్రానిక్ కాకుండా మరేవిధమైన కంప్యూటర్లు ఉంటాయన్న అనుమానం మీలో పుట్టవచ్చు. ఆ రోజులలో, మా భవనంలోనే, నాలుగో అంతస్తులో, ఒక చతుశ్శాలిక (atrium) లాంటి చోట ఒక mechanical analog computer మ్యూజియం లో ప్రదర్శించినట్లు చూపరుల కోసం ప్రదర్శనకి ఉంచేరు. ఇప్పుడు అది ఏ Smithsonian లోనో ఉండి ఉంటుంది. రెండు తరాలలో ఎంత దూరం వచ్చేమో తలుచుకుంటే ఆర్ద్రత చెందిన మనస్సు మూగబోతుంది.

ఇక SWAC (Standards Western Automatic Computer) గురించి రెండు మాటలు. ఇది శూన్య నాళికలతో కట్టబడ్డ మొదటి తరం కంప్యూటరు. అమెరికా ప్రభుత్వం వారి National Bureau of Standards వారు కట్టిన కంప్యూటరు ఇది. దీనికి రూపకల్పన చేసిన ప్రొఫెసర్ హేరీ హస్కీ ని నేను ఎరుగుదును. ఈయనే కాన్పూరులో స్థాపించిన IIT ని పర్యవేక్షించటానికి ఒక సారి ఇండియా వచ్చేరు. నా చదువు అయిపోయిన తర్వాత ఈయన, 1968 లో, నాకు కాన్పూరులో నెలకి 950 రూపాయల జీతం, ఇండియా వెళ్ళటానికి మా సంసారం అంతకీ విమానం ఖర్చులూ, సామాను పడవలో పంపటానికి అయే ఖర్చులూ ఇస్తూ ఉద్యోగం ఇచ్చేరు. కారణాంతరాలవల్ల ఆ ఉద్యోగం తీసుకోలేదు నేను. ఈ పిట్ట కథని పక్కకి నెట్టి మళ్ళా మన కలనయంత్రం కథలోకి వద్దాం. ఈ SWAC లో 2300 శూన్య నాళికలు ఉండేవి. Williams tube అనే శూన్య నాళికతో కట్టిన

memory లో 256 మాటలు దాచటానికి సరిపడా చోటు ఉండేది. (ఇప్పుడు నా బల్ల మీద ఉన్న కంప్యూటరుకి బిలియను – అంటే, 1,000, 000, 000 మాటలు దాచగలిగే స్థోమత ఉంది.) ఇది 1954 వరకు వాషింగ్టన్ లో ఉండి తరువాత యు. సి. ల్. ఎ. లో 1967 వరకు (మార్పులు, చేర్పులు చేయించుకుంటూ, అనుకోండి) ఉంది. ప్రోగ్రాము రాసి ఈ కంప్యూటరు చేత ఒక సారి పాట పాడించేరు. అప్పుడు నేను వెళ్ళి విన్నాను. చారిత్రాత్మకమైన విశేషం ఏమిటంటే ఈ కంప్యూటర్ మీదే మొదటి ఐదు మెర్సెన్ ప్రాథమిక సంఖ్యలు (Mersenne primes) లెక్కగట్టేరు. (కుతూహలం ఉన్న వారికి – ఈ ఐదు సంఖ్యలలో ఒకొక్కదానిలో 157, 183, 386, 664, 687 చొప్పున అంకెలు ఉన్నాయి.) ఇప్పుడు ఈ కంప్యూటరు ఎక్కడైనా మ్యూజియంలో ఉందో, మరేమైందో నాకు తెలియదు కాని 1967 దీనిని dismantle చెయ్యటం నేను చూసేను.

నేను చూడటమే కాదు, నా చేతులతో ఒక కంప్యూటర్ ని dismantle చేసేను కూడ. యు. సి. ఎల్. ఎ. లో జేరిన కొత్తలో నేను కూర్చుందుకి బెక్‌మన్ కంపెనీ వారి EASE Analog Computer ఉన్న గదిలో ఒక మూల ఒక కుర్చీ, బల్ల వేసి కూర్చోమన్నారు. నా ఆఫీసు, ప్రయోగశాల కూడ అదే. ఆ గది దరిదాపు ఇరవై అడుగుల పొడుగు ఉండేది. అందులో ఈ కొస నుండి ఆ కొస వరకు, గాడ్రెజ్ బీరువాల మాదిరి, ఒకదాని పక్క మరొకటి చొప్పున ఓ పదిహేను పలకలు (panels) ఉండేవి. ఈ పలకల వెనక సొరుగులలో అనేకమైన శూన్య నాళికలతో చెయ్యబడ్డ ఎలక్ట్రానిక్ పరికరాలు ఉండేవి. ఈ కంప్యూటర్ ని వాడటం నేర్చుకోమని మా గురువు గారు చెప్పేరు. నేర్చుకునేటప్పుడు ఒక మాదిరి సమస్య ఉంటే బాగుంటుందని అక్కడ మెడికల్ కాలేజీ లో ఉన్న Brain Research Institute లో పిల్లుల మెదడు మీద ప్రయోగాలు చేస్తూన్న వైద్యుల దగ్గరికి వెళ్ళి, వాళ్ళు కూడగట్టిన దత్తాంశాలని సేకరించి ఆ మెదడు ఎలా పనిచేస్తుందో ఈ కంప్యూటరు మీద ప్రయోగాలు చేసి చూడమన్నారు. వీటినే ఈ రోజులలో న్యూరల్ నెట్స్ అంటున్నాం. ఆ ఏనలాగ్ కంప్యూటరు అప్పటికే బాగా పాతబడిపోయి నన్ను నానా తిప్పలు పెట్టింది. ఎలాగో నా ప్రయోగాలు అయేయనిపించిన తర్వాత ఆ కంప్యూటరు ని ఏ కీలు కా కీలు విడదీసేసి, దాన్ని మనం ఎదురు తిరిగి డబ్బిచ్చినా ఏ మ్యూజియం వారూ పుచ్చుకోరని నిర్ధారించుకుని, మేమే చెత్త పట్టికెళ్ళే వారికి డబ్బిచ్చి పారేయించేము. అది పారేసిన తరువాత మేమే hybrid computer అనే కొత్త రకం కంప్యూటరు ని నిర్మించి, దాని మీద ప్రయోగాలు చేసి, థీసిస్

రాసేను. నా పని అయే వేళకి ఈ hybrid computer కి కూడ రోజులు మూడేయి. కంప్యూటర్ల పోటీలో మనం ఇప్పుడు రోజూ వాడుకునే రకం డిజిటల్ కంప్యూటర్లు నిర్ద్వందంగా పందెం గెలిచేయి.

ఈ రోజులలోనే మా డిపార్టుమెంటుకి ఎం. ఐ. టి. నుండి లెనర్డ్ క్లయిన్‌రాక్ అనే కుర్ర ప్రొఫెసరు ఒకతను వచ్చేడు. ఆయనా, ఆయన అనుయాయులూ యు. సి. ఎల్. ఎ. లో ఉన్న ఒక కంప్యూటరుని ఎం. ఐ. టి. లో ఉన్న మరొక కంప్యూటరుకి టెలిఫోను తీగల ద్వారా తగిలించి ఆ రెండు కంప్యూటర్ల మధ్యా వార్తలు పంపటం ఎలాగో ప్రయోగాలు చేసేవారు. అంటే ఒక కంప్యూటరు చెప్పినట్టు మరొక కంప్యూటరు వినేటట్లు చెయ్యటం అన్నమాట. ఈ ప్రయోగాలే ARPA Net కి నాంది. ఈ ARPA Net మనందరికీ ఇప్పుడు సుపరిచితమైన Internet కి తల్లి. కనుక ఇటుపైన "Internet నేనే కనిపెట్టేను' అని రాజకీయ నాయకుడు ఎవ్వరైనా అంటే నమ్మకండి – నిజంగా ఇంటర్‌నెట్ ని కనిపెట్టినది ఎవ్వరో ఇప్పుడు మీకు తెలుసు కనుక!

## ఇంటికి తిరుగు ప్రయాణం

మే 1965 లో పి. హెచ్. డి. రాత పరీక్ష. ఇది ఉదయం మూడు గంటలు, మధ్యాహ్నం మూడు గంటలు. డిగ్రీ సంపాదించటమనే వైకుంఠపాళీలో ఈ పరీక్ష ఒక పెద్ద నిచ్చెన. ఈ నిచ్చెన ఎక్కిన తర్వాత పెద్ద పాము (వాచక పరీక్షలు లేదా ఓరల్స్) మింగెయ్యకుండా ఉంటే, పక్కానికి వచ్చిన పండులా డిగ్రీ అదే వస్తుంది. ఈ పరీక్ష మొదటిసారి తప్పితే మరొకసారి తీసుకోనిస్తారు. రెండవసారి పేసవక పోతే చెంగే శరణ్యం. కనుక మొదటిసారి పేసవటంలోనే సొగుసు ఉంది. సుడి బాగుండి ఏదో డింకీ కొట్టకుండా పేసయాను. నిజానికి సుడి 'బాగుంది' అనే కంటె 'అలా రాసి పెట్టి ఉంది, అలా పేసయ్యేం' అనాలి. ఎందుకంటే, ఈ పరీక్ష తర్వాత వచ్చే 'పెద్ద పాము' మింగకుండా నేను తప్పించుకున్నాను కానీ, నా స్నేహితుడు నవీన్ దోషీ ని పెద్ద పాము మింగేసింది. గుజరాతీ వాడేమో, వెధవ పరీక్ష పోతే పోయిందిలే అని పునర్జన్మ ఎత్తి, వర్తకం పెట్టి మిలియన్లు ఆర్జించి, 1995 ప్రాంతాలలో భార్య ప్రతిమ పేర యు. సి. ఎల్. ఎ. కి మిలియను డాలర్లు దానం చేసేడు. నేను? ఎవరి సుడి బాగుందంటారు? ఒకసారి ప్రొఫెసర్ చాంద్ విశ్వనాధన్ నవీన్‌తో, "నిన్ను మేము ఫెయిల్ చెయ్యడమే మంచిదయింది. అందువల్లే నువ్వింత ధనవంతుడవయావు" అన్నాడుట!

ఎన్నాళ్ళబట్టో ఇండియా ఒక సారి వెళ్ళి అందరినీ చూడాలన్న కోరిక ఉండేది. అప్పటికే మన దేశం వదలి నాలుగేళ్ళయింది. ఇప్పుడు — డిగ్రీ సగం జేబులో ఉందనే ధైర్యం వచ్చిన తరువాత – ఇంటికి వెళ్ళాలన్న కోరిక బలవత్తరమైంది. అమ్మనీ, నాన్నగారినీ, మిగిలిన అందరినీ చూడాలని ఒక కోరిక. తర్వాత, పెళ్ళి చేసుకుంటే కొంత ఒంటరి తనం తగ్గుతుందేమోనన్న భ్రమ. మన ఇండియన్ పద్ధతి లో ఉన్న సుఖం ఏమిటంటే పిల్లని మనవాళ్ళు చూసి పెడతారు. డేట్లు, ఊయింగులు, పెట్టింగులు, ఈ పెట్టింగుల సదుపాయానికి కొంచెం విశాలంగా వెనక సీట్లు ఉన్న కార్లూ, వగైరా ఈతి బాధలు ఏమీ ఉండవు. వంగూరి చిట్టెన్‌రాజు చెప్పినట్లు మా తరం వాళ్ళకి పెద్దవాళ్ళు పెళ్ళిళ్ళు కుదర్చకపోతే ముదిరిపోయిన బెండకాయల్లా ఉండేవాళ్ళమో ఏమో మరి! కనుక ఇండియా ఒక సారి వెళితే ఈ పనులన్నీ ఒకే సారి చక్కబెట్టుకు చక్కా రావచ్చని మనస్సులో ఉండేది. కాని అదొక పెద్ద ఖర్చు.

దాచుకున్న నాలుగు రాళ్ళూ విమానాల మీద పోసేస్తే పెళ్ళి చేసుకుని, పిల్లని తీసుకొచ్చి ఎలా పోషించటం?

ఇలా తటపటాయిస్తూ ఉండగా, అమెరికాలో ఉన్న ఇండియన్ విద్యార్థులు కొంత మంది కలసి ఒక విమానాన్ని టోకు పద్ధతిలో బేరమాడి (అంటే charter చేసుకుని) ఇండియా వెళుతున్నారన్న వార్త వచ్చింది. నూ యార్కు నుండి బొంబాయికి టికెట్టు $400 మాత్రమే. మామూలుగా టికెట్టు కొనుక్కుంటే  $800 అయి ఉండేది. బిళ్ళకుడుముల్లా నాలుగు వందలూ ముందు ఇచ్చెస్తే వాళ్ళు ఆ డబ్బు పట్టుకు ఎక్కడికైనా పోతే నా పని గోవిందా. అబ్బరాజు ఖంగు తినటం కళ్ళారా చూసిన తర్వాత తెలుసున్న వాళ్ళకి కూడ డబ్బివ్వటానికి భయం వేసేది. తెలుసున్నవాళ్ళని నమ్మి డబ్బివ్వడమే ఎక్కువ ప్రమాదమని తరువాత తెలిసిందనుకొండి; కాని అది వేరే విషయం.  పోనీ ఎక్కడైనా వాకబు చేద్దామా అంటే, పశ్చిమ తీరం నుండి వెళ్ళేవాడిని నేను ఒక్కడినే కనిపించేను. (నాకు నేను ఎలా కనిపిస్తాను కానీ, భాష మీద ఇంతకంటె పటుత్వం లేక అలా అంటున్నాను.) కనుక ఇది నమ్మకస్తులు చేస్తూన్న పనా, ఎవ్వరైనా మోసగిస్తున్నారా అన్న భయం ఒక పక్క పీకుతున్నా టికెట్టు చాలా చవక కదా అని రెండంచెల మీద డబ్బు కడతానన్నాను. వాళ్ళు, 'సరే' అన్నారు.

ఇహ లాస్ ఏంజిలిస్ నుండి నూ యార్కు వెళ్ళాలి. విమానంలో వెళితే ఆ టికెట్టు ఇండియా టికెట్టు కంటె ఎక్కువగా ఉండేది. ఎవ్వరైనా ఇటు నుండి అటు వెళ్ళేవాళ్ళు ఉంటే వాళ్ళ కారులో తీసికెళతారేమో కనుక్కోవాలి. ఇదేమీ కష్టం కాదు. మా కాలేజీలోని స్టూడెంట్ యూనియన్ లో Ride Board అని ఒకటి ఉండేది. దాని మీద వెతుక్కుని తూర్పు కోస్తాకి వెళ్ళే వాళ్ళ కారులో చోటు ఉంటే వాళ్ళు మనని తీసుకెళతారేమో కనుక్కోవాలి. అలా రెండు రోజులు ప్రయత్నం చేసేసరికి ఒక వ్యక్తి దొరికేడు. పెట్రోలు ఖర్చులు నేను పంచుకుని, అప్పుడప్పుడు కొంచెం కారు తోలటంలో సహాయం చేస్తే నన్ను తీసుకెళతానన్నాడు. అతను హార్వర్డ్ యూనివర్సిటీలో విద్యార్థిట. నా కంటె వయస్సులో కొంచెం పెద్దగానే కనిపించేడు. సరే అన్నాను. ఈ దేశంలో కలుసుకున్న ఎంతోమంది పేర్లు గుర్తు పెట్టుకున్నాను కానీ ఇతని పేరు గుర్తు లేదు కనుక మాటవరసకి మైక్ అందాం. ప్రయాణానికి ముందు మైక్ చిన్న మెలిక పెట్టేడు.

“నాకు కార్పస్ క్రిస్టీ, టెక్సస్ లోనూ, లిటిల్‌రాక్, ఆర్కన్సా లోను చిన్న చిన్న పనులు ఉన్నాయి. ఆ పనులు చక్కబెట్టుకుందుకి అక్కడ కొంచెం ఆగాలి. నీకేమీ తొందర లేదు కదా?” అన్నాడు.

“నా విమానం బయలుదేరే లోగా నన్ను నూ యార్కులో పడెస్తే చాలు” అన్నాను.

“అన్నట్లు చెప్పటం మరిచాను. నేను మూడొంతులు క్లీవ్‌లండ్ వరకూ మాత్రమే వెళతాను. అక్కడనుండి నూ యార్కు వెళతానో లేదో ఇప్పుడు చెప్పలేను.”

“హోరి నీ…” అని నాలో నేనే అనుకున్నాను. ఇంక అప్పుడు మీన మేషాలు లెక్క పెడుతూ కూర్చుంటే నన్ను నూ యార్కు తీసికెళ్ళటానికి మరొక మనిషి దొరకొద్దూ. అన్ని షరతులకీ ఒప్పుకున్నాను.

బయలుదేరేముందు, ఇంటి దగ్గర ఉన్న మగ వారికి గెడ్డం గీసుకుందుకి స్టెయిన్‌లెస్ స్టీలు బ్లేడులు (అక్కడ దొరికే సెవెనోక్లాక్ బ్లేడులు ఒక సారి వాడే సరికి మొద్దుబారిపోయేవి), అక్క చెల్లెళ్ళకి జపాన్ సిల్కు చీరలు (ఒకొక్కటి పది, పదిహేను డాలర్లకి దొరికేవి), ఒక ట్రాన్సిస్టర్ రేడియో, బంగాళా దుంపల తొక్కలు తీసుకునే ఒక ఉపకరణం (దీనినే peeler అంటారనుకుంటాను. మా ఇంట్లో కత్తిపీట తోటే తొక్కలు ఒలిచేవారు కనుక ఈ ఉపకరణం నాకు చాలా నచ్చింది), ఇంట్లో ఉన్న అమ్మాయిలకి సెంటు బుడ్లూ, మా నాన్న గారికి చిన్న పెట్టెతో చుట్టలు, ఇలా నాకు తోచినవి అందరికీ తలొకటీ కొని బయలుదేరేను. నేను పట్టికెళ్ళిన చుట్ట ఒకటి కాల్చి, “ఈ చుట్టలు రుచిగా లేవురా!” అని నాన్నగారు చప్పరించేసేరు. “చుట్టలకి రుచేవిఁటో!” అని అమ్మ ఒక్క మాటలో dismiss చేసేసింది. ఇవన్నీ వేరే విషయాలనుకొండి.

మైక్ కారు చకచకా తోలబట్టి, రాత్రి ఎక్కడా ఆగకుండా చాలా దూరం వచ్చేసేము. పక్కన కూర్చుని మైక్ చక్రం దగ్గర నిద్ర పోకుండా కబుర్లు చెప్పటం నా పని. ‘కావేవీ కబుర్లకనర్హం’ అనుకుంటూ ఆకాశం కిందనీ, భూమి మీదనీ ఉన్న విషయాలన్నిటినీ సందర్శించేము. రాత్రి ఒంటి గంట ప్రాంతానికి చర్చ కాష్మీర్ మీదకి మళ్ళింది. కారు జోరుగా ముందుకు వెళుతోంది.

“అక్కడ ఉన్న వాళ్ళు దరిదాపుగా అంతా ముస్లింలు అయినప్పుడు ఆ కాష్మీరుని పాకిస్తానుకి ఇచ్చేస్తే పోలా?” అన్నాడు, మైక్.

నాకు ఒళ్ళు మండింది. “బ్రూక్లిన్‌లో అంత మంది జ్యూ లు ఉన్నారు కదా, బ్రూక్లిన్‌ని జ్యూలకి ఇచ్చేసి, ఇజ్రయిల్ ఆక్రమించిన భూభాగాన్ని పాలస్తీనా వారికి ఇచ్చెయ్యొచ్చు కదా?” అన్నాను.

మైక్ జ్యూ అని నాకు తెలుసు. నేనలా అన్నానని అతనికి ఉడుకుమోత్తనం వచ్చింది. నిజానికి మైక్ ముందస్తుగా కాష్మీర్ మీద అలా విసురు విసరటానికి కారణం అప్పట్లో ఇండియా గుడ్డిగా పాలస్తీనాని సమర్ధించి, ఇజ్రయెల్ ఉనికిని కూడ గుర్తించలేదు. అందుచేత అమెరికాలో ఉన్న జ్యూలకి ఇండియా మీద పెద్ద అభిమానం ఉండేది కాదు. అమెరికా జనాభాలో జ్యూల శాతం అతి తక్కువ కనుక వాళ్ళ అభిప్రాయాలు మనని ఏమి చేస్తాయిలే అని నిర్లిప్తతతో ఊరుకోవటం మంచిది కాదు; ఎందుకంటే దేశంలోని ప్రజాభిప్రాయాన్ని మలచగల సంస్థలలో వీరు కీలక స్థానాలు ఆక్రమించి ఉన్నారు.

ఈ వాదన వేడిలో అతనూ చూసుకో లేదు, నేనూ చూసుకో లేదు. కారు టప్ టప్ మని రెండు సార్లు చప్పుడు చేసి ఆగి పోయింది. అప్పుడు ఇద్దరం చూసుకున్నాం. పెట్రోలు టేంకు ఎండలో దండెం మీద ఆరేసిన తుండు గుడ్డలా ఎండి పోయింది, చెమ్మదనమేనా లేకుండా.

అప్పుడు ఆ నడిరేయిలో ఇద్దరం కారుని కొంచెం రోడ్డు పక్కకి తోసేం. ఓ పది నిమిషాల కిందటే మైక్ దారిలో ఎక్కడో ఒక గేస్ స్టేషన్ చూసేడుట. అక్కడకి నడచి వెళ్ళి సహాయం తీసుకొస్తానన్నాడు. నన్ను కారు దగ్గర కాపలా పెట్టి తను ఒక్కడూ ఆ చీకట్లో నడుచుకుంటూ అదృశ్యమైపోయాడు. బయట చిట్ట చీకటేమో కొంచెం భయంగానే ఉంది. అలా బితుకు బితుకు మంటూ నేను కారులో కూర్చున్నాను. ఒక గంటలో మైక్ ఒక గేలను పెట్రోలు డబ్బాలో పోయించి, దారిన పోయే దానయ్య మరెవరో కారులో ఎక్కించి తీసుకొస్తే తిరిగి వచ్చేడు. కారులో ఆ పెట్రోలు పోసి, మళ్ళా వెనక్కి వెళ్ళి, డబ్బాని తిరిగి ఇచ్చేసి, ముందుకి కదిలేం. ఆ తర్వాత మైక్ కాష్మీర్ పేరెత్తితే ఒట్టు.

ఈ చిన్న ఉపద్రవం నుండి బయట పడి మరి కొంత దూరం వెళ్ళే సరికి టెక్సస్ లో ఏదో పల్లెటూరు పక్కనుండి వెళుతున్నాం. తెల్లవారుతోంది. ఇద్దరికీ బాగా అలసటగా ఉంది. ఆ రోడ్డు పక్క ఒక చిన్న పెట్రోలు బంకు, దాని వెనక రేకులతో కట్టిన షెడ్డు (barn) లాంటి కట్టడం ఒకటి కనిపించింది. అక్కడ ఒక కప్పు కాఫీ తాగుదామని ఆగేం. లోపల బొత్తిగా పల్లెటూరి వాతావరణం. మనుషులు కూడ విద్యాగంధం లేని బైతులులా ఉన్నారు. వాళ్ళెలా ఉంటే మనకేమిటి కప్పు కాఫీ తాగి పోదామని అక్కడ ఉన్న కౌంటర్ దగ్గర కూలబడ్డాం. ఇంతలో నేను అల్పాచిమానానికని లేచి బయటకి వెళ్ళేను. నేను తిరిగి వచ్చే సరికి మైకూ, ఆ హొటేలు యజమాని ఏదో ఘర్షణ పడుతున్నారు. నేను వచ్చి నా స్థానంలో కూర్చోగానే అక్కడి సర్వరు కొంచెం విసురుగా నాకు ఒక కప్పు కాఫీ ఇచ్చేడు. మా లాగే వాడికీ రాత్రి నిద్ర లేదు కాబోలునని నేను సమాధానపడి, ఆ కాఫీ తాగేసి బయటకి వచ్చి కారెక్కేను. మళ్ళా కారు బయలు దేరిన తర్వాత మైక్ చెప్పేడు, లోపల ఘర్షణకి కారణం. ఆ హొటేలు వాడు నేను నల్ల వాడిని కనుక నాకు కాఫీ ఇవ్వనని మొరాయించేడుట. మైకు, “అతను నల్ల వాడు కాదు, మరొక దేశం నుండి ఇక్కడికి వచ్చిన మన అతిథి. నువ్వు అలా అల్లరి పెట్టకూడదు” అని సమాధాన పరిచేడుట. ఈ విషయం చెప్పి, “రావ్, ఇక్కడ నుండి మనం క్లీవ్‌లండ్ వెళ్ళే వరకు  దారిలో ఎక్కడికి వెళ్ళవలసి వచ్చినా నన్ను వదలి వెళ్ళకు. ఆఖరికి బాత్ రూం కి వెళ్ళవలసి వచ్చినా నాతో చెప్పకుండా వెళ్ళకు” అని ఒక హెచ్చరిక చేసేడు. ఆ రోజులలో హార్వర్డ్ విద్యార్థులు చాలా మంది civil rights movement లో నల్ల వాళ్ళని సమర్ధిస్తూ చాల సహాయం చేసే వారు. వాళ్ళల్లో మైక్ ఒకడు.

మధ్యాహ్నం రెండింటికి కార్పస్ క్రిస్టీ చేరుకున్నాం. అక్కడ సముద్రపుటొడ్డున ఉన్న విమానాశ్రయంలో కలుసుకోవలసిన వాళ్ళని కలుసుకుని, తర్వాత  లిటిల్‌రాక్, ఆర్కన్సా లో ఆగేం. తెల్ల వాళ్ళకీ, నల్ల వాళ్ళకీ జరుగుతూన్న ‘పోరాటం’ లో లిటిల్‌రాక్ ఒక కురుక్షేత్రం. ఈ యుద్ధరంగంలో నన్ను ఒక్కడినీ ఒదిలిపెట్టి వెళ్ళటం మైక్ కి ఇష్టం లేదు. ఒక కాలేజీ హాస్టల్ లో మా బస. నన్ను హాస్టల్ గదిలో పెట్టి, భవనం దాటి బయటకి రావద్దని నన్ను హెచ్చరించి, తను బయటకి వెళ్ళి, తన పనులు చూసుకుని, నాకు తినటానికి తనే ఇంత తిండి పట్టుకొచ్చి నా భద్రత కోసం చాల తాపత్రయ పడ్డాడు — టెక్సస్ లో జరిగిన సంఘటన తర్వాత.

మైక్ నా క్షేమం గురించి ఇంతగా గాభరా పడటానికి కారణం లేకపోలేదు. అప్పటికి కొద్ది రోజుల క్రితమే, అనగా జూన్ 21, 1964 న పక్కనున్న మిసిసిపి రాష్ట్రంలో Congress of Racial Equality సంస్థ కి చెందిన ముగ్గురు స్వచ్ఛంద సేవకులు, ఏండ్రూ గుడ్‌మన్, 20, మైకెల్ ష్వెర్నర్, 24, అనే ఇద్దరు తెల్ల వాళ్ళూ, జేంస్ ఎర్ల్ చేనీ, 21, అనే ఒక నల్ల వాడూ అకస్మాత్తుగా మాయం అయిపోయేరు. తర్వాత పాతిపెట్టబడ్డ వారి మృత దేహాలు దొరికేయి. ఈ నేపథ్యంలో ఒక తెల్ల వాడూ, ఒక చామన చాయ వాడూ కలిసి తిరగటం లో ఉన్న ప్రమాదాన్ని ఆకళింపు చేసుకుని మైక్ భయపడ్డాడంటే భయపడడూ?

ఆ తర్వాత క్లీవ్‌లండ్ వెళ్ళే వరకూ మరేమీ 'సంఘటనలు' జరగలేదు. నన్ను గ్రేహౌండ్ బస్సు స్టేషన్‌లో దింపేసి, నా వాటా గేసు ఖర్చులు లెక్క గట్టి (పదకొండు డాలర్ల పై చిలుకు అయింది) తీసుకుని, తన దారిన తను వెళ్ళి పోయేడు. నేను అక్కడ నుండి రాచెస్టర్ లో ఉన్న శాస్త్రి అన్నయ్య (పిన్ని కొడుకు) దగ్గరకి వెళ్ళి, అక్కడనుండి బస్సులో నూ యార్క్ వెళ్ళి, నా చార్టర్ విమానం పట్టుకున్నాను. ఆ విమానం కంపెనీ పేరు Saturn Airlines.

ఆ విమానం ప్రొపెల్లర్ విమానం. అప్పటికి జెట్ విమానాలు బాగా వాడుక లోకి వచ్చేసేయేమో, ఈ ప్రొపెల్లర్ బండి నిజంగా అట్లాంటిక్ దాట గలదా అని నాకు అనుమానం వచ్చింది. అది నూ యార్కులో సాయంకాలం బయలుదేరి తూర్పు కోస్తాని అంటిపెట్టుకుని ప్రయాణం చేసి, కెనడా లోని నూ ఫండ్‌లండ్ లో Bangor అనే ఊళ్ళో తెల్లారేసరికల్లా ఆగింది. ఈ లంకణాల బండి అక్కడ పెట్రోలు కొట్టించుకుని మరొక ఎనిమిది గంటలు ప్రయాణం చేసేసరికి కిందని భూమి కనిపించింది. అది ఐర్లండ్ ట. విమానం ఐర్లండ్ మీదుగా ఎగిరి, తరువాత ఇంగ్లండు మీదుగా ఎగిరి, సాయంకాలానికి పేరిస్ చేరుకుంది. కిందకి దిగి, కాళ్ళు సాగదీసుకునేసరికి నిజంగా ప్రాణం లేచొచ్చింది.

విమానం నెమ్మదిగా వెళ్ళినా, లోపల కాలక్షేపానికి కొదవ లేదు. అంతా ఇండియన్లు అవటం తో అంతా సొణకలలా ఒకటే వాగుడు. లోపల ఒకటే గోల. ఇంత సందడి లోనూ, ఆ విమానంలో మరో ముగ్గురు

తెలుగు వాళ్ళు కనబడ్డారు. అందులో ఒకాయనతో నాకు బాగా స్నేహం అయిపోయింది. బోరు భరించ లేక ఆయన మంత్రపుష్పం, నమకం, చమకం, రుద్రం అందుకుని వరసలు తీస్తూ పఠించటం మొదలుపెట్టేడు. నాకు వచ్చిన సగం సగం మంత్రపుష్పంతో ఆయనకి నేను వంత కలిపేను. ఆయన పేరు మొన్న మొన్నటి వరకూ గుర్తు ఉండేది; ఇప్పుడు మరచి పోయేను. విమానంలో ఎవరు కావలిస్తే వారు కాక్‌పిట్ లోకి వెళ్ళి అక్కడ పైలట్ తో కబుర్లు చెప్పొచ్చు. సిబ్బంది కూడ స్నేహంగానే ఉండేవారు. కనుక నిజానికి అంత కష్టం అనిపించలేదు.

అప్పుడప్పుడు మన ఇండియన్స్ ప్రవర్తన చూస్తే కరెంటు తీగల మీద కూర్చున్న కాకుల ప్రవర్తన స్ఫురణకి వస్తుంది. తీగల మీద బారులు తీర్చి కూర్చున్న పిట్టలన్నీ ఒక్క సారి లేచి పైకి ఎగురుతాయి. అలా మనవాళ్ళకి అందరికీ ఒకే సారి బాత్‌రూం కి వెళ్ళవలసిన అవసరం వస్తుందనుకుంటాను. దీనికి కారణం ఏమై ఉంటుందో ఎవరినైనా సైంటిస్టుని అడగాలి. తెలతెల్లారే వేళకి విమానంలో ప్రజలు అందరూ విమానం తోక దగ్గర ఉన్న బాత్‌రూం బయట పెద్ద బారులు తీరేరు. బరువంతా వెనక్కి వెళ్ళిపోతే విమానం ముందు భాగం పైకి తేలి పోతోందని “మీదకి రావాలి, మీదకి రావాలి” అంటూ పైలట్ ఒకటే పోరు. మా తునిలో ఎర్రన్న కట్టిన ఒంటెద్దు బండి ఎక్కినప్పుడల్లా, “అయ్యగోరూ, కాడి తేలి పోతంది, తఁవరు మీదకి రావాలె,” అన్నప్పుడల్లా మా వెంకటలక్ష్మి అత్తయ్య (రాజమండ్రి వాస్తవ్యులు, శ్రీ కొల్లూరి సూర్య ప్రకాశరావు గారి భార్య), “నాయనా, నువ్వు అలా ఆశీర్వదిస్తూ ఉంటే, ఆ భగవంతుడి దయ కూడా కలిసొస్తే, మీదకే వస్తాం” అనేది. అలా, ఈ పైలట్ కూడ మన శ్రేయోభిలాషి కాబోలు, అలా ఆశీర్వదిస్తూనే ఉన్నాడు.

పేరిస్ లో రెండు రోజుల మకాంకి కావలసిన హొటేలుని ఎవ్వరూ ముందుగా రిజర్వు చేయించుకోలేదు. అప్పటికప్పుడు ఎయిర్‌పోర్టులో సందర్శకులకి సహాయం చేసే ఒక బల్ల దగ్గరకి వెళ్ళి, వాళ్ళ సహాయంతో హొటేలు సంపాదించేం. వాడు, నన్నూ, మరో ఇద్దరు తెలుగువాళ్ళనీ (వీళ్ళిద్దరిలో ఒకరు ఆడ, ఒకరు మగ, కాని వీరొక జంట కాదనే నా జ్ఞాపకం. వీళ్ళు మళ్ళా నాకు ఎక్కడా తారస పడలేదు. వీరి పేర్లు కూడా జ్ఞాపకం లేవు.) కలిపి ఒక స్వీట్, అంటే గదుల జంట, లో పడేసేడు. మన ఇండియాలో హొటేలు గదిలా విశాలంగానే ఉంది కాని ఏమీ సదుపాయాలు లేవు; రెండు మంచాలు,

ఒక సోఫా తప్ప. స్నానం చెయ్యటానికి బొత్తిగా సదుపాయం లేదు. దరిదాపు పద్దెనిమిది గంటలు ప్రయాణం లో ఉన్నామేమో అందరికీ స్నానం చెయ్యాలని ఆత్రుతగా ఉంది. కాని ఆ హొటేలు వాళ్ళు స్నానపు సదుపాయం గురించి అంతగా ఆలోచించినట్లు లేదు. “రోజూ స్నానం ఎందుకు, వారానికో సారి చేస్తే సరిపోదా?” అంటాడు రిసెప్షన్ దగ్గర కూర్చున్న గుమస్తా. వీడి కబుర్లు విన్న తర్వాత మన కంటె ఫ్రెంచి వాళ్ళకి వినాయకుడి మీద భక్తి ఎక్కువేమోనని అనిపిస్తోంది. “ఫ్రెంచి వాళ్ళకి వినాయకుడి మీద భక్తేమిటి, నా శ్రాద్ధం!” అని కొట్టి పారేసే ముందు నేను చెప్పబోయే కథ వినండి. వెనకటికి మానవులని సృష్టించిన తర్వాత బ్రహ్మ దేవుడు వినాయకుణ్ణి కేకేసి, “నాయనా! భూలోకం వెళ్ళి అక్కడ మనుష్యులతో వారానికో సారి భోజనం చేసి రోజూ తల స్నానం చెయ్యమని చెప్పు,” అని పురమాయించేడుట. మన వినాయకుడికి కొంచెం చెవుడు ఉందిట. చెప్పిన మాట సరిగ్గా వినిపించుకోక, “రోజూ భోజనం చేసి వారానికోసారి తల స్నానం చెయ్యాలి” అని చెప్పేడుట. ఫ్రెంచివాడు దాన్ని తు. చ. పాటించేస్తున్నాడు.

వేడినీళ్ళకి విడిగా డబ్బులివ్వాలంటే అలాగే ఇచ్చి వేడి నీళ్ళు తెప్పించుకుని మరీ స్నానం చేసేం. నాకు నిక్కచ్చిగా జ్ఞాపకం లేదు కాని వేడి నీళ్ళు బాల్చీ తో తెచ్చి ఇచ్చేడన్నట్లు గుర్తుంది. ఆ గదిలోనే ముగ్గురం సర్దుకుని పడుక్కున్నాం.

పేరిస్ లో చూడతగ్గ ప్రదేశాలు ఏవేమిటో నాకు తెలియదు కాని అందరూ లీడో అనే పేరుగల నైట్ క్లబ్బుకి వెళ్ళటానికే ఓటు వేసేరు. కనుక ఒక రాత్రంతా నైట్ క్లబ్బులు చూపించే టూరు తీసుకున్నాం. టికెట్టు ముప్ఫై డాలర్లో, నలభై డాలర్లో అయింది. ఇప్పుడు అదే లీడో కి వెళ్ళాలంటే ఏ రెండు వందలో అవుతుందిట. చూసిన మూడు నైట్ క్లబ్బులూ అద్భుతంగా ఉన్నాయి. వెళ్ళిన ప్రతీ చోటా తాగుడు, తిండీ ఉండేవి. నేను శాకాహారిని కనుక తినటానికి నాకు ఏమీ దొరికేది కాదు. కనుక షేంపెయిన్ తోనే కడుపు నింపుకోవటం మొదలు పెట్టేను. తాగుడే కాకుండా వేదిక మీద రకరకాల వినోద కార్యక్రమాలు చూసేం.

మరొక రోజు ఐఫిల్ టవర్ చూసి ఊళ్ళో ఇక్కడా, అక్కడా తచ్చాడేం. రాత్రల్లా షేంపెయిన్ తాగి ఉన్నానేమో, ఊరికే దాహం వేస్తూ ఉంటే మంచినీళ్ళు తాగుదామని రోడ్డు పక్క ఉన్న రెస్టరాంటు లోకి వెళ్ళి భాష రాదు కనుక ఏదో సంజ్ఞలు చేసి తాగటానికి కావాలని అడిగేను. వాడు ఒక రొట్టె, గ్లాసుడు వైను ఇచ్చి బిల్లు చేతిలో పెట్టేడు. మా తునిలో అయితే వెల్కం హొటలు కి వెళ్ళి మంచినీళ్ళు కావాలంటే, కంచు గ్లాసులో నాలుగు వేళ్ళూ లక్షణంగా ముంచి, ఆ గ్లాసుని వేళ్ళతో సహా బిందిలో ముంచి నీళ్ళిచ్చే వాడు. డబ్బులు ఎప్పుడూ అడగలేదు. మా పోలీసు నూతి దగ్గర అయితే, నాయురాలు చేదతో తోడిన నీళ్ళు చేతిలో పోసేది. ఇక్కడ వీళ్ళు నీళ్ళు కావాలంటే వైను ఇచ్చి డబ్బు అడుగుతున్నారు. వీళ్ళతో తగువు పెట్టుకుందామంటే భాష రాదు. ఏం చేస్తాం. బాగుండదని వాటికి డబ్బు కట్టేసి ఆ వైను తాగేసి మరొక చోట మంచినీళ్ళు తాగటానికి మళ్ళా ప్రయత్నించేను. వాడూ ఒక రొట్టె, గ్లాసుడు వైను, ఒక బిల్లూ ఇచ్చేడు. ఇలా మూడు చోట్ల మర్యాదలు చేయించుకునేసరికి వైను బాగా బుర్రకి ఎక్కినట్లుంది, దాహం మాట మరచి పోయి, తూగుతూ గదిలోకి వెళ్ళి పడుక్కున్నాను.

విమానం బేరుట్ లో ఆగి, అక్కడ నుండి జూలై 8 న బొంబాయి చేరుకుంది. బొంబాయిలో దిగిన తర్వాత బాగా గుర్తున్న విషయాలు కొన్ని ఉన్నాయి. ముందుగా కష్టంస్ వారి హాలు లోకి రాగానే విపరీతంగా ఉక్క. పైగా ఉచ్చ కంపు. తెల్ల వాళ్ళని చూసి చూసి ఉన్నానేమో ఇండియా వాళ్ళు మరీ నల్లగా కనబడ్డారో, లేక బొంబాయి విమానాశ్రయంలో నల్లగా ఉన్న వాళ్ళకి ఉద్యోగాలు సులభంగా దొరుకుతాయో నాకు తెలియదు కాని, మొత్తం మీద అంతా నల్లగా కనిపించేరు. నేనంటే పవిత్ర భారతీయుడినే కనుక దేవుడిచ్చిన రంగుకి వాళ్ళేమి చేస్తారులే అని ఊరుకున్నాను. కాని, మళ్ళా నాలుగేళ్ళ తర్వాత సకుటుంబంగా ఇండియా వచ్చినప్పుడు మా మూడేళ్ళ అమ్మాయి, సీత, “వీళ్ళంతా ఇంత నల్లగా ఉన్నారేంటి, డేడీ?” అంటూ ఇంగ్లీషులో ఏడిచేసింది. వాళ్ళ నలుపు రంగు కంటె అందరూ – ఆడా, మగా – ధుమ ధుమ లాడుతూ దుంపల్లా మూతులు పెట్టుకుని కనిపించేసరికి నాకే ఏడుపు వచ్చింది. నవ్వుతూ ఒక్క ముఖం కనిపించ లేదు. ఎన్నాళ్ళో పోయిన తరువాత ఇండియా తిరిగి వస్తున్నామని ఒక స్వాగత వాక్యం పలికిన పాపాన్న పోలేదు కష్టంస్ లో ఉన్న శాల్తీలు. ఇప్పటిలా గ్రీన్ లైను, రెడ్ లైను అంటూ ఏమీ ఉండేవి కావు; అన్నీ రెడ్ లైనులే. వాళ్ళకి తెలిసినదల్లా ప్రతీ పెట్టెనీ దొంగాళ్ళ పెట్టెలని శోదా చేసినట్లు శోదా చెయ్యటం. ఆ పెట్టెల్లో వాళ్ళ కంటికి ఆకర్షణీయంగా ఏదైనా

కనిపిస్తే దానిని మన ప్రమేయం లేకుండా తస్కరించటం. నా పెట్టె నిండా చీరలు చూసి నాకు చీరలెందుకని అల్లరి పెట్టేరు. వాళ్ళు విదేశాల నుండి ఇండియా వచ్చే ప్రతివారి మీదా కక్ష కట్టినట్లు, కోడింటికం పెడుతూన్నట్లు ప్రవర్తించేవారు. ఇండియా వెళదామని పడ్డ సరదా అంతా ఒక్క క్షణంలో హరించుకు పోయింది.

ఆ కస్టంస్ కష్టాల్లోంచి ఎలాగో బయట పడ్డాను. "డాలర్లు ఉంటే రూపాయలు ఇస్తాం" అంటూ ఎంతో మంది చుట్టు గుమిగూడేరు. ఆ రోజులలో బేంకులో మార్చుకుంటే డాలరుకి ఐదు రూపాయలు వచ్చేవి. నల్ల బజారులో దరిదాపు పన్నెండు రూపాయలు వచ్చేవి. నల్ల బజారంటే ఎక్కడికో గుడిసెలలోకి, గొడారాలలోకి వెళ్ళనక్కర లేదు. శాంటా క్రూజ్ లో, బట్ట బయట డాలర్లు పుచ్చుకుని రూపాయలు ఇచ్చేవారు. మన అబ్బరాజుకి జరిగిన అనుభవం నసాళంలోకి అంటుకుపోయిందేమో, నా చుట్టూ మూగిన వాళ్ళతో నా దగ్గర ఏమీ డాలర్లు లేవని ఎంత చెప్పినా వాళ్ళు వినకపోతే అక్కడ నుండి పారిపోయి, వాళ్ళని ఒదిలించుకున్నాను. అక్కడనుండి విక్టోరియా టెర్మినస్ కి వెళ్ళేను. రైలు టికెట్టు కొనుక్కుందుకి డబ్బు కోసం జేబులో చెయ్యి పెట్టి చూస్తే డాలర్లు ఉన్నాయి కాని రూపాయలు లేవు; కస్టంస్ వాళ్ళు పెట్టిన కోడింటికం హడావిడిలో డాలర్లని రూపాయలలోకి మార్చుకోవటం మరచి పోయేను. అక్కడ రూపాయలలోకి మార్చుకునే సదుపాయం లేదు. ఏమిటి చెయ్యటమా అని చుట్టూ చూస్తూ ఉంటే శాంటా క్రూజ్ లో నన్ను పట్టుకు వేల్లాడిన ఆసామీయే నా దగ్గరకి వచ్చి డాలరుకి పన్నెండు రూపాయలు ఇస్తానన్నాడు. వాడు నన్ను వెన్నంటి రైలు స్టేషన్ కి వచ్చేడన్న స్ఫూర్తి నాలో కలిగే సరికి ఒక్క నిమిషం భయం వేసింది. నాకు గత్యంతరం లేక వాడి దగ్గర రూపాయలు పుచ్చుకుని టికెట్టు కొనుక్కున్నాను – రిజర్వేషన్ లేని మూడవ తరగతి పెట్టెలో. బొంబాయి నుండి హైదరాబాదు, అక్కడ నుండి విజయవాడ. నేను విజయవాడ వచ్చే సరికి హౌరా మెయిల్ వెళ్ళిపోయింది. అక్కడ ఏదో పేసంజరు ఉంటే దానిలో తుని వెళ్ళేను.

నేను తునిలో దిగేసరికి రైలు స్టేషన్ లో మా వాళ్ళు ఒక్కళ్ళూ కనిపించ లేదు – అక్కడ పత్రికలు అమ్మే – బుక్ బైండరు పెరుమాళ్ళు కొడుకు – ఆచారి తప్ప. "మీరు హౌరా మెయిల్ లో వస్తున్నారనుకొని మీ వాళ్ళంతా పువ్వుల దండలు పట్టుకుని స్టేషన్ కి వచ్చేరండి" అని చెప్పేడు ఆచారి. అప్పటికి తునిలో

సైకిల్ రిక్షాలు వచ్చేసేయి కాని మమ్మల్ని చిరకాలంగా నమ్ముకుని మాకు బండి కట్టే అప్పన్న కొడుకు సివంచలం తన ఒంటెద్దు బండిలో తీసికెళ్ళి ఇంటిదగ్గర దింపేసేడు. ఇంటి దగ్గర అమ్మ నన్ను చూసి ఒక్క సారి వెక్కి వెక్కి ఏడ్చేసింది. “మావయ్యా! నీకోసం పువ్వుల దండలు పట్టుకుని హౌరా మైలుకి వచ్చేం.” అంటూంటే అందుకే ఏడుపు వచ్చిందో, నాలుగేళ్ళ తర్వాత అమ్మని, నాన్నగారినీ చూసినందుకు ఏడుపు వచ్చిందో నాకు ఇప్పుడు జ్ఞాపకం లేదు కాని ఈ వాక్యం రాస్తూ ఉంటే ఇప్పుడు నా కళ్ళు చెమ్మగిల్లి తెర మీద అక్షరాలు అలుక్కుపోయినట్లు కనిపిస్తున్నాయి.

సరిగ్గా రెండు నెలల తర్వాత, అనగా సెప్టెంబర్ 8 న, తిరిగి బొంబాయి వచ్చేను. ఎందుకైనా మంచిదని విమానం బయలుదేరే వేళకి బాగా ముందుగానే శాంటా క్రూజ్ చేరుకున్నాను. నేను ఇంకా విమానాశ్రయంలో ఇంకా పూర్తిగా అడుగు పెట్టకుండానే ఎవ్వరో చావు వార్త చల్లగా చెప్పేరు – Saturn Airlines దివాలా ఎత్తేసిందనిన్నీ, కనుక మమ్మల్ని తీసుకెళ్ళటానికి రావటం లేదనిన్నీని. నా ప్రాణాలు పైకెగిరిపోయాయి. అక్కడ ఎవ్వరిని అడిగినా, ఆ విమానం కంపెనీ పేరే ఎరగం పొమ్మన్నారు. కర్తవ్యం తెలియక చుక్కాని లేని పడవలా ఇటూ, అటూ తిరుగుతూ ఉంటే ఈ charter కి వ్యవహర్త అయిన సర్దార్‌జీ కనబడ్డాడు. అతని దగ్గరకి పరిగెత్తుకు వెళ్ళి నేను విన్న విషయం నిజమేనా అని అడిగేను. అతను నన్ను చెయ్యి పట్టుకు తీసుకెళ్ళి దూరంగా tarmac మీద వాలి ఉన్న Saturn Airlines వారి విమానాన్ని చూపించేడు!

# కొత్త కాపురం

మన పవిత్ర భారతదేశంలో సరిగ్గా రెండు నెలలు ఉండి, పురోహితుల చేత 'మాంగల్యం తంతునాం' చదివించి, ఒక అమ్మాయితో కలసి ఏడడులు వేసి తిరిగొచ్చాను. (ఈ పెళ్ళి కథ ఇండియాలో జరిగిన అనుభవం కనుక ఈ అమెరికా అనుభవాలతో కలిపి చెపితే అలంకారదోషం అని చెప్పటం లేదు.) కొత్త కాపరానికి ఇల్లూ, వాకిలీ, ముంతా, తప్పేలా, మొదలైన పటాటోపం కావాలి కదా. అదృష్ట వశాత్తూ యు. సి. ఎల్. ఎ. వారు వివాహితులైన విద్యార్థుల నిమిత్తం కొన్ని ఇళ్ళు కొని, వాటిని సరసమైన ధరలకి అద్దెకి ఇచ్చేవారు. ఈ రకం ఇళ్ళు రెండు చోట్ల ఉండేవి. కాలేజీ ప్రాంగణానికి ఆనుకుని గేలే ఎవెన్యు మీద నెలకి ముప్పై డాలర్ల అద్దెకి కొన్ని ఇళ్ళు ఉండేవి. వీటిని "ఇళ్ళు" అనేకంటె "కొంపలు" అనడం సమంజసమేమో. శ్రీనాధుడు చెప్పిన పద్యంలా పశుల రేణముతో కాకపోయినా ఆ దోసెడు కొంపలలోనే కొన్ని కుటుంబాలు ఉండేవి. కాలేజీని ఆనుకుని ఉన్న ఈ ఇళ్ళు కారు లేని వాళ్ళకి ఎంతో సదుపాయంగా ఉండేవి. ఈ ఇళ్ళల్లోనే ఒక దానిలో గీత, సుందరరామన్ ఉండేవారు. నా దగ్గర కారుంది కనుక కేంపస్ కి కొంచెం దూరంగా ఉన్న ఇళ్ళ వైపే మొగ్గు చూపేను. నేనంటే మొగ్గు చూపుతాను కానీ, యూనివర్సిటీ వాళ్ళు మొగ్గు చూపొద్దూ? అప్పుడు మా గురువు గారి దగ్గర పనిచేసే మాయ కలుగజేసుకుని, ఎవ్వరికో ఫోను చేసి నాకు ఒక ఎపార్ట్‌మెంటు వచ్చేలా చూసిపెట్టింది. అమ్మాయిలంటే అలా ఉండాలి. అందానికి అందం, మంచితనానికి మంచితనం. ఉపకారం అంటే ఊళ్ళోంచి వెళ్ళిపోయే ఈ ప్రపంచంలో మాయ నిషినగ లాంటి యువతులు అరుదు.

నాకు దక్కిన ఈ లోవరి (apartment, వీటినే married student housing అనేవారు) శేన్ డియాగో ఫ్రీవే (దీనినే Interstate 405 అని కూడ అంటారు) ని ఆనుకుని, నేషనల్ బులవార్డ్ కీ, పాంస్ బులవార్డ్ కీ మధ్య, ఇటువైపు సాటెల్ బులవార్డ్ వెంబడీ, అటువైపు సెపల్‌వడా బులవార్డ్ వెంబడీ బారులుతీరి ఉన్న వాటికల్లో ఒకటి. ఈ రెండు ఇళ్ళ వరసల మధ్యా ఫ్రీవే ఉందన్నమాట. ఆ రోడ్డు చేసే రొదకి భయపడి అక్కడ ఎవ్వరూ నివసించటానికి ఇష్టపడక పోతే మా యూనివర్సిటీ వారు చవగ్గా వచ్చేయని కొనేసి ఉంటారు. కాని ఏమాట కామాటే చెప్పుకోవాలి. ఆ గేలే ఎవెన్యు మీద ఉన్న వాటితో పోల్చితే ఇవి స్వర్గతుల్యమే. ఈ గృహ వాటికలో ఒకొక్క భవనం లో నాలుగేసి లోవరుల

చొప్పున ఉండేవి; కింద రెండు లోవరులు, పైన రెండు లోవరులు ఉండేవి. వీటినే ఇంగ్లీషులో Quadruplex అంటారు. కాని ఈ వాటిక అంతటికీ రెండే రెండు బంగళాలు ఉండేవి. బంగళా అంటే మేడ మీద వాటాలు ఉండవు; కిందని రెండు వాటాలు ఎదురెదురుగా అతుక్కుపోయిన జంట కవలల్లా ఉండేవి. సాంకేతిక భాషలో చెప్పాలంటే ఇవి Duplex లు, లేదా జంట simplex లు అన్నమాట. కనుక వీటికి గిరాకీ ఎక్కువ. అంతా ఇవి కావాలని ఎగబడేవారు. వడ్డించే మాయ మన పక్కని ఉన్నప్పుడు మనం బంతిలో ఎక్కడ కూర్చుంటేనేమిటి. ఆర్హతల మీద కాకుండా రికమెండేషన్ మీద దొరికిన ఇల్లు కనుక అన్నిటి కంటె మంచిదయిన బంగళానే నాకు కేటాయించేరు! నేనేదో కోతలు కోసేస్తున్నానేమోనని మీరు ఇప్పుడు పనిగట్టుకు తనిఖీ చెయ్యటానికి లాస్ ఏంజిలిస్ వెళ్ళబోకండి. కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి అని రెండు రకాలు ఉంటే సంఘానికి శ్రేయోదాయకం కాదనో ఏమో, ఇప్పుడు ఈ బంగళాల మీద మరొక అంతస్తు వేసేసి అన్నిటిని ఒకే సమానమైన స్థాయిలోకి దింపేసేరు. ఇక్కడ మనవాళ్ళు నేర్చుకోవలసిన పాఠం ఒకటి ఉంది. ఇండియాలో ఐ. ఐ.టి. లు, ఆల్ ఇండియా ఇన్స్టిటూట్ అఫ్ మెడికల్ సైన్సెస్ వంటి సంస్థల స్థాయి మిగిలిన విశ్వవిద్యాలయాల స్థాయి కంటె మెరుగ్గా ఉన్నాయి కనుక వాటికి పోటీ ఎక్కువైంది కదా. ఈ పోటీలు, ఈ కన్నె్రలూ తగ్గాలంటే మిగిలిన విద్యా సంస్థల స్థాయిని పెంచాలి. లేదా – ఆహాఁ, కుశాగ్రబుద్ధులండీ మీరు! – పైనున్న వాటిని కిందకి దింపాలి. ఈ రెండో ప్రత్యామ్నాయం చవక కనుక, భారత ప్రభుత్వం అటువైపే మొగ్గుతోంది. భారత ప్రభుత్వం వారి కిటుకు యు. సి. ఎల్. ఏ. వాళ్ళకి ఎలా తెలిసిందబ్బా?

సంపాదకీయాలతో దారి తప్పుతున్నాను కదూ? ఈ ఎపార్ట్‌మెంట్లు అన్నీ చూడడానికి శుభ్రంగానే ఉండేవి. సరసమైన అద్దె; నెలకి అరవై డాలర్లు! విద్యుత్తు, నీళ్ళ ఖర్చూ గృహస్తుల బాధ్యతే. అన్నీ బాగానే ఉన్నాయి కాని ఈ ఇళ్ళల్లో ఫర్నిచరు ఉండేది కాదు. రెఫ్రిజిరేటరు కాని, స్టవ్ కాని, ఏవీ ఉండేవి కాదు. అన్నీ మేమే సమకూర్చుకోవాలి. మింగ మెతుకు లేదు కాని మీసాలకి సంపెంగ నూనె అన్నట్లు, మా జీతాలు మా బ్రతుకులకే బొటాబొటీగా సరిపోయేవి. ఇప్పుడు మరొక శాల్తీని కూడ పోషించాలాయె. ఫర్నిచరు ఎక్కడ కొనుక్కుంటాం?

**ఇంటికి ఫర్నిచరు సంపాదించిన వైనం:**

ఈ సందర్భంలో మాకొక దేవత లాంటి వ్యక్తి దొరికింది. చూడ్డానికి చింపిరి జుత్తుతో పిచ్చి దానిలా ఉండేది ఆవిడ. పేరు మిసెస్ మస్కొస్కీ. ఆమె మా యూనివర్శిటీలో పని చేసే ఫిజిక్సు ప్రొఫెసరు గారి భార్య! వాళ్ళు మాలాగే మా కంటె ముందు ఎప్పుడో — ఏ పోలండు నుండో – అమెరికా వచ్చి ఉంటారనుకుంటాను. మాలాగే విద్యార్థి దశలో కష్టాలు పడ్డారనుకుంటాను. విద్యార్థులకి సహాయం చెయ్యాలనే తపన ఆమెకి చాల గాఢంగా ఉండేది. ప్రొఫెసరు గారి భార్యేమో ఆమెకి ఆ చుట్టుపట్ల ఉన్న బ్రెంట్‌వుడ్, బెల్ ఎయిర్ వంటి సామంతపు శివార్లలో ఉన్న ప్రజలని కొంతమందిని తెలుసు. ఈ శివార్లలోనే హాలీవుడ్ తారలు, నిర్మాతలు, దర్శకులు, వగైరా ఉండేవారు. ఈ పరిచయాలని పురస్కరించుకొని ఆమె వారి వారి ఇళ్ళల్లో వారికి అక్కరలేని వస్తువులని సేకరించి తన గరాజ్ లో దాచేది. ఇది, అది అని లేదు. కాఫీ పెట్టుకొనే పాత్రలు, కప్పులు, సాసర్లు, గ్లాసులు, భోజనాల బల్లలు, కుర్చీలు, రిఫ్రిజిరేటర్లు, అవెన్లు, రేంజి లు — ఇలా ఒకటేమిటి, మన నిత్యావసరాలకి పనికి వచ్చే వస్తువులన్ని సేకరించేది ఆమె. మనం వారింటికి వెళ్ళి, ఆమె గరాజ్‌లో జొరబడి మనకి కావలసిన వస్తువులు ఏరుకొని పట్టుకుపోవడమే!

నాలాంటి విద్యార్థులు ఎంతో మంది ఉండేవారు గనుక శనాదివారాలు వచ్చేయంటే, వీరంతా తమ తమ కార్లకి ట్రెయిలర్లు తగిలించుకుని మిసెస్ మస్కొస్కీ ఇంటి ముందు వాలేవారు. అదొక చేపల బజారులా ఉండేది. నా అవసరం కదా. నేనూ ఒక రోజు వెళ్ళేను. నేను వెళ్ళేసరికల్లా, నా దురదృష్టం కొద్దీ మిసెస్ మస్కొస్కీ చాలా కోపంగా ఒక పక్కా, విచారంగా ఒక పక్కా ఉన్నారు. సంగతి ఏమిటా అని వాకబు చేసేను.

మిసెస్ మస్కొస్కీ కి పెంపుడు జంతువులంతే ఇష్టం. ఆవిడ ఇంటి నిండా పిల్లులు, కుక్కలు, పంజరాలలో చిలకలు — చిన్న జంతు ప్రదర్శన శాల లా ఉండేది. ఒకటి కాదు, రెండు కాదు. ఇంట్లో ఎక్కడ చూసినా – ఇక్కడో మంద! అక్కడో మంద! పిల్లులు, కుక్కలు అయితే అప్పుడప్పుడు అలా కాట్లాడుకుంటూనే ఉండేవి. మిసెస్ మస్కొస్కీ మధ్యవర్తిలా వాటిని సమాధాన పరుస్తూనే ఉండేది. కాని ఆ రోజు మిసెస్ మస్కొస్కీ పెంపుడు పిల్లి ఒకటి ఆమె పెంపుడు ఎలకలలో ఒక దానిని తినేసింది! ఎలక చచ్చిపోయిందని దుఃఖం ఒక పక్క, పిల్లి తన చెప్పుచేతలలో ఉండకుండా క్రమశిక్షణ

వ్యతిక్రమించిందని  మరొక పక్క ఆవేదన. ఇలా వ్యగ్రతతో కుములుతూన్న ఆమెని కొద్దిగా పరామర్శించి, నా గోడు చెప్పుకున్నాను.

"హాలీవుడ్ లో ఒక డైరెక్టరు గారింట్లో మంచి సోఫా సెట్టు, కాఫీ టేబులు ఉన్నాయి తెచ్చుకో" అని ఆయన చిరునామా ఇచ్చింది. నాకు సాయం చెయ్యటానికి అక్కడ చేరిన విద్యార్థులలో మరొకరిని తోడు పంపింది. ఈవిడ ఏ మిలటరి లాజిస్టిక్స్ లోనో పని చెయ్యవలసిన మనిషి, ఈ ప్రొఫెసరు ని పెళ్ళాడి ఇక్కడ ఇలా రాటవుతోంది కాని. తెల్ల పాలరాయి రంగులో, మెత్తగా, నున్నగా ఉండి ఎంతో ముద్దొస్తూ ఉన్న ఆ సోఫా ని చూసి ఇలా ముచ్చట పడిపోయేను. అది ఎంత నున్నగా ఉందంటే దాని మీద కూర్చుంటే కిందకి జారిపోయేవాళ్ళం. అందుకనే కాబోలు, ఆ సోఫాని ఆనుకొని కింద కూర్చునేవారు మా ఇంటికొచ్చిన అతిథులంతా!

ఇలాగే ఒక సారి సోఫాలు; మరొక సారి మంచం, పరుపు; మరొక సారి రిఫ్రిజిరేటరు, స్టవ్; మొదలైనవి సమకూర్చుకొని నా శ్రీమతి అమెరికా చేరుకునే వేళకి ఇల్లు సదుపాయంగా తయారు చేసేను. నవంబరు నెలలో ఉమ, రామదాసు గారి భార్య లక్ష్మి, ఇద్దరు – ఒకరికొకరు తోడుగా – ఇండియా నుండి అమెరికా వచ్చేరు. అప్పటికి నేను ఉమని ఇండియాలో వదిలిపెట్టి ఏడు వారాలైంది, రామదాసు గారు తన భార్యని ఇండియాలో వదలిపెట్టి ఏడేళ్ళు అయింది!! ఇప్పటికి ఆర్థికంగా నిలదొక్కుకుని లక్ష్మిని తీసుకురాగలిగేరు, ఆయన!

**గృహప్రవేశం:**

పట్టుమని పద్దెనిమిది ఏళ్ళయినా నిండేయో లేదో, పాపం! నా అన్న వాళ్ళందరినీ వదిలేసి ఎంతో దూరం నుండి వస్తోంది కదా! ఇంటికొచ్చేసరికి మంచి భోజనం  పెడితే కొత్త పెళ్ళాం సంతోషిస్తుందన్న ఊహతో ఎయిర్‌పోర్టు కి వెళ్ళే ముందే వంట చేసేసి మరీ బయలుదేరేను. నేను కొంచెం కంగారు పడే రకమని పసిగట్టేసినట్లున్నాడు, నా సహాధ్యాయి – వెస్లీ కాక్స్. "నువ్వా కొత్త పెళ్ళికూతురిని

తీసుకొస్తూన్న హడావిడిలో కారుని ఏ చెట్టుకో గుద్దేస్తావో ఏమిటో నేను మిమ్మల్నిద్దరినీ ఇంటికి తీసుకొస్తాను" అంటూ నాతో ఎయిర్ పోర్టుకి వచ్చేడు.

ఇద్దరినీ ఇంటికి తీసుకొచ్చి, దింపేసి, వెంటనే వెళ్ళిపోకుండా లివింగ్ రూం లో తెల్ల సోఫా జారుతున్నాదని నేల మీద తిష్ట వేసేడు, కబుర్లు చెబుతూ. ఎంతకీ వెళ్ళడే! వాడిని వెళ్ళగొట్టడం తెలియక షెర్రీని టెలిఫోనులో పిలచి చెప్పేను. ఆమె నా బాధ అర్థం చేసుకుని, వెస్లీకి టెలిఫోను ఇమ్మని, వాడికి నాలుగు చివాట్లు వేసింది! వాడు నవ్వుకుంటూ ఇంటికి వెళ్ళిపోయేడు.

ఇంట్లో అడుగు పెడుతూనే మన హాలీవుడ్ సోఫా, వగైరా చూసి నా శ్రీమతి సర్టిఫికేటు ఏదీ ఇవ్వలేదు కానీ సంతోషించినట్లే కనబడింది.

"వంట వండేసేను, తింటావా?" అని అడిగేను.

ఇంటికి రాగానే వంట పని అప్పుడే తగల లేదు కదా అని నిజంగా సంతోషించినట్లుంది, కొత్త పెళ్ళికూతురు. వెంటనే టేబుల్ మీద ఉన్న పళ్ళెంలో ఇంత అన్నం, కూర పెట్టుకుని, చక చక కలుపుకుని ఒక ముద్ద నోట్లో పెట్టుకుని ఎందుకో లేచి వంట గదిలోకి వెళ్ళింది.

"నీకు ఏమిటి కావాలో నాకు చెప్పు, తెచ్చి పెడతాను," అన్నాను. కొత్తగా ఇంటికొచ్చిన పెళ్ళానికి ముగుడు గాడు ఆ మాత్రం సేవ చేస్తే తప్పు లేదు కదా. పైపెచ్చు నా అప్ప చెల్లెళ్ళు ఎవరూ చూడటం లేదు కదా!
అమ్మాయి తిన్నగా సింకు దగ్గరకి వెళ్ళి, నోట్లో ఉన్న ముద్ద సింకులో ఉమ్మేసి, మారు మాట్లాడకుండా వంట మొదలెట్టింది. ఇలాంటి నాటకీయత ప్రదర్శిస్తేనే నాకు కోపం వస్తుంది.

నేను హర్టయానంటే అవనూ మరి? మీరే చెప్పండి.

అయ్యా! నేను నిఝం చెబుతున్నాను. "సరస్వతి" తోడు. అప్పటికి గడచిపోయిన నాలుగేళ్ళూ నా వంట నేనే వండుకుని తిన్నాను. అసలు కంప్యూటర్లతో పాటు వంట మీద కూడా రిసెర్చి చేసేను. ఇప్పటికీ తరవాణీ కుండ ఎలా స్టార్టు చెయ్యాలో చెప్పగలను – స్టార్టు చెయ్యమంటే చెయ్యలేను, చెప్పగలను. ఆఖరికి పూతరేకులు చెయ్యటం కూడా చెప్పగలను!

"పోనీ కాఫీ కలిపి ఇచ్చేదా, అందాకా?" అన్నాను ఆత్రుతగా.

"మీరు డిట్రోయిట్ లో ఉన్నప్పుడు మీ అన్నయ్య గారికి కలిపిచ్చిన కాఫీలో పంచదారకి బదులు ఉప్పేసేరటగా!"

"నీకు అప్పుడే ఆ వార్త కూడా అందిపోయిందీ? నీకెవరు చెప్పేరు?"

"ఒకళ్ళు చెప్పాలేంటి. అనకాపల్లిలో అంతా చెప్పుకుంటున్నారు!"

హతవిధీ! పిల్లి పాలు తాగినట్లు  మేము కళ్ళు మూసుకుని ఈ అమెరికాపిల్లిలో చేసిన పనులన్నీ అనకాపల్లి వరకూ పాకిపోతున్నాయన్నమాట!

ఆనాటి నుండి ఈ నాటి వరకు నేను వంటింట్లో జొరబడి చెయ్యి కాల్చుకో లేదనుకొండి. ఇంట్లో పనులన్నీ తనవి, బయట పనులన్నీ నావి.

**కారు డ్రైవింగు నేర్పిన వైనం:**

ఒక రోజు కారు తోలటం నేర్చుకుంటానని ముచ్చట పడింది, నా శ్రీమతి. గంటకి రెండున్నర డాలర్లు గణిస్తున్న నేను గంటకి పది డాలర్లు ఇచ్చి పాఠం నేర్పించే  తాహతు లేక, నేనే నేర్పటానికి సిద్ధపడ్డాను – నా ఫోక్స్‌వేగన్ మీద! అది స్టిక్ షిఫ్టు కారు! ఈ మధ్య తండోపతండాలుగా మన వాళ్ళు ఇండియాలో

పెళ్ళిళ్ళు చేసుకుని, కొత్త పెళ్ళాలని తీసుకొస్తున్నారని విన్నాను. ఇప్పటికప్పుడే ఆలశ్యం అయిపోకపోతే వీళ్ళందరికీ ఒక చిన్న సలహా. ఉచితంగా ఇస్తున్నాను. నా సలహా మీకు నచ్చి, ఏకలవ్యుడిలా గురుదక్షిణ ఇవ్వ దల్చుకుంటే మాత్రం ఇవ్వండి — మొహమాటం పడకుండా పుచ్చుకుంటాను. అప్పు చేసైనా డ్రైవింగు స్కూలుకి పంపించి మరీ నేర్పించండి కాని, మీరు పొరపాటున కూడా మీ శ్రీమతికి డ్రైవింగు నేర్పకండి. చేసిన పొరపాటుకి ఇప్పటికీ అలా ఆరారా లెంపలు వేసుకుంటూనే ఉన్నాను. నేర్పటం మొదలు పెట్టేక ఎంత నిగ్రహించుకుందామని అనుకున్నా "బ్రేకు వెయ్యి! గుద్దేస్తున్నావ్!" అన్న మాటలు నిదానంగా, శాంతంగా రమ్మంటే ఎలా వస్తాయి? ప్రాణ రక్షణ కోసం 'ఎడ్రీనలిన్' అనే హార్మోను ఒక్క ఉదుటున, పేద్ద మోతాదులో, రక్త ప్రవాహం లోకి ప్రవేశించినప్పుడు ఇటువంటి పెడ బొబ్బ అసంకల్ప ప్రతికార చర్యలా వచ్చేస్తుంది.
"ఏమిటా పెడ బొబ్బలు? మీరేమీ నేర్పక్కర లేదు. నేను సత్యనారాయణని అడుగుతాను," అని కారు దిగిపోయింది.

"---"
మాజేటి సత్యనారాయణ మాకు నాలుగడుగుల దూరంలో ఉండేవాడు. నాకు కంగారు ఎక్కువన్నాడు. కోపం నిగ్రహించుకోవాలన్నాడు. స్టిక్ షిఫ్ట్ కారు మీద నేర్పటానికి ప్రయత్నించటం తప్పన్నాడు. తన ఆటోమేటిక్ ట్రాన్స్మిషన్ కారు మీద చిటికలో నేర్పేసి తీసుకొస్తానని తీసుకెళ్ళేడు. ఇలాంటి పరిస్థితులలో ఆదుకునేవాళ్ళే కదా స్నేహితులంటే!

మూడు నిమిషాల్లో తిరిగొచ్చేసేరు, ఇద్దరూ!

"చూశారా! ఎలా నేర్పేసేనో!" అని గప్పాలు కొడుతూ దిగలేదు. దమ్మిడీ కాసంత ముఖంతో కారు దిగేడు సత్యనారాయణ! తర్వాత అడిగితే చెప్పేడు.
"మీ కంటె మా వారే నయం. ఆయన అరిస్తే తిరిగి అరవగలను," అని చెప్పి సత్యనారాయణని ఉద్యోగంలోంచి పీకేసిందిట!

ఈ కథనం అంతా విని, "కాన్ఫిడెన్సు ఉండాలండీ" అన్నాడు రామేశ్వరరావు, ఉరఫ్ వేదకుమారి మొగుడు – మేము పడుతూన్న తంటాలు చూసి. కాబోలు అనుకున్నాను. వారం రోజులు తిరక్కుండా హ్యూస్ మార్కెట్ లోంచి నేషనల్ బులవార్డు మీదకి ఎడం పక్కకి తిరుగుతూ తిన్నగా వెళ్ళి టెలిఫోను రాటని గుద్దేసేడు, రామేశ్వర్రావు. కాన్ఫిడెన్సు తో కారుని తోలి, తలకి బొప్పి కట్టించుకుని, కన్ను లొట్ట పోయినంత వరకూ వచ్చిన తర్వాత కథని కంచికి పంపేడాయన.

**కోర్టుకెక్కిన వైనం**

నేను అమెరికా వచ్చి దరిదాపు ఐదేళ్ళు అయినా ఇంతవరకు టెలివిషన్ కొనుక్కోవలసిన అవసరం రాలేదు. ఉమ కాపురానికి వచ్చిన తర్వాత టెలివిషన్ అత్యవసరం అయింది. తనా దేశానికి కొత్త! నాకంటే స్నేహితులు ఉన్నారు కాని తనకి స్నేహితులు, పరిచయస్తులూ ఎవ్వరూ లేరు. నేను పొద్దుట ఏ తొమ్మిదింటికో స్కూలుకి వెళ్ళి సాయంత్రం ఐదింటికి వస్తూ ఉంటే ఇంటి దగ్గర గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడం పరమ బోరు కదా. అందుకని ఒక టెలివిషన్ కొనడానికి నిశ్చయించేం. పందొమ్మిదంగుళాల తెలుపు-నలుపు టెలివిషన్ నూట ఇరవై డాలర్లు. నూట ఇరవై డాలర్లు ఒక్క టెలివిషన్ మీద ఖర్చు పెట్టటానికి ప్రాణం ఒప్పక ఒక పాతది కొనటానికి నిశ్చయించేం. శాంటా మానికా బులవార్డ్ మీద ఒక టెలివిషన్ రిపేర్ షాపు వాడు పాతిక డాలర్లకి ఒక సెట్టు అమ్మకానికి పెట్టేడు. చూడ్డానికి ఎంతో ముద్దొస్తోంది. రోజ్ వుడ్ తో చేసిన కేబినెట్. దానికి రెండు తలుపులు. ఆ కలప మీద చేసిన పనితనానికే పాతిక డాలర్లూ ఇవ్వొచ్చు! షాపు వాడు వాల్యూం, కాంట్రాస్ట్, బ్రైట్‌నెస్, ఫోకస్, వర్టికల్ అంటూ సవాలక్ష మీటలు ఎలా వాడాలో అన్నీ చూపించేడు. కేబుల్ లేదేమో, రేబిట్ ఇయర్స్ అని ఒక రకం ఎంటెనా ఉండేది.

బొమ్మ వస్తోంది. శబ్దం వినిపిస్తోంది. చిన్న చిన్న సవరింపులతో ఈ బొమ్మ జరజరా పైకీ, కిందకీ వెళ్ళిపోకుండా నిలకడగానే ఉంది. నా ఆర్. సి. ఎ. అనుభవం అంతా ఉపయోగించి అది మంచి టి. వి. అనే నిర్ధారించుకుని కొని ఇంటికి పట్టుకొచ్చేం. ఇంటి దగ్గర ఒక రోజు బాగానే పని చేసింది. రెండవ రోజు బొమ్మకి నిలకడ పోయింది. ఎంటెనాని చేత్తో పట్టుకుని పక్కన నిలబడితే బొమ్మ నిలకడగా

వచ్చేది. చెయ్యి ఒదిలేమో బొమ్మ పైకి పరిగెత్తటం మొదలెట్టేది. మూడవ రోజు బొమ్మ కనిపించటం మానేసి తెర మీద ఏటవాలుగా గీతలు కనిపించటం మొదలైంది. నాలుగో రోజున శబ్దం ఆగిపోయింది. ఐదోరోజున టప్ మని చప్పుడై అస్సలు బొమ్మే రాలేదు, శబ్దం వినిపించనూ లేదు. నా చిన్నప్పుడు నేర్చుకున్న

Solomon Grundy
Born on Monday
Christened on Tuesday
Married on Wednesday
Took ill on Thursday
Worse on Friday
Died on Saturday
Buried on Sunday.

పాటలోలా ఈ టెలివిషన్ కనీసం వారం రోజులైనా పనిచేయ్యలేదే అని , బాధ పడి ఆ షాపు వాడి దగ్గరకి వెళ్ళి అడిగేం. వాడు మరో పది డాలర్లు ఇస్తే "ఆ 'చెత్త' టి. వి. తీసుకుని బాగా పని చేసేది మరొకటి ఇస్తా" అనన్నాడు. వాడు మొదట అమ్మిన టి. వి. చెత్తది అని వాడే ఒప్పుకుంటూన్నా గొర్రె కసాయి వాణ్ణి నమ్మినట్లు నమ్మి మరో పది ఇచ్చేం. ఇంటికొచ్చిన తర్వాత ఈ రెండోదీ పని చెయ్యలేదు. మాకు బుద్ధి వచ్చింది. మా డబ్బులు మాకు ఇచ్చేయమన్నాం. డబ్బు తిరిగి ఇవ్వను; కావలిస్తే మరి కొంచెం డబ్బు తీసుకుని బాగు చేస్తానన్నాడు. తడిపి మోపెడైనట్లు తయారవుతూన్న ఈ ఖర్చు చూసి మొదట్లోనే కొత్త టి. వి. కొనుక్కోవలసిందే అని చింతించేం. కాని చెత్త టి. వి. అంటకట్టిన ఆ షాపువాడి మీద కోపం తగ్గలేదు.

మాకు లాస్ఏంజిలిస్ లో ఒక హోస్టు ఫేమిలీ ఉండేది. అప్పటికి నేను అమెరికా వచ్చి ఐదేళ్ళు అవుతోంది. నేనే మరొకరికి హోస్టుగా ఉండగలిగే అనుభవం సంపాదించేను. కాని ఉమకి ఇంకా అంతా కొత్త కనుక తనకి కూడా ఈ హోస్టు ఫేమిలీ అనుభవం చవి చూపించాలనే ఉద్దేశంతో హోస్టు

ఫేమిలీ కావాలని అడిగి సంపాదించేను. వారు ఫ్రెడ్, మిరియం కోయన్ (Fred, Miriam Cohen) అనే జ్యూలు. వారింట ఒకనాడు భోజనం చేసిన తర్వాత Yahtzee ఆట ఆడుతూ మా టెలివిషన్ అనుభవం అంతా ఒక కథలా చెప్పేను వారిద్దరికీ – కబుర్లు చెప్పటానికి ఏదో ఒక విషయం ఉండాలి కదా అన్న ధోరణిలో. మిరియంకి ఆ టెలివిషన్ కొట్టు వాడికి బుద్ధి చెప్పాలన్న సంకల్పం కలిగింది. "వాడి మీద దావా వేద్దాం" అంది. దావా అనగానే నాకు భయం వేసింది. మరేం భయం లేదని Small Claims Court లో దావా వేయించింది ఆమె – వెనకనుండి ధైర్యం చెబుతూ.

కోర్టుకి వెళ్ళేను. షాపు వాడు రాలేదు కనుక తీర్పు నాకు అనుకూలంగా వచ్చింది. నేను టి. వి. మీద పెట్టిన ముప్ఫై ఐదు డాలర్లూ, నాకైన కోర్టు ఖర్చులూ నాకివ్వాలని తీర్మానించేరు కోర్టువారు.

కోర్టు కాగితాలు తీసుకుని విజయ గర్వంతో టి. వి. షాపు వాడి దగ్గరకి వెళ్ళేను.

"షాపు వాడు నన్ను చాలా చులకన చేసి మాట్లేడేడు. నేను తొడుక్కున్న చొక్కా చవక రకం రెడీ మేడ్ చొక్కా అన్నాడు; తను తొడుక్కున్నది కస్టం మేడ్ అన్నాడు. ఇలా ఏవేవో మాట్లాడి చివరికి 'నీ దిక్కున్న చోట చెప్పుకో' అన్నంత పని చేసేడు. "మళ్ళా ఇటు వచ్చేవంటే తంతాను," అని బెదిరించేడు. "తన్నిస్తాను!" అనుంటే భయపడి ఉండేవాడిని.

జరిగినదంతా మిరియంతో చెప్పేను. ఆమె కి చాలా కోపం వచ్చింది. నన్ను మళ్ళా కోర్టుకి తీసుకెళ్ళింది. కోర్టుకి మరో ఐదు డాలర్లు కడితే పోలీసులని పంపిస్తామన్నారు. ఇప్పటికే షాపువాడు ముప్ఫై ఐదు కబళించేడు. కోర్టు ఖర్చులు పది అయేయి. ఇప్పుడు మరో ఐదు. నిండా మునిగినవాడికి చలేమిటి? కానీమన్నాను. కోర్టు వాళ్ళు మరో కాగితం ఇచ్చేరు. "పోలీసులేరీ?" అని అడిగేను.

ఈ కాగితం పోలీసు స్టేషన్ కి తీసికెళ్ళి, పోలీసుకయే కాలానికి గంటకి, మనిషికి పది డాలర్లు చొప్పున కడితే వాళ్ళు ఇద్దరు నాతో వస్తారుట. వచ్చి, షాపువాడి గల్లా పెట్టె తెరిపించి నా డబ్బు నాకిప్పిస్తారుట. ఈ వ్యవహారాన్ని Tapping of the Till అంటారుట. నా శ్రాద్ధం అనరూ?

అలాగే డబ్బు కడతాను అన్నాను. అప్పుడు ఒక పోలీసావిడ నా మీద దయ తలచి నాకు తెలియని ధర్మ సూక్ష్మం మరొకటి చెప్పింది. గళ్ళా పెట్టె తెరచిన తర్వాత అందులో డబ్బేమీ లేక పోతే నా నెత్తి మీద చెంగే అని చెప్పింది. ఈ వ్యవహారం అంతా తెమిలేసరికి నాకు ఒక వంద డాలర్ల పైనే క్షవరం అయ్యే సూచనలు బాగా కనబడ్డాయి. అప్పుడు మిరియం ఒక సలహా చెప్పింది.

మిరియం సలహా ప్రకారం నేను, ఆమె మళ్ళా షాపువాడి దగ్గరకి వెళ్ళేం. మిరియం ఆ షాపు వాడితో, "నాయనా! పోలీసులు వస్తున్నారు. వాళ్ళు వచ్చే లోగా నువ్వు మాతో రాజీ పడి మాకు అయిన ముప్పై అయిదూ, పది డాలర్లు కోర్టు ఖర్చులూ ఇచ్చేవా సరే సరి, లేక పోతే నీకు పోలీసులకయ్యే ఖర్చులు కూడా తగుల్తాయి" అని చెప్పింది. వాడే కళనున్నాడో మా మొహాన్న నలభై అయిదు డాలర్లు పారేసేడు.

అక్కడనుండి తిన్నగా శాంటా మానికాలో ఉన్న సియర్స్ కి తీసికెళ్ళి సరి కొత్త టెలివిషన్ నెలకి పదిహేను డాలర్ల చొప్పున వాయిదాల పద్ధతి మీద కొనిపించింది, మిరియమ్మ. అప్పటి నుండి ఇప్పటి వరకు డబ్బు కోసం కక్కుర్తి పడి పాత సామాను కొనడం దూరాలోచన లేని పని అని అనిపిస్తూ ఉంటుంది.

## ఆడుతు, పాడుతు పనిచేస్తూంటే...

యు. సి. ఎల్. ఎ. కేంపస్ కి దగ్గరలోనే ఇంటర్నేషనల్ స్టూడెంట్ సెంటర్ అని ఒక భవనం ఉండేది. ఈ సెంటర్‌లో ఉండటానికి రెండు మూడు గదులు ఉండేవి తప్ప మిగిలినదంతా సాంస్కృతిక కార్యకలాపాలకి వాడేవారు. ఇక్కడ ప్రతి దేశపు విద్యార్థి సంఘాలు ఏవేవో కార్యక్రమాలు జరుపుకునే వారు. ఇలాంటి ఒక కార్యక్రమంలో మన దేశపు నృత్యం ఒకటి ప్రదర్శించేరు. పార్వతీ పరమేశ్వరుల నృత్యం అది. నాకు నాట్య కళలో ప్రవేశం సున్న. కనుక వీళ్ళ డేన్సు ఎంత బాగుందో చెప్పలేను కానీ ఆ శివ తాండవానికి ఆ వేదిక ఇలా కంపించిపోయింది. డేన్సు అయిపోయినతర్వాత 'ఎవరా ఇంతలా అదరగొట్టేసేరు' అని నేను అనుకుంటూ ఉండగానే ఎవ్వరో నాకు తిరుమలేశ గారినీ, ఇందిర గారినీ పరిచయం చేసేరు. ఈ తిరుమలేశ పేరిస్ లో పి. హెచ్. డి. చేసి వచ్చేడు. చూడ్డానికి రమణ మహర్షిలా ఉండేవాడు, గెడ్డంతో సహా! మాయాబజార్ సినిమాలో ఘటోత్కచుడిలా "అహ్హాహ్హా" అంటూ పెద్దగా నవ్వేవాడు.

### తిరుమలేశ ఇంట్లో పార్టీ

మాకు ఆ రోజుల్లో entertainment అంటే ఎవరింట్లో అయినా భోజనానికి పిలిస్తే వెళ్ళటం, కబుర్లు చెప్పుకోవటం, డబ్బులెయ్యకుండా ఏ లిటరేచర్ లాంటి పేకాటో ఆడుకోవటం వగైరా పనులే. ముఖ్యంగా కబుర్లు. ప్రతి వారాంతం ఎక్కడో ఒక చోట కలవటం జరిగేది. మేమింకా కొత్త జంట కనుక మేం పిలవకపోయినా మమ్మల్ని పిలిచేవారు. ఒక సారి తిరుమలేశ ఇంట్లో కలిశాం. శాంటా మానికా ఫ్రీవే మీద వెళ్ళి క్రెన్షా బులవార్డ్ దగ్గర బైటకి వస్తే ఆయన ఉండే వాటిక అక్కడే ఉండేది. రాత్రి పదకొండు దాటింది కాని మా పార్టీ పూర్తవ లేదు. అసలే తెలుగు వాళ్ళమి. మనం గట్టిగా మాట్లాడుకుంటే కాని కడుపునిండా కబుర్లు చెప్పుకున్నట్లు ఉండదనుకుంటాను. అనుకోవడమేమిటి? ఉండదు. దీనికి తోడు తిరుమలేశ 'అహ్హాహ్హా' అన్నాడంటే ఘటొత్కచుడే! ఆ రాత్రి పన్నెండింటికి ఎవ్వరో గట్టిగా, అధికారయుక్తమైన వైఖరితో తలుపు తట్టేరు. గెడ్డాలతో ఉన్న మన తిరుమలేశ లుంగీ, బనీనుతో వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా ఇద్దరు పోలీసులు! లోపలకొొచ్చి ఇటూ, అటూ చూసేరు. మనం మందులు,

మాకులు వాడే రకం కాదని తెలిసి, కొంచెం గొంతుక తగ్గించమని చెప్పేరు. పక్క వాటిక వాళ్ళు ఫిర్యాదు చేసేరుట.

ఈ తిరుమలేశకి అప్పటికే అయిదుగురు పిల్లలు. అందరికీ పేర్లు భలే తమాషాగా పెట్టేడు. మరీచి, విరించి కొడుకులు. ఫణి, మాతంగి, హరిణి. కూతుళ్ళు. పెద్ద వాడు మరీచికి అప్పుడు పదేళ్ళు ఉంటాయేమో. ఎవరింట్లో కలుసుకున్నామో జ్ఞాపకం లేదు కాని వాడు, "నాన్నా! ఇదేంటీ?" అంటూ ఏదో మెరుస్తూన్న వస్తువునొకదాన్ని పట్టుకొచ్చేడు. అది ఆ ఇంటి వారి టెలివిషన్ టూనర్! దాన్ని మనవాడు పీకేసి పట్టుకొచ్చేడు! వాడికొకటి ఇచ్చుకోడానికి బదులు తిరుమలేశ మళ్ళా అహ్హహ్హా అంటూ నవ్వేసి ఊరుకున్నాడు. మిగిలిన వాళ్ళ సంగతి తెలియదు కాని, నేనంటే ఎంతో అభిమానంగా ఉండేవారు, తిరుమలేశ.

### గోంగూర పచ్చడి కథ

ఉమ కాపురానికి వచ్చిన కొత్త రోజుల్లోనే మానికొండ శాస్త్రి గారు, ఆయన భార్య సీత చీకో నుండి ఫుల్లర్టన్ వచ్చేరు. చీకోలో ఉన్నన్నాళ్ళూ చీకో శాస్త్రి లా చెలామణీ అయిన ఆయన ఇక్కడకి రాగానే ఫుల్లర్టన్ శాస్త్రిగారు అయిపోయారు. సీత గుంటూరు నుండి వచ్చిన పిల్లేమో ఆమె తెలుగు యాస బందరులో రెండేళ్ళు చదువుకున్న నాకే వింతగా ఉంటే తూర్పు గోదావరి నుండి వచ్చిన రామదాసుగారికీ, విశాఖపట్నం జిల్లా నుండి వచ్చిన ఉమ కి ఇంకా యాసగా వినిపించి ఉండాలి. కాని ఆమె భాష కాదు మాకు ఆకర్షణ – ఆమె వంట. కారాలు బాగా వేసి కొరివి కారం, గోంగూర పచ్చడి వగైరాలు చేసి పెడతానని ఊరించి మమ్మల్ని వారింటికి భోజనానికి పిలచేరు, ఒక నాడు. మాకు ఫుల్లర్ టన్ దరిదాపు డెబ్భై మైళ్ళు దూరం ఉన్నా సీత గారు గోంగూర పచ్చడి చేసి పెడతాననగానే మేమంతా పొలోమని వెళ్ళిపోయేం. మేమంతా అంటే ఎంతో మందిమి లేము లెండి. ఓ నాలుగైదు జంటలు ఉంటామేమో. ఆవిడ గోంగూర పచ్చడి బాగుందని అంతా లొట్టలు వేసుకుంటూ ఉండగా రామదాసుగారనుకుంటాను, "ఇండియా నుండి ఎవరొచ్చేరబ్బా!" అంటూ ఇటూ, అటూ చూడటం

మొదలు పెట్టేరు. ఇంత బాగున్న గుంటూరు గోంగూర పచ్చడి ఎవరు పట్టుకొచ్చారా అని ఆయన ఉబలాటం.

“ఎవ్వరూ రాలేదండి. నేనే చేసేను. ఈ గోంగూర మా పెరట్లోదే!”

“మీరు విత్తనాలు ఇండియా నుండి తెచ్చుకున్నట్లున్నారు. తెలివైన వారు. మిమ్మల్ని కస్టంస్ వాడు పట్టుకోలేదా?”

“మా పెరట్లో వైల్డ్ గా పెరుగుతోందండీ!”

“అబ్బ! ఎంత అదృష్టం అండీ. విత్తనాలొచ్చిన తర్వాత మాకో నాలుగు విత్తనాలు ఇద్దురూ!”

“నేను విత్తనాలు మీకిచ్చెస్తే మీరు దూరం అని సాకు పెట్టి మా ఇంటికి మళ్ళా రారు. నేను విత్తనాలివ్వను.”

వేసవి కాలమేమో బయట ఇంకా చీకటి పడ లేదు. రామదాసు గారు, “అలా అయితే ఓ రెండు గోంగూర మొక్కలని పీక్కుని, ఇంటికి పట్టుకెళతాను. నాకు గోంగూరలో సెనగపప్పు వేసి కాచిన పులుసంటే ఇష్టం,” అంటూ బయటకి వెళ్ళేరు. భార్య వచ్చిన దగ్గరనుండి  ఈయనకి వేవిళ్ళు వచ్చినట్లున్నాయి, చూడబోతే!

“ఈ గోంగూరేమిటీ ఇలా ఉందీ?” అంటూ ఆయన రెండు మొక్కలని చేత్తో పట్టుకొచ్చేరు. అక్కడ పక్కనే కూర్చున్న మరొకాయనెవరో, “అయ్యా బాబోయ్! అది మేరువానా అండీ, బాబూ! పోలీసులు చూసేరంటే మనందరినీ జైల్లో తోసెస్తారు!” అంటూ కంగారు పడుతూ ఉండగానే, రామదాసు గారు చేతిలో ఉన్న మొక్కలని గభీ మని నేల మీద పడేశారు.

**వంకాయ బజ్జీల కథ**

మేమున్న వివాహితుల వాటికలోనే చంద్రభాను గుప్త, తులసి అని మరొక జంట ఉండేది. వీళ్ళు తమిళ దేశంలో ఉన్న తెలుగువాళ్ళు. తమిళ యాస గట్టిగానే ఉండేది. భాష కూడ కొంచెం తేడాగా ఉండేది. గుప్తా గారు పిడియాట్రిక్ కార్డియాలజీ లో రెసిడెన్సీ చేసేవారు – యు. సి. ఎల్. ఎ. లో. కేథిటర్ అనే మాట మొట్టమొదట ఈయన దగ్గరే విన్నాను. వీరికి రాము అని రెండు మూడేళ్ళ కొడుకు ఉండేవాడు. మేము మొదటి సారి కలుసుకున్నప్పుడు తులసి నన్ను చూసి "మిమ్మల్ని ఎక్కడో చూసేను," అంటూ సాగదీసేరు. నాకు రోజూ చూసే మనుష్యులే గుర్తుండరు, పేర్లూ గుర్తుండవు, ముఖాలు అసలే గుర్తుండవు. కనుక నన్నెవరైనా ఎప్పుడైనా చూసేను అని ప్రతిపాదిస్తే ప్రతిఘటించకుండా వెంటనే ఒప్పేసుకుంటాను. దీనికో చారిత్రకమైన కారణం ఉంది. నేను కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో చదువుతూన్న రోజులలో సర్వే చేస్తూ బానుగుడి ప్రాంతాల వరకూ వెళ్ళిపోయేను. అక్కడ ఒక శాల్తీ తారసపడి "ఏరోయ్ వెంకటేశ్వర్రావ్" అంటూ ఆ శాల్తీ నా జబ్బ చరిచేడు. నా జబ్బ అదిరిపోయింది తప్ప ఆ శాల్తీ ఎవ్వరో గుర్తుకు రాలేదు. పేరు పెట్టి పిలుస్తున్నాడాయె! కొంతసేపు నన్ను కిందా మీదా పెట్టి తన పేరు చెప్పేడు. తునిలో చదువుకున్నామని కూడ చెప్పేడు. అయినా గుర్తుకి రాలేదు. క్లిష్టమైన సాంఘిక పరిస్థితులు ఎదురైనప్పుడు లౌక్యంగా తప్పించుకోవటం ఇంకా అప్పటికి అలవాటు కాలేదేమో వాడు తెలుసున్నట్లు నటించటం తెలియలేదు. అతను ఎవ్వరో జ్ఞాపకం రాలేదని ఒప్పేసుకున్నాను. వాడికి చాలా కోపం వచ్చింది. "ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చిందని నీకు కళ్ళు నెత్తి మీదకి వచ్చాయిరా!" అంటూ వాడు వెళ్ళిపోయేడు. తర్వాత నాకు బాధేసింది. అందుకని తులసి నన్ను ఎప్పుడో ఎక్కడో చూసేనంటే కాబోలు అనుకున్నాను. అయినా ఈ అరవ పిల్ల నాకెక్కడ తారసపడుంటుంది? నేవేలీలో నా ఆఫీసులో, నా పక్కనే ఉన్న డెస్కు దగ్గర కూర్చున్న అమ్మాయి పేరు పట్టమ్మాళ్. ఈమె కంటె తెల్లగా ఉండేది. 'ఎవరబ్బా?' అని ఇంకా ఆలోచిస్తూ ఉంటే అప్పుడు ఆవిడే జ్ఞాపకం చేసింది. "అదేమిటండీ, అప్పుడే మరచి పోయేరా? డిట్రాయిట్ లో లక్ష్మి గారింట్లో మిమ్మల్ని తరచు చూసేదానిని." నేను డిట్రాయిట్ లో ఉన్న మాట నిజం. అక్కడ నేను లక్ష్మి ఇంటికి తరచు వెళ్ళటం వరకు నిజం. కాని ఈమెని అక్కడ నేను చూసేనా? తరచు? అవునని ఆవిడ, కాదేమోనని నేను. ఈ వాదన తెగక నేను పడక గదిలో ఉన్న టెలిఫోను దగ్గరకి వెళ్ళి డిట్రాయిట్ పిలచి లక్ష్మి ని అడిగేను,

"అమ్మా! నాకు కాని తులసి అనే ఆవిడని తెలుసా?" అని.

"మీకు తెలియకపోవటమేమిటీ? తెలుసు," అన్నాది లక్ష్మి.

"నాకు తెలుసని మీకెలా తెలుసు?" అని అడిగేను.

"అదేమిటండీ! మేము డౌన్‌టౌన్ లో ఉన్న రోజుల్లో మా ఎదుటి వాటాలో ఉండేది. వాళ్ళాయన డాక్టరు కదూ? ఆయన ఎప్పుడూ ఆసుపత్రిలోనే ఉండేవాడు. కనుక మీరెప్పుడూ అతనిని చూడలేదు. ఈ తులసికి ఓ కొడుకున్నాడు కదూ?"

"అది మీకెలా తెలిసిందండీ?"

"ఈ తులసిని మీకు తెలుసు! బాగా తెలుసు! ఈమె కడుపుతో ఉన్నప్పుడు తరచు ఏదైనా ఆవకాయ ఉంటే ఇమ్మనీ, నిమ్మకాయ ఉంటే ఇమ్మనీ మనింటికి వచ్చి అడిగేది. రాత్రి పూట అతను చాలా ఆలశ్యంగా వచ్చేవాడు. ఇంట్లో ఒక్కర్తీ లింగు లింగు మంటూ ఉండటానికి భయం వేసి అతను ఇంటికి వచ్చేవరకూ మనింట్లో కూర్చోటానికి వచ్చేది. ఆమె అరవ పిల్లనుకుని మీరు పద్యం ఏదో పాడేవారు." అంటూ చెణుకుని జ్ఞాపకం చేసింది లక్ష్మి.

'మేత గరిపిల్ల, పోరున మేకపిల్ల..అందమునకు కోతి పిల్ల, ఈ అరవ పిల్ల' అన్న శ్రీనాధుడి పద్యం జ్ఞాపకం రాగానే, "అయ్యయ్యో! ఎంత పని జరిగిపోయింది! నేనా పద్యం చదవటం ఈమె అప్పుడు విన లేదు కదా? విన్నా అర్థం అయుండకపోవచ్చులే. అయినా ఇప్పుడు నేను చేసేదేమీ లేదు కదా!

గదిలోంచి బయటకి వచ్చి ఆమెకి క్షమార్పణ చెప్పుకున్నాను. పద్యం పాడినందుకు కాదు, ఆమెని గుర్తుపట్ట లేకపోయినందుకు.

ఈ తులసి ఇప్పుడు మా ఉమకి ఒక గురువైపోయింది. ఉమ కి వంట పనులు ఇంకా కొత్తగానే ఉండేవి ఆ రోజుల్లో. ముఖ్యంగా రోజుకొకటి చొప్పున మార్చి మార్చి వంటలు వండటం చేతనయ్యేది కాదు. పెళ్ళి కాక పూర్వం రోజూ పీనట్ బటర్, జెల్లీ రాసిన రొట్టె ముక్కలు తినేవాడిని; ఇప్పుడు రోజూ అదే కూర, అదే పచ్చడి! అదే పులుసు! అదే చారు! తినేవాడికి నాకు విసుగెయ్యకపోయినా పెట్టే తనకి విసిగేసి ఉంటుంది, మార్పులేకుండా ఒక ఒరవడిలో పడిపోయిన తిండిని చూసి. అందుకని తులసిని అడిగింది, "మీ వారికి మీరు రోజూ ఏమి వండి పెడతారు?" అని.

"అయ్యో రాత! నేను అన్ని ఆధరువులు చెయ్యను. వంకాయ బజ్జీలు చేసి పెడతాను. అదీ, ఆ తర్వాత మజ్జిగా అన్నం."

"బజ్జీలొక్కటే ఎలా తింటారండీ?"

"అయ్యో రాత! మీవారిని మీరు పాడు చేసేస్తున్నారు. ఒక రోజు మీరు కూడా చేసి పెట్టండి. తినకేం చేస్తారు. మీరు రాక పూర్వం కూరలూ, పచ్చళ్ళూ అన్నీ రోజూ తిన్నారేంటి?"

వాళ్ళిద్దరి మధ్య సంభాషణా ఈ స్థాయికి చేరుకునే సరికి నేను అక్కడనుండి వెళ్ళిపోయుంటాను; నేను విన లేదు. ఆవిడ ఏదో రిసపీ చెప్పుంటుంది. ఈవిడ వినుంటుంది. మనకేదో కొత్త రకం భోజనం తినే ప్రాప్తం వస్తోందని లొట్టలు వేసుకుంటూ నేను ఎదురు చూసేను.

మర్నాడు ఇంటికి వచ్చేసరికి, "ఈ వేళ ఒక కొత్త రకం వంట చేసేను. తులసి చెప్పేరు."

ఇంతవరకు మనం కరెక్టుగానే ఊహించేం కదా! గబగబ లోపలికి వెళ్ళి, బట్టలు మార్చుకుని, చేతులు కడుక్కుని, కంచం పెట్టుకుని కూర్చున్నాను. నోట్లోంచి లాలాజలం ఊరుతోంది. ఉమ లోపలికి వెళ్ళి పళ్ళెం నిండా వంకాయ బజ్జీలు నింపి నా ఎదట పెట్టింది.

"భోజనం చేసేస్తున్నాము కదా. ఇప్పుడు ఈ బజ్జీలు తినేస్తే ఆకలి చస్తుంది. దాచు. రేపు సాయంత్రం కాఫీ తాగుతూ తినొచ్చు."

"ఇదే ఈ రాత్రి మీ భోజనం!"

"ఎక్కడైనా బజ్జీలు భోజనం చేస్తారా? ఇది టిఫిన్."

"తులసి గారు ఇవే చెయ్యమన్నారు."

నేను తులసిని పిలచేను. "అమ్మా! మీరు బజ్జీలు డిన్నరుకి పెట్టమని చెప్పేరా?"

"చెప్పేను. అన్నంలో కలుపుకు తింటే  బాగుంటుందండీ."

"ఇక్కడ అన్నం లేదు. బజ్జీలే ఉన్నాయి. అయినా బజ్జీలు అన్నంలో ఎలా కలుపుకుంటారండీ? మీరు రిసపీ ఏమని చెప్పేరు?"

"నేనేమీ చెప్పలేదే! తనకి తెలుసన్నారు."

"మీరు ఎలా చేస్తారో కొంచెం నాకు చెప్పండి."

"వంకాయ కాల్చి, కాలిన తర్వాత తొక్క తీసేసి, దానిలో కొత్తిమిర, మిరపకాయలు, వగైరా బాగా కలిపి, పోపు వెయ్యాలి. చాలా బాగుంటుంది."

"హారినీ! బజ్జీలంటే వంకాయ పులుసు పచ్చడా?"

అసలు విషయం అర్థం అయి, "నాకైనా తట్ట లేదు! అన్నం లేకుండా నూనెలో వేయించిన బజ్జీలొక్కటి ఎలా తినగలం?" అంటూ పాపం ఉమ ఎంతో బాధ పడింది.

పిల్లని చంపిన మనోహర్ కథ:

మేమున్న వివాహితుల వాటికలోనే డాక్టర్ సెల్వరాజ్ మనోహర్, ఆయన భార్య బెస్సీ అన్నపూర్ణ అని ఒక క్రైస్తవ జంట ఉండేవారు. ఆమె తెలుగావిడే కాని ఆయన తమిళ దేశంలో పెరిగినట్లున్నారు. వెల్లూరు మెడికల్ కాలేజీలో చదువుకుని వచ్చేరు. తెలుగు బాగానే మాట్లాడేవారు కాని కొంచెం తమిళ యాస ఉండేది. మనిషి చాలా తెలివైన వాడు, నెమ్మదస్తుడు, మంచి వాడూను. నల్లటి కారు నలుపు జుత్తుకి బాగా నూనె పట్టించి దువ్వారో ఏమో (అప్పటికి ఇంకా dry look రాలేదు) చెంపలు చెమ్మగా నిగనిగలాడుతూ కనిపించేవి. మా ఇంట్లో లిటరేచర్ ఆట ఎప్పుడైనా ఆడితే అది ఆడటానికి ఇద్దరూ వచ్చేవారు. లిటరేచర్ అంటే సాహిత్యం అనుకునేరు! అదొక అష్టముఖ పారాయణం. ఈ పేకముక్కలాటకి ఆరుగురుంటే సరిపోతుంది కాని, ఎనిమిది మంది ఉంటే భలే బాగుంటుంది. కాని ఎనిమిది మంది తెలుగువాళ్ళు దొరకొద్దూ? అందుకని ఊళ్ళో ఎక్కడైనా బ్రహ్మచారిగాళ్ళు ఉంటే భోజనం పెడతామని ఊరించి ఆటకి లాక్కొచ్చేవాళ్ళం. భాభా ఎటామిక్ సెంటర్ నుండి డెప్యుటేషన్ మీద వచ్చిన ఇవటూరి సుందర్రావు ఈ కోవకి చెందిన బ్రహ్మచారి. పిలచి 'రైదు' కి ఏర్పాట్లు చేస్తే వచ్చేవాడు. సన్నగా, పీలగా, ఊదెస్తే పడిపోతాడేమో అన్నట్లు ఉండేవాడు. గంగన్న పేసదీనా నుండి డ్రైవు చేసుకుని వచ్చేవాడు. నలుగురేసి ఒకొక్క జట్టు. ఒకొక్క రంగులో ఆసు నుండి తొమ్మిది వరకు మేజర్ సెట్టు, ఎనిమిది నుండి మూడు వరకు మైనర్ సెట్టు. ఒకొక్క సెట్‌లో కనీసం ఒక్క బేస్ కార్డు మన దగ్గర ఉన్నప్పుడు ఎదటి జట్టులోని వాళ్ళ దగ్గర నుండి మనం ఆ సెట్టులో మిగిలిన ముక్కలు అడిగి పుచ్చుకోవచ్చు. మనం అడిగిన ముక్క అడిగిన ఆసామీ  దగ్గర లేక పోతే అడగడం ఎదటి వాళ్ళ వంతు అవుతుంది. వెధవ పేక ముక్కల కోసం ఆస్తులు కోసం కొట్టుకున్న అన్నదమ్ముల్లా కొట్టేసుకునే వాళ్ళం.

ఒక నాడు మనోహర్ ఆటకి కొంచెం ఆలస్యంగా వచ్చేరు. గుండ్రంగా ఉండే ఆయన ముఖం ఆవేళ అరగజం పొడుగున వేల్లాడుతూ కనిపించింది. మేమింకా విషయమేమిటని పరామర్శించకుండానే, ఆలశ్యంగా వచ్చినందుకు సంజాయిషీ చెబుతూన్నట్లు, "పిల్ల చచ్చిపోయిందండీ, ఈవేళ," అంటూ వచ్చి కూర్చున్నారు. మేమంతా నిర్ఘాంతపోయి చూస్తున్నాం, "ఎవరా పిల్ల? ఏమా కథ?" అన్న పోజు పెట్టి. ఆయన మెల్లిగా జరిగిన ఉదంతం చెప్పుకొస్తూ ఉంటే చచ్చిపోయినది పిల్ల కాదు, "పిల్లి" అని మాకు బోధ పడింది. మనోహర్ గారు డాక్టర్ రాస్ ఏడీ దగ్గర మెదడు ఎలా పని చేస్తుందో రిసెర్చి చేసేవారు. ఆ సందర్భంలో పిల్లి కి మత్తు మందు ఇచ్చి, దాని కపాలం మీద టొపారం ఎత్తేసి, లోపల మెదడుకి తీగలు తగిలించి, పిల్లి కంట్లో దీపం వేసి, ఆ దీపం వల్ల ప్రేరేపించబడ్డ మెదడు నుండి వచ్చే విద్యుత్ తరంగాలని రికార్డు చేసి పరిశోధనలు చేసేవారు. ఈ ప్రయోగం అయిపోయిన తర్వాత మళ్ళా ఆ పిల్లిని బ్రతికించడమనేది జరగని పని. బ్రతికినా తోటకూర కాడలా వేల్లాడి పోతుంది తప్ప మామూలు పిల్లిలా బ్రతక లేదు. అంతకంటె చావే నయం. కనుక  ఒకొక్క పిల్లినో వారం పది రోజుల పాటు అలా కొన ప్రాణాలతో అట్టేపెట్టి ప్రయోగాలు చేసి, అప్పుడు ఆ పిల్లిని చచ్చిపోనిచ్చే వారు. అదీ ఆవేళ జరిగిన ఉదంతం.  పిల్లితో పాటు ఈయన తన యాసతో మమ్మల్ని కూడా చంపేరు. ఈ సంఘటన జరిగిన నాలుగైదు ఏళ్ళ తర్వాత, మనోహరు గారు అకస్మాత్తుగా నా రాడార్ స్క్రీన్ మీంచి అదృశ్యమైపోయేరు. ఏమైపోయారో తెలియక డాక్టర్ రాస్ ఏడీ ని పిలచి అడిగేను. అప్పుడు ఆయన చెప్పేరు – అప్పటికి కొద్ది నెలల క్రితమే అకస్మాత్తుగా గుండె పోటు – ఆయన వాడిన మాట, మయోకార్డియల్ ఇన్ఫార్క్షన్  – వచ్చి చచ్చిపోయేరు అని. Myocardium అంటే హృదయ కండరం. Infarction అంటే కణజాలపు మరణం. గుండె ఏ కండరాలతో నిర్మించబడిందో ఆ కండారాలు రక్తపు సరఫరా లేక చచ్చిపోవటం. అంటే గుండె కొట్టుకోకుండా ఆగిపోవటం. అతి చిన్న వయస్సులో మనోహరు  ఇలా చచ్చిపోవటం అన్యాయం!

## లాలీవుడ్ ప్రభావం

చూశారు కదా, మన వాళ్ళ నోట హాలీవుడ్ అన్న మాట రకరకాలుగా ఎలా రూపాంతరాలు పొందుతోందో. బొంబాయిలో ఉన్న చలన చిత్ర వ్యాపార సంస్థలన్నీ బాలీవుడ్! తెలుగు చలన చిత్ర సంస్థలన్నీ టాలీవుడ్! కన్నడం వాళ్ళవి కాలీవుడ్! నేనేనేమిటి తక్కువ తిన్నాను? లాస్ ఏంజిలిస్ శివార్లలో ఉన్న ఈ హాలివుడ్, కల్వర్ సిటీ మొదలైన ఊళ్ళల్లో ఉన్న చలనచిత్ర, టెలివిషన్, నైట్ క్లబ్ పరిశ్రమలని కూడగట్టి నేను లాలివుడ్ అంటాను!

నేను లాస్ ఏంజిలిస్ లో ఉన్న మొదటి ఏడు ఈ లాలీవుడ్ పరిశ్రమలేవీ నన్ను ఎప్పుడూ అంతగా ఆకర్షించలేదు. ఉమ కాపురానికి వచ్చిన తర్వాత సినిమాలన్నా, పగలు వచ్చే టి. వి. షోలు అన్నా కొంచెం పరిచయం పెరిగింది. ఈ టెలివిషన్ ఉంది చూడండి, దీన్ని చూడటం, సిగరెట్టు కాల్చటానికి అలవాటు పడటం రెండూ ఒకే రకం వ్యసనాలు అని నాకు అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది.

### టెలివిషన్ షోలో పడ్డ వైనం

సియర్స్‌లో కొనుక్కున్న కొత్త టెలివిషన్ వచ్చిన తర్వాత మాకు సోప్ ఆపెరాలు అలవాటు కాలేదు (భగవాన్!) కాని game show లు చూట్టం కొంచెం అలవాటైంది. Bob Barker ఆధ్వర్యంలో జరిగే Truth or Consequences అంటే తెగ ఇష్టపడి చూసేవాళ్ళం. ఆ కార్యక్రమం అంటే తను సరదా పడుతున్నాది కదా అనిన్నీ, స్టుడియో ఊళ్ళోనే కదా అనిన్నీ, ఆ show కి తీసుకెళ్ళి Bob Barker ని చూపిద్దామని ఒక రోజు హాలీవుడ్ తీసుకెళ్ళేను. అప్పుడు ఈ కార్యక్రమం NBC వాళ్ళ చానల్ మీద వచ్చేదనుకుంటాను. వాళ్ళ స్టుడియో హాలివుడ్ లో సన్‌సెట్ బులవార్డ్ మీద ఉండేదని చూచాయగా జ్ఞాపకం ఉంది. వెళ్ళేం. పక్క వీధిలో ఎక్కడో కారు పార్కు చేసుకుని వరసలో నిలబడ్డాం. వరస చూస్తే ఆంజనేయుడి తోకలా పెద్దగా ఉంది. లోపల అందరికీ చోటు దొరుకుతుందో దొరకదో అని నేను కొంచెం కంగారు పడటం మొదలెట్టేను. నా కంగారుకి నన్ను తెలుసున్న వాళ్ళంతా అలవాటు పడిపోయేరు కనుక ఇటుపైన నా కంగారు గురించి చెప్పదలుచుకోలేదు. ఏది ఏమైతేనేమి, మేమూ

లోపలికి ఇలా వెళుతున్నాం, హాలు నిండిపోయింది కనుక మిగిలిన వాళ్ళని వెనక్కి వెళ్ళిపోమన్నారు. మేము ఆఖరున వెళ్ళేం కనుక మాకు ముందున్న కుర్చీలు దొరకలేదు. వెనక వరసలో కూర్చోబెట్టేరు. ఉమ కొంచెం నిరుత్సాహం పడ్డ మాట మాత్రం నిజం.

బాబ్ బార్కర్ వేదిక మీదకి వచ్చే ముందు మరొక నక్షత్రకుడు వచ్చి మమ్మలందరినీ రెచ్చగొట్టి, కేరింతాలు కొట్టించి, మాచేత చప్పట్లు కొట్టించి, ఉత్సాహపరచేడు. బాబ్ బార్కర్ వేదిక మీదకి వచ్చేసరికల్లా మేమంతా కేరింతాలు కొడుతూ, గోల పెడుతూ, నవ్వుతూ ఉండాలని హెచ్చరించేడు. ప్రేక్షకుల మీద వెలుగు పడేలా దీపాలు వేసేరు. మేమంతా ఘొల్లుమని కేరింతాలు కొట్టటం మొదలెట్టేము. టెలివిషన్‌లో షో చూస్తూన్నన్నాళ్ళు ఉమకి ఇక్కడే ఒక ధర్మ సందేహం వచ్చేది. ఆట మొదలవుతూన్న సమయంలో బాబ్ బార్కర్ స్టేజి మీదకి వచ్చేముందు ఎందుకు ప్రేక్షకులు అలా కేరింతాలు కొడుతున్నారో అప్పుడు అర్థం అయింది.

బాబ్ బార్కర్ వేదిక మీదకి వచ్చేడు. ఒక అరగంట సేపు వాళ్ళనుకున్న కార్యక్రమం టేపు చేసేరు. అప్పుడు హాల్లో ప్రేక్షకుల మీదకి మరొక సారి దీపాలు వేసి, బాబ్ బార్కర్ ఇలా అన్నాడు. "సాధారణంగా ఇప్పటితో ఈ కార్యక్రమం అయిపోవాలి. కాని మేమింతకు పూర్వం టేపు చేసిన కార్యక్రమంలోని ఒక సంఘటన వల్ల మేము ప్రసారం చెయ్యటానికి వీలు లేని పరిస్థితి ఏర్పడింది. ఆ ఖాళీ సమయంలో మరొక కార్యక్రమం జొప్పించాలి. కనుక మరొక చిన్న కార్యక్రమాన్ని ఇప్పుడు టేపు చేస్తాం. ఇది అకస్మాత్తుగా ఎదురైన పరిస్థితి కనుక ఈ ఆడిటోరియం లో ఉన్న ఒక వ్యక్తిని ఎన్నుకుని కార్యక్రమం టేపు చేస్తాం. మీలో ఎవ్వరికైనా ఉత్సాహం ఉందా?"
హాలులో ఒక్క సారి ఎన్నో చేతులు పైకి లేచేయి. అలా లేచిన చేతులు చూడగానే మా తునిలో, ఆదివారం సంత రోజున, రోడ్డు పక్క మోళీ చేసే సాయిబు కార్యక్రమం జ్ఞాపకం వచ్చింది. జోలె లోంచి మూలిక తీసి పడగ విప్పిన పాము తల మీద పెట్టేవాడు. ఆ మూలికని చూసి పాము పడగ దించేది. అప్పుడు సాయిబు గుప్పెడు మూలికలు జోలె లోంచి బయటకి తీసి, అందరికీ చూపించి, అవి ఎవరికి కావలిస్తే వారికి ఇస్తాననేవాడు. మా ఊళ్ళో పాములు రాత్రయేసరికల్లా వీధుల మీద పచారులు చెయ్యటానికి వచ్చేవి. రాత్రేమిటి, ఖర్మ! పట్ట పగలు మేమంతా భోజనాలు చేస్తూ ఉంటే ఒక సారి తాచు

పామొకటి జరజర పాకు కుంటూ వడ్డనకి వచ్చినట్లు వచ్చేసింది. అందుకనే ఇటువంటి మూలికలకి గిరాకీ ఉంటుంది మరి. కాని అందరికీ ఇవ్వటానికి సరిపడా సాయిబు దగ్గర లేవు కనుక చేతిలో ఉన్న గుప్పెడు మూలికలూ గాలిలోకి ఎగరేస్తానని చెప్పి, ఎవరికి దొరికితే వాళ్ళని తీసుకోమనేవాడు. అని, చెయ్యి గాలిలోకి విసిరేవాడు. ఒక్క ఉదుటున గుమి గూడిన ప్రజలంతా ఆ మూలికల కోసం ఎగబడి చిన్న దొమ్మీ చేసేవారు. అప్పుడు మోళీ సాయిబు, తన గుప్పిట్లోనే ఉన్న మూలికలని చూపించి,

“చూసారా ఊరికనే ఇస్తానంటే ఇలా దొమ్మీ చేసేస్తున్నారు. దీనికి న్యాయమైన మార్గం ఒక్కటే. ఈ మూలిక నిజంగా కావలసిన వాళ్ళు ఒకొక్క రూపాయి ఇవ్వగలరా?” అనేవాడు. బెరుకు బెరుకుగా అరడజను చేతులు లేచేవి. అందరి దగ్గరా ఒకొక్క రూపాయి పుచ్చుకుని ఒకొక్క మూలిక ఇచ్చేవాడు.

“మీరంతా మనస్ఫూర్తిగా రూపాయి ఇస్తున్నారా? మనస్సు మార్చుకుంటే ఇప్పుడే చెప్పండి. మీ రూపాయి మీకు తిరిగి ఇచ్చేస్తాను!” అనేవాడు.

“లేదు. మాకు మూలికే కావాలి!” అంటూ అంతా ఏక కంఠంతో అరిచేవారు.

అప్పుడు మోళీ సాయిబు, “మీరు నా మీద నమ్మకం చూపించేరు. నేను కూడా అన్న మాట తప్పను. ఇదిగో మీ రూపాయి నాకు అక్కర లేదు.” అంటూ ఎవరి రూపాయి వారికి ఇచ్చేసి వారికో మూలిక ఉచితంగా ఇచ్చేవాడు.

మోళీ సాయిబు వెనకాతల ఉన్న సత్రకాయ దప్పు వాయించేవాడు. సాయిబు ఒంటితీగ ఫిడేలు మీద “నిలో! నిలో! నిలుపు బండీ! నిలవరపూ, నిలో! నిలో!!” అంటూ ఒక పాట పాడుతూ, గెంతుతూన్నట్లు నడుస్తూ, వలయాకారంగా గుమిగూడిన ప్రేక్షకుల పరిధిలో రెండు చుట్లు తిరిగేవాడు. తిరిగిన తరువాత వీర్యవృద్ధికి మందు అంటూ ఏదో ఒక సీసా అమ్మేవాడు. తర్వాత ఆడదాన్ని వశపరచుకోవటానికీ, చెడుపు, చిల్లంగి, శాకినీ, ఢాకినీ, కామినీ వంటి దుష్ట శక్తుల నుండి తప్పించుకోవటానికీ ఒక

మంత్రించిన తావీజు ఇస్తాననేవాడు. అందరికీ ఉచితంగా ఇస్తానని ఒక తావీజు గాలిలోకి ఎగరేసేవాడు. ప్రజలు పొలోమని ఎగబడేవారు. ఆ తావీజు తిరిగి పుచ్చుకునేవాడు.

“ఇలా కాదు. నా దగ్గర పదే పది తావీజులు ఉన్నాయి. నా రక్తంలో ముంచి తాపడం చేసి ఇస్తాను. నా మాట మీద ఎంతమందికి నమ్మకం ఉంది?”

అందరూ చేతులు ఎత్తేవారు.

“మీకంత నమ్మకం ఉంటే ఈ తావీజుకి అయిదు రూపాయలంటే ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నారా?”

“ఉన్నాం!” అంటూ ఒక గోల వినబడేది.

సాయిబు మొదటి పది మంది దగ్గర ఐదేసి రూపాయలు పుచ్చుకునేవాడు.

వాళ్ళందరూ చూస్తూ ఉండగా తన ముంజేయి ముందుకి చాచి దాని మీద చిన్న కోత పెట్టి, కారుతూన్న రక్తంలో ఆ తావీజు మొన అద్ది, అందరికీ తలొక తావీజు ఇచ్చేవాడు.

వాళ్ళ దగ్గర పుచ్చుకున్న ఐదు రూపాయలూ తిరిగి ఇచ్చెస్తాడేమోనని నేను అలా కళ్ళప్పగించి చూస్తూ ఉండేవాడిని. నేను తేరుకునే లోగా సాయిబు బిచాణా ఎత్తేసేవాడు.

హాలులో ఒక్క సారి పైకి లేచిన ఎన్నో చేతులు చూడగానే తునిలో రివాజుగా జరిగే ఈ తంతు నా మస్తిష్కంలో ఒక్క సారి మెరిసింది. కాని ఆలోచించటానికి వ్యవధి లేదు. అన్వేషణ కాంతి పుంజాలు ప్రేక్షకుల ముఖాల మీద ముందుకీ వెనక్కీ నాట్యం చేస్తున్నాయి — అనుకూలమైన ముఖాన్ని వెతకటంలో.

“నువ్వు వెళతావా?” అని ఉమని అడిగేను.

తను ఆలోచించుకుని సమాధానం చెప్పేలోగా ఆ దీపం మా మీద పడబోతూంది. అసంకల్ప ప్రతీకార చర్య లా నేను ఉమ చెయ్యి పట్టుకుని పైకి ఎత్తేను. ఉమ తన చేతిని పైకి ఎత్తడమా వెనక్కి లాక్కోవడమా అని ఇంకా తటపటాయిస్తోంది. మా ఈ చిన్న ప్రణయ కలహాన్ని గమనించేడో ఏమో, బాబ్ బార్కర్ ఉమ వైపు చూపించి, common down అన్నాడు. నన్నేమో అనుకుని నేను లేవబోయాను. కాదు, ఉమ కావాలని అడిగేడు. అంతా కనురెప్ప మూసి తెరిచే అంతా లోగా జరిగిపోయింది.

ఉమ వేదిక ఎక్కి బాబ్ బార్కర్ పక్కన నిలబడింది. ఉమని లోపల శబ్దం చొరబడని గదిలోకి పంపి నా వైపు తిరిగి తన పథకం చెప్పేడు, బార్కర్. తను ఉమని వెనక్కి తీసుకొచ్చిన తర్వాత తనకి తప్ప మరెవ్వరికీ సమాధానం తెలియటానికి వీలు లేని ప్రశ్నలు బార్కర్‌ని అడగాలిట. ఆ ప్రశ్నలని “అవును, కాదు” అని ఒక సమాధానం వచ్చేటట్లు కూర్చాలిట. అప్పుడు బాబ్ బార్కర్ తన దివ్యదృష్టితో చూసి ఆ సమాధానం చెబుతాడుట. ఈ దివ్య దృష్టి ఎక్కడో ఒక యోగి దగ్గర నేర్చుకున్నాట్ట! ఈ సందర్భంలో ప్రేక్షకులలో కూర్చున్న నేను సమాధానం “అవును” అయితే తల నిలువుగానూ, “కాదు” అయితే తల అడ్డుగానూ ఆడించి బాబ్ బార్కర్ కి సహాయం చెయ్యాలిట. ఇదంతా వివరంగా బోధపరచి, నాకు అర్థం అయిందని హామీ ఇచ్చిన తర్వాత ఉమని బయటకి తీసుకొచ్చి, పథకం చెప్పవలసినంత వరకు చెప్పి, ప్రశ్నలు అడగమని సవాలు చేసేడు.

ఉమ, “మా నాన్నగారు డాక్టరు. నిజమా? కాదా?” అని అడిగింది.

ఉమ తాత గారు డాక్టరు. నాన్న గారు లాయరు. తండ్రి చిన్నతనంలోనే పోవడంతో ఆమె తాత దగ్గరే పెరిగింది. ఎప్పుడూ తాతగారి గురించే ఎక్కువగా మాట్లాడేది. నేను నా సొంత కవిత్వం ఉపయోగించి వాళ్ళ తాతగారు అనటానికి బదులు నాన్నగారు అందనుకొన్నాను. ఈ కంగారులో బుర్ర నిలువుగా ఆడించాలో అడ్డుగా ఆడించాలో తేల్చుకోలేక మన ఇండియన్సు తలాడించే విధంగా ఎనిమిది ఆకారంలో ఆడించేను. ఈ రకపు శిరఃకంపనం ఈ అమెరికా వాళ్ళకి ఛస్తే అర్థం అయి చావదు. అంత

మొనగాడైన బాబ్ బార్కర్ నలుగురిలోనూ నగుబాటు అయే ప్రమాదం రాబోతూంది. అప్పుడు త్వరగా తేరుకుని, అప్పటినుండి ప్రశ్నలన్నింటికి సరిగ్గా తల పంకించగా, బాబ్ ఉమ అడిగిన ప్రశ్నలన్నింటికి సరిగ్గా సమాధానాలు చెప్పేడు. ఉమ ఆశ్చర్యపోయింది. ఇలా ఇందులో పాల్గొనందుకు మాకు Spiegel కంపెనీ వారి $50 Gift Certificate బహుమానంగా ఇచ్చేడు.

ఆ రోజు అలా ఎంతో సంతోషంగా ముగియకుండా చిన్న అపశృతిలా మా కారుకి పది డాలర్ల పార్కింగ్ టిక్కెట్టు వచ్చింది. ఇలా లాస్ ఏంజిలిస్ వచ్చిన రెండేళ్ళల్లో ఒక రెండు డాలర్ల టికెట్టు, ఒక పది డాలర్ల టికెట్టు సంపాదించేను. రెండూ పార్కింగు టిక్కెట్లే కాని moving violations కాదని సంజాయిషీ చెప్పుకుని సంతోషించేం.

## Graduate సినిమాలో వేషం వెయ్యటం

టెలివిషన్ అనేది చిన్న తెర తతంగం. హాలీవుడ్ సినిమా అంటే పెద్ద తెర. పంచరంగుల తెర! కనుక టెలివిషన్ తారల కంటే సినిమా తారల అంతస్తు ఎక్కువ. మాకు చిన్న తెర నుండి పెద్ద తెరకి ఎగబాకే అవకాశం రాబోతూంది!! ఒక రోజు ఆఫీసులో పనిచేసుకుంటూ ఉంటే మా సెక్రటరీ మాయ పిలిచి, "రావ్! సినిమాలో వేషం వేస్తావా?" అంది. ఉపోద్ఘాతం లేకుండా నీలి ఆకాశం నుండి పడ్డ అశనిపాతంలా వచ్చిన ఈ ప్రశ్నకి సమాధానం చెప్పే లోగానే, "చూడు, హాలీవుడ్ వాళ్ళు ఏదో సినిమా తీస్తున్నారుట. వాళ్ళకి ఫారిన్ స్టూడెంట్స్ వాళ్ళవాళ్ళ దేశపు దుస్తులు వేసుకుని వస్తే వాళ్ళకి చిన్న వేషం ఇస్తారుట. ఉమకి చీర కట్టి తీసుకెళతావా?" అంది. నేనింకా తటపటాయిస్తూ ఉంటే, "వెళ్ళు. వాళ్ళు గంటకి నాలుగు డాలర్ల పాతిక సెంట్లు చొప్పున జీతం ఇస్తారుట, పైపెచ్చు లంచి కూడ పెడతారుట." లంచి పేరు వినగానే ప్రాణం లేచొచ్చిందో, నాలుగు డాలర్ల పాతిక సెంట్లు నసాళంలోకి ఎక్కేయో, సినిమాలో వేషం అనేసరికి ఉత్సాహం పుట్టుకొచ్చిందో కారణం చెప్పలేను కాని, మర్నాడు ఉదయం తొమ్మిదింటికల్లా నేను, ఉమ యూనివర్సిటీ అఫ్ సదరన్ కేలిఫోర్నియా కేంపస్ కి చేరుకున్నాం. అక్కడ హాలివుడ్ వాళ్ళు ఒక పెద్ద డేరా వేసి అందులో కాఫీలు, భోజనాలకి ఏర్పాట్లు చేసేరు. చుట్టూ సాంకేతిక నిపుణులు టోపీలు పెట్టుకుని హడావిడిగా తిరుగుతున్నారు. అందరి టోపీల మీద Graduate Class

of 68 అని రాసి ఉంది. ఎవ్వరినో అడిగితే చెప్పేరు, "అది వీరు తియ్యబోయే సినిమాకి అందాకా పెట్టిన పేరు" అని.

ఒకాయన వచ్చి, "అందరూ కాఫీలూ, టిఫిన్లూ తిని ఇక్కడే తిరుగుతూ ఉండండి. మేం ఎప్పుడు తయారుగా ఉంటే అప్పుడు పిలుస్తాం" అన్నాడు. నేను కుదురుగా ఊరుకోకుండా, వెళ్ళి, "అయ్యా! మరి మీరు మాకు ముట్టజెప్పే డబ్బుకి కాగితాల మీద సంతకాలు పెట్టాలా?" అని అడిగేను. "ఇప్పుడేమీ అక్కరలేదు" అన్నాడాయన. ఆ ప్రాంగణంలో ఒక అంబుస్పోటం (fountain) ఉంది. దాంట్లోంచి నీళ్ళు రాకుండా కట్టేసేరు. కనుక ఆ ఫౌంటెన్ చుట్టు ఉన్న చపటా మీద చతికిలపడ్డాం. ఇంతలో ఒక కుర్రాడు — పాతికేళ్ళు ఉంటాయేమో, చూడటానికి సగటు అమెరికన్ కంటె ఒక వాసి పొడుగులోనూ, అందంలోనూ తక్కువే ఉన్నాడు – పెద్ద ముక్కూ వాడూ, మోచేతుల మీద మాసిక వేసిన ఒక గోధుమ రంగు కార్డురాయ్ కోటు తొడుక్కుని వచ్చి ఉమ పక్కని చతికిల పడ్డాడు. పడి ఉమతో పిచ్చాపాటీ మొదలుపెట్టేడు. వాడి వాలకం ఉమకి నచ్చ లేదు. ముళ్ళ మీద కూర్చున్నట్లు వాడు అడిగినదానికి ఏదో సమాధానం చెబుతూ ఉంటే వాడు వెకిలి నవ్వు నవ్వుతున్నాడు. రాధని గోపాళమూ, సీగానపెసూనాంబని బుడుగూ రక్షించినట్లు నేను ఉమని వాడి బారి నుండి రక్షిద్దామనే సదుద్దేశంతో ఆ పక్కకి చేరి వాడితో ఏదో అనబోయే తరుణంలో, దూరం నుండి ఎవ్వరో, ఈ పెద్ద ముక్కువాడిని ఉద్దేశించి, "డస్టీ, ఆ కొసకి వెళ్ళి నువ్వు ఇటు నెమ్మదిగా నడుచుకు రావాలి. అక్కడికి వెళ్ళు" అని దూరంగా ఉన్న ఒక చెట్టుదగ్గరకి పంపించేడు. అప్పుడు మా అందరి వైపూ తిరిగి, "ఇప్పుడు మీరంతా ఒక క్లాసు నుండి మరొక క్లాసుకి వెళుతున్నారన్న మాట. క్లాసుకీ క్లాసుకీ మధ్య వ్యవధి తక్కువ కనుక మీరంతా గబగబ నడుస్తూ ఉంటారు. ఎవ్వరూ పరుగెత్త కూడదు. ఎవ్వరూ ఒకరినొకరు తోసుకుంటూ ముందుకి వెళ్ళకూడదు. ఎవ్వరూ కెమేరాల వైపు చూడ కూడదు. మీ మానాన్ని మీరు, మీ పక్కనున్న వాళ్ళతో మాట్లాడుతూ — కొందరు ఇటునుండి అటు, మరికొందరు అటునుండి ఇటు, అన్ని దిశలలోనూ నడవాలి" అని చెయ్యవలసిన పని చెప్పేడు. డస్టీ నడవటానికి ఒక నిమిషం పట్టింది. ఆ షాటు రెండు మూడు సార్లు తీసేరు. మేమంతా నడచిన భాగం రెండు మూడు చోట్ల నాలుగైదు షాట్లు తీసేరు. ఒకటి, లోపల మెట్లు దిగుతూనట్లు, రెండు, బయట పచ్చికలో, చెట్ల కిందా, ఇలా రకరకాల షాట్లు. ఒక చోట కేథరిన్ రాస్ పుస్తకాలు చేత్తో పట్టుకుని మెట్లు దిగి బయటకి వస్తున్నట్లు తీసేరు.

అప్పుడు ఎవ్వరో చెప్పేరు – ఈ అమ్మాయే ఈ సినిమాలో హీరోయిన్ లాంటిది అని. హీరో ఎవ్వరో ఎవ్వరూ చెప్పలేదు. ఈ వ్యవహారం అంతా అయేసరికి మూడు రోజులు పట్టింది. ఏరోజుకారోజు సాయంకాలం సినిమా కంపెనీ వారి ట్రక్కు ఒకటి వచ్చేది. అక్కడికి వెళ్ళి కాగితం మీద పేరు, ఎడ్రస్సూ, సోషల్ సెక్యూరిటీ నంబరు రాసిస్తే మనిషికి 34 డాలర్లు చొప్పున ఇద్దరికీ చెరో ముప్పైనాలుగూ ముట్టేయి. ఇలా మూడు రోజులలో ఇద్దరం కలసి $204 సంపాదించేం. ఈ మొత్తం అప్పట్లో నా నెల జీతం కంటె ఎక్కువ!

ఈ మూడు రోజుల పాటు జరిగిన షూటింగూ సినిమాలో తెర మీద ఒక నిమిషం కనిపిస్తుంది. ఈ సినిమాలో వేషం వేసిన డస్టిన్ హాఫ్‌మన్ అప్పటికి ఒక అనామకుడు. ఈ సినిమాలో వేషం వేసినందుకుగాను అతనికి $17,500 ఇచ్చేరు. వీడింత పెద్దవాడవుతాడని నేను కలలోనైనా ఊహించి ఉంటే వాడిని చూసి చీదరించుకోకుండా మరికొంచెం స్నేహభావంతో ప్రవర్తించేవాడినేమో. ఏ పుట్టలో ఏ పాము ఉంటుందో మనకి తెలియదు కనుక ఎవ్వరినీ చులకన చెయ్యకుండా, అందరినీ సమభావంతో చూడటం అలవాటు చేసుకోవటం మొదలుపెట్టేను.

**ముగ్ధగా మారిన బాల తార మా అతిథి కావటం**

లాలీవుడ్ అనుభవాలు చెప్పేను కనుక ఇహ ఒక టాలివుడ్ అనుభవం చెబుతాను. ఆ రోజుల్లో టాలీవుడ్ అనే మాట ఇంకా వాడుకలోకి రాలేదు కాని మద్రాసు నుండి శశికళ అనే బాల సినిమా తార మా ఊరు వచ్చింది. 'బాల' అంటే మా ఊరొచ్చేసరికి బాలేమీ కాదు – నవ యవ్వనంలో ఉన్న జాణ. కొంచెం పుష్టిగా, బొద్దుగా, పొట్టిగా ఉన్నా పిల్ల బాగానే ఉండేది. ఆమె చిన్నతనంలో ఒకటో, రెండో సినిమాల్లో చిన్న సావిత్రి గానో, చిన్న భానుమతి గానో వేషం వేసిందిట. ఏదైతేనేమి, ఎలాగొచ్చిందో నాకు తెలియదు కాని అమెరికా వచ్చింది. అప్పట్లో మా ఊళ్ళో లలితమ్మ గారని – కొంచెం పెద్దావిడే – కొడుకు దగ్గరకి చుట్టపు చూపుకి వచ్చింది. ఆమె సిఫార్సు మీద మా ఇండియా స్టూడెంట్ ఎసోషియేషన్ అధిపతిగా ఉన్న మాజేటి సత్యనారాయణ శశికళని భరతనాట్యం చెయ్యమని ఆహ్వానించేడు. వచ్చింది. డేన్సు చేసింది. కొద్దో గొప్పో పాట కూడా వచ్చేమో The Sound of Music లో 'డో, రే, మీ' పాట

కూడా పాడింది. బాగానే పాడింది. ఆ రోజుల్లో ఇలా ఎవరైనా ఆర్టిస్టులు కాని, రాజకీయ నాయకులు కాని వస్తే వాళ్ళని హోటేల్లో పెట్టి మర్యాదలు చేసే తాహతులు ఎవ్వరికీ ఉండేవి కావు కనుక వాళ్ళకి అతిథి సౌకర్యాలు సమకూర్చటం, కార్లల్లో తిప్పటం వగైరా బాధ్యతలు – మూలిగే నక్క మీద తాటిపండు పడ్డట్లు – మా మీద పడేవి. ఇలా వచ్చి మా చేత మర్యాదలు చేయించుకున్న వాళ్ళల్లో అన్నాదురై ఒకడు. శశికళ ఒకర్తె! అందులోనూ శశికళ పెళ్ళి కాని పిల్ల! అందుకని సత్యనారాయణ మా ఇంట ఆమెకి ఒక రోజు ఆతిధ్యం ఇవ్వమని ఉమని అడిగేడు. సరే అంది.

శశికళ, ఆమె అన్న మా ఒంటి పడక గది వాటికలో ప్రవేశించారు. అప్పటికే నేను, ఉమ, చంటి పిల్ల మా సీత అందులో ఉంటున్నాం. పడక గది మా సంసారానికి, కూర్చునే గది శశికళకి, ఆమె అన్నకి కేటాయించుకున్నాం. ఒక్క రోజు కదా, కళ్ళు మూసుకు సర్దుకు పోతే వచ్చిన నష్టం ఏమిటనుకున్నాం. ఒక రోజు అయింది. ఒక వారం అయింది. అతిథులు కదిలే సూచనలు కనబడలేదు. ఇవి చూపించండి, అవి చూపించండి అని వాళ్ళు అడుగుతూ ఉంటే, వాళ్ళకి కావలసినవి గబగబ చూపించెస్తే వాళ్ళు గబగబ వెళ్ళిపోతారన్న ఆశతో వాళ్ళని ఊరంతా తిప్పేము.

అయినా వాళ్ళు కదిలే సూచనలు కనబడలేదు.

ఈ కథనం ఇలా జరుగుతూ ఉండగా – రామాయణంలో పిడకల వేటలా – మరొక పిట్ట కథ పక్కని మొదలయింది. శశికళ మా ఇంట్లో ఉందని తెలిసి చలపతి అని ఒకాయన (హాశ్చర్యం ఏమిటంటే ఈయన లాస్ ఏంజిలిస్ శివారుల్లో ఉన్నాడన్న విషయం నాకు అంతవరకు తెలియనే తెలియదు!) ఫోను చేసి శశికళని కలుసుకోటానికి మా ఇంటికి వస్తానన్నాడు. ఇప్పటికే శశికళని వదిలించుకోవటం ఎలాగో తెలియక బిక్క మొహం వేసిన మేము అమె తరఫు వాళ్ళు వస్తామనేసరికి వాళ్ళు కూడా మా ఇంట్లో ఉండిపోతారేమోనని భయపడి మేమే శశికళని, ఆమె అన్ననీ లాంగ్ బీచి తీసుకెళ్ళేం.

అక్కడకి వెళ్ళిన తర్వాత చలపతి మరొక తెలుగాయనని పరిచయం చేసేడు. ఈయనే లలితమ్మ గారి కొడుకేమోనని నాకు చూచాయగా అనిపిస్తోంది ఇప్పుడు.

వీళ్ళిద్దరూ పాండవులలా ఇక్కడ అజ్ఞాతవాసం చేస్తున్నారా ఏమిటి?

ఇద్దరిని పాండవులతో పోల్చటం అలంకార దోషం కాదండోయ్!

'పంచపాండవులు మంచం కోళ్ళల్లా ముగ్గురు' అంటూ  రెండు వేళ్ళు చూపించటం జరిగింది కదా!

ఏమైతేనేమి, ఈ చలపతి గారికీ, ఈయన స్నేహితుడికీ శశికళ మీద పుట్టిన అభిమానానికి కారణం ఏమిటంటే వీళ్ళూ, వాళ్ళూ ఒకే కులం వారట! కులం కలిసింది కనుక మనసులు కూడా కలిసే అవకాశం ఉందేమోనని లలితమ్మ గారు అల్లిన సాలెగూడు లోకి మన మాజేటి సత్యనారాయణ అమాయకంగా నడిచి, అందులోకి నన్ను కూడా ఇరికించేడేమోనని ఇప్పుడు నాకు అనిపిస్తోంది. ఇంత పెద్ద వ్యూహం వెనక ఉండబట్టే శశికళ ఇబ్బందులకి ఓర్చుకుని మా ఇంట్లో కదలకుండా ఉండిపోటానికే నిశ్చయించుకుందన్న మాట!   ఇదేదో తెమిలి మేము పెళ్ళివారం అయేవరకు శశికళ మా ఇంటి నుండి కదిలే సూచనలు కనిపించ లేదు.

ఏమైతేనేమి చలపతి గారింటికి వెళ్ళేం. ఆయన మాత్రం మాకు మర్యాదలు బాగానే చేసేరు. ఆడ పెళ్ళివారం కదా! ఆయన మాకు మర్యాదలు చేస్తూ, పానీయాలు కలుపుతూ, హడావిడిలో ఉండి, ఎవ్వరినో ఎందుకో టెలిఫోనులో పిలచేరు. చలపతి గారికి కొంచెం నత్తి. కొంచెమేమిటి, నా మొహం. బాగానే ఉంది నత్తి! అందుకనే కాబోలు మాతో కూడ తెలుగులో మాట్లాడకుండా ఇంగ్లీషులోనే మాట్లాడుతున్నారు. టెలిఫోనులో అవతలి వాళ్ళు ఈయన పేరు అడిగినట్లున్నారు. ఈయన పేరు చెబుతున్నాడు. అద్దరి వారికి ఈ నత్తి సంసారం అర్థం కాలేదు. స్పెల్లింగు చెప్పమని అడిగినట్లున్నారు అట్నించి.

మనం స్పెల్లింగు చెప్పినప్పుడు International Standard Code ప్రకారం చెప్పాలి. అంటే చలపతి పేరుని Charlie, Hotel, Alpha, Lima, Alpha, Papa., ...అలా ఒక నిర్దుష్టమైన మాటలతో చెప్పాలని మన పవిత్ర భారతీయులకి తెలియదు. సినిమాలలో పోలీసులు ఈ పద్ధతి వాడుతూ ఉంటే వినే ఉంటారు. ఈ standard code తెలియక పోయినా, కనీసం Cat, Horse, Apple, Light...

అంటూ ఏదో తంటాలు పడ్డా ఈ అమెరికా వాళ్ళకి అర్థం అవుతుంది. మన చలపతి గారికి ఏ కోడూ, గుడ్డూ కూడ తెలిసున్నట్టు లేదు. నట్టేమిటి? తెలియదని తెలుస్తూనే ఉంది. ఈయన టెలిఫోనులో C as in చ...చ...చ్చ, ఛ్చ...చలపేటీ" అన్నాడు.

నవ్వితే బాగుండదు. చెపితే అర్థం చేసుకోరు. పైపెచ్చు చెప్పేరని కోపం వస్తుంది. నత్తి లేని వారికి కూడ ఉచ్చారణ దోషం ఎత్తి చూపితే కోపం వస్తుంది. ఓహియో కాదు ఒహాయో అనీ, శెన్‌జోస్ కాదు, సేన్ హొజే అనీ, లింకోలన్ కాదు లింకన్ అనీ, జిమ్మిక్కు కాదు గిమ్మిక్ అని చెప్పి చూడండి. మనల్ని A జాబితా లోంచి తీసేసి ఏ C జాబితాలోనో పడేస్తారు. అమెరికా వాళ్ళు చెబితే ఏమీ అనుకోరు కాని మనం చెప్పేమంటే మనకీ వాళ్ళకీ ఇక మాటలు ఉండవు!

ఇంతకీ చలపతి గారి స్నేహితుడు అసలు పెళ్ళి కొడుకు... ట. ఆయనకి పెళ్ళి మీద కాని, పిల్ల మీద కాని ఏమీ మోజు ఉన్నట్లే లేదు. తల్లి ఇరకాటంలో పడేసినట్లుంది. తనకి కాకపోతే కనీసం చలపతికైనా ఈ అమ్మాయి సరిపోతుందేమోనని ఆయన పైకి తేలిపోకుండా తన పాత్రని జాగ్రత్తగా పోషిస్తున్నాడు.

ఆయనకి Playboy క్లబ్బులో ఉద్యోగమో, సభ్యత్వమో ఉంది. అందుకని మమ్మల్ని అందరినీ ప్లేబోయ్ క్లబ్బుకి తీసుకెళ్ళేరు. కనుక మేము పడ్డ శ్రమకి కొంచెంగానైనా ఫలితం దక్కింది. మా అంతట మాకు వెళ్ళటానికి ఎలాగూ దమ్ములు లేవు.

కథని టూకీగా ముగించెస్తాను. శశికళ, ఆమె అన్నా, మా ఇంట్లో ఒక నెల్లాళ్ళు ఉన్నారు. ఏదో ఒక సంబంధం కుదిరే వరకు వెళ్ళే సూచనలు కనబడలేదు. కక్కొచ్చినా కల్యాణం వచ్చినా ఆగదంటారు. మాకు కక్కొస్తోంది కాని ఆమెకి కల్యాణ ఘడియలు వస్తూన్న దాఖలాలు కనబడ లేదు. అప్పటికే సత్యనారాయణ – పాపం – ఇరుకున పడిపోయేడేమో మాకు మొహం చూపించ లేదు. అలాగని ఈ సమశ్య మా నెత్తి మీద వదిలేసి దులిపేసుకుని వెళ్ళిపోయే రకం కాదు. చివరికి బలవంతాన్ని వాళ్ళిద్దరినీ మా ఇంట్లోంచి వెళ్ళగొట్టేడు.

అప్పటి నుండి ఇప్పటి వరకు ఇండియా నుండి మా ఇంటికి ఎవరైనా వస్తున్నారంటే – ప్రత్యేకం సినిమాల వాళ్ళు – మాకు సింహ స్వప్నమే!

## అమెరికాలో అరవైయవ దశకం

నేను 1961 లో డిట్రాయిట్ వచ్చిన దగ్గర నుండి 1968 లో యు. సి. ఎల్. ఎ. లో పి. హెచ్. డి. పట్టా పుచ్చుకుని, 1970 లో కేలిఫోర్నియా వదలి పెట్టి, లాఫయెట్, ఇండియానాలో, పర్డ్యూ యూనివర్సిటీలో ఉద్యోగం లో చేరే వరకు ఉన్న కాలాన్ని అమెరికా చరిత్రలో చాలా గణనీయంగా, "అరవయ్యో దశకం" (The Sixties) అని చెప్పుకుంటారు. ఒక్క సారి వెనక్కి తిరిగి చూస్తే ఈ దశాబ్దంలో జరిగిన మరపురాని సంఘటనలు, వాటి వెనక ఉన్న మనుష్యులు మనస్సులో మెరుస్తారు. కెన్నడీ కుటుంబం, క్యూబా లో జరిగిన సంఘటనల వల్ల అమెరికా–సోవియట్ యూనియన్ ల మధ్య యుద్ధం వచ్చినంత పని అవటం, ప్రెసిడెంట్ కెన్నడీ హత్య, మానవుడి చంద్రలోక యాత్ర, Woodstock, Bob Dylan, Led Zeplin, Beatles, Rolling Stones, LSD వంటి psychodelic drugs, హిప్పీలు, మార్టిన్ లూథర్ కింగ్ హత్య, మాల్కం X హత్య, రాబర్ట్ కెన్నెడీ హత్య, వియత్నాం యుద్ధానికి నిరసన ప్రదర్శనలు, సమాన హక్కుల కోసం నల్ల వాళ్ళ పోరాటం, సమాన హక్కుల కోసం ఆడవాళ్ళ పోరాటం, ఇలా పోరాడుతున్న వాళ్ళ మీద ఎఫ్. బి. ఐ. నిఘా వెయ్యటం, వీరితో సి. ఐ. ఏ. వారు చెయ్యి కలపటం, ఇలా అనేక కోణాల నుండి దేశంలో జరిగిన మార్పులని సమీక్షించవచ్చు.

ఈ దశాబ్దంలో, ఈ దేశంలో పరిస్థితి ఇంత అల్లకల్లోలంగా ఉండేదనిన్నీ, ప్రజలలో అసంతృప్తి బాగా ప్రబలి ఉండేదనిన్నీ, ప్రజలకీ, ప్రభుత్వానికీ మధ్య ఒక పెద్ద అగాధం ఏర్పడుతోందనిన్నీ నాకు మొదట్లో అంతగా అవగాహన కాలేదు. పరిస్థితి అర్థం అవటం మొదలు పెట్టినది 1964 లో లాస్ ఏంజిలిస్ లో విద్యార్థి దశ మళ్ళా ప్రారంభించిన తర్వాతే. అది కూడా నేను గది అద్దెకి తీసుకుని ఉంటూన్న ఇంటి ఆవిడ, రే ఆస్‌గుడ్, ప్రభావం వల్లనే అని నిస్సందేహంగా చెప్పగలను. టి. వి. మీద వార్తలు వచ్చినప్పుడు, ఆ వార్తల వెనుక ఉన్న పూర్వ గాధని ఆమె తన పట్టకం ద్వారా నాకు చూపించి, ఆమెకి రాజకీయ వాతావరణం పై ఉన్న అవగాహనని నాకు అర్థం అయే రీతిలో గుక్క తిప్పుకోకుండా చెప్పి వ్యాఖ్యానించేది. ఇంక ప్రభావితుణ్ణి కాక ఏమి చెయ్యగలను?

రే గంథర్ షికాలో పుట్టి పెరిగింది. ఆమె తల్లి పేరు బెర్తా; అప్పటి సోవియట్ యూనియన్ లోని ఉక్రెయిన్ ముఖ్య పట్టణం అయిన కియవ్ లో యూదుల వంశంలో పుట్టింది. చిన్నతనంలోనే అమెరికా వలస వచ్చి, షికాగోలో స్థిరపడి, దరిదాపు వంద ఏళ్ళు బతికి, 1970 దశకంలో ఎప్పుడో చనిపోయింది. రే తల్లి బెర్తా ఎంతటి అసాధ్యపు పిండం అంటే, ఎనభై ఏళ్ళ వయస్సులో షికాగో నుండి లాస్ ఏంజిలిస్ వరకు సొంతంగా రూట్-66 మీద కారు తోలుకుని (గంటకి 35 మైళ్ళకి మించని జోరుతో) కూతురిని చూడటానికి వచ్చింది! నేను ఆమెని చూసేను. తల్లికి, పిల్లకి ఒక్క క్షణం పడేది కాదు. ఆ తల్లి లాగే ఈ పిల్ల కూడ పండు ముసలి వయస్సు వరకూ బతికి మార్చి 2005 లో కాలధర్మం చెందింది.



రే యుక్త వయస్సులో ఎడ్వర్డ్ ఆస్గుడ్ అనే ఆసామీని పెళ్ళి చేసుకుని రే ఆస్గుడ్ అయింది. ఈ ఎడ్డీ తండ్రి పోలండ్ నుండి అమెరికా వలస వచ్చేడు. అతని పేరు ఆస్ట్రాస్కి. ఆ రోజుల్లో కాందిశీకులు నిండు పడవల్లో, తొంబ తొంబలుగా యూరప్ నుండి అమెరికా వలస వచ్చేవారు. ఇలా వలస వచ్చిన వారికి స్వాగతం పలికే సింహద్వారం నూ యార్క్ నగరపు హార్బరులో ఉన్న Ellis Island. ఈ ద్వారం గుండా 1892 నుండి 1945 వరకు 12 మిలియన్లు పైబడి ఇతర దేశాల వారు ఈ అమెరికాలో తల దాచుకుందుకి వచ్చేరు. వీరందరూ ఆరోగ్యంగా ఉన్నారో లేదో తనిఖీ చేసి, వీళ్ళ పేర్లని నమోదు చేసి, వీళ్ళు దేశంలో ప్రవేశించటానికి అనుమతి ఇవ్వటానికి పెద్ద సిబ్బంది ఉండేది. తొంబ తొంబలుగా వస్తూన్న ఈ జనాల పేర్లు నమోదు చెయ్యటం అక్కడ పని చేసే గుమస్తాలకి కొంచెం కష్టంగానే ఉండేది.

అందులోనూ పోలండు దేశం వాళ్ళ పేర్లు పలకటం కష్టం. వాటి వర్ణక్రమం (spelling) ఇంకా కష్టం. ఈ సందర్భంలో మన ఆస్ట్రాస్కీ పేరు లోని Os రాసిన తర్వాత ఎవ్వరో మరెవ్వరికో good luck అని చెబుతూ ఉంటే పరాకు చిత్తగిస్తూ పగటి కలలు కంటూన్న మన గుమస్తా ఆ Os తరువాత good అని రసేసేడు. ఆ చిన్న పొరపాటుతో మన ఆస్ట్రాస్కీ కాస్తా ఒక్క క్షణంలో Osgood అయిపోయేడు. ఇలా పరాకులో పేరు మారిన ఆసామీ కొడుకే మన రే గంథర్ ని పెళ్ళి చేసుకుని ఆమెని రే ఆస్గుడ్ గా మార్చేసేడు.

రష్యా సోవియట్ యూనియన్ గా మారిన తర్వాత అక్కడ స్టాలిన్ చేసిన దురంతాలకి రే బంధువులూ, స్నేహితులూ బలి అయ్యారు. కనుక స్టాలిన్ అంటే రేకి కిట్టేది కాదు కాని, ఆమెకి కమ్యూనిజం మీద అంత ఏహ్యాభావం ఉన్నట్లు అనిపించలేదు. ఇక హిట్లరు సంగతి సరేసరి. ఆరు మిలియన్ల (అంటే అరవై లక్షల) యూదులని కౄరంగా చంపించేడు హిట్లరు. ఈమె యూదుల సంతతి మనిషి కనుక సహజంగా ఈమెకి హిట్లరు అంటే ఎనలేని కోపం. హిట్లరు చేసిన దురాగతాలకి ఆమె స్పందించినంతగా నేను స్పందించకపోతే పదమూడేళ్ళ Anne Frank నాజీ కిరాతకుల బారి నుండి తప్పించుకుందుకి అటక మీద దాంకొని రాసుకున్న దినచర్య పుస్తకం నా చేత చదివించింది. అదొక హృదయ విదారకమైన విషాద గాథ.

అమెరికా ఆర్ధిక వాతావరణం కుదేలయిపోయిన గడ్డు రోజులలో పెరిగిందేమో, రే కి ప్రెసిడెంటు ఫ్రేంక్లిన్ రూజువెల్టు ఇష్టుడు. ఆయన భార్య ఎలనోర్ అంటే ఇంకా ఇష్టం. అందుకనే తన కూతురుకి ఎలనోర్ అని పేరు పెట్టుకుంది. ఆ తర్వాత వచ్చిన ప్రెసిడెంట్లు అంతా త్రికరణశుద్ధి లేని మనుష్యులు (hypocrites) అని కొట్టి పారేసేది. అప్పటి వరకు రాజకీయాలలో ఖాళీ పలకలా ఉన్న నా మెదడు మీద ఆమె భావాలతో ఒక రకం చిత్రణ ప్రారంభం అయిందని అనొచ్చు.

ఆ కాలపు రాజకీయ వాతావరణం సమగ్రంగా అర్థం కావాలంటే అప్పట్లో అమెరికా మనోస్థితి ఎలాగుండేదో మనకి అవగాహన కావాలి. 1945 లో మిత్రమండలి (అంటే, అమెరికా అని అన్వయం చెప్పుకోవచ్చు) చేతిలో జెర్మనీ, జపాన్ పరిపూర్ణంగా ఓడిపోయినప్పటికీ, అప్పటికే సోవియట్

యూనియన్ కి అమెరికాకి మధ్య ప్రచ్ఛన్న యుద్ధపు మేఘాలు కమ్ముకోవటం మొదలైంది. ఆగస్టు 1949 లో సోవియట్ యూనియన్ తమ అణు బాంబు ని పేల్చి అమెరికాకి అణ్వస్త్రాల మీద ఉన్న గుత్తాధికారానికి స్వస్తి వాచకం పలికింది. ఇంతలో పులి మీద పుట్రలా, రెండవ ప్రపంచ యుద్ధపు కాష్టాలు ఇంకా పూర్తిగా చల్లారకుండానే, జూన్ 1950 లో కొరియాలో యుద్ధం మొదలైంది. రెండవ ప్రపంచ యుద్ధంలో నిర్ద్వందంగా గెలిచిన అమెరికా ఈ కొరియా యుద్ధంలో నిక్కచ్చిగా గెలవ లేకా, ఓటమిని అంగీకరించలేకా, నలుగురిలో నగుబాటు పాలవటం ఇష్టం లేకా సంధికి ఒప్పుకోక తప్పింది కాదు. ఇటు కొరియా యుద్ధం ఇలా ముగిసిందనుకుంటూ ఉండగానే అటు వియత్నాం లో అమెరికా వేలు పెట్టి కెలకటం మొదలు పెట్టింది. ఫ్రెంచి వాళ్ళు 1954 లో వియత్నాం చేతిలో పరాభవం పొందటం, వియత్నాం రెండుగా చీలిపోవటం, ఉత్తర వియత్నాం కమ్యూనిస్టుల వశం కావటంతో ఏర్పడిన శూన్యం లోకి అమెరికా తల దూర్చింది. సోవియట్ యూనియన్ ఉత్తర వియత్నాంని సమర్ధించటంతో అప్పటికే యూరప్‌లో ప్రారంభమైన ప్రచ్ఛన్న యుద్ధం క్రమేపీ ఆసియా ఖండంలోకి పాకడం మొదలు పెట్టింది. ఆసియా ఖండంలోని ఇతర దేశాలు కూడ ఒకటీ, ఒకటీ కమ్యూనిస్టుల వశం అయిపోతాయేమోనన్న భయంతో (దీనినే Domino theory అంటారు) అమెరికా దక్షిణ వియత్నాం లో నియంతగా రాజ్యం ఏలుతూన్న డియం కి దన్నుగా సలహాదారులని పంపటం మొదలెట్టింది. ప్రెసిడెంట్ కెన్నడీ చనిపోయేనాటికి దక్షిణ వియత్నాం లో 16,000 మంది అమెరికా సలహాదారులు ఉండేవారు. అప్పటికే అమెరికా ప్రభుత్వపు ప్రోత్సాహంతో డియం చంపబడ్డాడన్నది నగ్న సత్యమే అన్న విషయం గతంలో ఒక సారి ప్రస్తావించేను.

నేను ఇండియనాపొలిస్ వదలి పెట్టి లాస్ ఏంజిలిస్ ప్రయాణం అయే తరుణంలోనే ఉత్తర వియత్నాం సముద్ర తీరంలోని గల్ఫ్ అఫ్ టాంకిన్ లో గస్తీ తిరుగుతూన్న అమెరికన్ యుద్ధ నావల మీద ఉత్తర వియత్నాం తుపాకులు పేల్చిందని ఒక వార్త వచ్చింది. లేని మారణాయుధాలు ఉన్నాయని ప్రజలని నమ్మించి ఇరాక్‌తో అమెరికా ఎలా యుద్ధం లోకి దిగిందో అదే విధంగా అమెరికా ప్రభుత్వమే గల్ఫ్ అఫ్ టాంకిన్ లో ఈ కథని సృష్టించి, లేని పోని ఆరోపణలు ఉత్తర వియత్నాం మీద వేసి, ఈ కట్టు కథలతో ప్రజలని, కాంగ్రెస్ నీ రెచ్చగొట్టి కాంగ్రెస్ మద్దత్తు సంపాదించి, ప్రెసిడెంటు జాన్సనూ, సెక్రటరీ మేక్‌నమారా వియత్నాం మీద యుద్ధం ప్రకటించకుండానే యుద్ధం చెయ్యటం మొదలు పెట్టేరని రే నెత్తీ, నోరూ బాదుకునేది. (ఈ గూడుపుఠాణీకి సంబంధించిన విషయాలే Pentagon Papers లో

డేనియల్ ఎల్స్‌బర్గ్ వెల్లడి చేసిన తర్వాత రే అభిప్రాయాలలో ఎంత నిజం ఉందో నాకు వెల్లడి అయింది.) ఇలా కయ్యానికి కాలు దువ్వి అమెరికా యుద్ధం లోకి దిగటం చక చకా ఆగస్టు మొదటి రెండు వారాలలోనూ అయిపోయింది.

యుద్ధం చెయ్యటానికి సైన్యం ఉండాలి కదా. ఆ రోజులలో 18 నుండి – 26 ఏళ్ళు వయస్సు ఉన్న ప్రతి మగాడు తప్పనిసరిగా, అవసరం వెంబడి, మిలటరీలో పనిచేసి తీరాలని ఒక నిబంధన ఉండేది. కాంగ్రెస్ యుద్ధం చెయ్యాలనే తీర్మానం చేసిన ఉత్తర క్షణంలో వయస్సులో ఉన్న మగ పిల్లలకి మిలటరీ లో జేరమని ఆహ్వానాలు వెళ్ళటం మొదలయాయి. నేను యు. సి. ఎల్. ఎ. లో చేరటం ఈ మిలటరీ పేరంటానికి పిలుపులు బట్వాడా కావటం దరిదాపు ఒకే సారి జరిగేయి. ఈ పిలుపుని ఇంగ్లీషులో draft అంటారు. నేను ఇక్కడ ఆహ్వానాలు, పేరంటాలు, పిలుపులు అని వాడుతూన్న మాటలు వ్యంగ్యోక్తి; ప్రభుత్వం దగ్గర నుండి పిలుపు వచ్చిందంటే అది తిరస్కరించటానికి వీలు లేని రాజాజ్ఞ. పిలుపు అందుకుని తక్షణం వెళ్ళక పోతే వారికి జైలు శిక్ష పడుతుంది. ఆరవయ్యవ దశకపు ఉత్తరార్ధంలో ఈ పిలుపులకి లోబడి దరిదాపు 15 లక్షల (ఒకటిన్నర మిలియన్ల) యువకులు సైన్యంలో చేరి యుద్ధం చెయ్యవలసి వచ్చింది. ఇలా యుద్ధం చేసిన వారిలో దరిదాపు నలభై వేల మంది చచ్చిపోయేరు.

యుద్ధానికి పిలుపంటే వచ్చింది కాని, యుద్ధం చెయ్యాలన్న ఆతృత అందరిలోనూ రాలేదు. చాలమంది కుర్రాళ్ళు, 'కాలేజీలో చదువుకుంటున్నాము, చదువైన తర్వాత యుద్ధం చేస్తాం' అని సాకు చెప్పి మేస్టర్స్ డిగ్రీలలోనూ, డాక్టరేట్ డిగ్రీ చదువులలోనూ తొంబ తొంబలుగా జేరటం మొదలు పెట్టేరు. ఈ రకం సాకునే educational deferement అనే వారు. నేను యు. సి. ఎల్. ఎ. లో ఉన్న రెండవ సంవత్సరం ఈ రకం విద్యార్థులు చాల మంది తారస పడేవారు. ఈ రకానికి చెందినవాడే వెస్లీ కాక్స్ (Wesley Cox) అనే కుర్రాడు. మొదట్లో నా సహాధ్యాయి, తర్వాత నాకు, ఆ తర్వాత మా సంసారానికీ స్నేహితుడు అయేడు. ఇతనే మొట్టమొదట మన తెలుగు వాళ్ళ ఉచ్చారణలో V కి, W కీ మధ్య విభేదం చూపించటం లేదని నాకు ఎత్తి చూపించేడు. నేను అతని పేరుని Vesley అని ఉచ్చరిస్తున్నానని దానిని Wesley అనాలని నా నోరు, బుగ్గలు, అన్నీ పట్టుకుని సరిగ్గా పలికించేవాడు. ఇతని గురించి చెప్పవలసినవి ఇంకా చాలా ఉన్నాయి కాని, ప్రస్తుతం చెప్పుకోదగ్గది ఇతను అమెరికా వాయుదళాలలో

మేజర్ గా పని చేస్తూ, యుద్ధం లోకి వెళ్ళవలసి వస్తుందని educational deferment పుచ్చుకుని Ph. D. ప్రోగ్రాము లో చేరేడు. ఈ కుర్రాడు రిపబ్లికన్ పార్టీకి ఓటు వేసేవాడు. ప్రస్తుతం మన అధ్యక్షుడుగా ఉన్న బుష్, ఉపాధ్యక్షుడుగా ఉన్న చేనీ కూడ ఇలా యుద్ధం చెయ్యకుండా సాకు చెప్పి తప్పించుకున్న వాళ్ళే; ఇప్పుడంటే శ్రీరంగ నీతులు చెబుతున్నారు కానీ!

ఈ సందర్భంలోనే, వయస్సులో ఉన్న మగ పిల్లలు ఇళ్ళల్లో ఉన్న కొద్దిమంది భారతీయ కుటుంబాలలో కొందరు అమెరికా శాశ్వతంగా వదలి పెట్టేసి కెనడా వలస వెళ్ళిపోయేరు. ఇలా వెళ్ళిపోయిన వారిలో నాకు స్వయంగా తెలుసున్న వారు కొందరు ఉన్నారు. ఆ మాటకొస్తే నాకూ వియత్నాం నుండి పిలుపు వచ్చి ఉండేదే. నేను యు. సి. ఎల్. ఎ. లో ఉన్న రెండవ సంవత్సరంలో గ్రీన్ కార్డు ఉంటే కేలిఫోర్నియా నివాసిగా పరిగణించబడతాననీ, తద్వారా out of state tuition తప్పుతుంది అనీ ఆశపడి గ్రీన్ కార్డ్ కి దరఖాస్తు పడేసేను. అది కొంప ముంచింది. ఆ దరఖాస్తు మీద ఇంకా ఏ నిశ్చయమూ చెయ్యకుండానే ముందుగా నన్ను Draft Board వారి దగ్గరకి పంపించేరు. ఇప్పుడంటే మా ఆవిడ సంరక్షణలో పోతరించిన శరీరంతో ఇలా ఉన్నాను కాని ఆ రోజులలో బాగా బక్కగా నూరు పౌనులకి మించి ఉండేవాడిని కాదు. అదే నన్ను రక్షించింది. నా లాంటి వాడు మిలటరీలో జేరితే యుద్ధం చేసేవాళ్ళ కాళ్ళకి అడ్డు పడటం తప్ప మరొక ప్రయోజనం ఉండదని నాకు unfit for military service అంటూ 5F classification ఇచ్చి పొమ్మన్నారు. వాళ్ళు పంపి ఉంటే నేను మిలట్రీ వాడిగా ఎలా ఉండేవాడినో మీ ఊహకి వదిలేస్తాను.

ఫిబ్రవరి 1965 నుండి వియత్నాం యుద్ధం బాగా పుంజుకుంది. జాన్సన్ విమాన దళాలని విస్తారంగా ఉపయోగించి ఉత్తర వియత్నాం ని నేలమట్టం చేసెయ్యటానికి ఉపక్రమించేడు. అదే నెలలో మొదటిసారిగా సైన్యాన్ని (అంతవరకూ సలహాదారులు అన్నారు, అప్పటి నుండి సైన్యం అనటం మొదలు పెట్టేరు) దక్షిణ వియత్నాం కి పంపటం మొదలు పెట్టేడు.

ఎక్కడైనా సరే యుద్ధం మొదలైన వెంటనే మొట్టమొదట ఆ యుద్ధానికి బలి అయ్యేది సత్యసంధత. ఆ ఉద్రేకపు వేడిలో ఎవ్వరు నిజం చెబుతున్నారో ఎవ్వరు అబద్ధం చెబుతున్నారో చెప్పటం కష్టం. తనకున్న

అన్ని హంగులనీ కదిలించి ప్రభుత్వం propaganda మొదలు పెడితే దానిని ఎదుర్కొనటం కష్టం. ఈ వాతావరణంలో యుద్ధానికి వ్యతిరేకించి మాట్లాడితే దాన్ని దేశద్రోహంగా పరిగణించటానికి వెనుకాడని బలవత్తర శక్తులు ప్రతీ సంఘంలోనూ ఉంటాయి. పైపైకి స్వతంత్రం, ప్రాథమిక హక్కులు, మానవ హక్కులు, చట్ట సమ్మతమైన ధర్మ యుద్ధం మొదలైన నినాదాలతో ఎన్ని గప్పాలు కొట్టినా ఈ అమెరికా ఇటువంటి బలహీనతలకి అతీతురాలు కాదు. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులలో జపాను నుండి అమెరికా వచ్చి ఇక్కడే పుట్టి పెరిగిన పౌరులని కారణం లేకుండా అనుమానించి, వారి ఆస్తులన్నీ జప్తు చేసి, కనీసం న్యాయస్థానం లో తీర్పు అనే అత్తి ఆకునైనా అడ్డు పెట్టుకోకుండా బందిఖానాలో పడేసింది ఈ దేశం. ఒక్క తరం క్రిందటే విస్కాన్సిన్ సెనేటర్ జోసెఫ్ మెకార్తీ విచక్షణ లేకుండా తనకి ఇష్టం లేని వారందరూ కమ్యూనిస్టులు, దేశద్రోహులు అని నేరారోపణ చేసి ఎందరినో దుమ్మెత్తి పోయటంతో ఎంతో మంది ఈ కమ్యూనిస్టు ముద్రని చెరుపుకోలేక నాశనం అయిపోయేరు. వియత్నాంలో యుద్ధం చేస్తూన్నది కమ్యూనిస్టులతో అని ప్రభుత్వం అంటోంది కనుక యుద్ధానికి వ్యతిరేకంగా మాట్లాడితే ఆ మాట శత్రువుని సమర్ధించినట్లే అని కొంతమంది ప్రజల బుర్రల్లో నాటుకు పోయింది. ఇటువంటి భయపూరితమైన వాతావరణంలో ఏన్ ఆర్బర్ లో ఉన్న యూనివర్సిటీ అఫ్ మిషిగన్ లో ఒక అనూహ్యమైన సంఘటన జరిగింది.

విద్యార్థుల ఆధ్వర్యంలో జరిగిన ఈ సంఘటనని ఇంగ్లీషులో teach-in అన్నారు, ఆ రోజులలో. ఈ మాట ఇంగ్లీషు భాషలో అంత వరకు లేదు; అప్పుడే పుట్టింది. Teach-in అంటే కూర్చోపెట్టి పాఠం చెప్పటం అన్నది వాచ్యార్థం. వీళ్ళు వినే పాఠం గురువులు చెప్పేది కాదు; వాళ్ళకి వాళ్ళే ఒకళ్ళకొకళ్ళు చెప్పుకునేది. వియత్నాంలో జరుగుతూన్న యుద్ధం ధర్మ యుద్ధం కాదనిన్నీ, ఆ యుద్ధం గురించి ప్రభుత్వం అన్నీ అబద్ధాలు చెప్పి ప్రజలని మోసగిస్తోందనిన్నీ, నిజం తెలుసుకోవాలంటే అందరూ ఆ రాత్రి ఒక పెద్ద హాలులో సమావేశం కావాలనీ పెద్ద ఎత్తున ముందు ప్రచారం జరిగింది. విద్యార్థులు ప్రభుత్వం మీద చేసిన తిరుగుబాటులో ఇది మొదటి అధ్యాయం కనుక చారిత్రాత్మకంగా ఈ సమావేశానికి చాల విలువ ఉంది. మొదట్లో విద్యార్థులు బంధ్ చేద్దామనుకున్నారు. తర్వాత ఘెరావ్ చేద్దామనుకున్నారు. విశ్వవిద్యాలయపు అధికారులతో ఈ బంధ్ గురించి సంప్రదింపులు జరుతూ ఉండగా ఎవ్వరికో స్పురించింది – విశ్వవిద్యాలయపు అధికారుల ఆలోచనా సరళి తమకి వ్యతిరేకంగా

లేదని. విశ్వవిద్యాలయం పాఠాలు నేర్చుకునే ప్రదేశం కనుకనున్నూ, పాఠం అంటే పుస్తకాలలో ఉన్న విషయమే కానక్కర లేదనిన్నీ, జీవితమే ఒక పాఠ్య పుస్తకం కనుక వియత్‌నాం లో యుద్ధం చెయ్యటం వల్ల తమ జీవితం ఎలా బుగ్గి అయిపోతున్నాదో వివరిస్తూ పాఠాలు చెబుతాం రండి అంటూ విద్యార్థులందరికీ అహ్వానాలు వెళ్ళేయి. ఆ రాత్రి అంతా అక్కడికి చేరిన అమ్మాయిలూ, అబ్బాయిలూ జీవితంలో అసలు నిజం ఏమిటో తెలుసుకున్నారు. వారికి జ్ఞానోదయం అయింది. ఈ సంఘటన తర్వాతే love-in, sit-in మొదలైనవి ఎన్నో పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చేయి. ఇంతింతై, వటుడింతై అన్నట్లు ఈ తిరుగుబాటు దేశం అంతా వ్యాపించి సంవత్సరాంతానికి 80 ఊళ్ళల్లో లక్ష మందికి పైగా నిరసన తెలుపుతూ వీధులమీద పడ్డారు.

వియత్‌నాం యుద్ధాన్ని ధిక్కరించినది ఒక విద్యార్థులే కాదు. అమెరికాలో ఉన్న నీగ్రోలు కూడ యుద్ధాన్ని సమర్ధించలేదు. నలుగురితో కలసి నీళ్ళు తాగటానికి వీల్లేదు, బస్సుల్లో కూర్చుందుకి వీల్లేదు, ఇళ్ళు కొనుక్కుందుకి వీల్లేదు, ఓట్లు వెయ్యటానికి వీల్లేదు. కానీ యుద్ధం వచ్చే సరికి అందరికంటే ముందస్తుగా నల్లవాళ్ళని ఎంపిక చేసి యుద్ధ ఫిరంగులకి మేతగా వేసే ఈ ప్రభుత్వపు పోకడ నల్ల వాళ్ళకి నచ్చ లేదు. పైపెచ్చు పౌర హక్కుల కోసం వీళ్ళ తరఫున పోరాడుతున్న మార్టిన్ లూథర్ కింగ్ ని ఒక తెల్ల వాడు తుపాకితో పేల్చి చంపేసేడు. దీనితో నల్లవాళ్ళకి చిర్రెత్తుకొచ్చి యుద్ధానికీ, సంఘానికీ ఎదురు తిరిగేరు. చెయ్యగలిగినది ఏమీ లేక దేశం నలుమూలలా తాము నివసించే పేటలకే నిప్పెట్టి తగలెయ్యటం మొదలు పెట్టేరు. భగ భగ కాలిపోతూన్న అమెరికాని ప్రతి రోజూ టి. వి. మీద చూపించేవారు.

ఈ తిరుగుబాటుకి వియత్‌నాం యుద్ధం ఒక ప్రేరణ కారణం మాత్రమే. అసలు కారణాలు అనేకం. ఈ అరవయ్యో దశకం మొదలయ్యే నాటికి అమెరికా జనాభాలో దరిదాపు సగం మంది 18 ఏళ్ళ లోపు వాళ్ళు. అమెరికా ఆ రోజులలో ఎనలేని ఐశ్వర్యంతో తులతూగుతూ ఉండేది. ఈ సంఘాన్నే జాన్ కెన్నెత్ గాల్బ్రెయిత్ The Affluent Society అన్న పుస్తకంలో వర్ణించేరు. మూడు పడక గదులు ఉన్న మధ్య తరగతి ఇల్లు శేన్ హొసే లో 17 వేల డాలర్లకి వచ్చేది (ఇది కల కాదు, పచ్చి నిజం; దువ్వూరి తిరుమలేశ కొన్నాడు). ఇప్పుడు అదే ఇల్లు ఉరమరగా మిలియను డాలర్లు! గేలను పెట్రోలు 30 పైసలైతే, గేలను పాలు నలభై పైసలు. పోస్టు కార్డు మూడు పైసలు. పంచరంగుల టి. వి. లు వచ్చిన తర్వాత పుస్తకాలు చదివే అలవాటు క్రమేపీ తగ్గినా నల్ల వాళ్ళకి జరిగిన అన్యాయాల నేపథ్యాన్ని

ఇతివృత్తంగా తీసుకుని హార్పర్ లీ రాసిన To Kill a Mocking Bird వంటి పుస్తకాలు బాగా జనాదరణ పొందేయి. ఈ రోజులలోనే రేచల్ కార్సన్ రాసిన Silent Spring అనే పుస్తకం DDT వల్ల జరిగిన హానిని వేలెత్తి చూపించి పర్యావరణ ఉద్యమానికి నాందీ వాక్యం పలికింది.

తెల్లారి లేవగానే టి. వి. మీద ప్రతి రోజూ ఇవన్నీ పంచరంగులలో చూసే అవకాశం కలిగింది. ప్రపంచం క్రమేపీ చిన్నది కావటం మొదలైంది. వియత్నాం యుద్ధం పంచరంగులలో చూసి చూసి, అసలు విషయం అర్థం చేసుకుని, ప్రజలు తిరగబడ్డారు. ఈ తిరుగుబాటుని సూక్ష్మంగా ఇలా వర్ణించవచ్చు. పోలీసులు కట్టిన 'బేరికేడు' కి ఒక పక్క తమ హక్కుల కోసం పోరాడే ప్రజలు, మరొక పక్క శాంతిభద్రతలు నిలపటానికి ప్రయత్నించే పోలీసులు. ఎఫ్. బి. ఐ. వారు శాంతిభద్రతలు నిలిపే మిష మీద పౌరుల దైనందిన చర్యల మీద నిఘా వేసి మెకార్తీ రోజులని జ్ఞాపకం చెయ్యటం మొదలు పెట్టేరు. ఈ ఎఫ్. బి. ఐ. పన్నిన ఉచ్చులో అన్ని రకాల అతివాదులు, తీవ్రవాదులు, సామాన్య మానవతా వాదులు, పర్యావరణ పరిరక్షకులు, ఓటు హక్కు కోసం పోరాడే నల్ల వాళ్ళు, స్త్రీల హక్కుల కొరకు పోరాడే ఆడవాళ్ళు, ... ఇలా విచక్షణ లేకుండా అందరూ పడ్డారు.

ఎఫ్. బి. ఐ. వారు తమ ప్రజల మీద నిఘా వెయ్యటమే కాకుండా ఆకాశరామన్న ఉత్తరాలు రాసి భయపెట్టటం, ఆదాయపు పన్ను చెల్లించకుండా ఎగ్గొటుతున్నారని నిందారోపణ చేసి ప్రజల జీవిత నేపథ్యాలని శోదా చెయ్యటం – ఇలా ఏదో ఒక విధంగా ఈ సంచలనం సృష్టిస్తున్న నాయకుల పరువు ప్రతిష్టలని మంటగలిపి వాళ్ళని నిస్తేజంగా చెయ్యటానికి కుట్రలు పన్నేవారు.

రే ఆస్గుడ్ ఉంటూన్న ఇంటి పక్క ఇంట్లోనే ఒక ఎఫ్. బి. ఐ. ఏజంటు ఉండేవాడు. అతను తన మీద నిఘా వేసేడని రే రోజూ నాతో చెప్పేది. అప్పట్లో ఆమె మాటలు నేను నమ్మలేదు కానీ ఇప్పుడు నమ్ముతున్నాను. ఎందుకుట? నేను ఈ వ్యాసం రాస్తూన్న రోజునే టి. వి. మీద వార్త చూపించేరు. టెరరిస్టులని వేటాడే నెపంతో పౌర హక్కుల కోసం పోరాడే సంఘాలెన్నింటినో ఎఫ్. బి. ఐ. వారు నిఘా వేసి చూస్తున్నారట. ఇది చట్ట విరుద్ధంట. మనం పంపే e-mail లు మనకి తెలియకుండా ప్రభుత్వం వారు చదవగలరు. మనం టెలిఫోనులో ఎప్పుడు, ఎవ్వరితో, ఏమి మాట్లాడుకుంటున్నామో ప్రభుత్వం

వారు తెలుసుకోగలరు. మనం గణించుకున్న డబ్బుని మనం ఎలా ఖర్చు పెడుతున్నామో ప్రభుత్వం వారికి తెలుసు. తలుచుకుంటే మన పడక గదులలోకి ప్రభుత్వం వారు తొంగి చూడగలరు. ఇదంతా మన స్వతంత్రం కోసం మనం చేస్తూన్న పోరాటం!

వియత్నాంలో యుద్ధం సంగతి అటుంచి మన భారతీయులకి ఉపయోగపడే సంఘటన ఒకటి జరిగింది ఈ దశకంలో. పెసిడెంట్ జాన్సన్ హయాంలోనే immigration చట్టంలో పెను మార్పులు వచ్చేయి. అంతవరకు ఈ దేశంలోకి వలస రావాలంటే తెల్ల తోలు గల ఐరోపా వారికి సుళువుగా ఉండేది. చదువును బట్టీ, అర్హతలని బట్టీ ఈ దేశంలోకి వలస రాడానికి వీలుగా చట్టంలో మార్పులు చేసేరు. నేనెలాగా ఇండియా వెళ్ళిపోదామనే లెక్కలోనే ఉన్నాను కనుక ఈ మార్పులకి నేను స్పందించలేదు. కాని ఒక రోజు మా గురువు గారు, ప్రొఫెసర్ కార్ప్లస్ నన్ను పిలచి immigrant visa కి దరఖాస్తు పడెయ్య మన్నారు. ఆయన అడిగేరు కదా అని దరఖాస్తు నింపి పడేసేను. తరువాత తెలిసింది ఆయన భావమేమిటో. నేను ఇమ్మిగ్రెంటు అయితే నా తరఫున స్కూలువాళ్ళకి ఆయన చెల్లిస్తూన్న రుసుం తగ్గుతుంది. ఈ ఇమ్మిగ్రేషన్ కాగితాలు కదలి నాకు వీసా వచ్చేసరికి నా చదువు అయిపోయింది. మా గురువు గారి డబ్బు ఆదా చేద్దామనే వ్రతం చెడింది కాని, నాకు గ్రీన్ కార్డ్ ఫలం దక్కింది.

## తెలుగులో రాయాలన్న కోరిక పుట్టటం

మా ఇంట్లో అష్టముఖ పారాయణం అప్పుడప్పుడు జరిగేదని చెప్పేను కదా. ఆ తంతేదో అయిన తర్వాత కొంత సేపు కబుర్లు చెప్పుకుని ఎవరి ఇళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయేవారు. ఒక నాడు ఈ కబుర్లు వాదనలోకి దింపేయి. తెలుగు వాళ్ళు కలిసినప్పుడు ఒక్క వాదనేం ఖర్మ, కొట్టుకుని కోర్టుకి వెళ్ళిన సందర్భాలు కూడా ఉన్నాయి కనుక వాదన చాలా చిన్న విషయం. ప్రసక్తి ఎప్పుడు ఎలా పుట్టుకొచ్చిందో చెప్పలేను కాని, 'సైంటిఫిక్ విషయాలు రాయడానికి తెలుగు పనికి రాదు, తెలుగులో ఆ సత్తా లేదు' అని సుందర్రావు వాదించడం మొదలు పెట్టేడు. ఇంటర్ 1954 లో పూర్తి చేసిన తర్వాత నాకు తెలుగుతో పరిచయం క్రమేపీ తగ్గి పోయిందనే చెప్పాలి. కాని సుందర్రావు అలా పేట్రేగి పోతూ ఉంటే చూస్తూ ఎలా ఊరుకుంటుంది తెలుగు రక్తం – మీరే చెప్పండి? కనుక నేను సుందర్రావుతో ఏకీభవించలేను అన్నాను. సుందర్రావు ఏదో పెద్ద రచయిత అనుకునేరు! నాకు తెలిసినంత వరకు అతనికి వాదించటంలో ఉన్న పాండిత్యం భాషలో ఉందని అనుకోను. కనుక ఇద్దరం ఒక గంట సేపు థియరిటికల్ గా వాదించేసుకున్నాం. ఆఖరికి ఈ వాదన you how much? అంటే you how much? (నువ్వెంతంటే నువ్వెంత!) వరకూ దిగజారిపోయే లోగా, ఈ వాదనని తెగ్గొట్టడానికి "నేను రాసి చూపిస్తాను కాసుకో!" అంటూ సవాలు చేసేను.

సవాలంటే చేసేసేను కాని తెలుగులో రాయటం అనేది అనుభవం లేని వ్యవహారం. నా చిన్నతనంలో మా పెద్దన్నయ్య – సూర్యం అన్న కలం పేరుతో కొన్నాళ్లు, వి. వి. సూర్యనారాయణ అన్న పేరుతో కొన్నాళ్ళూ – ఆనందవాణి, స్వతంత్ర, చిత్రగుప్త, ఆంధ్రపత్రిక మొదలైన పత్రికలలో తరచు కథలు రాసేవాడు. మా పెద్దన్నయ్య స్నేహితులు ఈరంకి వెంకట్రావు, మారేమండ రామారావు కూడ రాసేవారు. ఆ కథలు చదివి అలా తెలుగులో కథలు రాయాలనే కోరిక చిన్నప్పుడు ఉండేది కాని, రాయగలిగే స్థోమత ఉందని ఎప్పుడూ అనుకోలేదు. ఈ రకం అభిలాష, పాటవం నాలో ఉన్నాయేమోనన్న అనుమానం మొట్టమొదటగా వచ్చినది నేను బందరులో హిందూ కాలేజీలో ఇంటర్మీడియేట్ చదువుతూన్న రోజుల్లో.

బందరులో మాకు వేమూరి వెంకట్రామయ్య గారు (బంధుత్వం లేదు) తెలుగు పాఠం చెప్పేవారు. సూరపనేని వాడి ప్రభావం వల్ల పద్యాలు చదివి అర్థం చేసుకోవడం వచ్చిందేమో, కౌముదీ మహోత్సవం నాటకంలో పద్యాలు  మేష్టారు చదివి అర్థం చెబుతూ ఉంటే వినకుండా వెనక బెంచీలో కూర్చున్న నేనూ, ధూళిపాళ లక్ష్మణ రావూ ముందు పేజీలో ఉన్న మరొక పద్యం చదివి కిచకిచ మన్నాం. మేష్టారికి కోపం వచ్చి మమ్మల్ని ఇద్దరినీ లేచి నిలబడమన్నారు – బెంచీ మీద కాదు, నేల మీదే! నిలబడ్డాం. "ఏం? గోదావరి నీళ్ళ పైత్యం ఎక్కువయిందేమిటి?" అన్నారు. నేను తూర్పు గోదావరి వాడిని. లక్ష్మణరావు పశ్చిమ గోదావరి వాడు. ఈ విషయం కృష్ణా జిల్లా వాస్తవ్యులైన ఈ తెలుగు మేష్టారికి ఎలా తెలిసిందో నాకు తెలియదు. చేసిన తప్పు ఒప్పేసుకుని, నోరు మూసుకుని, తల దించుకుని నిలబడ్డాను. నా పక్కనున్న లక్ష్మణ రావు, "మేష్టారూ, తప్పే చేసేం. అందుకని మమ్మల్ని తిట్టండి, పడతాం. కావలిస్తే కొట్టండి, పడతాం. కాని, మా గోదావరిని చులకన చేసేరంటే మాత్రం మేం పడం" అన్నాడు. క్లాసు అయిపోయిన తర్వాత బయటకి వచ్చి, "ఈయనకి కృష్ణ నీళ్ళకి వేడెక్కి ఉంటుంది, గోదావరి నీళ్ళు పైత్యం చేసేయంటారా?" అంటూ ఒక గంట సేపు గునిసేడు. ఈ ధూళిపాళ లక్ష్మణరావు తర్వాత ఇంగ్లీషులో పి. హెచ్. డి. చేసి కాకినాడలో ఉన్న పోస్ట్ గ్రేడ్యుయేట్ సెంటర్‌లో ఉపాధ్యాయుడిగా పనిచేసేడు. ఇతని ప్రభావం వల్ల ఇంగ్లీషు మీద, సూరపనేని వెంకట్రామయ్య ప్రభావం వల్ల తెలుగు మీద నాకు కొంత ఆసక్తి పుట్టిన మాట నిజం. (గ్రూపులో ఎవరి ప్రభావం అక్కర లేకుండానే బాగా మార్కులు వచ్చేవి.)

తెలుగులో ఆసక్తికి మరొక చిన్న కారణం కూడా ఉండుండచ్చు. బందరులో సర్కిల్ పేట నుండి హిందూ కాలేజీకి వెళ్ళే దారిలో త్రివేణి ప్రెస్ అని ఒక మేడ ఉండేది. అక్కడ నుండి త్రివేణి అనే పత్రిక వెలువడేది. నాకు జ్ఞాపకం లేదు కాని ఈ పత్రిక ఏడాదికి నాలుగు సార్లు వచ్చేదని అనుమానం. ఈ భవనంలో చిన్న గ్రంథాలయం లాంటిది ఉండేది. కాలేజీకి వెళ్ళే దారే కనుక తరచు అక్కడ ఆగి, ఆ పత్రికాలయంలో త్రివేణి పత్రిక క్రమం తప్పకుండా చదివేవాడిని. ఎంతో బాగుండేది. నాకు అప్పట్లో తెలియదు కాని ఈ పత్రిక వెనక హేమాహేమీలు ఉండేవారు. శ్రీ భావరాజు నరసింహారావు ఈ పత్రికలో భాగస్వామి. శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు  హయాం ముగిసిన తర్వాత కొన్నాళ్లు ఈ పత్రికకి సంపాదకుడిగా కూడ వ్యవహరించేరు. ఈ భావరాజు గారు శ్రీ కోట సుందరరామ శర్మ

సహాధ్యాయి. ఈ సుందరరామశర్మ ఎవరంటారా? ఈయన మొన్నమొన్నటివరకూ సిలికాన్ వేలీలో ఉండేవారు. మంచి కవి, దాత — కొన్నాళ్లు లివర్‌మోరులో ఉన్న శివ-విష్ణు దేవాలయానికి మేనేజరుగా కూడ పనిచేసి తిరిగి బందరు వెళ్లిపోయి ఆయన ఆర్జించిన డబ్బంతటితో త్రిపురసుందరి ట్రస్ట్ అన్న పేరిట ఒక నిధి స్థాపించి దానిని సత్కార్యాలకి వినియోగిస్తున్నారు. పైన చెప్పిన రామకోటీశ్వరరావు గారి అబ్బాయి కోలవెన్ను రంగనాధ్, కోడలు శ్రీలక్ష్మి ప్రస్తుతం సిలికాన్ వేలీ లోనే ఉంటున్నారు. ఇంత చరిత్ర ఉన్న బందరుతో సంపర్కం ఉండకపోతే నాకు తెలుగు మీద ఈ వ్యామోహం ఉండేది కాదేమో. లేక కృష్ణ నీళ్ళు పడ్డాయో!

ఇంటరు అయిపోయి ఇంటికి వచ్చేను. మా ఇంట్లో అంతా నా మీద గంపెడు ఆశ పెట్టుకుని ఉన్నారు — పరీక్షల్లో బాగా మార్కులు వస్తే నాకు ఇంజనీరింగులో సీటు వస్తుందేమోనని. నిజానికి నాకు అప్పటికి బి. ఎ. కి బి. ఇ. కి తేడా ఏమిటో కూడ తెలియదు. కాని వాళ్ళ ఆత్రుత వాళ్ళది. మా నాన్న గారు నన్ను పక్కన కూర్చోబెట్టుకుని పేపర్లు ఎలా రాసేనో అడగడం మొదలు పెట్టేరు. నేను చదివిన గ్రూపు గురించి ఆయనకి ఎలానూ తెలియదు కనుక ఇంగ్లీషు, తెలుగు ఎలా రాసేనో చెప్పమన్నారు. తెలుగు పరీక్షలో "భారత దేశంలో బిచ్చగాళ్ళ సమస్య తీర్చడం ఎలా?" అన్న విషయం మీద వ్యాసం రాయమన్నారు. నేను రాసిన వ్యాసం టూకీగా ఇది: "మనం అందరమూ పూజించే శివుడు ఆది భిక్షువు. ప్రతి బ్రాహ్మణుడు ఉపనయనం అయిన తర్వాత, "భవతి భిక్షాందేహి" అని తల్లి దగ్గర మొదటి భిక్ష తీసుకుంటాడు. బ్రాహ్మణ విద్యార్థులు గురుకులం లో ఉన్నప్పుడు గురువుగారింట భోజన సదుపాయం లేని యెడల ఊళ్ళో వారాలు చేసుకుని బ్రతకడం అనాదిగా వస్తూన్న ఆచారం. బిచ్చమెత్తుకోవడం మన సంప్రదాయంలో జీర్ణించుకుపోయిన ఆచారం...." ఈ ధోరణిలో మొదలుపెట్టి "మన దేశంలో బిచ్చగాళ్ళ సమస్య లేదు, బిచ్చమెత్తుకోవడం మన జన్మ హక్కు" అంటూ ఒక వితండ వాదనతో రాసేను ఆ వ్యాసాన్ని. వాళ్ళడిగిందొకటి, నేను రాసింది మరొకటి. మార్కులు పోతాయేమో అని భయంగా ఉంది. ఆ భయమే మా నాన్నగారికి వెల్లడి చెసేను. "భయపడక్కరలేదురా, వెర్రి కక్కగట్టా! నీ వాదన చాలా బాగుంది. నీకు తప్పకుండా మంచి మార్కులు వస్తాయి," అని, "ఏదీ ఆ జాతకాల పుస్తకం పట్రా, నీ జాతకం మరో సారి చూస్తాను," అన్నారు. నా జాతకంలో గజకేసరి యోగం ఉందని మరొక సారి నిర్ధారించుకుని, "నీకు రాకపోతే మరెవ్వరికీ సీటు రాదు" అని ధైర్యం చెప్పి పంపించేసేరు. నేను

ఆంజనేయుడి లాంటి వాడిని. పొగడేస్తే ఉబ్బిపోయే రకం. అందుకని ఆ గజకేసరియోగం వెళ్ళిపోయేలోగా ఆ వేసంగిలో ఆంధ్ర పత్రిక వారు నడిపే 'కథకాని కథ' శీర్షిక కింద పెట్టిన పోటీకి ఒక చిన్న కథ రాసేను – పోస్టు కార్డు మీద పట్టే అంత కథ. వారికి కావలసినది స్వానుభవంలో జరిగిన సంఘటన.

విశాఖపట్నం జిల్లా, చోడవరంలో నాకు వేలు విడచిన మేన మామ కొడుకొకడు ఉండేవాడు. అంటే వాడి నాయనమ్మ, నా అమ్మమ్మ అప్పచెల్లెళ్ళన్న మాట. వాడినాయనమ్మ రేగులగడ్డవారి కోడలు, నా అమ్మమ్మ తెన్నేటి వారి కోడలు.

మన కథానాయకుడి పేరు రేగులగడ్డ సోమేశ్వరరావు. నా నాయనమ్మ రేగులగడ్డ వారి అమ్మాయి కనుక మా నాయనమ్మ తండ్రి పేరే వీడికీ, మా నాన్నగారికీ వచ్చింది. చూశారా బీరకాయ పీచు!

ఈ రేగులగడ్డ సోమేశ్వరరావు నా కంటె పది నెలలు పెద్ద. మా చిన్న తనంలో వాడి మామ్మ వాడిని సినిమాకి తీసుకెళ్ళింది. వాడికో బేడ్డబ్బులు పెట్టి మళ్ళా టికెట్టు కొనడం ఎందుకని, వాడిని చంకనేసుకుని గేటు దగ్గరకి వచ్చింది. గేటు వాడు అటకాయించి, "మామ్మ గారూ, పిల్లాడికి టికెట్టు కొనాలమ్మా" అని మర్యాదగానే అడిగేడు. మా చిన్నమ్మమ్మ, వాడిని ఎగా దిగా చూసి, "ఆఁ మరీ సోద్యం! వీడికింకా మాటలు కూడా రావు. వీడికి టికెట్టేమిటోయ్" అని కొంచెం అధికారయుక్తమైన స్వరంతో హుంకరించింది. గేటు వాడు సర్దుకుని మా చిన్నమ్మమ్మని లోపలకి పంపే తరుణంలో నా బావ "అదేమిటే, మామ్మా! నాకు మాటలు రావంటావు? ఊఁ, ఊఁ" అంటూ ముక్కు ఎగబీల్చేడు. గత్యంతరం లేక మరో టికెట్టు కొనుక్కున్నారు. ఈ కథ రాసి పంపేను. రెండవ బహుమతి అయిదు రూపాయలు వచ్చింది. నేను శ్రమించి గణించిన రెండవ ఆర్జన ఈ అయిదు రూపాయలూ. (మొదటి ఆర్జన, 1950 లో ఎన్నికల సమయంలో మా నియోజక వర్గంలో ఓటర్ల జాబితాకి నకలు తియ్యవలసి వచ్చినప్పుడు వెయ్యి పేర్లు నకలు రాసినందుకుగాను ఒక రూపాయి ఇచ్చేరు.) భిలాయిలో ఒక రోజు రాత్రి కూర్చుని అకస్మాత్తుగా వంద పద్యాలు రాసిన సంఘటనని మినహాయిస్తే, ఇదీ రచనా ప్రపంచంలో నా అనుభవం.

నక్కెక్కడ నాగ లోకం ఎక్కడ అన్నట్లు ఆంధ్రపత్రికకి మినీ కథ రాయటానికీ సైన్సు రాయటానికీ తేడా లేదూ? అయినా సరే, ఆ మర్నాడు, రాస్తూన్న థీసిస్‌ని పక్కకి పెట్టి కంప్యూటర్లు ఎలా పని చేస్తాయో తెలుగులో ఓ నాలుగు పేజీలు రాసి చూద్దామని ఉపక్రమించేను. ఎక్కడ మొదలు పెట్టటం? కంప్యూటర్లు వాడే గణితపు పద్ధతులే వేరు. ఇప్పుడంటే హైస్కూలు విద్యార్థులే నేర్చేసుకుంటున్నారు కాని ఆ రోజుల్లో అవి సామాన్యులకి అందుబాటులో ఉండేవి కావు. తర్వాత కంప్యూటర్ నిర్మాణానికి కావలసిన ఎలక్ట్రానిక్స్ ఎంతమందికి అర్థం అవుతుంది? అలాగే సాఫ్ట్‌వేరు ని తెలుగులో ఏమనాలి? హార్డ్‌వేరు ని ఏమనాలి? ఆదిలోనే హంసపాదా? ఈ తర్జన భర్జనలతో ఎటూ తేల్చుకోలేక మిగిలిన భాషలలో ఈ పని ఎలా చేస్తున్నారో తెలుసుకోవాలనే కుతూహలం పుట్టింది. నా స్నేహ బృందంలో మిగెల్ మరీన్ అనే స్పేనిష్ వాడు ఒకడు ఉండేవాడు. వాడిని "ఒరేయ్ మిగెల్లూ! మీ స్పేనిష్‌లో హార్డ్‌వేర్ కీ, సాఫ్ట్‌వేర్ కీ ఏమంటారురా?" అని అడిగేను. "హార్డ్‌వేర్ ని 'ఫెర్రా' అనీ, హార్డ్‌వేర్ స్టోర్ ని 'ఫెర్రతెరియా' అనీ అంటారు కాని కంప్యూటర్లో వాడే హార్డ్‌వేర్ కి మా భాషలో మాట లేదు" అన్నాడు. అని ఊరుకోకుండా 'తెరియా' అంటే 'దొరికే చోటు' అని వ్యుత్పత్తి చెప్పేడు. ఇదే బాణీలో 'కఫెతెరియా' అంటే కాఫీ దొరికే చోటు అని అర్థంట!. 'బకెరియా' అంటే పశువుల సాల – 'బకెతెరియా' అనరుట! స్పేనిష్‌లో సాంకేతిక మాటలు లేకపోయినా దక్షిణ అమెరికాలో పాఠాలన్నీ స్పేనిష్ భాషలోనే చెబుతారట. పాఠ్య పుస్తకాలన్నీ స్పేనిష్ లోనే ఉంటాయిట.

నాకు ధైర్యం వచ్చింది. ఇంగ్లీషులో 'కేఫిటేరియా' లాంటిదే హిందీలో 'దవాఖానా.' అప్పుడే gymnasium అనే ఇంగ్లీషు మాట హిందీలో 'జింఖానా' గా మారిందేమో అన్న అనుమానం వచ్చింది. ఇలా మనస్సులో రకరకాల ఆలోచనలు ముసురుకోవటం మొదలెట్టేయి. కాని ఇప్పుడు నా థీసిస్ ఆపేసి భాష మీద పరిశోధన మొదలెట్టేనంటే అటు అదీ జరగదు, ఇటు ఈ పనీ పూర్తి కాదు. రెండింటికి చెడ్డ రేవడిలా అవుతుంది నా పరిస్థితి. అందుకని నాకు తోచినట్టు రాయటం మొదలుపెట్టేను. నాలుగు పేజీల వ్యాసం రాద్దామనుకున్న వాడిని రెండు వందల పేజీల కాగితాల కట్ట రాసేను. అడపా తడపా రాసి పూర్తి చేసేసరికి రెండు నెలలు పట్టింది. ఈ రెండు నెలలో సుందర్రావు బొంబాయి తిరిగి వెళ్ళిపోయేడు! కనీసం నేను రాసిన రాత ప్రతి అయినా చూడకుండా! మూడొంతులు నాతో వాదించిన విషయం కూడా మరచి పోయుంటాడు. పిల్ల చచ్చినా పురిటి వాసన పోలేదన్నట్లు ఆ వాదన ఎప్పుడో మరచి పోయేరు అంతా – నేను తప్ప. నా దగ్గర రెండు వందల ఖరాబైన కాగితాలు

మిగిలేయి. వాటిని ఏమి చెయ్యాలో తెలియక, ఒక కట్ట కట్టి క్లాజెట్‌లో పైన పడేసి నా థీసిస్ పనిలో నేను మునిగి పోయాను.

కొద్ది నెలలు పోయిన తరువాత ఒక రోజున – ఎక్కడి నుండో కూడా తెలియదు – ఒక ఉత్తరం వచ్చింది. కవరు కూడా కాదు. ఒక కాగితం రెండు మడతలు పెట్టి, పైన ఒక స్టాంపు అంటించి తపాలా డబ్బాలో పడేసినట్లున్నారు. అది విప్పి చూద్దును కదా! అది మిమియోగ్రాఫు (mimeograph) చేసిన ఒక కాగితం. ఈ రోజుల్లో నకలు తియ్యటానికి జిరాక్స్ యంత్రాలు, అచ్చుకోట్టటానికి ప్రింటర్లు ఎక్కడ పెడితే అక్కడ ఉన్నాయి కనుక మిమియోగ్రాఫు అన్నా, సైక్లోస్టయిలు (cyclostyle) అన్నా అంతమందికీ తెలియక పోవచ్చు. మేము చదువుకునే రోజుల్లో దేనికైనా ఎన్నో నకళ్ళు తియ్యాలంటే ఒక ప్రత్యేకమైన మైనపు కాగితం (stencil) మీద రిబ్బన్ లేకుండా ఉన్న యంత్రం మీద టైపు చేసి (టైపే చెయ్యక్కరలేదు, చేత్తో కూడ రాయొచ్చు) ఆ కాగితాన్ని సిరా పులిమిన ఒక పీపా కి చుట్టబెట్టి, ఆ పీపాని గిర్రుమని చేత్తో తిప్పితే ఒక నకలు వచ్చేది. ఎన్ని సార్లు తిప్పితే అన్ని నకళ్ళు. క్లాసు నోట్సు తయారు చెయ్యటానికీ, పరీక్షా పత్రాలు తయారు చెయ్యటానికీ ఇటువంటి యంత్రాలే వాడేవారు. సైక్లోస్టయిల్ తో నల్లటి కరక్కాయ సిరాతో రాసిన అక్షరాల్లాంటివి వచ్చేవి. మిమియోగ్రాఫు చేస్తే ఊదా అక్షరాలు వచ్చేవి. ఈ టెక్నాలజీ గురించి ఇప్పుడు ఎందుకు గాని, నాకు వచ్చిన ఆ సర్క్యులర్ సారాంశం ఏమిటంటే అట్లాంటాలో పనిలేని మంగళ్ళు నలుగురు, పిల్లి దొరక్క కాబోలు, ఒక తెలుగు పత్రిక స్థాపించాలని ప్రయత్నిస్తున్నారట. ఈ పత్రికలో ప్రచురణకి ఏదైనా రాసి పంపితే పరిశీలిస్తారట. ఇదేమో ఆషామాషీ కథల పత్రిక కాదుట. సైన్సు విషయాలు తెలుగులో, జనరంజకమైన శైలిలో రాయాలిట. ఆడబోయిన తీర్థం ఇలా ఎదురయ్యేసరికి నా కళ్ళని నేను నమ్మలేక పోయాను. అడుగున సంతకం పెట్టిన మంగళ్ళ పేర్లు చూసేను: డా. పెమ్మరాజు వేణుగోపాలరావు, డా. గవరసాన సత్యనారాయణ, డా. పరిమి కృష్ణయ్య, డా. రావిపూడి సుబ్బారావు. ఈ నలుగురి పేర్లూ నేను ఎప్పుడూ వినలేదు. కాని అందరి పేర్ల ముందూ డా. చూసి, పూర్వం పాశ్చాత్య దేశాల్లో మంగళ్ళే డాక్టర్లుగా కూడ చెలామణీ అయేవారని గుర్తుకి తెచ్చుకుని, వెంటనే నా క్లాజెట్‌లో దుమ్ము సేకరిస్తూ మూలుగుతూన్న రెండు వందల కాగితాలూ తీసేను. దుమ్ము దులిపేను. ఆఫీసుకి పట్టుకెళ్ళేను. మా డిపార్టుమెంటులో ప్రొఫెసర్ల కోసం

లోపల దాచిపెట్టిన జిరాక్స్ యంత్రం మీద, ఎవరైనా చూస్తే కోప్పడతారేమోనని భయపడుతూ, లంచి వేళప్పుడు — ఎవ్వరూ లేని సమయంలో – ఒక నకలు తీసి వేణుగోపాలరావు గారికి పంపించేను.

కొద్ది రోజుల్లోనే ఆయన దగ్గరనుండి జాబు వచ్చింది. నచ్చిందిట. కాని "కొంచెం ఎడిట్ చేసి వేస్తాము, మీకు అభ్యంతరమా?" అని దాని సారాంశం. 'సరే' అన్నాను. పరీక్షల్లో రాయటం, ఆంధ్రపత్రిక వారి 'కథకాని కథ' శీర్షికకి పోస్టు కార్డు మీద రాసినదీ మినహాయిస్తే నేను మొట్టమొదట తెలుగులో రాసిన రచన ఇది. కనుక అందులో తప్పులు తప్పకుండా ఉంటాయని నాకు తెలుసు. ఎవ్వరైనా ఉచితంగా సమీక్షించి తప్పులు సవరించిపెడితే అంతకంటె ఏమి కావాలి? ఒప్పుకున్నాను. ఆ రెండువందల పేజీలని రెండేళ్ళ పాటు, వరుస క్రమంలో 'తెలుగుభాషాపత్రిక' లో ప్రచురించేరు. ఈ ప్రచురణ ద్వారా వేణుగోపాలరావు గారు, సత్యనారాయణ గారు, సుబ్బారావు గారు నాకు స్నేహితులవటమే కాకుండా వారి సంసారాల్లో ఒకడినైపోయేను.

ఈ తెలుగు భాషా పత్రిక సంపాదకులకి సరుకు కావాలి కనుక నేను రాసినది పేలవంగా ఉన్నా సర్దుకుని ప్రచురణకి అంగీకరించి ఉంటారనే నాకు మొదట్లో అనుమానం. కాని నేను రాసినది నిజంగా ఆసక్తికరంగా ఉందో లేదో, నేను రాసిన దానిలో నిజంగా సత్తా ఉందో లేదో అని నాకు ఒకటే అనుమానం. ఈ అనుమానం నివృత్తి అవటానికి ఆరు నెలలు పైగానే పట్టింది. ఈ ఆరు నెలలలో రెండు సంచికలు విడుదల అయాయి. నేను రాసిన శైలి చాలా బాగుందని ఇద్దరు ముగ్గురు కంటె ఎక్కువ మందే అన్నారు. అది కూడ బొత్తిగా ముఖ పరిచయం లేని వారి దగ్గరనుండి వచ్చిన అభిప్రాయం. మొదటి సారి తెలుగులో రాయగలననే ధైర్యం వచ్చింది. అప్పుడు థీసిస్ పనిలో మునిగి ఉంటిని కనుక తెలుగులో ఇంకా రాయాలనే కోరిక విజృంభించలేదు.

ఈ తెలుగు భాషా పత్రికలోనే వి. వి. రావు అనే ఆసామీ ఈ ప్రయత్నాన్ని విమర్శిస్తూ ఘాటుగా ఒక వ్యాసం రాసేరు. అది నేనే రాసేననుకుని చాల మంది నాకు ఫోను చేసి నన్ను తెగ మెచ్చుకుంటూ ఉంటే అది నేను కాదని ఎంత చెప్పినా ఎవ్వరూ నమ్మలేదు. దరిమిలా నేను ఒక సారి అట్లాంటా వెళ్ళినప్పుడు వేణుగోపాలరావు గారు ఈ వి. వి. రావు ని నాకు పరిచయం చేసేరు. ఆయనే మన వేలూరి

వెంకటేశ్వరరావు గారు. ఇప్పటికీ అప్పుడప్పుడు తెలియని వాళ్ళు వేలూరి వారి రచనలు చూసి నేనే రాసేననుకుని నన్ను పొగుడుతూ ఉంటారు. నేను కిమ్మనకుండా ఆనందిస్తూ ఉంటాను. అప్పటికీ ఇప్పటికీ ఆ వేలూరి వారి రూపురేఖల్లో చాలా మార్పు వచ్చిందని ఒప్పుకు తీరాలి – అప్పుడు తల నిండుగా నల్లటి జుత్తుండేది. ఇప్పుడాయనకి ఏ జుత్తూ లేదు, నాకు మాత్రం 'బ్లాండ్ హెయిర్' వచ్చేసింది. నా శ్రీమతి అంటూ ఉంటుంది, "ఈ తెల్ల జుత్తు కంటె గుండే నయం" అని!

తెలుగు భాషా పత్రిక అనుభవంతో సైన్సుని తెలుగులో రాయగలం అనే ధైర్యం వచ్చింది. అసలు జనరంజక శైలిలో సైన్సు గురించి తెలుగులో రాతలు లేకపోలేదు కాని – బహు తక్కువ. సైన్సు గురించి సులభమైన శైలిలో తెలుగులో పుస్తకాలు ఉంటే బాగుండుననే ఊహ నేను బందరులో ఇంటరు చదువుకుంటూన్న రోజులలోనే పుట్టింది. అప్పుడు మాకు ఇంగ్లీషు 'నాండిటైలు' గా "థర్టీనైన్ స్టెప్స్"ఒకటీ, ఒక popular science లాంటి వ్యాసాల సంపుటం ఒకటీ ఉండేవి. ఈ వ్యాసాల సంపుటంలో ఒక అధ్యాయం పేరు 'కోల్' మరొక అధ్యాయం పేరు 'పెట్రోలు.' రాక్షసిబొగ్గు గురించీ, ఖనిజ తైలాలగురించీ, ఇలా ఒకొక్క అధ్యాయంలో ఒకొక్క విషయం మీద వ్యాసాలున్న పుస్తకం అది. చాలా ఇష్టంగా చదివేవాడిని. ఇలాంటి పుస్తకం తెలుగులో ఎందుకు లేదూ అన్న ఆలోచన అప్పుడే వచ్చి ఉంటే 'ఎ సెక్షన్' లో వాడుతూన్న పరమాణువు పుస్తకం చదివేవాడిని. పరమాణువు ఏమిటంటారా?

ఇంటర్ లో మా తెలుగు నాండిటైల్ గా 'వ్రతశీలి' అనే నవల కాని 'పరమాణువు' అనే popular science పుస్తకం కాని ఎంపిక చేసుకోవాలి. హిందూ కాలేజీలో 'ఎ సెక్షన్' వాళ్ళకి పరమాణువు, 'బి. సెక్షన్' వారికి వ్రతశీలి కాలేజీ అధికారులే ఎంపిక చేసేసేరు. వ్రతశీలి ఒక ఫ్రెంచి నవలని ఆధారంగా చేసుకుని రాసిన కథ అని రచయిత చెప్పి ఉండకపోతే అది మహాపద్మనందుడి కాలంలో జరిగిన కథ అని నమ్మేస్తాం. అంత బాగా రాసేడా రచయిత. ఆ రచయిత ఎవ్వరో అని నేను పదే పదే అనుకుంటూ ఉంటే బెంగుళూరు నుండి శ్రీ వి. వి. ఎస్. శర్మ అక్టోబరు 2017 లో సమాచారం అందించేరు. సూర్యరాయ విద్యానంద గ్రంథాలయ పుస్తకాల జాబితాలో 2552–వ పుస్తకం వ్రతశీలి. దాని రచయిత కొమరవోలు నాగభూషణరావు. ప్రచురణ తేదీ 1952. ఏదైతేనేమి అప్పట్లో నాకు పరమాణువు పుస్తకం చదివే అవకాశం రాలేదు. నేటికీ చదవలేదనుకొండి, అది వేరే విషయం. ఈ పరమాణువు రాసినది

మరెవ్వరో కాదు. మొన్న మొన్నటి వరకు హ్యూస్టన్ లో ఉండి ఈమధ్యనే దివంగతులైన డా. డి. ఎ. ఎ. ఎస్. (దువ్వూరి) నారాయణరావు గారు. ఈయన, భార్య శారదాంబతో, 1955 లోనే అమెరికాలో స్థిరపడిపోయిన కురువృద్ధులలో ఒకరు.

ఆ ఇంటర్మీడియేట్ లో పడ్డ విత్తనం నిద్రాణంగా నాలో ఎక్కడో అణగి మణగి ఉండి ఇప్పుడు మొలకెత్తి పైకొచ్చినట్లుంది. కంప్యూటర్ల గురించి నేను రాసిన వ్యాస పరంపర మీద వచ్చిన ప్రతిస్పందనతో మరింత ఉత్సాహం పెరిగింది. ఈ ప్రేరణతో పర్డ్యూ యూనివర్సిటీలో పని చేస్తూన్న రోజులలో కాలక్షేపానికి రెండు, మూడు సైన్సు ఫిక్షన్ కథలు రాసేను. అందులో 'కించిత్‌భోగో భవిష్యతి!' అన్న కథ ఒక మైలు రాయి వంటిది. అది రాజస్థాన్ ఎడారిలో ఇండియా మొట్టమొదటి అణుబాంబు పేల్చిన కాలం. అమెరికాలో నిక్సన్ మండిపడ్డాడు. ఈ నేపథ్యంలో ఆ కథ రాసేను. నా చిన్నప్పుడు మా నాన్నగారు చెప్పిన కథలోని ఒక వాక్యాన్ని నా కథకి మకుటంగా వాడుకున్నాను. ఈ కథ రాసిన తరువాత – దరిదాపు ఇరవై ఏళ్ళ తరవాత –హైదరాబాదులో కవన శర్మ గారిని కలుసుకోవడం జరిగింది. నన్ను నేను పరిచయం చేసుకుంటూ ఉంటే ఆయన, "మీరే కదూ కించిత్ భోగో భవిష్యతి! రాసినది?" అన్నారు! పరవాలేదనుకున్నాను.

ఆ రోజులలో తెలుగులో రాయటానికి చాల ఇబ్బందులు పడేవాడిని. ముఖ్యంగా సైన్సు మాటలకి తెలుగు మాటలు తట్టేవి కాదు. ఒక సారి ఒక చోట సరైన మాట (మామూలు మాటే, సైన్సు పదం కానే కాదు) తట్టక ఇంగ్లీషు మాట రాసి ఆంధ్రపత్రికకి పంపేను. శివలెంక రాధాకృష్ణ గారు ముందస్తుగా కథ ప్రచురణకి స్వీకరించేమంటూ ఒక కార్డు పంపేరు. నేను ఇంగ్లీషులో వదిలేసిన మాటకి బదులు సరైన తెలుగు మాట వేసి, కథ ప్రచురించి నాకు ఒక ప్రతి విమానం టపాలో పంపి, మా నాన్నగారికి ఏభై రూపాయల పారితోషికం పంపేరు! అప్పుడు తెలిసింది. మన బుర్రకి తెలుగు మాట తట్టనంత మాత్రాన తెలుగులో ఆ మాటే లేదనుకోవటం ఎంత పొరపాటో. ఈ పొరపాటుని సవరించుకోవాలంటే నిఘంటువుని సంప్రదించటం అలవాటు చేసుకోవాలి. కాని నా దగ్గర తెలుగు నిఘంటువు లేదు. లాఫయెట్ ఇండియానాలో కోనేరు రాజేశ్వరరావు గారూ, పిల్లలమర్రి రామకృష్ణ ఉండేవారు కాని వాళ్ళ దగ్గర మాత్రం తెలుగు నిఘంటువు ఎక్కడుంటుంది! నా స్పురణకి తట్టిన కొత్త మాటలని చిన్న

కాగితాలమీద రాసుకుని వాటిని జోళ్ళు కొనుక్కున్నప్పుడు వచ్చిన ఒక అట్టపెట్టెలో పెట్టి దాచుకునే వాడిని. ఇలా చిత్తు కాగితాలతో నిండిన జోళ్ళ పెట్టెలే ఉత్తరోత్తర్యా నేను నిర్మించిన నిఘంటువుకి మూలాధారం అయేయి.

లాఫయెట్ వదలి బింఘంటన్ వెళ్ళిన కొత్త రోజులవి. డిసెంబరు నెల. మంచు విపరీతంగా పడి వీధులన్నీ మంచుకుప్పలతో బందయి పోయాయి. ఇల్లు కదలటానికి వీలు లేని పరిస్థితి. ఏమీ తోచటం లేదు. అసిమావ్ రాసిన The Wellsprings of Life అనే ఇంగ్లీషు పుస్తకం చదువుతూ ఉంటే, ‘ఇలాంటి పుస్తకం తెలుగులో ఎందుకు రాయకూడదు?’ అని ఒక ఆలోచన వచ్చింది. తెల్ల కాగితాల కట్ట ముందు వేసుకుని క్రిస్మస్ సెలవలు అయిపోయే లోగా తెలుగులో ‘జీవ రహశ్యం’ అనే పుస్తకాన్ని రాసేసేను. అప్పటికి ఇండియాని ఉద్ధరించెద్దామనే ఉద్దేశంతో గవరసాన సత్యనారాయణ గారు, ఆయన సతీమణి సుభద్ర గారు అమెరికాలో ప్రేక్టీసు వదలిపెట్టి గొల్లప్రోలు అనే కుగ్రామంలో ప్రేక్టీసు పెట్టేరు. నేను మా ఊరు, తుని, వెళ్ళినప్పుడు పక్కనే ఉన్న గొల్లప్రోలు వెళ్ళి నా పుస్తకం ఆయనకి చూపించేను. దానిని ముద్రించి విక్రయించే బాధ్యత ఆయన తీసుకున్నారు. అది చదివిన వాళ్ళంతా శైలి బాగుందని మెచ్చుకున్నారు. నేను పెట్టిన ఖర్చు తిరిగి రాలేదు కాని, అచ్చొత్తిన వాటిలో సగం ప్రతులు ఖర్చయిపోయాయి. మిగిలిన సగం తునిలో మా ఇంట్లో ఉన్న బీరువాలో దాచితే కొన్నింటిని చెద పురుగులు తినేశాయి. మరికొన్ని తునిలో వరదలు వచ్చినప్పుడు తాండవనదిలో కొట్టుకు పోయాయి.

అప్పటినుండి నేను ఏదో ఇలా కొట్టుకొస్తూ మళ్ళా కేలిఫోర్నియాలో తేలేను. అప్పట్లోనే ఎప్పుడో రసగంధాయ రసాయనం అని రసాయనశాస్త్రాన్ని తేలిక తెలుగులో రాసేను. నా జీవ రహశ్యం, రసగంధాయ రసాయనం చదివిన ఒక అమ్మాయి జీవరసాయనశాస్త్రంలో నా దగ్గర డాక్టరేటు చేస్తానంటూ నెల్లూరు నుండి ఉత్తరం రాసింది!! “అమ్మా! నేను కంప్యూటరు వాడిని” అని చెప్పుకోవలసి వచ్చింది.

ఆ తరువాత, కొన్నేళ్ళ తదుపరి చందూరి మురళి ఒక సారి అన్నారు: “మీరు సైన్సు గురించి పుస్తకాలు రాస్తే ఎవ్వరూ చదవరు. కథలు రాయండి” అని. పూర్వం ‘కించిత్భోగో…’ లాంటి కథలు

రాసినప్పుడు ఆంధ్రపత్రిక వారు ప్రచురించటం అంటే ప్రచురించేరు కానీ, ఎప్పుడూ ఎవ్వరి దగ్గర నుండీ స్పందన ఏమీ వచ్చినట్లు లేదు. వచ్చినా వచ్చినట్లు ఈ అమెరికాలో ఉన్న నాకు తెలిసే అవకాశం లేదు కదా! అందుకని ఎక్కువ రాయలేదు. మళ్ళా మురళీ ఇలా అనటంతో (రచన మాస పత్రికకిని స్థాపించినది చందూరి మురళి గారే, శాయి గారు కాదు) మళ్ళా రాయటం మొదలుపెట్టేను. ఈ ఊపులో చాలా సైన్సు కథలు రాసేను. ఇన్ని కథలు రాస్తే ఒకే ఒక కథకి – పంటి కింద పోక చెక్కకి – పత్రికా ముఖంగా వెల్లువలా మంచి స్పందన వచ్చింది. రెండు మూడు వారాలపాటు పాఠకుల దగ్గరనుండి ప్రశంశలు వస్తున్నాయి కాని, నేను చందాదారుడిని కాను కనుక నేను వాటిని చూడనే లేదు. ఆఖరికి ఒకాయన సంపాదకుడి దగ్గరనుండి నా ఈ–మెయిలు చిరునామా సంపాదించి బెంగుళూరు నుండి నాకు ఈ–మెయిలు పంపేడు – నా కథని, దాని మీద వచ్చిన స్పందననీ మెచ్చుకుంటూ. నా వద్ద నుండి ప్రతిస్పందన రాలేదేమని ప్రశ్నించేరు ఆయన. నాకా విషయమే తెలియదని రాస్తే పాపం ఆయన పాతబడి నలిగిపోయిన ఒక ప్రతిని ఏదో గ్రంధాలయంలో కొని నాకు విమానం టపాలో పంపించేరు – ముక్కూ మొహం తెలియని వ్యక్తికి!!

ఆ స్పందన చూసి నేను చకితుణ్ణయేను. ఒక పల్లెటూరు హోమియోపతీ వైద్యుడు కథానాయకుడు కనుక పాఠకులు అలా స్పందించేరే తప్ప ఎవ్వరికీ ఆ కథలోని సైన్సు మెలిక అర్థం అయినట్లు లేదు. ఆఖరికి బాపు వేసిన బొమ్మ కూడా కథలోని అసలు విషయాన్ని అపార్థం చేసుకుని వేసిన బొమ్మే అని నాకు అనిపించింది. నా సైన్సు కథలు బహు కొద్ది మంది పాఠకులకీ, ఇంకా కొద్ది మంది విమర్శకులకి అర్థం అయేయేమో అనిపించింది. ఒక సారి షికాగోలో ఒక తెలుగు సభలో మధురాంతకం రాజారాం గారు కనిపించినప్పుడు నేను ఆయనకి పరిచయం చేసుకుంటూ ఉంటే, ఆయన నేను రాసిన "మిడతంభొట్లు" కథని గుర్తుపట్టి, "కథ విలక్షణంగా ఉంది, కాని అర్థం కాలేదు" అని చమత్కరించేరు. పాఠకుల మెప్పు లేదు. విమర్శకులు విస్మరించేరు. ఎందుకొచ్చిన కంఠ శోష అని సైన్సు కథలు రాయటం మానుకున్నాను.

ఇప్పుడు? ఈ వ్యాసం రాస్తూ ఉంటే – జూన్ 2006 రచన సంచికలో – కవన శర్మ తెలుగు కథని సమీక్షిస్తూ, నేను రాసిన కథలని ప్రస్తావించి, ఇలా అన్నారు. "ఈయన కథలని విమర్శకులు

ఇంతవరకు పట్టించు కోకపోవడం మన దురదృష్టమనిపిస్తుంది. మన పాఠకులకి, విమర్శకులకి కూడ అంతగా సైన్సు ఎక్కదేమో అనిపిస్తుంది."

కనీసం నేను రాసిన కథలని చదివి అర్థం చేసుకున్నవాడు ఒక్కడైనా ఉన్నాడు కనుక పరవాలేదు!!

# రచయిత గురించి



ఈ పుస్తకం అంతా చదివిన తరువాత వేమూరి వేంకటేశ్వరరావు గురించి ఇంకా చెప్పడానికి ఏముంది? అంతా తెరచిన పుస్తకమే కదా!ఆయన కృషికి గుర్తింపుగా అనేక పురస్కారాలు అందుకున్నారు. ఆయన సైన్సులో జనరంజకంగా రాసిన రచనలని గుర్తిస్తూ యూనివర్సిటీ అఫ్ కేలిఫోర్నియా వారు "పబ్లిక్ సర్విస్ అవార్డ్" ఇచ్చేరు. తానా వారి పురస్కారం అందుకున్నారు. వంగూరి సంస్థ వారు "జీవిత సాఫల్య పురస్కారం" చేసి గౌరవించేరు. ఈయన తెలుగులో రాసిన కథలకి, వ్యాసాలకి బహుమతులు వచ్చేయి. భార్య ఉమ తోటీ, పిల్లలు సీత, సునీల్, మైథిలి, మనుమలు ఆర్జున్, విద్యాల తోటీ కేలిఫోర్నియాలో ఉద్యోగానంతరం విశ్రాంత ఆచార్యుడిగా ఉన్నారు. ఇప్పటికీ తరచు విదేశాలలో తిరుగుతూ పాఠాలు చెబుతూ ఉంటారు.